దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ '57
ఐదు రూపాయలు
దేశీప్రెస్, విజయవాడ.



సంపాదకులు :
బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

చలం రచనలన్నీ
పదహారు సంపుటాలలో
సంపుటి: ౫ రూపాయలు

# త్యాగం

## ఒకటో రంగం

రాత్రి పదకొండు గంటలను. కేశవరావు యిల్లు-పడకగది. వెనుక వేపున, కుడిచేతివేపు పందిరి పట్టిమంచము. దానిమీద పరుపు, దిళ్లు. దానిపక్కన వెనక నడవాలోకి తలుపు; వొంటింటోకి వెళ్ళే ప్రవేశం దాంట్లోంచే తిరుగుడుతో వుంటుంది. కుడిచేతివేపున తలుపు. అది సందులోకి తెరుచుకుంటుంది. —ఆ సందు వీధిలోకి తెరుచుకుంటుంది. వీధిలోంచివచ్చే కేశవరావు మొదలైనవాళ్లు దాంట్లోంచి వచ్చి వెళ్లుతో వుంటారు. ఆ తలుపు పక్కగా బల్ల; దానిమీద పెద్ద అద్దం, దువ్వెనలు, నాలుగైదుబుడ్లూ, తక్కిన 'టాయిలెట్' సామానులు; బల్లమీద 'జేబులైటు' గోడకు 'లైంప్సు' (ఆరిపోయింది); రొమ్ము కనపడుతున్న యింగ్లీషు స్త్రీ వున్న బొమ్మగల క్యాలెండరు; ఊర్వశి, దమయంతి, సావిత్రి, రవివర్మ పటాలు; పక్కదగ్గిరిగా బట్టలులేని యూరోపియన్ స్త్రీ పటం.

వెనక తలుపుదగ్గిర నిద్రతో మూతబడే కళ్ళతో వగసిగ్గు చూపుతో భ్రమరాంబ కూర్చుని వుంది. ఆమె తలగొరిగిన పదిహేనేళ్ళు. నల్లటిపిల్ల. దృఢంగావుంది. బల్లమీద అద్దంలో చూస్తుంటో, జుట్టు సవరించుకుంటో, పమిట సద్దుకుంటో సీతాకాంతం నుంచుని వుంది; అప్పుడప్పుడు ఆ బల్లమీదే నగుపెంచుని మాట్లాడుతో వుంది. సీతాకాంతం చాలా తెల్లనిది. సన్నగావుంది. ముఖం నిర్మలం, అమాయకము. ఇంకా బొమ్మలతో ఆడుకుంటుందా అనిపిస్తుంది. కాని వెకిలితనము లేని గాంభీర్యము వుంది. లోకంలో అడుగుపెట్టిందా ఈ పిల్ల అని ఆశ్చర్యమేస్తుంది. తను అలవడ్డైన చిన్నన్న జ్ఞానం కలదలాగు అద్దంలో చూసుకుంటుంది. నవ్విస్తుంది. కాని మాట్లాడేప్పు దానంగతి మరచిపోతుంది.

భ్రమరాంబ : (శ్లోకం చదువుతో మధ్యలో) అడుగో పద కొండు!

సీతాకాంతం! కాదు, పది.

భ్రమ: ఇందాక నువ్వు కిటికీలోంచి తొంగిచూస్తున్నప్పుడు పది.

సీతా : ఇంకా రాలేదే!

భ్రమ: వొస్తాడు! వొస్తాడు! యింకా కాచుకున్నావో. నిద్రపొమ్మంటే వినదు, పెంకిపిల్ల. నేను వెళ్ళి పడు కుంటా నమ్మా! నిన్నరాత్రి రైల్లో నిద్రలేదు.

సీతా : వొద్దు. నాకు భయమేస్తోంది. వొస్తారు అమ్మా!

భ్రమ: (హేళనగా) వొస్తారు తెల్లారి!

సీతా : నిద్రరాదు. ఎట్లా వొస్తుంది? (వింటో) అదుగో! (కిటికీదగ్గిరికి వెళ్ళి) అదుగో వచ్చారు. ఇంక వెళ్ళు అమ్మా! (ఆత్రుతతో చూస్తూ) కాదు. ఎవరో! ఆయన కాకూడదూ? యిందరు యిట్లా నడుస్తారే!

ఆ మూల అడుగుల చప్పుడు కొంచెంగా మొదలు పెడు తుంది. మెల్లిగా ఎక్కువవుతో వొస్తుంది చెవికింటికి.

ఆయనే అనుకుంటా. కదిలితే తలయెత్తి చూస్తే యెక్కడ కాకపోతుందేమోనని అట్లానే గట్టిగా చెవి పట్టి పడుకుంటా. గుమ్మంలో ఆగినట్టే వుంటుంది. కాని క్రూరంగా మెల్లిగా తగ్గుతో వెళ్ళిపోతాయి పాదాలు. చీకట్లో అందరు ఎక్కడికి పడతారో! ఒక్కటి ఆయన కాకూడదూ. ఒక్క పాదాలు యిలా

యింటిని గుర్తుపట్టి ఆగకూడదూ. ఒకప్పుడే, చీకట్లో యిల్లు గురుతు తెలియక వెదుతో వున్నారేమో అని లేచి పిలవాలనుకుంటా. 'ఇదే యిల్లు' 'నేనే' అనా లనుకుంటా.

భ్రమ: అన్నావుగావు నయం!

సీతా : ఇంక రారని నిద్రపట్టించుకుంటో వుంటే మళ్ళీ యింకో అడుగుల చప్పుడు.

భ్రమ: అబ్బా! చాలు. దీపంతగ్గించి పడుకుందూ.

సీతా : క్లబ్బులో ఆలస్యమైందేమో!

భ్రమ: ఈయనకోసం అర్ధరాత్రి క్లబ్బులని ప్రత్యేకం పెట్టించారు!

సీతా : ఏమో? తప్పకుండా త్వరగా వొస్తానన్నారు. ఏదన్నా మోటారుక్రింద పడ్డారేమో.

భ్రమ: పడి ఏకాలో విరిగితేనన్నా బావుండును! ఇంటి పట్లు పడివుంటాడు.

సీతా : ఏం లాభం? మనసంతా అక్కడవున్న తరవాత! మోటారుమీద వెడతారు అప్పుడు.

భ్రమ: కుంటివా డెవరికి కావాలి?

సీతా : డబ్బుంటేచాలటగా వాళ్ళకి. (సీత అద్దంలో చూసుకుంటోంది) నేను బాగా లేనే, అమ్మా?

భ్రమ: కళ్ళున్నవాళ్ళకి—

సీతా : (ఆలోచనగా) నావంక చూసుకుంటేనే అమ్మా, నా మీద నాకు ప్రేమ వస్తుంది. ఎంత చక్కని మొహం

అనుకుంటా. అద్దంలో యింకెవరో అనుకుని చూస్తా. ఎందుకంటే. నేను బావుంటానమ్మా.

భ్రమ: పెళ్ళికాగానే పనికిరాదు అందం.

సీతా : ఎందుకో.

భ్రమ: చేటురోగం.

సీతా : చెప్పవేం, అమ్మా! నీకు తెలీదూ?

భ్రమ: ఆకాశం అందం ఎంతవుంది చూస్తారు, నీలం గాజు పెంకు లేరుకుంటారుగాని!

సీతా : ఇట్లా నీతో కూచుని మాట్లాడి ఎన్నో గాజులయింది, సీత మొహానికి పౌడరు వేసుకుంటోంది. సోమరిగా ఆటగా ఏం తోచనట్టు, ఈయన నేనా; మొగవాళ్ళందరూ యింతేనా?

భ్రమ: అందరూ అంతే! పశువులు.

సీతా : నాన్నా—?

భ్రమ: ఇంతే.

సీతా : ఏం చేశావు!

భ్రమ: దిగమింగుకుని వూరుకున్నాను. ఏమిలాభం! మురుగు గొయ్యి కుళ్ళుతీసుకుని! బయటికి వెళ్ళే వాళ్ళని ఎట్లా అదుపులో పెట్టడం?

సీతా : ఎట్లావూరుకున్నావో! పగలు - రాత్రి రంపంతో కోస్తున్నట్టుంది, తలుచుకొన్నకొద్ది. (మెళ్లో గొలుసు సర్దుకుంటూ) యీ తెలుపుమీద బంగారం ఎట్లా మెరుస్తుందో చూడు. (ఆగి) పడుకునేప్పుడు అంతా

మరిచి నిద్రపోతాను. తెల్లారి లేచేప్పటికి నెత్తిమీద ఎవరో దెబ్బకొట్టినట్లు అంతా జ్ఞాపకం వొస్తుంది. భక్తితో పూజచేస్తున్న తులసిమొక్క ఒకరోజు పొద్దున్న చూసేప్పటికి గంజాయి మొక్కగా మారి నట్లుంటుంది. ఒక్కొక్కరోజు ఆయనకి నన్ను చూడడమే కష్టంగా వుంటుంది. నేను చచ్చిపోతే, ఆయనకి సంతోషం కలిగేట్లు అనిపిస్తుంది.

ప్రభ: ఛా, వూరుకో. వూరికే అధైర్యపడకు. ఎన్నాళ్ళు తిరగడం. ఏమో తాత్కాలికంగా మతి చలిస్తుంది. మళ్ళా యింటికి చేరుకుంటారు. ఈమగవాళ్ళు, పిల్లలమోస్తరు అజ్ఞానులు. వొద్దంటే వినరు. అల్లరి చేసి ఎక్కడో పదిదెబ్బలుతిని మన్ని పశువుల్లాగో వొస్తారు. మర్నాడు మళ్ళీ అంతే. మరి స్నానం చేయించి మందురాయకుండా ఆడది మూతిముడుచు కుంటే వాళ్ళకి దిక్కెవరు?

సీతా: మరి ఆడవారి హృదయబాధ తీర్చుకునేందుకు దిక్కెవరు?

ప్రభ: ఈశ్వరుడు.

సీతా: ఆ భోగంవాళ్ళు నా కన్నా బావుంటారా? వాళ్ళ కింతకన్నా మంచిచీర లుంటాయిగావును? ఏం? మరి నా కొనిపెట్టకూడదూ, ఇంకా మంచిచీరలూ, నగలూ? (అద్దంలో చూచుకుంటూ) పోని ఎవరైనా గొప్పవాళ్ళను ప్రేమించినా, తాకినా, అది వొక మోస్తరు? నీచులు, అన్నీ మాయరోగం! అంతా

మురికి; అసహ్యమేకదా! ప్రతి వాడికి దక్కుతారు గదా! అట్లాంటివాళ్ళని తాకి ఆ చేతులతోనే నన్ను ...ఎంత కోపమొస్తుందంటే, యింట్లోంచి పారిపోవాలనీ, ఆ చేతులు కాల్చెయ్యాలన్నంత కోపమొస్తుంది. వాళ్ళతో చేరి నన్ను నవ్వుతారు. నన్ను, నా కాలిగోరు, నా అరికాలు మన్ను తాకటానికి పనికిరాని వాళ్ళందరికీ లోకువ నేను!

భ్రమ: వాళ్ళసంగతి నీకేం తెలుసు? అందరూ అంత దుర్మార్గులా?

సీతా: నేను చదవలా, పుస్తకా లన్నిట్లోనూ అట్లానే వుంది... నా నాథుడు...దైవమే లోకువై నన్ను నవ్వులపాలుచేస్తే... నేను బతకనమ్మా. నేను చచ్చిపోతాను.

భ్రమ: నీకు దయ, శాంతం, శీలం, క్షమ యివి అవసరం. వాటితో ఆకర్షించాలి.

సీతా: ఇంకా నీ మాటలు వింటే యింకా భ్రష్టురాల్ని అవుతాను. నీ బోధవల్లనేగా నా సంసారం పాడయింది!

భ్రమ: ఏమిటి? మంచి బుద్ధులు బోధించటంవల్లా?

సీతా: ఆ! నిస్సందేహంగా. వాళ్ళ మంచిబుద్ధులు చూసేనా అక్కడికి వెళ్ళారు!

భ్రమ: వాళ్ళ ఆదరణను చూసివెళ్ళారు. రాగానే నువ్వు కాళ్ల కుక్కవలే మీద పడుతో వుంటివి.

సీతా : లేకపోతే చచ్చినట్టు పడివుంటాను ! అరుగో అట్లాం
టివి బోధించే కొంపకు చేటు తీసుకొచ్చావు. పాతి
వ్రత్యం, పతిభక్తి, భర్తకు ఎదురాడక పోవడం
యిదే ధర్మాలు మంచి గుణాలు కావాలిగాని, మంచి
బట్టలెందుకు ? మనోశుభ్రము సంగతి బోధించారు
గాని, శరీరశృంగారము నేర్పారా ? నాభక్తి, సేవా
ధర్మం ఎందుకు అక్కరికి వొచ్చాయి ? ఎవరు
చూశారు ? 'ఇట్లా వున్నావేం, ఆ రవికేమిటి ?'
అంటే, 'పోనిద్దురూ నేనేం బోగందాన్నా' అన్నాను.
ఆయనకి కాళ్ళు కడిగిన చేతులు పనికివచ్చాయూ ?
మొట్టి రూపాయలు లాగేవి నెత్తిన పెట్టుకున్నారు !
భక్తితో వొంచినముఖము, తెక్కిరించి సన్నాటుకు,
ఆ మూలమొహం దేవతైంది. కాఫీ స్వయంగా తెస్తే
'ఛా, పొగకంపు' అన్నారు, రాత్రి కాళ్ళు పిసుకుతో
కూచుంటే అట్లానే మాట్లాడకండా నిద్రపోయినారు.
చీరెలు, గంధాలు, అత్తర్లు, అన్నీ బోగంటక్కలు
పనికిరావంటివి. వాటికోసమే సన్నడివి పాక్కొరు.
ప్రేమ కాని కామం కూడదంటివి. అది కూడకపోతేనే
'నీకేం రక్తంలేదూ, అందానివి కాదూ. నా కొక్క
డికే యీ ఉత్సాహం. అసంబం' అని ఎన్నోసార్లు
విసుక్కున్నారు. అరుగో వొచ్చారు. (చప్పున
మానేసి లేచింది త్వరగా) వెళ్ళమ్మా. వెళ్ళు.

భ్రమరాంబ వెళ్ళింది. సీతాకాంతం చప్పున మంచంమీద బోర్ల పడుకుని నిద్ర నటిస్తోంది. కేశవరావు చప్పుడుకాకుండా వొచ్చి కండువా తగిలించి జోడువిప్పి సీతాకాంతం మేలుకుందో లేదో తెలుసుకోడానికి మెల్లిగా మాట్లాడుతున్నాడు.

కేశవరావు: దీపంతగ్గించి లేదేం? నిద్రే! ఆ బోర్లపడు కోడమేమిటి?

నిద్రపోయిందని నిశ్చయించుకుని, బయటికివెళ్ళి, బయటి తలుపు గడియవేసి, గదితలుపు గడియవేసి, బల్లమీద గ్లాసులోని పాలు తాగి, చీల్చి పెట్టివున్న తములపాకులు వేసుకుని, కిటికీలోంచి పైటికిచూసి, నిట్టూర్పు విడిచి, మెల్లిగా గోడపైపున సీతాకాంతం పక్కన పడుకోబోతున్నాడు. ఇదంతా సీతాకాంతం చేతి సందు లోంచి చూస్తూనేవుంది. కేశవరావు పడుకుని కళ్ళు మూసు కున్నాడు. సీతాకాంతం అట్లానే పడుకుని 'సిగ్గులేదూ' అంది.

కేశవ: (కళ్ళు మూసుకునే) ఊ, ఏమిటి? (మాట్లాడడు) ఏమిటీ వేషం, మేలుకొనివుండే!

సీతాకాంతం తలక్రింది చేతిని లాగేశాడు.

సీతా: పొండి, సిగ్గులేదూ. నన్ను ముట్టుకోకండి, పొండి.

కేశవ: ఏమిటీకోపం? ఎందుకు?

సీతా: ఎందుకు! ఎప్పుడు వస్తానన్నారు?

కేశవ: ఆలస్యమైంది. పాపం! నాకు చాలా విచారంగా వుంది.

సీతా: పాపం! ఎందుకైంది ఆలస్యం? అది చెప్పండి.

కేశవ: ఎందుకడుగుతావు? నీతో అబద్ధం చెప్పడానికి యిష్టంలేదు.

సీతా : అబద్ధాలే చెప్పండి. అప్పుడింత ఏడవనుగా!

కేశవ: పిచ్చిపిల్లా! పడుకో.

సీతా : ఏమిటి పడుకునేది? నే నెందుకు పడుకోవడం? ఎందుకు వొచ్చారిక్కడికి, దాం దగ్గ రేవుండక?

కేశవ: నువ్వు ఏడుస్తావని.

సీతా : ఏడుస్తానని పాపం? యిప్పుడు సంతోషిస్తున్నాను. నాకోసం... నా కోసంట. (మాటలేదు) (గొంతు మార్చి) నన్ను చంపరాదూ — చంపరాదూ — చస్తే సంతోషమేగా? ఒక్కసారి గొంతు పిసికెయ్య రాదూ! ఇంకెందుకు నేను బతికి? ఎందుకు?

ఏడుస్తోంది. కొంత సేపు కేశవరావు ఊరికే చూస్తున్నాడు. తరువాత అతని మొహంలోకి జాలివొచ్చింది. ఆమెవైపు చేతులుజాచి పాకుతున్నాడు.

కేశవ: యిట్లా రా.

సీతా : ఛీ, ఛీ, నన్ను తాకకండి. అది వుండగా నే నెందుకు?... అయ్యో! తాకారంటే వెళ్ళిపోతా. బయిటికి దూకుతా. దూరంగా వుండండి. నే నెందుకూ, నే నెవరిని? ... వదలండి. నన్ను తాకారా ...ఛీ... వదలండి... అయ్యో! తల పంచానేసి బాదుకుంటా... అవును, బాదుకుంటే మాత్రం ఎవరికి? మీ కేం! పీడ విరగడై పోతుంది. రాత్రంతా దాంతో నే వుండవచ్చు హాయిగా.

కేశవ: వుండు. ఏమిటా అరుపు? బుద్ధిలేదూ, (నెమ్మదిగా) ఎందుకు చస్తానంటావు? నీవు చస్తే నే నేమౌతాను!

సీతా : అయ్యో ! అయ్యో ! ఎక్కణ్ణుంచి వొస్తున్నాయి ఆ మాటలు ! (గొంతు మార్చి) నిజం చెప్పండి. నిజం ప్రమాణంచేసి చెప్పండి. నేను చస్తే మీకు దిగులు పుడుతుందా ?

కేశవ: ఆ. ప్రమాణంచేసి చెప్తున్నాను. నా కమితమైన బాధకలుగుతుంది. జీవితంమీద విరక్తికలుగుతుంది.

సీతా : అయితే నామీద ఇంకా ప్రేమ వుందా! కొంచెం ఏమూలన్నా —

కేశవ: (కావలించుకుంటూ) నిజంగా వుంది. నువ్వు వృథాగా బాధపడుతున్నావు పాపం !

సీతా : (అతని బుజంమీద తల పెట్టుకొని) నిజమేనా, నేను చచ్చిపోతానని అంటున్నారా ?

కేశవ: నిజం.

సీతా : ఎట్లా నమ్మను ? మరి ప్రేమవుంటే, దాన్ని-

కేశవ: అది మరచిపో - మరచిపోవాలి - ఆ సంగతిఎందుకు?

సీతా : ఎట్లా మరిచిపోను ? రాత్రింబవళ్ళు యిక్కడ ఎర్రని యినుం పెట్టినట్లు కాలుస్తోంటే. నాకూ మరిచి పోవా లనే వుంది; ఎట్లా !

కేశవ: నిన్ను ప్రేమిస్తున్నాను; చాలదూ ?

సీతా : చాలదు. నన్ను ప్రేమిస్తే యింకోరెందుకు కావలసి వొస్తారు ? అబద్ధం.

కేశవ: కాదు, నా ప్రేమ అంతా నీదే.

సీతా : అబద్ధం, అబద్ధం, పొండి (తోసేస్తుంది)

కేశవ: దాన్ని-దాన్ని—ఛీ-అది నా చపలత్వం - అది నా పశుత్వం. నీ మాధుర్యం, నీ దయ ఎక్కడనాన్నా చిక్కుతుందా, నా భార్యవి—నా రాణివి...

సీతా : మంచిరాణినే! ఇంకా పూర్వంమాటలు అని నన్ను వెక్కిరించకండి. ఎంత గాయం చేస్తాయనుకొన్నారు ఆ మాటలు! మీకు వుద్యోగమైన మొదటిరోజున ఆ వానలో రావిచెట్టుక్రింద, మెరుపులమధ్య, నన్ను చీకట్లో 'రాణీ' అని పిలిచారు...అబ్బా నన్ను బాధ పెట్టకండి. వెళ్ళిపొండి. నన్ను నాచావు చావనివ్వండి (ఏడుస్తోంది.)

కేశవ: నీ పౌడరంతా కరిగిపోతోంది. శుభ్రమైన గంధం మానేసి ఆ పౌడ రేమిటి?

సీతా : అవును, నా కెందుకు పౌడరు? మేము పౌడర్లకి తగు దుమా?

కేశవ: అదికాదు. నిన్నుచూస్తే నా కెంతోగౌరవం. ఆ నీచులు మల్లే నువ్వు వేషాలువేస్తే నాకు బావుండదు. ఆ పక్కపాపిడి - ఆ పౌడరు - ఆ జాకట్టు-అవేమిటో నీకు సరిపోయినట్టుండవు. నీ గొప్పతనము పోయిన ట్టుంటుంది. నీకు అందం లేకనా యివి?

సీతా : అవును-చాలా అందంవుంది నాకు! చాలా లాభం వొచ్చింది, అందంవల్ల! యీభోగులకి మేము తగు దుమా! పూర్వోత్తరము గంధాలు రాసుకుని, కొప్పులు పెట్టుకుని, భార్య యింటో మూలుగుతో పడివుండాలి...... మీ ప్రియాంగనలు మాత్రం,

యివన్నీ వేసి, తలికి మీకళ్ళని మిసమిస్సగొలిపి...

కేశవ: నీకూ వాళ్ళకీ సాటా ?

సీతా : అవును, సాటా ? ఎవరెక్కువో తెలుస్తోనేవుంది ! నేను పూర్వోత్తరంగా వుంటానసేగా నన్ను వొదిలేశారు.

కేశవ: అందుకని యివన్నీ సాగించావా ? పిచ్చిదానా ! నిన్ను చూస్తే జాలేస్తోంది... చూడు, నీవే పవిత్రురాలివి. నిజంగా సీతవి. సీత యీ వేషాలు వేసుకుంటే యెట్లా వుంటుంది ? నిన్ను కావిలించుకుంటే అప్పుడే మంచుతో తడిసిన మల్లెపువ్వుని కావిలించుకున్నట్టు.

సీతా : చలివేస్తుంది... ...అందుకనే వాసనచూసి, నలిపి, అవతల పారేశారు... నే నేం పువ్వునీ కాను, దేవతనీ కాను, సీతనూ కాను. నన్నేం పొగడక్కర్లేదు. అట్లా అనే నన్ను వొదిలి మనుషుల దగ్గిరికి వెళ్ళారు. నేనూ మనిషినే. నాకూ కావాలి మోహం. నాకూ వుంది రక్తం. నేనూ పడతాను బాధ. మనిషినే... నే నెంత యమబాధ పడుతున్నానో ఎట్లా తెలుస్తుంది—ఎవరికి కావాలి (ఏడుస్తోంది.)

కేశవ: (బాధతో) అబ్బా, ఏడవకు. ఏడిస్తే అసహ్యంగా వుంటావు.

సీతా : ఆఖరికి యేడవనుకూడా యేడవకూడదు. నాగతి యింతవరకు వొచ్చింది (ఏడుస్తోంది.)

కేశవ: (బాధతో) అబ్బా ! వూరుకో. నేను దుర్మార్గుణ్ణి. నీవంటి సుకుమారిని, పతివ్రతను వొదిలి, పశువునై

అధముడనై పోయినాను. నిన్ను తాకడానికి అనర్హుణ్ణి.
నన్ను నాదోవను పోనియ్యరాదు! చచ్చాననుకో...
యీ బాధపడడం, యేడవడం, మానేద్దూ. ఇంత
పనికిమాలినవాడు బాగుపడడని నా గతికి నన్ను
వొదిలెయ్యి.

సీతా: ఎట్లా వొదలనూ — ఇన్ని ప్రేమబంధనాలతో కట్టు
కొని నాచేత ప్రేమింపించుకుని, చప్పున నన్ను వొది
లెయ్యమంటే, హృదయం రక్తం కారుతోవుంటే
ఎట్లా వూరుకోను?

కేశవ: పోనీ. నన్ను ఏదో స్నేహితుడిగా చూడు. యీ
వెధవతో నాకేమనుకో — మరిచిపో — నన్ను అసలే
మరిచిపో —

సీతా: ఎట్లా మరిచిపోను — ప్రతి రాత్రి నాతో
కూర్చుని, నవ్వి, గంధాలు రాసుకుని, తాంబూ
లాలు వేసుకుని, నన్ను తొడమీద కూచో
పెట్టుకుని, కథలు చెప్పి ... యిప్పుడు నే నేం
కాను. ఎట్లా గడపను ... అబ్బా మీకర్థంకాదూ—
యీ పెదిమల్ని — యీ బుజాల్ని — చూడక
చూడకా — కాదు — కాదు — దాంతో —
ఏ పాడుముండతోనో - నన్ను గట్టిగా - చక్కగా -
ముద్దు - అబ్బా-సౌండి-పాండి-పాండి. నన్ను చంప
డానికి ఎందుకు వస్తారు? మరిచి పోవాలన్నా ఎట్లా
మరవను? మాట్లాడరేం? చూస్తో, చూస్తో-ప్రేమిస్తో,
ప్రేమిస్తో - అట్లా చచ్చిపోయినవాడిమల్లే కళ్ళు,

చెవులు, అన్నీ మూతలుపడి – అట్లా ఐపోయినారే. ఎంత కోపించినా ఎంత ప్రార్థించినా లాభంలేదు. రాయి-రాయి——ఆ హృదయం రాయి _ ఎందుకండీ యిట్లా అయినారు? నే నేం చేశాను? (కాళ్ళమీద పడింది) నే నే అపరాధం చేశాను? మీ కెట్లా అసహ్యం కలిగించాను? మనసులోగాని, పనిలోగాని మిమ్మ న్నేమన్నాను? మీకు కోపంవస్తే – కోప మన్నా రాదేం నామీద. పూర్తిగా మాయ మైనారు. మీరు నాకు లేరు, మీకు నేను లేను. కొట్టండి, తిట్టండి, చీల్చండి, చంపండి. కాని నాతో సంబంధం లేనట్టు, నామాటలు వినపడనట్టు, అట్లా కూచోకండి, అట్లా చూడకండి. భరించలేను. (ఏడు స్తుంది) ఏం పాపం చేశానండి. నావల్ల యేం లోపం? ఎందుకు ప్రేమించారు? నన్నెందుకు మోసంచేశారు? అసహ్య యెట్లా భరించను...వొదలరూ – దాన్ని వదలరూ, నాతో మునపటిమల్లే ఆడుకోరూ, యింత శిక్షా! దేనికి?

కేశవ: కూచో. నామాట విను ముందు. నీకు నిజంగా బాధ వుంటుంది. అది నిజమే, కాని సమాధానపెట్టుకోడం నేర్చుకోవాలి.

సీతా: నేను మనసు సమాధానం పెట్టుకోవాలీ, మీరు మాత్రం మీ పనులు మానుకోకూడదు, ఏం? సిగ్గ య్యటం లేదూ?

కేశవ: యింక భరించలేను. అట్లా ఏడిస్తే వెళ్ళిపోతా.

సీతా : వెళ్ళిపోతున్నారూ! (అతన్ని కావలించుకుని ఏడుస్తోంది) నన్ను వొదిలేసి వెడతారా? మధ్యాన్నం నుంచి ప్రతినిమిషం ఎదురుచూస్తో కాచుకుని కూచుంటే ఏదా మొఖం. ఆ చెయ్యి యిట్లా తెండి. మీా రేం చెయ్యమన్నా చేస్తా. దాని వేషాలన్నీ నేర్పండి, నేను మోహం చూపలేదనేగా. చూపుతా, నేర్చుకుంటా — యిట్లా కావిలించుకొని, రండి, ఇట్లా రండి — మరి...

కేశవ: (బాధతో) అబ్బా, వూరుకో ఓర్చుకోలేను. నిజంగా నీ మీాద నా కిష్టంలేదు. పోనీ, అట్లా నాకు బావుండవు. నన్ను బాధ పెట్టకు.

సీతా : ఏం చేశానండి. ఏమి చెయ్యానండి?

కేశవ: నాకు మనసు మారిపోయింది. నేనుమాత్ర మేమి చెయ్యను.

సీతా : మీాకు మార్చుకుంటే మారింది.

కేశవ: మనశక్తిలోవుందా? నాశక్తికి మించింది.

సీతా : అంతవరకొచ్చిందీ? పోండి. వెళ్ళండి, నీచుడా దుర్మార్గుడా, ముండ వాడా! పో పో!

కేశవ: ఆ! ఏం—మరీ మితిమీారుతోంది వ్యవహారం? నాలిక కొవ్విందా!

సీతా : ఔను. మీారు చేసేపనులకి బుద్ధిచెప్పేవాళ్ళు లేకేగా. నేనంటే లోకువా. ఏమిటీపని అని చెప్పు తీసుకు కొట్టేవాడే వుంటేనా. నోరులేనిదాన్ని నేనుగనక

సరిపోయింది గాని (ఏడుస్తో) యింక దిక్కులేదుకదా, దీనికి నే నేంచేస్తే దీని కేంగతి అనికాని.

కేశవ: తన్నులు కావాలా?

సీతా: తన్నండి పోనీ, తన్నినా బాగా సేపుండును. తన్నండి. అదే తక్కువైంది. ఆదేనయం. చాలు. దయ చేయండి యింక.

కేశవ: (లేచి కండువా, చెప్పులు వేసుకుంటున్నాడు.)

సీతా: అన్నదే చాలని వెడుతున్నారా, వెళ్ళండి. అస లెందుకొచ్చారు?

కేశవ: ఏడవడానికి.

వెళ్ళిపోయినాడు. సీత స్తబ్ధయై చూస్తోంది. ప్రక్కతలుపు తెరుచుకుని భ్రమరాంబ తొంగిచూసి లోపలికి వొచ్చింది.

భ్రమ: వెళ్ళాడా?

సీతా: (మాట్లాడదు)

భ్రమ: పంపించావా?

సీతా: (మాట్టాడదు)

భ్రమ: వెర్రిపిల్ల!

సీతాకాంతం చప్పున మంచాన్నానుకొని ఏడుస్తోంది. భ్రమ రాంబ దగ్గరిగా వెళ్ళి తలమీద చెయ్యేసి మాట్లాడుతోంది.

అట్లా పోట్లాడి పడిస్తే అతన్ని గాయం చెయ్యడం, నువ్వు గాయం కాపడంతప్ప యింకేంలేదు.

సీతా: మరి యిరా బాధ?

భ్రమ: మరి బాధ అని పురుషుని మరింత రేపుతారా? విధ మతిగాదు. ఎన్నిసార్లు చెప్పినా నీకు తెలియటం లేదు.

సీతా: కానీ, అందరికీ లోకువైనాను. నువ్వూ ఆయన వేపే!

భ్రమ: చేతకాని దానివి.

సీతా: ఏం చేతకాదు?

భ్రమ: ప్రేమించడం...

సీతా: ప్రేమవల్లనే కదా యీ బాధ.

భ్రమ: మరి అంత ప్రేమించేదానివి, ఆయన ఆనందం భంగ పరుస్తావేం?

సీతా: మరి నా బాధ?

భ్రమ: మరి నీదే నిజమైన ప్రేమ ఐతే, యీ బాధలో నీ హృదయం నృత్యం చెయ్యవద్దూ?

సీతా: మరి ఆయనకి నా మీద ప్రేమలేనిదే.

భ్రమ: ఇంతేనా నీ ప్రేమ! బిడ్డ తిరగబడితే తల్లిప్రేమ పోతుందా?

సీతా: బాధ పడదా?

భ్రమ: కాని బిడ్డకి సహాయం చేస్తుందా లేదా? అట్లానే నీ బాధని లక్ష్యం చెయ్యకు, అణుచుకో. అతని సేవ చెయ్యి. పతివ్రత లందరూ అట్లానే కదా, ఆత్మ సామ్రాజ్యాన్ని ఏలుకోవలసింది?

సీతా : పతివ్రతల కేం? వాళ్ళకి అన్నీ సాధ్యమవుతాయి. ఆ కాలమూ! ఆ మనుషులూ!

భ్రమ: పతివ్రతలు వుంటే యిదీ ఆ కాలంగానే మారుతుంది.

సీతా : సీతలు, చంద్రమతులు వుంటే ఏం లాభం! రాములు హరిశ్చంద్రులు ఏరి?

భ్రమ: యీ సీతలూ, చంద్రమతులూ తమ భర్తల్ని రాములూ హరిశ్చంద్రులూ చెయ్యాలి. మొగవాడు పశువైతే స్త్రీ తనుకూడా పశువు కావచ్చా? తన శీలంచేత అతన్ని మృగత్వంనించి వుద్ధరించాలి.

సీతా : అందాకా వైధవ్యం భరిస్తో, తాను ప్రేమించి పూజించే దైవము వేశ్యలకాళ్లు కడుగుతో వుంటే సంతోషించమంటావు?

భ్రమ: నీకు ప్రేమమహిమ తెలీదు. నిజంగా ప్రేమిస్తే ఆ ప్రేమ నీకు యీ శరీర సౌఖ్యాలకన్నా ప్రసన్నతమైన ఆనందాన్ని యిస్తుంది. అది ఎటువంటి ప్రేమ—భర్త ఎటువంటి వాడైనా, ఏమిచేసినా, ఎంత హింసించినా చలించని... ...

సీతా : అట్లాంటివాణ్ణి ప్రేమించే దెట్లా ముందు?

భ్రమ: భర్తగనక—భర్త అని... అంతే. అతని రూపాన్ని కాదు, గుణాన్ని కాదు.

సీతా : కొట్టినా, తిట్టినా...

భ్రమ: ఆ... యీభర్త, భౌతికభర్త యేమైతేనేం! నీ హృదయంలోని భర్తని ఎవరు ఎత్తుకుపోతారు! విను మళ్ళీ

చెపుతున్నా, నీ సౌఖ్యం కోరి. వీటికోసం తగవులాడి నన్నాళ్లు శాంతిలేదు.

సీతా: అన్నీ ఉత్తదే. శాంతి యెట్లా వొస్తుంది, అట్లాంటి భర్తతో?

భ్రమ: శాంతి హృదయంలో వుంది. బయట వెతికితే రాదు. భర్త ఎంత కావిలించుకుంటే మాత్రం వొస్తుందా?

సీతా: ఆ, తప్పకుండా వొస్తుంది.

భ్రమ: అదో శాంతా...ఎన్నాళ్లు, ప్రయత్నించిచూడు. 'ఆ భర్త నాకేం ఆనందమిస్తాడని వెతికి అతనివ్వ నప్పుడు ఏడవటం కాదు. నేను అతని కేమివ్వగలనని ఆలోచించాలి. అత న్నెట్లా సంతోషపెట్టను అనే చింత ముఖ్యం. మనము ఆనంద మనుభవించడము కన్న యింకొకరికి ఆనందమిచ్చి ఆనందం అందు కోడం నేర్చుకోవాలి.

సీతా: ఎట్లా?

భ్రమ: త్యాగంవల్ల.

సీతా: అంటే—

భ్రమ: నువ్వతన్ని ప్రేమిస్తున్నావుగదా!

సీతా: ఆ—

భ్రమ: మరి అతనికి ఆనందం యివ్వవా?

సీతా: ఇస్తాను.

భ్రమ: నీకు బాధ కలిగినా ఏం?

సీతా: అమ్మా!

భ్రమ: అయితే అదేమి ప్రేమ!

సీతా: సరే ననుకో.

భ్రమ: మరి అతని కామనిషే కావాలి.

సీతా: ఛా.

భ్రమ: అదుగో, చూశావా, ఆ అహంభావమే కూడదు. యింక త్యాగ మేమిటి?

సీతా: అదేం ప్రేమ? కొరివిపెట్టి తల గోక్కున్నట్టుంది.

భ్రమ: నీ కర్థంకాదు. మాధుర్యం అనుభవిస్తేనేకాని బోధ పడదు.

సీతా: నాకు వొద్దు ఆ త్యాగం.

భ్రమ: త్యాగమే సృష్టిరహస్యం. ప్రేమ అంటేనే త్యాగం. ప్రతినిమిషం ఈశ్వరుడు తన స్వేచ్ఛని త్యాగంచేసి, ఆనందాన్ని పొందుతున్నాడు. ముఖ్యము, త్యాగమూర్తి ఐన స్త్రీద్వారా సృష్టించుకుంటున్నాడు తన ప్రపంచాన్ని. పతివ్రతలందరూ యీశ్వరాంశ సంభూతులు. చంద్రమతి చేసిన త్యాగం ఆమె కెంత మహానందాన్ని యిచ్చివుండాలి! నాటకాల్లో ఆమె యేడ్చిందని వ్రాస్తారు కాని...

సీతా: నిజమేనా?

భ్రమ: ఏ ప్రతివ్రత త్యాగం చెయ్యలేదో ఆలోచించుకో.

సీతా: మరి ఆ త్యాగ్యవల్ల ఆయనకి నాపైన మనసు తిరుగుతుందా?

భ్రమ: అదుగో—ఆ నా—అనేమాట వొదిలెయ్యి. ఆయనకు

సంతోషం కల్గుతుందా అని ప్రశ్నించుకో. ఆయన ఆనందమే నీది.

సీతా : నాకు బాధ కలిగించినా—

భ్రమ: ఆయన ఆనందంగా వుంటే నీకు బాధ ఎక్కడది? ఆయనే నువ్వు, నువ్వే ఆయన.

సీతా : ఏంచెయ్య నిప్పుడు?

భ్రమ: పోట్లాడకు. సంతోషమైనముఖం కనపరుచు. సేవ చెయ్యి. ఏమాత్రం బాధ ఆయనకి కలిగినా, అది మాన్చడానికి నీప్రాణం - నీసుఖం - నీమానం - అన్నీ త్యాగం చెయ్యి.

సీతా : ప్రాణమా - చచ్చిపోతే యింక యీ త్యాగంవల్ల లాభం ఏమిటి?

భ్రమ: అదుగో లాభంసంగతి మాట్లాడుతున్నావు.

సీతా: మరి యిట్లా మెత్తపడటానికి. ఆయనతో కారణం చెప్పనా?

భ్రమ: తెలియడ మెందుకు?

సీతా : తెలియకపోతే ఆయన మనసు తిరగడమెట్లా?

భ్రమ: అదుగో మళ్ళీ ఆసంగతే, నీసంగతే. ఆహా!

సీతా : మరి ఆయన చివరికి నన్ను ప్రేమిస్తారన్నావుగా?

భ్రమ: అయ్యో! పెర్రితల్లీ. మాటలతో చెప్పాలంటే మన గొప్పతనము! మనము చెప్పకోవాలా! మన కార్యాలవల్ల వ్యక్తంకావాలి.

సీతా: ఏమో! సరేలే.

భ్రమ: ఇంక పడుకో.

సీతా: నువ్వుకూడా యిక్కడే పడుకో అమ్మా! నాకు భయమేస్తుంది. ఈపాటికి దాంతోకలిసి నవ్వుతో వుంటారు. 'అంతేకావాలి దానికి' అంటోవుంటారు. ఎవడన్నా చితకబాదితే... అమ్మా పతివ్రతలు ఏ మాటంటే అది జరుగుతుందికదూ? (పడుకుని) అమ్మా!

భ్రమ: ఏం?

సీతా: కాని యీబాధ ఎన్నాళ్ళని భరించను!

భ్రమ: పిచ్చిదానా! సరియైన జ్ఞానంతో చూడు. యిదంతా మాయకదా! నువ్వు-యీ లోకం-నీ బాధ-నువ్వు బాధపడుతున్నా వనుకోడం-అంతా మాయకదా!

సీతా: యీ బాధ నిజంకాదా?

భ్రమ: అంతా కల.

సీతా: ప్రేమ—?

భ్రమ: ప్రేమకాదు. ధర్మము ఒక్కటే శాశ్వతము.

—: తెర :—

# రెండో రంగం

రాత్రి తొమ్మిది గంటలు. వనకుమారి యింటో పడకగది. ఎడమ చేతివేపునించి ఒకటే తలుపు. వెనక పదిరిపట్టెమంచం. దాని ముందు కొంచెం దూరంగా తివాసిమీద హార్మోనియం ముందు పెట్టుకుని వనకుమారి కూచునివుంది. ఆమెకి ముప్ఫైయేళ్ళకిలోపు. ఆమె అందమంతా ఆమె జుట్టులోనూ, ముక్కులోనూ వుంది. పక్కనించి చూస్తే కాశ్మీరపు స్త్రీ లాగు కనపడుతుంది. కేశవ రావు మంచంమీద కూచుని వున్నాడు.

వనకుమారి: ఛా, ఏమటా బూతుమాటలు !

కేశవ: నీకు బూతుమాట లనేవికూడా వున్నాయా?

వన : మీవంటివారి సహవాసం వల్లనైనా, మేము ధన్యులం కావాలని చూస్తాం. పువ్వులవల్ల నారకి వాసన వొచ్చినట్టు, విష్ణుభక్తివల్ల రాక్షసులు ముక్తి పొందినట్టు. కాని మీరే మాగతికి దిగుతారా !

కేశవ: మీఅంటి వాళ్ళంటే—నేనేం గొప్పవాణ్ణినా !

వన : కాదు మరి ! కులంగొప్ప; వంశం గొప్ప; ధనం గొప్ప.

కేశవ: అంతే—

వన : (చిరునవ్వుతో) సరే. అందంగొప్ప, బలంగొప్ప.

కేశవ: అంతేనా ?

వన : (సిగ్గుతో) మీకే తెలుసు. అనాలా చెప్పుమీటి? (చిరునవ్వుతో వోరగా చూస్తుంది)

కేశవ: అబ్బా! అట్లా చూస్తే నేను ఓర్చుకోలే ననలేమూ!
ఎందుకు చూస్తావు.

వన : ఆడదాన్ని గనక, మీదయ ఆశించిందాన్ని గనక.

కేశవ: ఆడవాళ్ళందరూ చూస్తారా నావంక!

వన : రసికత్వమూ, బుద్ధీ వున్నవాళ్ళందరూ.

కేశవ: నిజంగా నేనంత బావుంటానా? (అద్దంలో చూసుకుంటున్నాడు) నన్ను పొగడడానికి అంటున్నావు.

వన : మీ కళ్ళకే కనపడుతో వుండగా, నన్నడగడ మెందుకు?

కేశవ: నీ కళ్ళల్లో చూడాలని వుంటుంది.

వన : మీభార్య కళ్ళల్లోనో!

కేశవ: ఏమీ కనపడదు.

వన : ఐతే యింక భార్య ఎందుకు?

కేశవ: సంసారానికీ, పిల్లలకీ—

వన : ~~[illegible] భార్య; [illegible] భార్య~~

కేశవ: ఔను.

వన : కాని నాకు నేను భార్యని కావాలనేవుంది.

కేశవ: ఏం?

వన : (కొంచెం ఆవేశంతో) స్థిరంగా, దృఢంగా, గాఢంగా నాదేనని— యెప్పటికీ, అంతా, సంపూర్ణంగా ఐక్యమై, భేదంలేకుండా నేనే నని – ప్రేమించాలని అమితమైన కాంక్ష నన్ను కాలుస్తుంది.

కేశవ: ప్రేమించరాదూ?

వన : ఎవర్ని ?

కేశవ: నన్ను.

వన : (నవ్వేతోంది దిగులుగా) ఎన్ని జన్మాలెత్తితే మీరు నా వారౌతారు? నాకే భర్తవుంటేనా — మీ భార్య యెట్లా ఓర్చుకుందోగాని—నా జీవితమంతా, నా శక్తినంతా, నా తెలివినంతా, నాహృదయాన్నంతా — అంతా అర్పణంచేసి, పనవేసుకుని, కళ్లుకప్పేసి, నాలో లీనం చేసుంకుంటాను.
ఆ యిద్దరిదయు వుంటే వేశ్యకైనా అద్భుతమైన ప్రేమరాజ్యం తటస్థపడుతుంది. అంతా మన పూర్వజన్మసుకృతం.

జన్మవల్లగాక గుణంవల్ల సంసారి, వేశ్య అనే విభాగము చూపుంతును.

మీ రెందుకు యిక్కడికి వొస్తున్నారో మీకూ తెలుసు; నాకూ తెలుసు; వీధులో వాళ్ళకీ తెలుసు.

ఈ భార్యల్ని చూస్తే దిగులేస్తుంది. తన భర్తల్ని ఆకర్షించుకోలేని వాళ్ళు మమ్మల్ని తక్కువగా చూస్తారు. మమ్మల్ని తాకింతర వాత తమని తాకనివ్వకండా నిషేధించేధైర్యం లేనివాళ్ళు మాకన్నా అధికు లెట్లా ఔతారు! పిచ్చి!

కేశవ: కాని నువ్వే సంసారివైతే, నాకు కనపడి వుండే దానివా? ఒక వేళ నా భార్యవైతే తప్ప... కాని

అప్పుడు... నీ సొగసు, నీ వినుసు, నీ మనసు... ఏదీ పాడు.

వన : అదేమిటో నాకు రాదు.

కేశవ: అదే—'లావణ్యారామ'—

వన : నాకు రాదు.

కేశవ: అన్నట్టు ఈ కృతులు దానికివొచ్చు - మా ఆవిడకి. నాకు మతే పోతోంది, నిన్ను చూస్తున్నకొద్దీ... పాడు-యింకోటేదన్నా పాడు... 'ఏమీ మాయమూ చేసి, పోతివో.'

వన : (పాడుతోంది)

కేశవ: దానిపై సంగతి శ్యామసుందరాలోది—కానీ. (వనకుమారి పాట అంతా పాడి ఆపింది.) బావుంది. బావుంది. ఏదీ యదుకుల కాంభోజిలోనే యింకోటి వుండాలి.

వన : ఆ యదుకుల కాంభోజి మీ భార్యాగారు. నా కా రాగాలసంగతి తెలీదు. దాని మొదలేదో చెప్పండి.

కేశవ: అదేదో జ్ఞాపకం రావటంలేదు. పోనీ యింకోటి గాని 'యింతిరో వాని మన—' (వనకుమారి పాడుతోంది) అదుగో, పాడుతో అట్లా చివర నవ్వవొద్దనలేదూ! ఆ దిగులుచూపు వొద్దు. ఒక్కసారిగా కళ్ళల్లో దిగులూ, పెదవులమీద నవ్వూ, ఎట్లా చూపుతావు! అభినయంలో నేర్పుతారా! (వనకుమారి పాడుతోంది)

వన : (పాట మధ్యలో) ఏమో టక్కరి పాటలు - ఒక రాముడిమీద భక్తికీర్తనా! పుణ్యమూ, మోక్షమూ ఎందుకొచ్చిన పాటలు, చచ్చుపాటలు! కృతులు నేర్పమంటే ఆయన సెవకో నవ్వాడు. ఈ జన్మం కూడా, పాపకూపంలో, యిట్లానే గడుస్తుందిగావును. నామోచ్చారణచేతే జన్మలు నశిస్తాయంటారు. అట్లా ఏమన్నా వుండాలి నాకుకూడ ముక్తి! (పాడుతోంది)

కేశవ: ఏదీ, ఏదీ, మళ్ళీ. ఆహా! యెంత గొప్పగావుంది! నిన్నుకాదు, ఆకంఠాన్ని కాదు; ఆ స్వరాన్ని ముద్దు పెట్టుకోవాలి. ఎట్లా? ఎన్నిసార్లు నిన్ను కావిలించుకుంటే ఏంలాభం!

వన : సంగీతంలో యింత రసజ్ఞులే! మరి జీవితంలో కారేం?

కేశవ: (బాధతో) కానా?

వన : ఐతే బోగందాన్ని యిష్టపడతారా?

కేశవ: ఏమి?—రసికత్వమూ, మాధుర్యమూ వాళ్ళదగ్గిరే మిగిలింది.

వన : వుంటే నేం? పువ్వు దుమ్ములో అందరి కాళ్ళకిందా నలిగినతరువాత!— నన్నుచూస్తే నాకే రోతే! నన్ను చూసి యిష్టపడేవాళ్లుంటే, ఏదో నా ప్రాణ రక్షణార్థం, ఈశ్వరుడు పంపుతున్నా డనుకుంటాను. మీబోటి ధర్మాత్ముల్ని.

'ఎంతటి కులుకే' అని పాడుతోంది

కేశవ: అది వొద్దు. కళ్యాణి జావళీలకి బావుండదు. 'జాణా తనము' పాడు, కాఫీ.

వన : 'కాఫీ' ఏమిటి ?

కేశవ: (నవ్వుతో) దాని రాగం,

వనకుమారి పాడుతోంది

అక్కడ నొక్కు—యింకొంచం జాలిగా, మాయ లాడి - అన్నచోట.

వన : (పాడి, ఆపి, 'నీ వెళ్లిపోయినావంటే' అని పాడు తోంది)

కేశవ: అబ్బా! వొద్దు, వొద్దు.

వన : అది పాడుతోవుంటే నా కెట్లా వుంటుందను కుంటారు? ఆ నాయకుడి బాధ అంతా అర్థమౌతుంది. నేనే నాయికనై 'లేదు, లేదు, వొచ్చాను. వూరికే అట్లా తమాషాకి, నీ హృదయాన్ని పరీక్షించడానికి, అట్లా నిర్లక్ష్యం చేశా'నని కావిలించుకుని—

కేశవ: వెళ్ళు ఆయనదగ్గిరికి.

వన : ఎవరి దగ్గిరికి ?

కేశవ: ఆ పాటలాయన దగ్గిరికి.

వన : అంత అదృష్టమా—కాని, యింత రసికులు, మీకు యిష్టం లేదేం యీ పాటలు ?

కేశవ: నీచ శృంగారం.

వన : అయ్యో! మా శృంగారం కంటేనా! నీచురాల్ని గననేమో, ఒక్కచోటా నీచత్వం కనపడదు నాకు.

ఈ యిల్లు, యీ చీరెలు, యీ నాట్యాలు అన్నీ మాని "పచ్చని చేలోకి, పండువెన్నెల్లోన"— అంటు మామిడితోటలో. మల్లెతోటల్లో, వెతామెత్తే కాడ— అబ్బా నా మనసు ఎంత వేడుస్తుందని! ఒక్క మనిషి - నేను లేకపోతే - 'తోటవ్యాసంటే సికాకూ'-అంటే, ఎన్నిపుణ్యాలుచేస్తే, ఎంత తపస్సు చేస్తే, నా చిన్న చిన్న అందాలన్నీ. నా చూపు, నామాటలు 'ఎన్నాని చెప్పేది' అంటే...... ఎందుకో యీ పాడుబతుకు? ఎందుకు రాశానో ఆ పాటలు? ఎందుకో యీ ప్రపంచం! ఆ ప్రపంచం 'చల్లన్ని వెన్నెల్లు' 'జిమ్ముమనే తోట చీకట్లు' ఆవులు. గడ్డిమేటి, 'ఎలుతురుని నెమరేసే వళ్ళు' అవన్నీ నావి, నారాజ్యం. నాకోసమే ఆ పాటలన్నీ......
ఆకలేస్తోంది. వెళ్ళండి. పాపం మీ భాగ్యగారు వొంటరిగా వుంటారు, మీకోసం ఎదురు చూస్తా.

కేశవ: అవును వెడతాను. ఇట్లా నీ కాళ్ళముందుపడివుంటే మరీచవకై పోతాను. (లేచాడు. దగ్గిరిగా వొచ్చాడు) మళ్ళీ యెప్పుడు.

వన : ఎప్పుడు మీ కనుగ్రహం కలిగితే అప్పుడు.

కేశవ: ఎప్పుడూ నీదగ్గిరే వుండాలని వుంటుందికద!

వన : అంత దయవుంటే, అదేచాలు వుండాలా!

కేశవ: కుమారీ! మన అనురాగానికి అంతం వుంటుందా! ఒకవేళ నేనే చాలా బీదవాణ్ని ఐపోయినాననుకో,

పోనీ, ఒకవేళ నేనే యేదన్నా తప్పుచేశా నని
వుద్యోగం పోతుందనుకో - కాదంటావేం - ఇట్లా
భోగంవాళ్ళ యిళ్ళల్లోపడి ఏడుస్తూవుంటే —
చూశావా ? మన ఆనందం, మన ప్రేమ ఎవరి
కర్థమౌతాయి ? నిన్ను లంజ అనేస్తారు, చులకనగా.
నన్ను పోకిరీ అనేస్తారు - నా వుద్యోగంపోయి, నేను
బీదవాణ్ణయినా నీకు నామీద ప్రేమ వుంటుందా -
లేకపోతే మీ కులాచార ప్రకారం తలుపు తియ్యవా?

వన : మన స్నేహచరిత్రను జ్ఞాపకం తెచ్చుకుంటే— మీ
ప్రశ్నకి ప్రత్యుత్తరం మీకే తెలుస్తుంది. మరి ఆ
పైకం తీసుకొచ్చారా ?

కేశవ: తీసుకురాకండా వుంటానా ?

జేబులోంచి తీసి యిచ్చాడు

వన : (అతన్ని బుజ్జగిస్తో) చాలా అవసరం కనక అడిగాను.

కేశవ: నాకు తెలుసుగా.

వన : ఎందుకు నా మీద ఇంత మమకారం మీకు ?—
నా కృతజ్ఞత తెలిపేందుకు ఏం చెయ్యను ?

కేశవ: (చిరునవ్వుతో అర్థయుక్తంగా) తెలిపావుగా !

వన : అదా ! అది మామూలు. అట్లానా - పవిత్రమైన
కృతజ్ఞతాభావాన్ని తెలిపేది ? ఛీ ! యిట్లా రండి

నెమ్మదిగా అతని కళ్ళల్లోకి చూస్తో, ఆలో
చిస్తో అతని తలని వొంచి ముద్దు పెట్టుకుంది

కేశవ: మళ్ళీనా! ఐతే యింక కదలలేను. ఎట్లానన్నా నిన్ను మరిచిపోయి వెళ్ళా లనుకుంటూ వుంటే——

వన : యింక వెళ్ళండి; పాపం మీ భార్యగారు చూస్తూ వుంటారు.

కేశవ: (ఆలోచించకుండా, పరధ్యానంగా) అబ్బా! వెళ్ళ గానే గోల.

వన : గోలా, ఎందుకు? తగాదా పెట్టరన్నారు.

కేశవ: ఏడుస్తుంది. ఏదో పోనిమ్మని, నన్ను నా దోవని వొదిలెయ్య కూడదూ?

వన : ఆమె మీద ఎందుకు అసంతృప్తి కలిగింది?

కేశవ: నిజంచెప్పనా? ఆలోచించాను, నా కెందుకీ దుర్బుద్ధి అని. ఈ కులస్త్రీలకి పురుషుల్ని గంజించడం తెలీదు. ఎప్పుడూ పురుషుడి బలవంతమే కాని, వాళ్లు కూడా ఆనందాన్ని పంచుకోరు. చిన్నప్పణ్ణించి, అదేదో పాపకార్యమూ అసహ్యమూ అనుకోడంవల్ల, యింక పురుషుడు వూరుకోడు గనక నేమాం వొప్పు కొప్పి వూరుకుంటారు. కొన్నాళ్ళయిన తరువాత ఏవో......కొత్తలేదు, అసహ్యమైపోతాం వాళ్ళకి. అబ్బా, ఆ నరకం భరించడం కష్టం, లోకమంతా యెట్లా యీ వివాహ సంస్థని నిలబెడుతుందో కాని!

వన : ప్రతిభార్యనీ, కొన్నాళ్ళు మా కింద శిక్షకి పంప మంటారా యేమిటి?

కేశవ: నేను విద్యాధికారి నైతేనా, యీ విషయం ఆడ వాళ్ళకి కాలేజీలు పెట్టించి, మిమ్మల్ని 'లెక్చరర్ల'గా వేయిస్తాను.

వన : మాటలతో నా కడుపు నిండేట్టులేదు. లెక్చరరుపని వేయించిందాకా నన్ను మీరు పోషించవలసిందే. వెళ్ళండి.

కేశవ: వెళ్ళడమే మరిచిపోతావా. నిన్ను చూస్తోవుంటే... నువ్వెట్లాంటిదానివైనా, యెంతమందితో—

వనకుమారి అతని నోరుమూస్తోంది. అతను వొదిలించుకున్నాడు. బైట శ్రీనివాసులు తలుపు కొడుతున్నాడు. వనకుమారి భయం కనపరుస్తోంది.

వన : ఎవరో ?

కేశవ: చూడరాదూ ?

వన : ఈవాళిటప్పుడు ఎవరు వొస్తారు ?

కేశవ: ఏమిటా భయం, ఆ కళ్ళల్లో, చప్పుడువిన్న లేడిపిల్ల కళ్ళలాగు—ఒకసారి యిట్లా రా.

వన : వెళ్ళిచూస్తా.

కేశవ: నిన్ను వొదలను.

తలుపు కొడుతున్నారు.

ఎవరో అల్లరికి. పోనిద్దూ. నిన్ను వొదలను. ఏం చేస్తావు ? ఏమిటా భయం. నేను వుండగానే ! ఎవరన్నా రానీ, రాక్షసుడు కాని, రుద్రుడు కాని—

వన : వుండండి ఎవరో చూస్తాను.

వెళ్ళింది. బైట శ్రీనివాసులు మాటలు. వనకుమారి బుజాలచుట్టూ చెయ్యేసి శ్రీనివాసులు తీసుకొచ్చాడు. శ్రీనివాసులికి ఇరవై ఐదేళ్లు. చిన్నవాళ్లు. కాని బలమైంది. ముఖాన రౌడీ వరస్సు. కళ్ళల్లో కొంచెం వెర్రి. ఇప్పుడు బట్టలమీద రక్తం, తాగివున్నాడు, అతని స్థితిచూసి ఆమె కేశవరావు వున్నసంగతే మరచింది.

వన : ఆ గదిలోకి యెందుకు? ఆగు. ఏమిటీరక్తం? ఏం చేశావు? తొరగా చెప్పు.

శ్రీనివాసులు: ఈ బస్తీమీద సవాల్! రమ్మను - యిట్టా రమ్మను - ఏ లంజకొడుకు వస్తాడో! ... వనం... చూడు... నీ పేరేమిటి ... వనమేనా ... కాదు మధువనం (నవ్వుతున్నాడు.) మరువం... చూడు— నన్ను వుత్త వెధవాయి అనుకున్నారు, తెలిసింది - ఈ వాల్టితో తెలిసింది... దాన్ని ... నా దాన్ని... మాటంటే పడుతుం దనుకున్నాడు ... కర్నుడు - కలియుగ కర్నుడు-రణకర్నుడు- దానకర్నుడుండగా. నరసింహామూర్తిని ... తాగుతా వెధవల రక్తం, తాగుతా. బస్తీమీద సవాల్!

వన : ఏమిటిది? ఏమిటీ రక్తం చెప్పవూ?

కేశవ: కుమారీ—

శ్రీని : కుమారేమిటి? కుమారీ-కుమ్మారీ - కుమ్మరిపురుగూ! సరిగా పిలు! పిలవలేకపోయినావా—

వనకుమారి శ్రీనివాసులు వీపుమీద చెయ్యేసి బతిమాలుతోంది

వన : శ్రీ! నేనూ - వనాన్ని, తెలుస్తోందా? (అధి

కారంతో) చూడు, నా కళ్ళవంక. అట్టా కాదు తెలుస్తోందా? చెప్పు - అంతా చెప్పు, నాతో-

శ్రీని: వాడు - ఆ సాం...

కేశవ: మళ్ళీ వొచ్చాడా వీడు?

శ్రీని: సాంబయ్య... నిన్ను తిట్టలా - వాడు బతుకుతాడా- నిన్నంతమాట అని; బస్తీమీద-యీ పట్టణంమీద- దేశంమీద. రండిరా, కుక్కల్లారా - రండిరా-మీ మీసాలుచూసి. మీ మోటార్లుచూసి, నేను దడుస్తానట్రా-

వన: ఏం చేశావు;

శ్రీని: కాఫీ తాగుతున్న వాణ్ని ... జుట్టు పట్టుకుని (నవ్వుతో) యిలాపడేసి—ఆకప్పు యింకా నోట్లోనే చూస్తున్నాడు, నన్ను; దెయ్యాన్ని చూసినట్టు. వాడొచ్చాడు, బూషిగాడు ... తగూకి... సరేగాని వీడు ఎందుకొచ్చాడు?

వన: ఎరగవూ? ఈయ న్నెరక్కేం? సరిగా చూడు. మన కేశవరావు గారేగా?

శ్రీని: కేశవరావూ! ఎవడది? శవరావూ!

వన: (కేశవరావుతో) వెళ్ళండి. మీరు వెళ్ళండి.

శ్రీని: హో, హో.

వన: మర్యాద నేర్చుకో. ఏమనాలి? పంతులుగారివి.

శ్రీని: [illegible]గా, హొమ్మనాలి.

వన : శ్రీ, శ్రీ, ఎన్నాళ్ళు చెప్పను? 'వెళ్ళండి' అను. యింటికి వొచ్చిన వాళ్ళని యిట్లా అవమానం చేస్తావా?

కేశవ: ఎవడు వీడు? నీకూ వీడుకీ—

శ్రీని : (వనకుమారితో) అయ్యో! దిగులే, వొద్దు—నువ్వా—నువ్వు—పోరా. కాదు, పొండి, పొండి. అయ్యో! నీపని లేపులే! రేపూ నిన్ను సరకడం – ఇవాళిటికి తిను, పోయి—తిను, కాదు, తినండి.

కేశవ; కుమారీ! వీడు మళ్ళీ ఎందుకొచ్చాడు? వొదిలి పోయినాడంటివే! ఎవడు వీడు, నీకు?

శ్రీని : ఎవడు? ఏం కుమారీ? అదే నేను. నేనే అది. అంతే సంబంధం.

వన : మీరు వెళ్ళండి: తరవాత చెపుతాను.

శ్రీని : ను విట్లా రా; యీ తివాసీమీద యిట్లా కూచో. కదలకు.

అతన్ని తీసికెళుతోంది. హార్మోనియం దగ్గిరిగా వొచ్చారు.

శ్రీని : మళ్ళీ యీపాడుపెట్టె వాయిస్తున్నావా? నాకు బావుండదన్నానా? వెధవసంగీతమూ, నువ్వూను.

హార్మోనియం పగలతన్నాడు.

కేశవ: ఏమిటిది—కుమారీ? నేను మర్యాదస్తుణ్ని. ఇల్లాంటి గోలలు నాకు సరిపడవు. వీణ్ని క్షేపంపించెయ్యి.

వన : మీ కెందుకు? మీరూ, నేనూ ఆనందంగావున్నాం,

చాలదూ? రేపు యెప్పటిమల్లేనే రండి. కోపం వుంచకండి.

శ్రీని : (కళ్లు తెరిచి) పంపించు.

వన : వెడుతున్నారు. వెళ్ళండి.

కేశవ: కుమారీ! నన్ను మోసంచేశావా! అందరిమల్లేనా నువ్వూ : వూరుకోను—నే నూరుకోను! నా డబ్బంతా నీకెందుకు తగలెయ్యడం? ఓసి దొంగముండా. ముందు వీణ్ని పొమ్మను.

శ్రీని : ( వులికిపడి ) ఏ మన్నావు — నామరుకాన్ని ఏమన్నావు? చచ్చావురా.

వన : వెళ్ళండి, వెళ్ళండి. శ్రీకి కోపమొస్తే— చాలా వుపద్రవం జరుగుతుంది.

కేశవ: ఆ! నాకు భయం నేర్పుతావూ ?

వన : వూరుకోండి.

కేశవ: వూరుకుంటా ! తప్పేదు లంజ.

శ్రీని : ఆ, ఆ. (లేస్తున్నాడు)

వన : మీపాదాలు పట్టుకుంటా. న న్నే మనకండి. శ్రీ చెడ్డవాడు.

కేశవ: వెధవ న న్నేం చేస్తాడు ?

శ్రీని : ఏం చేస్తానా? గొంతుపిసికి, నరికి, యిక్కడే పాతేస్తాను. కృతయుగ అర్జునుణ్ని నేను. రా, రా, యుద్ధానికి రా. ఇప్పుడే దీన్నితిట్టిన వెధవని పొడిచాను, చీల్చాను. రా రా—నువ్వూరా.

వన : కేశవరావుగారూ! వెళ్ళండి—పరుగెత్తండి. (శ్రీనివాసుల్ని కావిలించుకుని ఆపుతోంది) శ్రీ, శ్రీ! నాకోసం. నీ వనం కోసం—

కేశవ: నా ముందేటే—ఓసి లంజా—

శ్రీని : అదుగో! (కేశవరావు మెడ పట్టుకుని వొంచాడు. వనకుమారి కేశవరావుని కావిలించుకుంది.)

వన : శ్రీ, నన్ను ముందుకొట్టు. (కేశవరావుతో) బాబూ వెళ్ళండి. (శ్రీనివాసులు కేశవరావుని వొదిలాడు)

కేశవ: వేడికి నీకూ ఏం సంబంధ మని—

శ్రీని : ఆ దేమాట అంటావు — ఏం సంబంధమా - నేను కృష్ణుణ్ణి, అది సావిత్రి-నేను నలుణ్ణి, అది చంద్రమతి నేను రావణుణ్ణి, అది రంభ. రంభేనా - అవును, రంభే అను, లేకపోతే చంపుతా—

కేశవ: వాడి రంభవటే నువ్వు?

శ్రీని : చచ్చావురా, నువ్వు, ఈ వాళ నీరక్తం కళ్ళ చూశా నన్నమాటే.

వన : శ్రీ, శ్రీ! నన్ను చంపు.

శ్రీనివాసులు కేశవరావుని చేతిమీద ఒక దెబ్బకొట్టి రెండుసార్లు కింద పడేసి, వీధిలోకి నెట్టాడు. వొచ్చి వనకుమారిని కావిలించుకున్నాడు.

వన : వొదులు—

శ్రీని : వొదలను—నువ్వు నాదానివి - నిన్ను - నిన్ను—

వన : నొదులు, సిగ్గులేదూ? తప్పతాగి, వూరంతా అల్లరి చేసి, నన్ను ముట్టుకుంటావా? చూసుకో - బుద్ధి లేదూ, వొదులుముందు. (వొదిలాడు)

శ్రీని : (వినయంగా) నామీద కోపమే?

వన : కోపమా? యింకానా. పో! నా మొహం చూడకు పో.

శ్రీని : అట్లా చూడకు-నామీద కోపించకు. నీకళ్ళు ఎర్ర పడ్డాయూ, నీ పెదవులు జేవురించాయూ, యీ లోకాలు అంటుకుంటాయి. వొద్దు-నే నోర్చుకోను? నావంక అట్లా చూడకు. మరిచిపోయినాను. బుద్ధి తక్కువ. ఇంకెప్పుడూ- (ఏడుస్తున్నాడు) వెధవని- తుంటరి వెధవని-నన్ను కొట్టు, తన్ను అట్లా చూడకు.

వన : శ్రీ! లే పద. స్నానంచెయ్యి.

శ్రీని : నీపాదాల్ని వొదలను. నీ దాసుణ్ణి-నన్ను-నన్ను- (వనకుమారి అతని పక్కన కూచుంది.)

వన : ఏమిటీ అల్లరి? అయింది చాలదూ? ఈ యేడు పేమిటి? యింత దుర్మార్గుడవైనా వేం?

శ్రీని : (లేచి) గోల చేస్తాను- చంపుతాను-అందర్నీ చంపుతాను - యీ బస్తీమీద——

వన : పో. నీమొహం చూడను, పో.

శ్రీని : వొద్దు, వొద్దు.

వన ; మరెందుకు తాగావు? మంచివాడివైనావని సంతోషిస్తావుంటే——

శ్రీని : మరి ఆ సాంబయ్య—నిన్న ఆ బూతు మాటలు—

వన : అంటే అన్నాడు. ఇంక నీతో యేమన్నా చెపుతా నేమో చూడు.

శ్రీని : చెప్పకపోతే నేం? అందర్నీ తంతా; ప్రతివాణ్ణీ—

వన : (కన్నీళ్ళతో) తంతాను, తాగుతా ననేకద! ఎన్నా ళ్ళైనా? ఎంత బోధించినా, ఎంత బతిమాలినా— శ్రీ నా శ్రీ! యింతేనా యెప్పుడూ? ఎక్కడో, నరకంలోపడి, పాడై—నన్నుకూడా యిట్లా యీడ్చి నీకోసం, నిన్ను సన్మార్గంలోకి తిప్పాలని — గుళ్ళో దేవికి అర్చనలు చేయించాను — వెంకటేశ్వర్లుకి మొక్కుకున్నాను. యింతేలే? ఈశ్వరుడికి దయ లేదు, నా మీద! మన ప్రయత్నా లేం లాభం?

శ్రీని : (తెప్పరిలుతో) ఏడవకోయ్, ఏడవకమ్మా! నీ శ్రీని వాసులుకదూ! నేనుండగానే ఏడుస్తా వేం? నేను మూడుతో కాలూ ఏలుతో బతికివుండగానే యీ దుఃఖం? రా. యిట్లా రా.

వన : పాపం, మర్యాదస్తుడు, ఆ కేశవరావుగారు.

శ్రీని : ఆ కేశవరావుని, శవరావే చేశా. (నవ్వుతున్నాడు)

వన : మరి యింక తిండెట్లా, మనకి? ఈ నెల యింకా అద్దె యివ్వలేదుకద! ఆ గూట్లో రెండురూపాయలు తప్ప

శ్రీని : (సిగ్గుతో) అవి నేను తీసుకుపోయినాను,

వన : తీసికెళ్ళావూ? ఏం తింటాం?

శ్రీని : ఇవ్వడూ—డబ్బివ్వడూ ? ఎట్లా యివ్వడో చెపుతా! వాడి గొంతు పిసికి, వాడి పెళ్లాం నగలమ్మి—(లేస్తున్నాడు.)

వన : కూచో, అన్నా ! కూచో. (కూచున్నాడు)

శ్రీని : (నెమ్మదిగా) వాడి గొంతు పిసికి—

వన : నోరుముయ్యి. ఎవర్నీ చంపొద్దు కాని, నా మాట విను. ఇవి చూడు. (నోట్లు చూపించింది.)

శ్రీని : ఎక్కడివి ? యింకేం ! అద్దె యియ్యి.

వన : నీ జూదం అప్పు లేదూ, అది తీర్చడానికి ! అద్దె ? మరి ఆయన్ని కొట్టావుకద !

శ్రీని : నా అప్పు తీర్చడానికే ! నీ చీర వొదిలించుకోడానికి కాదూ ? బుద్ధిలేదు నాకు, చండాలుణ్ణి.

వన : శ్రీ... ఎప్పుడో యిట్లాంటిపనులుచేసి ఖైదులోకి పోతావు, నన్ను వొదిలి. ఎట్లా నీతో ! – ఎంతో మంచివాడవవుతావు, నన్ను పోషిస్తా వను కుంటున్నానుకద ! నన్ను—రోజుకి మూడణాలు, రెండణాలు తీసుకొస్తే – యిక్కణ్ణించి – ఈ చీకట్లోంచి – యీ పాపంలోంచి వెళ్ళిపోదాం ఎప్పటికైనా నిర్మలంగా యీశ్వరారాధనచేస్తో, యెట్లానన్నా పుష్కలమైన జీవితంలో పడదాం... నా నగలన్నీ అమ్మితే, నా చీరలన్నీ అమ్మితే—

శ్రీని : అమ్మనియ్యను.

వన : వినమంటే - తక్కిన ఖర్చులు నేను సంపాయిస్తా, యీ లోపల. వాటితో మనం ఎక్కడికో-యే గంగా తీరానికో వెళ్ళి ఒక చిన్నస్థలం కొనుక్కుందాం. అటు నది ఒకపాయ మన తోట యిసెకగుండా చల్లగా ప్రవహిస్తో వుంటుంది. చిలకలూ, అన్ని పక్షులూ, కోవెలలతా ఎప్పుడూ కూస్తోవుంటాయి. ఆపుల్ని కొందాం. గడ్డిమేటివేద్దాం. చామంతులూ, మల్లెలూ, సంపంగీ, గులాబీ, అన్ని పువ్వులూ పూస్తాయి. అట్లా వెన్నెళ్ళలో, యేటిపక్క బయిళ్ళలో, యెంతో ఆనందంగా వుండమూ ? ఈశ్వరుడికి చిన్న గుడికట్టి భజనలూ స్తోత్రాలూ చేసుకుంటో - ఎప్పటికో ఆ అదృష్టం !

శ్రీని : యింకెవరూ వుండరూ ?

వన : ఎవరూ వొద్దు. మనిద్దరమే. చాలదూ ?

శ్రీని : వేం తోస్తుంది? వూరన్నా దగ్గిర వుండదు.

వన : వొద్దు. తోచడానికేం తోస్తుంది. కొంత కాలమయింతరవాత- యేమో-మర్త కరుణిస్తే-ఒక చిన్న పాప, వుంటుందేమో !

శ్రీని : మనకే ! పిల్లలే !

వన : అదుగో! అంత వొంటరిగా వుండలేవు. అవునా ?

శ్రీని : నీకోసం.

వన : కాని, అన్నీ కలలే-కలలే-అన్నీ కలలే !

—: తెర :—

## మూడో రంగం

రాత్రి పదిగంటలు. అంతా మొదటిరంగంలాగే వుంది. సీతాకాంతం మంచం దగ్గిరిగాకూచుని రామాయణం చదువుతోంది. ఉత్తర రామాయణంలో రాముడు వొదిలినప్పుడు సీత యేడవడం.

భ్రమ: అదుగో! మీ ఆయన వొచ్చాడు.

సీతా: యింత తొందరగా వొచ్చారే యీవాళ!

భ్రమ: మరి రామాయణం చదివిన ఫలం!

భ్రమరాంబ వెళ్ళింది. సీతాకాంతం వైఖరి మార్చింది. షోకులు తగ్గాయి. కేశవరావు వొచ్చాడు. కోపంతో విసురుకుంటో వొచ్చాడు. చెప్పు లోమూల విసిరాడు. కండువా పారేశాడు.

కేశవ: ఏం, స్నానానికి నీళ్ళు వున్నాయా?

సీతా: సిద్ధంగా వున్నాయండీ.

కేశవ: నువ్వు భోంచేశావా, లేదా?

సీతా: లేదింకా.

కేశవ: ఏం చెప్పాను, నీకు! నేను వొచ్చిందాకా వుండ వొద్దన్నానా? బుద్ధిలేదూ? మళ్ళీ తలనొప్పి అని మూలిగి నాదుంప తెంచుతారు. వెధవ సంసారం! పాడుగోల పట్టుకుంది.

కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళిచ్చింది,
కాళ్ళు కడుక్కోగానే తుడిచింది.

కేశవ: ఇవసీన్ని నాకేం చెయ్యనక్కర్లేదు—వెళ్ళు.

సీతా: స్నానానికి రండి.

కేశవ: అక్కర్లేదు.

సీతా : ఇప్పుడేగా అడిగారు!

కేశవ: నా యిష్టం.

సీతా : మరి భోజనం చేస్తారా ?

కేశవ: చెయ్యను.

సీతా : ఎందుకు ?

కేశవ: పో ,... నువ్వు మాట్టాడకండా పోయి భోజనంచెయ్యి.

సీతా : మీరు చెయ్యకండానా ?

కేశవ: నన్ను విసికిస్తా వేం ? తన్నులు కావాలా ? బుద్ధి లేదూ ?

సీతా : సరే, మీ యిష్టం. బతిమాలుకుంటూ; నా మాట వినండి.

కేశవ: నోరుముయ్యి. (ఊరుకుంది.)

సీతా : పాలు తాగుతారా ?

యిచ్చింది, తాగిం తరవాత తాంబూలం యిచ్చింది

కేశవ: పెట్టెలో డబ్బెంత వుంది ?

సీతా : పదిరూపాయలనోటూ, చిల్లరా వుంది.

కేశవ: మొన్ననేగా యాభైరూపాయ లిచ్చాను. ఏం చేశావు ?

సీతా : నే నేం చేశాను ? మరి బస్తాబియ్యం, చాకలాడికి —

కేశవ: యింత ఖర్చా, యిద్దరికీ ! ఎక్కడ సంసారం దాప రించింది, నాకు !

సీతా : (వినయంగా, భక్తిగా) పడుకుంటారా ?

కేశవ: నిద్రరావడంలేదు. నీ చదువేదో యేడుసుకో. నా జోలెందుకు?

సీతాకాంతం చదువుకోడానికి కూచుంది. కేశవరావు పచార్లు చేస్తున్నాడు. ఆమె రామాయణం బిగ్గిరిగా చదువుతోంది.

కేశవ: (కొంచెం సేపుండి) అబ్బా - బిగ్గిరిగా చదవకు-గోల

సీత లోపల చదువుకుంటోంది.

కేశవ: నీ మిరియాలపేరు ఎన్ని కాసులు? (సీత వినలేదు) నిన్నే! మిరియాలపేరు ఎన్ని కాసులు?

సీతా: ఇరవై మూడు. యిప్పుడెందు కాసంగతి?

కేశవ: ఎందుకులే. నీ గోల నువ్వు ఏడ్చుకో.

మరిచిపోయి సీత మళ్ళీ బిగ్గిరిగా చదువుతోంది.

కేశవ: అంతా అబద్ధం.

సీతా: ఏమిటి?

కేశవ: పతివ్రతలూ లేరు; ఎవరూ లేరు. అబద్ధాలు రాశారు, పుస్తకాలనిండా. సీతట! ఆందరాడవాళ్ళూ దొంగలే లోకమంతా——

సీతా: సీతాదేవి?——

కేశవ: సీతా అంతే, పీతా అంతే! ఆడదైతే సరి!

సీతా: కళ్ళు పోతాయి, అట్లా అనకండి. వినండి - (చదువుతోంది.) మీరు వినటంలేదు.

కేవవ: లేదు, లేదు. వింటున్నా.

ఆమె చదువుతోంది. కొంచెం సేపటికి ఆపింది.

సీతా : ఏదో ఆలోచిస్తున్నారు. ఏదో, మీ ముఖం మారిందికూడాను. ఎప్పుడూ యిట్లా లేరు. విచారం బాధిస్తోంది. మూఢురాల్ని. అది గుర్తించక, గుడ్డిగా చదువుతున్నాను. (పుస్తకం కింద పెట్టింది.)

కేశవ: ఏమీలేదు – నిజం, వింటున్నాను — చదువు — ఏమంటావు ?

సీతా : (లేచి) నాదగ్గిర దాస్తారా? ఇట్లా కూచోండి. అంత మాత్రం కనిపెట్టలేనూ?

సీతాకాంతం వుత్సాహంగావుంది. అతన్ని మంచంమీద కూచోపెట్టి పక్కన నుంచుంది.

సీతా : ఏమిటి చెప్పండి. ఎందు కట్లా వున్నారు! నావల్ల ఏమన్నా అపచారం జరిగిందా?

కేశవ: ఛా, ఛా. నువ్వా...ఏం లేదు. కొంచెం అలిశాను.

సీతా : (అణుచుకోలేని బాధతో) అదా! ... (ప్రయత్నపూర్వకంగా) విసరనా? యింకా పాలు కావాలా? కాళ్లుతీపులు, అవునా!

కేశవరావు పరధ్యానంగా వున్నాడు. చిన్నబోయిన మొహంతో సీతాకాంతం కిందకూచుని కాళ్లుపడుతోంది.

సీతా : బావుందా?

కేశవ: అక్కర్లేదు.

సీతా : ఇట్లాంటప్పుడు నాన్నకి తీపులుగా వుండేవి.

కేశవ: యాభై యేళ్ళ మీనాన్నా, నేనూ వొకటా?

సీతా : కాదులెండి. ఇంకా చిన్నప్పుడూ అంతే.

కేశవ: నాకేమీ నొప్పులు లేవు. వొదులు.

సీతా : పోనీ, నాకు ఆనందంగా వుంటుంది.

కేశవ: ఏమిటి! అందరి కాళ్ళూ పడితే ఆనందమా! వడ్డి మంగలిదానవా?

సీతా : అందరి కాళ్ళనా! మీ పాద సేవకురాల్నికద నేను.

కేశవ: అదేమిటి! పుస్తకంలో లాగు అట్లా మాట్లాడం నేర్చుకున్నావు?

సీతా : పాపం—అలిసిపోయినారు... ఆ—వుండండి.

బ్రాయరు తెరుస్తో తనలో తను మాట్లాడుకుంటోంది. 'దుర్మార్గులు. యీయన అలిసిపోతే దానికేం: పశువు' 'సిగార్' ఒకటి పైకితీసి, అగ్గిపెట్టితోసహా తీసుకొచ్చి కేశవరావు నోట్లో పెట్టి వెలిగిస్తోంది.

కేశవ: యిదెక్కడిది సీతూ? దీని పొగజూస్తే వాంతి చేసుకుంటావుగా!

సీతా : ఆవాళ మీకు పొగకాల్చి, నన్నేడిపించాలని తెచ్చారా, నన్ను కొట్టినరోజు! ఆ దూకుళ్ళో దీన్ని యిక్కడ కిందపడేసి వెళ్ళారు.

కేశవ: అది దాచావా, పిచ్చిపిల్లా!

సీతా : అమ్మా అంతే, మీరూ అంతే, నన్ను 'పిచ్చిపిల్లా' అంటారేం? అంత తెలీనిదాన్నా!

కేశవ: నిజంగా తెలీనిదానవే. (ప్రేమగా) ఇంత తెలీని పెళ్ళాం ఎవరికీ లేదు.

సీతా : మూర్ఖురాల్నే—

కేశవ: ఛా, లోకజ్ఞానం లేనిదాన వన్నమాట.

సీతా : మరి లోకం ఏం చూశారు, జ్ఞానం రావడానికి !

కేశవ: పాడులోకం, పోనిద్దూ ! చూడక పోతేనే మంచిది.

సీతా : మీకు కులాసాగావుందా, యిప్పుడు? లేదు, ఇంకా. మొహమే చెపుతోంది అసంగతి.

మళ్ళీ అలమారు తెరచి గ్లాసులో షర్బతుపోసి తీసుకొచ్చి తాగిస్తోంది.

కేశవ: ఏమిటీ, ఉపచారమంతా; నా కెందుకు—ఇట్టా కూచో. నీ కెందుకు యీ శ్రమంతా !

పక్కన కూచో పెట్టుకున్నాడు.

సీతా : మీ శ్రమంతా నాదే. నాతో చెపితే నేనూ పంచుకుంటాను. అప్పుడు సగమవుతుంది.

కేశవ: కాదు. ఒక పొయ్యిలోనుంచి యింకో పొయ్యి వెలిగిస్తే మంట సగమవుతుందా ?

సీతా : మంట వున్నదన్నమాట. చెప్పండి ఐతే! ఎవరి మీదో, ఏమిటో ?

కేశవ: ఎంతైనా, ప్లీడరు కూతురు.

సీతా : పిచ్చిదాన్ని — యీ పై వుపచారాలన్నీ చేస్తున్నాను. ఏమిటా బాధ ?

కేశవ: నీతో చెప్పి ఏం లాభం ?

సీతా : స్నేహితులతో చెప్పుకుంటారు కే ? ఏం లాభం ?

కేశవ: వాళ్ళతో వేరు. వాళ్ళ కర్థమౌతుంది. సహాయం చేస్తారు.

సీతా: నా కర్థంకాదు? ఊరికే వాగే ఆ కోతులకన్న నాకు
తెలివి లేదా? మరి అర్థంచేసుకునే జ్ఞానం యివ్వ
రాదా? ప్రేమ వున్నన్నాళ్ళూ, ఆడుకుంటారు, మా
బుగ్గలతో, మా జుట్టుతో. అదిపోగానే, అప్పుడర్థ
మౌతుంది. మేం బొమ్మలకంటే ఏమీ గొప్పకామని
—అందుకు తప్ప వుపయోగం లేదని. స్త్రీ తన
హృదయంతో అర్థం చేసుకున్నట్టు పురుషుడు చేసు
కోగలడా! మీరు నా దైవం—నా శ్రీరామచంద్ర
మూర్తి—మీరు నా హృదయదీపం— నా లోక
కళ్యాణం.

కేశవ: నిజమా—నన్నింకా అట్లా అనేవాళ్లు లోకంలో ఒక
రున్నారా? నిజమా— ఆమాటలు — ఇంక ఒక్క
హృదయంలోనన్నా గౌరవముందా నా పైని

సీతా: కొంచమనుకొన్నారా? ఈ జీవితమంతా మీదే?

పాదాలమీదికి జారుతోంది. కేశవరావు ఆమెని ఎత్తుకొని ముద్దు
పెట్టుకోబోయినాడు. సీత చేతుల్లోంచిదూరి దూరంగా వెళ్ళింది.

కేశవ: ఎందుకు దూరమౌతావు? నాకు తెలుసు — నీకు
కూడా అసహ్యమే. ని న్నింత యేడిపించి –

సీతా: కాదు, కాదు.

కేశవ: యేడిపించి, నీ ప్రేమనంతా కాలికింద రాసి, చంపి..
అవును ... యీ పశువుని ...

సీతా: కాదు, వినండి.

కేశవ: పశువుని యెవరు తాకనిస్తారు?

సీతా: (అతన్ని కావిలించుకుంటూ) అంటారా అట్లా? ఇప్పు డనండి.

కేశవ: నిజంగా యిష్టమే?

సీతా: (చప్పున వొదిలి దూరంగా నుంచుని) అది కాదు. మీకు నామీద మనసులేంది, నన్ను సంతోషపెట్ట డానికి కావిలించుకో నక్కర్లేదన్నాను. కాని మీరు నన్ను కావలించుకునే సంతోషపెట్టాలా? మీ రూపం చాలదూ? నా మనసులోని మీ భావం చాలదూ?

కేశవ: ఈ కొత్త మాటలన్నీ ఎక్కడ నేర్చుకున్నావు? ఎందు కిట్లా మారావు?

సీతా: యిట్లా మారడం బావుండలేదా? పోట్లాడితేనే బావుందా?

కేశవ: అట్లానే వుంది——

సీతా: పోట్లాడ మని ఆజ్ఞ ఐతే – (ఆగింది)

కేశవ: ఐతే...

సీతా: అది చాతకాదు.

ఈ సంభాషణలో ఆట్టే మనసు లేకండా మాట్లాడుతో వుంటాడు కేశవరావు. కొంచెం వూరుకున్నాడు. కేశవరావు ఆలోచిస్తు న్నాడు. సీతాకాంతం ఆలోచిస్తోంది, కేశవరావు మొహంలోకి దీనత్వం వొచ్చేస్తోంది,

కేశవ: నన్ను క్షమించగలవా? అన్నీ మరిచిపోయి-ఒక్క దానికీ కోపం వుంచుకోక!

సీతా : (అతని తలని కాపిలించుకుని) ఏమిటీ? జ్ఞాపకముంటేనా, మరిచిపోవడానికీ! ఎప్పుడన్నా కోపంవొస్తేనా పోవడానికి.

ఆమె రొమ్ములో తలపెట్టుకుని ఏడుస్తున్నాడు. ఆమె పమిట తొలిగిపోయింది. రవిక తడిసిపోయింది. చేతులు అతని మెడని రెండు వేపులా గట్టిగా వొత్తుకుంటున్నాయి ఆమె పెద్దజుట్టు యిద్దర్నీ కప్పతోంది.

మాట్లాడకండా కొంతసేపు వూరుకున్నారు. కేశవరావు యేడుపు గుక్కలు వినపడుతున్నాయి.

సీతా : ఏడుపెందుకోయ్? అంతవిచారమే! అంతవిచారమే! ఇక్కడ పడుకో. నాబాబు లోకంలో అలిసి వొచ్చాడు - ఇక్కడ విశ్రాంతి - ఇక్కడే బలం- యిక్కడే అమృతం-అన్నీ వున్నాయి. వెధవలోకం! మనుషుల్ని మాడ్చి చంపుతుంది. నేనే లేకపోతే, పాపం——పాపం యేమయ్యేవాడు. కదలకండి —— అట్లానే వుండండి. ఈనిముషాల్ని అట్లా నిద్ర పోనీండి.

మళ్ళీ వూరుకున్నారు. ఆమె చేతులు అతని వీపు మెల్లిగా రాస్తున్నాయి. నగంమూసిన ఆమెకళ్ళల్లో గొప్పశాంతి కనపడుతోంది.

కేశవ: నామీంద ప్రేమచూపకు. నేను అనర్హుణ్ణి-దరిద్రుణ్ణి. నన్ను గౌరవించకు - నిన్ను...

సీతా : ఇం కెవర్ని గౌరవించను? మీరు-మీరే నా భర్త- మీరు నా దైవం - నా శ్రీరామచంద్రమూర్తి-

మీరు నాహృదయదీపం, నా లోకం, నా కళ్యాణం–
(అతని చేతుల్ని తీసుకుని ముద్దు పెట్టుకుంటోంది,)
ఇవన్నీ నాదే! ఏం చేస్తే నేం? ఎక్కడ తిరిగితేనేం)
అంతా మాయ! ఒక్క భక్తే, ఒక్క పాతివ్రత్యమే?
యీ హృదయంలో, మీ రూపధ్యానమే నిజం!
ఏం చేస్తేనేం? నన్ను చంపితేనేం... వెళ్ళండి...
దాన్ని తెచ్చుకోండి, యిద్దరూ, ఇక్కడే పడుకోండి
విసురుతాను, సేవచేస్తాను, మీ యిద్దరికీ—

కేశవ: వుండు, వుండు వొద్దు.

సీతా: ఏమిటాబాధ? నేను మాట్లాడను పోనీ, (చేతులు రాస్తోంది. కొంచం వూరుకున్నారు)

కేశవ: (చప్పున లేచి) చంపుతాను. చంపివేస్తాను, నరుకుతా...

సీతా: ఏమిటి? ఏమిటిది? వూరుకోరూ?

కేశవ: వుండు; అడ్డుపెట్టకు; ఎవరడ్డమొస్తారో రానీ—

సీతా: చంపండి—నరకండి—

కేశవ: ఎవర్ని?

సీతా: నన్ను.

కేశవ: నిన్నా... ఛా... ఛా... నిన్నా

సీత అతన్ని కూచోపెట్టి సముదాయిస్తోంది

సీతా: ఎందుకా కోపం? నా మీద తీర్చుకోండి నెమ్మదవుతుంది. వాళ్ళు ఊరుకుంటారా? మరి నరికితే. మాట్లాడకండా పడుకోండి. మీ రిట్లా నాదగ్గిరికి

వా_స్తే ఎంత బాపుంటుంది. (కేశవరావు మళ్ళీ ఏడుస్తున్నాడు) మీ కింకా విచారం పోలేదు. నాతో చెప్పండి.

కేశవ: ఎందుకు! ఏం లాభం?

సీతా: మీ కావిచారం తగ్గుతుంది. ఎంతబాధ, పాపం!

కేశవ: ఛా, ఛా, సీతతోనా? ఎట్లా చెప్పను?

సీతా: చెప్పండి. ఫరవాలేదు... ఏం చేసింది?

కేశవ: ఎవరు?

సీతా: అదే—ఆ వనకుమారి—

కేశవ: నీ కెట్లా తెలుసు?

సీతా: తెలుసు—

కేశవ: (కోపంతో) ఎట్లా? చెప్పు ముందు.

సీతా: యిం కెవరున్నారు. మిమ్మల్ని వడిపించేందుకు? చెప్పండి. మీ బాధ పోగొడతానుగా.

కేశవ: (నెమ్మదిగా) నీ కేం చాతనవుతుంది.

సీతా: నేను ప్రేమిస్తున్నాను గనక, నా చేతనే అవుతుంది. ప్రేమలో అన్నీ కరిగి మాయమౌతాయి. చెప్పి చూడండి.

కేశవ: అది... ఏమనుకోక—

సీతా: ఆ—

కేశవ: అదినన్ను... ఏం లాభం? చెప్పను. నీతో చెపితే మాత్రం, యీ మంట ఎట్లా చల్లారుతుంది?

సీతా : అట్లా అనకండి. యింట్లో కూచుంటుంది, ఆడదాని కేం చేతనవుతుంది అనుకోకండి. అమూల్యాలు, సహజంగా ఈశ్వరుడిచ్చిన అమోఘవరాలు ... ఈ శరీరం, ప్రాణం, మానం వున్నాయి.

కేశవ: ఆ ముండ - అది నన్ను వొదిలేసింది.

సీతా : (బాధతో) అందుకా మీరు దుఃఖించడం! (నొచ్చుకొని చేతులు వొదులుచేసింది) నీచురాలు, అధమురాలు. అది-

కేశవ: కాదు, అది వుత్తమురాలే-

సీతా : కాదు. మిమ్మల్ని వొదిలి మీకెంత బాధ కలిగించిన దుర్మతి-

కేశవ: నీకు దాని హృదయం తెలీదు. నన్ను ఎప్పుడుకూడా నా మోహాన్ని, అందాన్ని, నా తెలివిని- (సీత బాధ పడుతోంది.)

సీతా : ఐతే యెందుకు వొదులుతుందేం? ఈ మంచికళ్ళని, ఈ నిర్మలాంతఃకరణాన్ని వొదిలింది. మళ్ళీ దానికీ జన్మంలో యింత అదృష్టం, సన్నిధానం, దొరకుతుందా? మీరు పొరబడ్డారు గాని-

కేశవ : అది మంచిదే. కాని యింకో దుర్మార్గుడు, పరమ పాతకి వాడు ...

సీతా : వాడికోసం మిమ్మల్ని వొదిలిందా? ఇంకా దాన్ని ఉదారురాలు అని పొగుడుతారు. యెంత మంచి హృదయం మీది!

కేశవ : అదేం చెయ్యలేదు, పైగా అడ్డ పడ్డది. వాడు నన్ను యీడ్చి...

సీతా . ఈడవడమే!

కేశవ : అంటే. యీడవలేదులే - నేనే తన్నా ననుకో -

సీతా : ఇంకేం: మరి యింక...

కేశవ : అంటే... నేనే గెలిచా ననుకో, కాని, అక్కడ... శూడు, అవి బోగంవాళ్ళ యిళ్ళు పదిమందీ పోగవు తారు. అందుకని వూరుకున్నానుగాని...

సీతా : వూరుకున్నారా ?

కేశవ: వాడికెంత బలమని ! కాని యిప్పు డూరుకోను. నేను వూరుకునే మనిషిని కాను. దాని-దాన్ని-యిద్దర్నీ కోసేస్తాను-కత్తితో నరికేస్తాను.

సీతా : పాపం దాన్నెందుకు ?

కేశవ: అదే, ఆదే-దాని కోసమే ! దానికీ వాణ్ణిచూస్తే యిష్టమే. నన్ను మోసంచేసి, నాడబ్బంతా తింటో, నాముందే... దాన్ని డొక్కలో పొడిచి, చంపి... కళ్ళు గుంటలుగా తవ్వి...

సీతా : ఎందు కాకోపం ? దానికేం తెలుసు. పాపం! దాని జన్మే అట్లాంటిది, మీరు కోస్తేమాత్రం...

కేశవ: వుండు, వుండు. నన్నది చేసినద్రోహానికి, దాన్ని ముక్కలు ముక్కలు చేస్తేమాత్రం...

సీతా : క్షమించండి. దాన్ని క్షమించండి. దాని లెఖ్కే మిటి ? దాని గుణం అది చూపుకుంది. మీరుకూడా

యింత ఆగ్రహపడి, మీ శాంతాన్ని నాశనంచేసు
కుంటారా ?

కేశవ: శాంతం కాదు. శాంతంవల్లే తన్నులు తిని బైట
పడ్డాను-రాత్రి రహస్యంగా నిద్రపోయ్యేప్పుడు...

సీతా : వినండి. మీ ఆత్మ నాశనం చేసుకోకండి-ఆపండి-
ప్రేమ చూపండి...

కేశవ: లే, వొదులు. వెళ్ళనీ. యిప్పుడే...

సీతా : నా కంఠంలో ప్రాణ ముండగా వీల్లేదు...

కేవశ: (తోసేసి) పో, వొదులు - అడ్డురాకు. అట్లాంటి
మణి - దేదీప్యమాన విగ్రహం — దాన్ని విడిచి
బతకగలనా ? లే, అందరూ—వూరంతా నవ్వరూ ?
చచ్చాడు—అదీ చచ్చింది-నా చేతుల్లో.

సీతా : కొట్టండి—నన్ను పొడవండి. మీ కే అపాయం
కలిగినా నేను సహించను. మీ కోపం నానంటి
మీాద తీర్చుకోండి.

కేశవరావు చప్పున సీతాకాంతంని కావిలించుకున్నాడు

సీతా : శాంతించండి. నామీద దయచూపనే అక్కర్లేదు.
మీారు శాంతించండి. ఆదేశాలు నాకు.

కేశవ: రా. నా వొళ్లు మరిచిపోయ్యాను. ఛీ, ఛీ. అవమానంద
నాకెందుకు ! నాకు వొద్దనే వొద్దు. రా ! నన్ను
తన్నానా !

సీతా : మీాకు వుపశాంతిగా వుంటే యింకా తన్నండి,
యీ దేహం మీాది నాది కాదు—

కేశవ: తన్నాను. నన్ను క్షమించు—

సీతా: నామాట వినండి. చంపుతాను, చంపుతానంటారు ఎవర్ని చంపుతారు? ఎవ రది? మీరే! నేనే! వాడెవరు? మీరే! అందరూ – అందరూ – శ్రీరాములే! చంపే దెవరు? చంపించుకునే దెవరు! అయ్యో పిచ్చివారా! మిమ్మల్ని మీరు పొడుచుకుంటారా? పోనీ, చంపితేమాత్రం, అది మీదవుతుందా? దాని హృదయం మారుతుందా: మిమ్మల్ని పాపం చుట్టుకోడంకన్నా ఫలిత మేమిటి? వాళ్ళిద్దరినీదా దయచూడండి. నేను వొండుతాను, ఫలహారాలు పంపండి. నేనూ వొస్తాను.

కేశవ: నీకేం మతిపోయింది. వాడికి ఫలహారాలా? ఫలహారాలే! నువ్వెంతన్నా చెప్పు, నాకీకోపం ఆగదు. వాడి కెట్లానూ నా చేతులో చావు వ్రాసిపెట్టి వుంది.

సీతా: పోనీ, యీమాట వినండి. చంపాలా? నామాట వినండి, చివరిదాకా చంప వొద్దనటంలేదు. సరే, వాణ్ణి చంపనేచంపవలసివొస్తే, మీకా నిశ్చయమే ఐతే, కానీండి. నేను మీదాసిని, మీవిధేయురాల్ని నే నుండగా మీ రెందుకు చెయ్యిచేసుకోడం? నేను చంపుతా, నన్ను చంపనీండి ... మీరు—వారు, మిమ్మల్ని ఆపదలోకి పంపుతానా? యిట్లా ... యిట్లా— దాచుకుంటా. కాని కట్టేస్తా ననుకోండి. మీయిష్టం.

మీాయిష్టం. కాని మీా బాధలు, కోపాలు, అన్నీ భరిస్తాను. ఏమంటారు ?

కేశవరావు మాట్లాడకండా పడుకున్నాడు.

దాన్ని చంపుతా నన్నారుకదా, నిజంగా చంపుతారా ? పోనీ, నేను చంపనా దాన్ని ? అమ్మో, మీారు వొప్పుకుంటారా ? నాకు తెలీదూ ? ఆ కోపమంతా విరిగిపోయిన ప్రేమ! నిజం చెప్పండి. అవునా? నాకు తెలీదూ ? దాన్నెంత ప్రేమించకపోతే ఇంత ఆగ్రహిస్తారు ?

కేశవ: అబ్బా ! నేను భరించలేను. ఈ బాధ నీకర్థంకాదు. ఎంత మోసం చేసింది ! ఎంత నమ్మించింది ! వాడు రాకముందే, అంతకుముందే-'మిమ్మల్ని చూసి ఏ స్త్రీ మోహించదు ? ఏ హృదయం మిమ్మల్నించి వియోగపడి మరణించదు?' అంటోంది, అంతా అసృతం. ఇప్పటికీ నమ్మలేను. ఎట్లా అంత సూనృత హృదయంలో యింత కాపట్యం దాచిందో! నా తిండి తింటో, నా బట్టకడుతో అన్నాళ్ళూ - అన్నాళ్ళూ - నా ముద్దుమాట లన్నిటినీ వాళ్ళిద్దరూ వెక్కిరించుకునేవాళ్ళు గావును. నా ఫలహారాలు తిని - నా వైరితనానికీ, నా గుడ్డితనానికీ నవ్వుతో... అట్లాంటి దానికోసం పదిహేను ఏండ్లు దొంగతనం... (ఆగాడు)

సీతా : ఏమిటి ? దొంగతన మేమిటి ?

కేశవ: ఏం లేదు.

సీతా : చెప్పరూ! దొంగతన మేమిటి?

కేశవ: ఏమీ లేదంటే-

సీతా : నాతో చెప్పాలి. చాలా భయపడు తున్నారు. దొంగతనమా? పదిహేనువందలా? చెప్పండి. ఏదో కొంపమునుగుతోంది. నాతో చెప్పకపోతే వీల్లేదు. తరవాత వడ్చి లాభంలేదు.

కేశవ: అబ్బా! నిజమే-నిజమే! కొంపమీదికే వొచ్చింది. ఎవరితో చెప్పకు. బాంకిలోంచి ఆ డబ్బుతీసి, దాని కిచ్చాను-

సీతా : బాంకిలోంచి ... చచ్చాము -- చచ్చాము. మీ వుద్యోగం పోతుందా? ఎప్పుడు? ఎందుకు?

కేశవ: అబ్బా, అవన్నీ అడక్కు. ఇచ్చాను.

సీతా : దౌర్భాగ్యురాలు, దొంగది. ఇంతపని చేసింతరు వాత, చివరికి మిమ్మల్ని, మనిషిని తీసుకుంది, చాలదూ! యింకా పైగా మిమ్మల్నిట్లా దివాలా తీయించి, బికారినిచేసి, కైదులో పెట్టించతలుచు కుంది. తప్పదు. మిమ్మల్ని పట్టుకుంటారు. సిగ్గు, అవమానం, పోనీ నా సంగతి తలుచుకున్నారా?

కేశవ: తిట్టకు. నేను ద్రోహిని, పాతకిని, ఏం కాను! నాకు తగిన ప్రాయశ్చిత్త మయింది.

సీతా : పోనీండి. మరి యెట్లా తీరుద్దా మనుకున్నారు?

కేశవ: ఏమో-ఎట్లానో-!

సీతా : అదే దొంగిలించమందా?

కేశవ: దానికి తెలీదు. నాదే నని యిచ్చాను.

సీత యేదో అతని ఆపద తప్పించే పద్ధతి మనసులో వుంచుకొని అతన్ని కొంచెం యేడిపించాలనే వుద్దేశ్యంతో మాట్లాడుతోంది.

సీతా: సరేలెండి. మరి యిప్పు డేంచేస్తారు ?

కేశవ: ఏంచెయ్యనా అనే ఆలోచిస్తున్నాను.

సీతా: యిందాకణ్ణుంచీ ఆలోచించారుగా, యేమన్నా తోచిందా ?

కేశవ: ఏమీ తోచ లేదు.

సీతా: మరి పాపం ! మీకు చాలా తంటా వొస్తుందే ! పనిపోయి జైదులోకి.

కేశవ: పిచ్చిదానా, భయపడకు. అంతవరకు రానిస్తానా !

సీతా: ( Dis appoint ఐ) ఏంచేస్తారు ? ఏంచేస్తారు ? అంత డబ్బెవరు అప్పిస్తారు ?

కేశవ: అప్పెందుకు ? నీ నగలు లేవూ ?

సీతా: నా నగలా ! అమ్ముతారా ?

కేశవ: బంగారం ధర బాగానేవుంది.

సీతా: అవి నావిగా....

కేశవ. అవును. అందుకనే.

సీతా: నే నివ్వకపోతే ?

కేశవ: ఎందు కివ్వవు ? యివ్వ కేం చేస్తావు ?

సీతా: ఎందు కివ్వా లేం ?

కేశవ: ఎందు కేముంది! అవసరం గనక—

సీతా: మీరు సొమ్ము దొంగిలించి, మీ ముండకిచ్చుకుంటే - మరి నేను నా నగలమ్మి...

కేశవ: మరి భార్యకీ, లంజకీ భేదమేమిటి ?

సీతా : నగలిచ్చేది భార్య, అనుభవించేది లంజా అంతే—

కేశవ: మరి కష్టకాలంలో భర్తకి ఇయ్యకపోతే? ... ఇయ్యవా ఏమిటి ?

సీతా : ఇస్తారండి. కాని, యియ్యనంటుం దనుకోండి ఒకత్తె.

కేశవ: యివ్వకపోతే తన్ని లాక్కుంటారు.

సీతా : మరి భార్యవిగా—

కేశవ: భార్యే భర్తదైనప్పుడు ...

సీతా : నేనివ్వకపోతే తంతారా ?

కేశవ: ఛా, నువ్విస్తావని ముందే తెలుసుగా నాకు.

సీతా : (ఆలోచనగా Disappointed గా) ముందు తెలుసునా అవును.

కేశవ: ఎందు కా బెంగ ?

సీతా : ఏం లేదు.

కేశవ: చెప్పాలి ... దిగులుపడకు - మళ్ళీ చేయించి పెడతాను. నగలమీద అంత ప్రేమా ! మొగుడికన్నా ఎక్కువా ?

సీతా : అది కాదు.

కేశవ: ఏమిటి !

సీతా : మీరు నా నగలు అమ్మడం సంగతి అనుకోరు. ఎట్లానా అని దిగులు పడుతోంటారు. అప్పుడు నా నగలు యిస్తానంటాను. మీ కెంతో సంతోషం కలుగుతుంది. నా భార్య నా కింత త్యాగంచేసింది కదా అనుకుని, యెంతో ప్రేమిస్తారనుకున్నాను.

కేశవ: పిచ్చిదానా, నా ప్రేమంతా యిదివరకేయిస్తినిగదా, యింక కొత్తగా ప్రేమ యివ్వడమేమిటి? త్యాగమేమిటి? నీ మొహం! భార్యాభర్తల్లో: ఐక్యమైన తరవాత. అసలు నగలొక భాగ్యంగా కనపడతాయా భక్తిముందు!

సీతా: నగలమీద ప్రేమలేంది, త్యాగం ఘనత ఏముంది... పోనీలెండి... ఇప్పుడు సంతోషంగా వుందా?

కేశవ: కాని, అది పదిహేనువందలూ అన్యాయంగా కాజేసిందికద! నేనూరుకుంటానా? వెళ్ళి, దాన్ని...

సీతా: నే నిస్తున్నానుగా.

కేశవ: కాని, మనకి నష్టమేగా.

సీతా: మీకేం నష్టం. నాకేగా!!

కేశవ: నీ కేమిటి: నా కేమిటి! ఈ సారి అవసరం వొచ్చినప్పుడు...

సీతా: ఎవరికి – మీకా, నాకా?

కేశవ: నీ కేమిటి, నా కేమిటి? మనకి –

సీతా: మరి మా తమ్ముడు పరీక్షదరఖాస్తుకి రూపాయలిమ్మంటే మీ రివ్వక 'వెధవ, చదవకుండా తిరిగి తప్పాడు. వాడికి మళ్ళీ దరఖాస్తుకి డబ్బెందుకు' అన్నారు.

కేశవ: అంటే ఏం?

సీతా: నా నాను అమ్మియిస్తానంటే వల్లకాదన్నారు. నా నగలు – నా అవసరం.

కేశవ: అవును. తెలివి తక్కువగా, వృధాగా పాడుచేసుకుంటోవుంటే...

సీతా : యింత తెలివైన (నాలికకొరుక్కుని) అవునులెండి మనకి నష్టమే. కాని దాన్ని అనుభవించనీండి. అది మీ కెంత సంతోషాన్ని యిచ్చిందికాదు ? యింత మాత్రం డబ్బు తీసుకుంటేనేం ? నాకోసం మీరు ఖర్చుచెయ్యలేదూ, ఎన్ని వేలో! దాన్నే సుఖపడనీండి.

కేశవ: అటు వొక్కటే కాదు – అసలు దాని కోసమే కాదు, యీ డబ్బు; ఆ వెధవకోసం తెప్పించి వుంటుంది, నాచేత, మోసంచేసి. నాడబ్బు లాగి పైగా, నన్ను వెళ్ళగొడతాడు ! వాణ్ణి – వాణ్ణి వాడిమీద కసి తీర్చుకుంటాను.

సీతా : ఎవరండీ వాడు? వాడి పేరేమిటి !

కేశవ: ఏమో ! శ్రీ అని పిలుస్తుంది, అది.

సీతా : ఎప్పుడూ దాని యింటోనే వుంటాడా ?

కేశవ : అట్లాగే కనపడుతోంది. నాకు తెలీకండా ఎన్నాళ్ళ నుంచి దాచుకుందో వాణ్ణి. దాన్ని వొదులుతానా–

సీతా : (ఆలోచిస్తోంది) వాడిమీద దానికి అంత మొక్కవైన ప్రేమా ?

కేశవ: ఏమో తెలీదు. కాని, వాడు అక్కడ వున్నంత కాలమూ నన్ను చేరనీదు. ప్రేమో, భయమో !

సీతా: పోనీండి. వాళ్ళతో మీకెందుకు ? ఆ నీచులతో సహవాసమైనా కష్టమే, విరోధమైనా కష్టమే.

యిద్దరూ ఆలోచిస్తున్నారు. కేశవరావుకి కన్నీళ్ళు వొస్తున్నాయి.

కేవశ: దాన్ని వొదలలేను. దాన్ని చూడకండా బతకలేను. నీతో చెప్పడానికి సిగ్గేస్తోంది. వుండు వెళ్ళనీ.

సీతా: ఎక్కడికి?

కేశవ: అక్కడికే.

సీతా: వెళ్ళి ... ఏం లాభం?

కేశవ: ఏదో నా గోల నేను పడతాను. బతిమాలుతాను, వేడుకుంటాను. అట్లా ప్రాధేయపడితేనైనా జాలి తలచదూ? (లేస్తున్నాడు)

సీతా: ఛీ, ఛీ, అంత నీచంగా లోకువ కాకండి, డబ్బు పారేసి కొనుక్కునే భోగందాని కోసం. అందులో ఆ జాతీ నీతీ లేని కులటలకోసం – సిగ్గుపోతే పోయింది. అభిమానం త్యజించకండి. మీకు కాదు; నాకు న్యూనతగా వుంటుంది.

కేశవ: ఏం చెయ్యను? నిజమే. నన్ను చూస్తే నాకే పరమ అసహ్యం కలుగుతుంది. కాని యీ విరహాన్ని వోర్చుకోలేను. కాలిపోతోంది, ప్రతినిమిషమూ. నేను నిలువలేను. ఆ, జానిచూపు–ఆమాటలు–ఎట్లా బతకను, అది లేక?

సీతా: నిజంగా అంత అవసరమా?

కేశవ: అవును – నన్ను ద్వేషించు – నా మొహం చూడకు. నాకు సిగ్గు లేదు. నీముందర చెప్పతాను. పశువని. ఏం చెయ్యను! నావంటివాణ్ణి యెందుకు కట్టుకున్నావు?

సీతాకాంతం ఆలోచిస్తోంది.

సీతా: మీ రీరాత్రి వెడితే రానిస్తుందా?

కేశవ: ఏమో——

సీతా: వాడు వుండడా?

కేశవ: తెలీదు.

సీతా: వుంటే?

కేశవ: వాణ్ణి బతిమాలతా. డబ్బిస్తా.

సీతా: ఈ రాత్రికి వూరుకోలేరూ?

కేశవ: వూరుకుంటే?

సీతా: మూడురోజుల్లో – దాన్ని మీకు ఇప్పిస్తాను.

కేశవ: ఎట్లా!

సీతా: ఎట్లానో – అడగకండి.

కేశవ: ఎట్లా ఆగను? ఒక్కసారి వెళ్ళివొస్తా.

సీతా: నేనూ మీ వెంట వొస్తాను.

కేశవ: ఎందుకు?

సీతా: వాడు అక్కడ వుంటాడు. మిమ్మ నే్నమనా్న చేస్తాడు.

కేశవ: నువ్వు వొచ్చి ఏం చేస్తావు?

సీతా: ఏమో... యేం చేస్తాను?... మిమ్మన్ని రక్షిస్తాను... దాన్ని బతిమాలతాను... మిమ్మన్ని సంతోష పెట్టమని ప్రాధేయపడతాను. భార్యని నేను వొచ్చి బతిమాలితే నిరాకరించలేదు.

కేశవ: నువ్వా? నా ప్రాణంపోయినా, నిన్ను వాళ్ళ దగ్గిరికి– ఆ వీధిలోకి రానిస్తానా?

సీతా: ఏమి?

కేశవ : ఛా, నువ్వు... నా భార్యవి అప్రదిష్ట! నీకు మతి పోయిందా!

సీతా : నా దైవం, నానాధులు మీరు వెళ్ళగా లేనిది, నేను వెళ్ళకూడదా? మీకు లేని అప్రదిష్ట నా కెట్లా వొస్తుంది! మీ ప్రతిష్టే నా ప్రతిష్ట.

కేశవ: ఛీ, ఛీ, ఏ ల్లేదు. నువ్వా – నా భార్యవి. అందరూ యేమంటారు?

సీతా : నేనిట్లా భద్రంగా, పెట్టెలో విగ్రహంవలె మడిగా వుండాలన్నమాట?

కేశవ: అవును. అక్కడంతా రౌడీలు, తాగుబోతులు.

సీతా : న న్నేం చేస్తారు.

కేశవ: ఏం చేస్తారు! వెళ్లు, తెలుస్తుంది.

సీతా : ఏం చేస్తారో నా కర్థంకావడంలేదు. వెళ్ళి చూడాలనే వుంది.

కేశవ: చాల్లే. ఊరుకో. నేను వెళ్ళివొస్తాను.

సీతా : వెళ్ళారా, నేనూ వొస్తాను.

కేశవ: వీల్లేదు.

సీతా : (అతని మోకాళ్ళమీదపడి) న న్నిట్లా వొస్తువువలె చూచుకోకండి. మీ సౌఖ్యాలకి నే నక్కరాను. నన్ను మీతో కష్టాలను పంచుకోనీండి, రానీండి – మీ సేవ యీ గదిలోనే కాదు, లోకంలో, అన్ని వేళలా, మీ సేవలో ధన్యురాలిని చెయ్యండి.

కేశవ: అయ్యో! ఇల్లాంటి ప్రేమని పొందాలనుకుని - నా కా దుర్బుద్ధి యేమిటో—యెందుకట్లా తిరుగుతానో!

సీతా: దుర్బుద్ధి కాదు. మొగవారు ప్రభువులు. ఆ దర్జా-ఆ ఆనందాలు లేక వుండలేరు. మీ కేం తక్కువ, అనుభవించండి.

కేశవ: ఎంత నీచుణ్ణి! ఎంత దౌర్భాగ్యుణ్ణి.

సీతా: నీచులూ కారు, దౌర్భాగ్యులూ కారు. మీ కోర్కె నా కర్థం కాదు. మీరువుండగా, మీరు వున్నా లేకపోయినా మిమ్మల్ని ప్రేమించిన తరువాత ఇంకో మనిషిని మనసులో నిలపడం నా కెట్లా అసంభవంగా తోస్తుందో అట్లానే నామీద ప్రేమఉండగా దాన్ని అంతగా యెందుకు కోరగలరో నా కర్థం కాదు. కాని, మీరు కోరుతున్నారు. బాధపడుతున్నారు. మిమ్మల్ని సంతుష్టి పరుస్తాను. అది మీ చేతుల్లో వాలేట్టు చేస్తాను. కాని మీరు పెళ్ళి దాని ముందు చవక గాకండి-సరేనా?

కేశవ: ఏం చేస్తావు?

సీతా: ఏదో... ...

కేశవ: మోసమా?

సీతా: మిమ్మల్ని మోసంచేస్తానా!

కేశవ: దాని కిష్టంకలిగినా వా డున్నాడు.

సీతా: వాడే దాన్ని వొదలేస్తాడు.

కేశవ: అప్పుడు నావిజయం. కాని ఏంచేస్తావు?

సీతా : అది నారహస్యం. నామంత్రం.

కేశవ: ఏం మంత్రం?

సీతా : అడక్కండి.

కేశవ: చెప్పాలి.

సీతా : ఏమి టా అనుమానం ?

కేశవ: చెప్పకపోతే నేను వెడతాను.

సీతా : అబ్బా ! ఏమీలేదు. అది మహామంత్రం. పతివ్రత లందరూ సేవించినమంత్రం. వారిదగ్గరినుంచి నే నుప దేశం పొందిన ప్రణవమంత్రం.

కేశవ: అబ్బా! అ దేమిటో చెపుదూ, గొడవపెట్టక——

సీతా : తరవాత తెలుస్తుంది. తెలీగానే 'ఆహా! ఏమో ననుకున్నాను. ఏం తెలీని మూర్ఖురా లనుకున్నాను. ఇంత సామర్థ్యముందా నీకు?' అని ఆశ్చర్యపోతారు. సామాన్యపు స్త్రీ నంటున్నారు. సామాన్యురాలినే. కాని నా హృదయంలో మీమీద వెలిగేభక్తి, నా పాతివ్రత్యం నాకు మహాశక్తు లిస్తోంది. పూర్వపు పతివ్రతల కెట్లాంటి అద్భుత మహిమ కలిగింది! ప్రపంచాల్ని, భూతాల్ని, దేవతల్ని స్వాధీనంచేసు కున్నారు, పాతివ్రత్యంచేత. నేను చూపుతాను మీకు నాశక్తిని.

కేశవ: కాని ఆ డబ్బు యీలోపల ఖర్చుచేస్తుందేమో !

సీతా : అదీ వొస్తుంది.

—: తెర :—

# నాలుగో రంగం

వారంరోజుల తరవాత. మధ్యాహ్నం రెండుగంటలు, వనకుమారి యిల్లు. గది గూటిదగ్గిర అద్దంలోకిచూస్తో మంచంమీద శ్రీనివాసులు కూచునివున్నాడు; వెనక వనకుమారి పుస్తకం చదువుతో దిండుకి ఆనుకుని కూచుంది. ఆ పుస్తకంనించి తలెత్తిమాట్టాడుతో వుంటుంది. శ్రీనివాసులు మీసం కత్తిరించడం, క్రాపు దువ్వడం, స్నోపుయ్యడం యీ పనులుచేస్తో మాట్టాడుతున్నాడు. పుస్తకం చదువుతో వనకుమారి నవ్వుతోంది.

శ్రీని : ఏమిటి సంగతి ?

వన ; ఈ పుస్తకమయ్యా! రామప్పంతులూ ఆ మంచం కిందే దూరాడు.

శ్రీని : ఎందుకు?

వన : (నవ్వుతో) పూటకూళ్ళమ్మ ... ... చీపురుపట్టు కొచ్చింది.

శ్రీని : ఇద్దరూ మంచంకిందనే వున్నారా ?

వన : ఆ! (చదువుతో నవ్వుతో) అది సరాసరి మంచం కిందికే చూసింది. 'రా బైటికి రా' అంటుంది.

శ్రీని : అదీ, ఆ భోగందీ—

వన : అది యీ తమాషాచూసి ఆనందిస్తోంది.

వనకుమారి చదువుకుంటోంది. అతను దువ్వుకుంటున్నాడు.

శ్రీని : ఏమన్నా తగిలాయా?

వన ; బాగా యిద్దరికీ.

శ్రీని : దానికి?

వన : లేదు. (చదువుకుంటోంది.)

శ్రీని : ఎట్లా ఐనా ఆడది తప్పించుకుంటూనే వుంటుంది. కాని భోగందానికి తప్పవులే.

వన : (చప్పున చదువు ఆపి) ఏవమ్మా, ఎందుకు తప్పవు? సంసారిదానికి మాత్రం, మొగుడు చూస్తే సరుకు తాడు. ఇంకా భోగందాన్నే వొదులుతాడు గాని -

శ్రీని : ఇద్దర్ని మంచంకింద దాచిందా? ఏం ఖర్మ చెప్పు?

వన : నీ కేం తెలుసు? అందులో వొకడు బికారి—ఇంకా వాడేడ్చిపోతాడని దయదలచి — వాణ్ని కూడా చూసింది. హృదయమే పాడు చేస్తుంది వెలయాలిని— అదే బాగు చేస్తుంది సంసారిని.

శ్రీని: వేశ్యకి డబ్బు ప్రధానం లెద్దూ, ఏదన్నా చెప్పు.

వన : సంసారికి?

శ్రీని : ప్రేమ.

వన : ప్రేమ! ప్రేమే! భర్త పడేసే కూడుకి, గుడ్డకి. మేమూ, వాళ్ళూ అందరమూ పొట్టకూటికే. అది జన్మంతా వొక్కడికే, మేము రోజుకి ఒకరికి.

శ్రీని : నీకు సంసారుల సంగతి ఏం తెలుసు? భర్తతో కాపరం ధర్మం. కనక వాళ్లు పవిత్రులు.

వన : (బాధతో) సరేలే. అంతే వనుకో. నీతో నాకు వాదనెందుకు? (చదువుకుంటోంది. శ్రీనివాసులు

దిద్దుకొంటున్నాడు) ఈయ నెవరోగాని మా సంగ తంతా సరిగా చూసినట్లు వ్రాశాడయ్యా!

శ్రీని : నువెప్పుడన్నా రామాయణం చదివావా?

వన : లేదు.

శ్రీని : చదవరాదూ?

వన : నాకర్థంకాదు. కాని పురాణం విన్నాను, బయు స్కోపులో చూశాను.

శ్రీని : చదవరాదూ! దాంటో తెలుస్తుంది స్త్రీ అంటే ఎట్లా వుండాలో.

వన : నీకు రామాయణం సంగతెందుకు?

శ్రీని : నా సంగతేం తెలుసు నీకు?

వన : నీ కల్లుదుకాణం, కాఫీహోటలు — నువ్వు ఎక్కడన్నా పురాణం విన్నావా?

శ్రీని : యింక కల్లుదుకాణంలేదు, ఏమీలేదు. ఈ మూడు రోజులూ తాగానా?

వన : ఏమో... చాల్లెద్దూ ఆ పోకు - ఎందుకంత చెప్తు తున్నావు?

శ్రీని : తాగానా - లేదు. ఇంక తాగను.

వన : ఎంతసే పామాటలు - సాయంత్రం చూశా.

శ్రీని : చూద్దుగాని.

వన : నిజంగా నాకోసం, నువ్వు నీ అలవాట్లని మార్చు కుంటున్నావా? ఏది - యే వరం నాకు యీశ్వరి యిస్తుందనుకుంటున్నానో అది సంప్రాప్తమౌతుందా?

అంత భాగ్యమా? నువ్వు వొప్పుకో - చాలు. శ్రీ- మనం వెళ్ళిపోదాం - మనం ఈరోజు సాయంత్రం వెళ్ళిపోదాం.

శ్రీని : నేను రాను.

వన : నాకు తెలుసుగా, నువ్వు నీ సావాసాలు వొదల లేవని——

శ్రీని : అందుకు కాదు. నాకో గొప్ప అదృష్టం తట స్థించింది.

వన : ఊ!

శ్రీని : నిజం.

వన : ఏమిటి?

శ్రీని : ఈ మూడురోజులూ నేను మారిపోయినట్టు లేనూ?

వన : ఏమో నా కేం కనపట్టంలేదు.

శ్రీని : నిర్మలమైన ప్రేమ.

వన : అంటే?

శ్రీని : అదే మొన్న చెప్పేగా.

వన : అదెవత్తో నీకు ఉత్తరం రాసిందని-నీ పేరువినా, లేక కీర్తి వినా?

శ్రీని : ఆదోవన పోతోంటే నన్ను చూసింది.

వన : ఒక్క చూపుతోనే! చాలా ప్రబంధమే! ఆ చూపుతో వెనక్కి మూర్ఛపడ్డది. అప్పుడు చెలి కత్తెలు పన్నీరూ, కర్పూరమూ చల్లారు. ఎంతకీ లేవదు. అప్పుడు——

శ్రీని - చాలు వుండు.

వన : విను. చెలులు తమతో ఆ రహస్యం చెప్పమని ప్రార్థించగా—

శ్రీని : చాల్లే, వేళాకోళం.

వన : సరేగాని, నిన్నెట్లా కనుక్కుంది? చిలకని పంపించిందా, హంసని—

శ్రీని : నీ నెత్తిని.

వన : సరే, ఈ మూడు రోజులూ అక్కడేనన్నమాట - చెప్పవేం యింకా? మొగుడున్నాడా?

శ్రీని : ఆ—

వన : ఎంతమంది?

శ్రీని : నోరుముయ్యి.

వన : ఇద్దరూ కనపడుతునే వున్నారు కదా!

శ్రీని : ఛీ, ఛీ, అట్లాంటి మాటలనకు.

వన : ఆయన దర్శన మయిందా?

శ్రీని : వాడు యీ మెని వొదిలి యెక్కడో తిరుగుతో వుంటాడు.

వన : చెప్పాకు ఏడ్చింది. నీ మనసు కరిగింది. అంతేనా? ఏమన్నా డబ్బు అడిగిందా!

శ్రీని : (అనుమానంగా) లేదు.

వన : జాగ్రత్త! కొంప ముంచేట్టుంది.

శ్రీని : ఛా! సాధారణ మనిషి కాదు, అతి అమాయకురాలు.

వన : మొదట అట్లానే అంటారు, నటించే కులటలూ, ఈ విషయాలల్లో అనుభవంగలవాళ్ళూ, ఇట్లాంటి మాటలే చెప్పి సులభంగా నమ్మించి వొలలో వేసుకుంటారు. ఆ మాటలే వేశ్య మాట్లాడితే, అబద్ధాలనుకుంటారు. భర్త నొకణ్ణి చాటుచేసుకుని, మాట్లాడగానే అన్నీ పవిత్రవచనా లౌతాయి.

శ్రీని : నువ్వు ఒక్కసారి ఆమెనిచూస్తే తెలుస్తుంది. నువ్వూ-తాకడం పాపం.

వన : సరే – కానీ, కానీ–

శ్రీని : ఆమెకోసం నే నేమన్నా చేస్తాను. ఆ అమాయికపు పసి కళ్ళల్లోనుంచి ఒక్క చూపుచాలు — ఆమె మెత్తని పెదవుల్లోంచి ఒక చిరునవ్వు చాలు. చూడు యీమూడు రోజుల్లో ఒక్కసారి తాగానా?

వన : లేదు. అదే భయం. వాళ్ళిచ్చేదల్లా ఒక్కచూపే! ఆకాస్తకోసం, వెర్రివాడివి, నువ్వెంతో త్యాగం చేస్తావు! ఎన్నో కలలుగని, ఎంతో కవిత్వ మల్లుతావు–నాకు తెలీదూ, ఆ కామరాజుగారి అమ్మాయితో – కాని ఆడవాళ్ళకి అట్లా తృప్తికలగదు—

శ్రీని – ఏమీ భయంలేదు... కాని వనం! నే నొకటి అడుగుతాను విను: నీతో వొచ్చేస్తాను, నువ్వెక్కడికి తీసికెళ్ళినాసరే... కాని ఆ అమ్మాయినికూడా తీసికెళదాము.

వన : ఎట్లా– అమాంతం ఎత్తుకు వొస్తావా?

శ్రీని : వొచ్చేస్తుంది.

వన : అన్నదా?

శ్రీని : అన్న మాటే!

వన : (ఆలోచిస్తో) నువ్వేదో పెద్ద చిక్కులో తగులు కుంటున్నావు. నాకు నిజంగా భయంగావుంది.

శ్రీని : ఛా!

వన : ఏమాత్రం విశ్వాసమూ, నీతి వున్న మనిషైనా మొగుణ్ని, సంసారాన్ని వొదిలి వొస్తుందా?

శ్రీని : నామీద ప్రేమచేత—

వన : ఎంత ప్రేమించినా - భర్త నన్యాయంజేసే ముండ, ఎవర్ని మాత్రం ఎట్లా ప్రేమిస్తుంది? నామాట విను. అంతామాయ. పిచ్చివాణ్ని నిన్నాధారం చేసుకుని లేచివొచ్చి, యెక్కడికో పోవాలని చూస్తుంది. దెబ్బ తినేది నువ్వు. ఆ మొగుడు, బంధువులు నిన్ను చంపుతారు- జైలులో పెట్టిస్తారు-అది పోతుంది-ఆ ఉగులుతో నువ్వు చస్తావు! నామాట విను-వెళ్ళకు. దా! వేపు వెళ్ళకు... శ్రీ... శ్రీ! నామాట వినవూ?

శ్రీని : నీకు తెలీదు వూరుకో. నా ప్రాణంపోయినా—

వన : అవును-నాకు తెలుసు వెళ్ళక మానవు. ఖర్మం... అంతా పురాకృత ఖర్మం... కానీ...

శ్రీని : నన్ను నమ్ము. నువ్వెంతో సహాయం చేస్తావను కున్నాను. మరి ఆమెని తీసుకుని యెక్కడికిపోను?

వన : ఇక్కడికే రా - వొద్దన్నానా ? కాని చిక్కులుపడి చచ్చిపోతావు? ఎట్లానూ నాకు దక్కవు.

శ్రీని : ఎప్పుడూ నీతోనే వుంటాను.

వన : మాటలు - మీ పవిత్రురాలు నాదగ్గిర వుండడానికి వొప్పుకుంటుందా ?

శ్రీని : కాని నువ్వీవృత్తి మానెయ్యాలి.

వన : మానేసి—

శ్రీని : అదుగో - ఎక్కడికో వెడదామన్నావుగా - వెళ్ళిపోదాం, దానికీ చాలా నగలున్నాయి.

వన : నగలుకూడానా! కొంప ముంచుతున్నావు.

శ్రీని : ఏమీ భయంలేదు. వెళ్ళిపోదాం. నువ్విదంతా వొదిలెయ్యి.

వన : ఎందుకు ?

శ్రీని : మరి, ఆమె - నిర్మలమైన ఆమె -

వన : నిర్మలమూ - నీతో లేచి వొచ్చేది ?

శ్రీని : నీ కర్థం కాదు.

వన : అవును, అర్థం కాదు. లేచివొచ్చేదానికి నా వృత్తి అభ్యంతరమా ?

శ్రీని : కాని నన్ను ప్రేమించింది కద—

వన : ఐతే—

శ్రీని : మరి, ధనంకోసం నువ్వు ప్రతివాణ్ణీ—

వన : అదా ? మరి, శ్రీ ! యీ ధనం సంపాయించడం నీ కోసమేగా - నీ మీద ప్రేమవల్లనేగా ! నేనూ

మానేస్తే, ఎట్లా బతుకుదాం? రోజుకి నువ్వు మూడణాలు సంపాయించు, మానేస్తా ననలేదూ?

శ్రీని : కానిడబ్బుకి యీ వెధవల్ని –

వన : ఆ వెధవలవంటి వా డెవడికాళ్ళో కడిగే భార్యనేగా నువ్వు పూజిస్తోంది!

శ్రీని : అదంతాపోనీ నే నడిగినదానికి జవాబుచెప్పు——

వన : నీ యిష్టం శ్రీ–

శ్రీని : నీ మీద ప్రేమ లేదనుకోకు.

వన : నా సంగ తెందుకులే – దిక్కుమాలిన వేశ్యని.

శ్రీని : ఎంతో ప్రేమ నా మీద. కాని నన్ను తాకనీదు. అట్లా యిష్టం లేదంటుంది. నన్ను చూస్తుంది. నేను తనదగ్గిర వుండడం యిష్టమే-అంతే-

వన : వ్రతమా?

శ్రీని : వెక్కిరించకు.

వన : నిజంగా దా న్నంత ప్రేమిస్తున్నావా?

శ్రీని : నా ప్రాణ మంతటితోనూ.

వన : ఐతే దాన్ని సంతుష్టిపరుచు.

శ్రీని : నే నుంటేనే సంతుష్టి.

వన : మాటలు; అబద్ధాలు; వేషాలు, నిజమేననుకో, ఆమె శరీరంలేని దేవత కావొచ్చు. నువ్వు మనిషివేగా!

శ్రీని : కాని, ఆమె పరమ పవిత్రురాలు. అట్లాంటి తుచ్ఛమైన కోర్కెలు ఆమెకి లేవు.

వన : మరి నువ్వెందుకు?

శ్రీని : ఆమెది నిర్మలమైన ప్రేమ. ఆమె చిటికినవ్రేలిని తాకనీదు.

వన : అంతా వేషం! నాకు తెలీవ్వా ఆవేషాలు ? నీకు ఇంకా పురెక్కించి బోల్తా కొట్టించేందుకు! చాలా గొప్ప జాణ.

శ్రీని : న న్నింతగా పిలిచింజా, మళ్ళా ఏం చెయ్యాదు వూరికే చూస్తుంది. నేను కావిలించుకోపోతే! 'ఇది చాలు. ఇట్లా చూడ్డంచాలు. అట్లానే మీ ప్రేమ కోరింది' అంటుంది.

వన : నువ్వు ఆగివుండగలవా ?

శ్రీని : ఎంత కష్టమని! కాని ఆమెకి కోపం వొస్తుందేమో నని వూరికే కూచుంటా. మళ్ళీ నన్ను చూసి, చూసి 'అబ్బా! నన్నెంత బాధపెడుతున్నారండీ' అని దగ్గిరికి వొస్తుంది. మళ్ళీ భయపడి తనే దూరంగా వెళుతుంది.

వన : ఆహా! చాలా వ్యవహారంగా వుందే. నామాట విను. అట్లా మొగవాణ్ని ఆకర్షించి, తిప్పుకుని, తృప్తిపర చని వాళ్ళు ఆడవాళ్లు కాదు, రాక్షసులు. ఈ కొత్త ప్రపంచంలో కొందరు బైలుదేరుతున్నారు, కొత్త రకం. తమ మానం యిచ్చేసే ధైర్యంలేదు. కాని మనసులో వ్యభిచార గుణం అణగదు. అందుకని యిట్లా ఆకర్షించి, నెత్తురుపీల్చి, హృదయాన్నిచీల్చి, బైటికి పొమ్మంటారు. నా మాట విను. యిదో

రాక్షసి. యిది నిన్ను చంపుతుంది. రక్తంతాగే భూతం. వొద్దు వెళ్ళకు.

శ్రీని : ఛీ, ఛీ, నీకు తెలీదు. వూరుకో.

వన : డబ్బా అక్కర్లేక, మనిషీ అక్కర్లేక నిన్నెందు కిట్లా ఆడిస్తోందనుకున్నావు? ఎంత గుంజుకుని గల్లైర చేసినాసరే. ఒక్కసారి, అమాంతం పట్టుకుని చూపించు, నువ్వు మొగాడివేనని!

శ్రీని : అదికాదుగాని, ఏమన్నా బహుమానం యియ్యాలని వుంది.

వన : ఇయ్యిపోనీ. కేశవరావుగారు నాకియ్యలా ఆవుంగరం యియ్యి. (బీరువాతలుపు తెరుస్తో) లేదే! రూపాయులూ లేవే! ఏమైనాయి? నిన్న పొద్దున్న, సాయంత్రం, చూశాను. దొంగలెవరో వొచ్చారు. తక్కినవన్నీ అట్లానే వున్నాయి. కేశవరావుగా రిచ్చిన పట్టెడా, వుంగరమూ, రూపాయులూ లేవు — గాజులూ లేవు ... వాడే—ఆ కేశవరావే తనిచ్చిన డబ్బా, నగలూ తీసికెళ్ళాడు ... కాని ఆయన రాలేదే! శ్రీ, నువ్వెవరన్నా రావడం చూశావా?

శ్రీని : లేదు.

వన : (అతని మొహంవంక చూస్తూ) నువ్వేమీ ఎరుగవూ! నిజంచెప్పు. అయ్యో, యెంత సొమ్ము పోయిందో; ఏం చెయ్యను? ... శ్రీ! నీకు తెలుసు నీ విషయం.

శ్రీని : నీ కెట్లా తెలుసు, తెలుసునని?

వన : అదుగో, నీ మొహం, చూస్తేనే తెలుస్తోంది. అదుగో సిగ్గు.

శ్రీని : అవును నేనే తీశాను.

వన : తీసి దానికిచ్చావు, అవునా?

శ్రీని : అవును.

వన : నేను చెప్పలా, యిది డబ్బుతో వ్యవహారమని!

శ్రీని : చాలా సిగ్గేస్తోంది.

వన : అడిగిందా?

శ్రీని : డబ్బులేదని, తనభర్త తన సంసారాన్ని గొప్ప ఆపదలోకి తీసుకొచ్చాడంటే—

వన : నీ ప్రేమ అబద్ధం కాదని చూపడానికి—

శ్రీని : అవును ఇంక ఏమీ అనకు.

వన : నిన్నేమీ అనటంలేదు.

వన : ఏమీ అనకుండా అట్లా చూడకు. తిట్టు —వెళ్ళగొట్టు.

శ్రీని : నన్ను తన్ను నీమాట వింటూగా. మనంవెళ్ళిపోదాం. పెడదా మనస్తాపుగా!

వన : డబ్బేది! పోనీ డబ్బు కేంగాని, నీమనసు అక్కడ వుందిగా!

శ్రీని : లేదు, వెళ్ళను.

వన : చూడు, ఆ మాట లెట్లా అంటాడో! నువ్వా వెళ్ళ కండా వుండేది. పద, కండువా వేసుకో, పో... కదులు ... నే నేమీ అనుకోనులే—

శ్రీని : ఇంకెప్పుడూ, ఏమీ తీసికెళ్ళను.

వన : (నవ్వుతో) తీసుకెళ్ళటానికి ఏమీ లేదుగా!

శ్రీని : నేను వెళ్ళను.

వన : వెళ్ళవోయ్.

శ్రీని : ఆఖరుసారి, ఇంకరానని చెప్పివొచ్చేస్తాను. ఆ డబ్బు కూడా అడిగి తెస్తాను.

వన : యిస్తారు! యిస్తారు!!

కండువావేసి పంపుతోంది. అతను బయలుదేర గానే దిగులుగా ఆలోచిస్తో నుంచుంది.

శ్రీని : నువ్వెంత చెప్పూ, వెళ్ళను. వెళ్ళమంటున్నావుగాని నీకు నేను వెళ్ళాలని లేదు.

వన : నా కెందుకు మధ్య? నువ్వు వెడితేనేం; వెళ్ళక పోతే నేం!

శ్రీని : అట్లానే. దాన్ని మోహించడం, దాన్నే నేను యింతకోరడం నీకు యిష్టంలేదు-అవునా?

వన : కాదు. నువ్వెందరితో తిరుగుతున్నావో - నా కే మన్నా పట్టిందా - కాని-

శ్రీని : తెలిసిందిలే. నీ కలబు ...... కలలికి అభ్యంతరం వొస్తుంది. అందుకూ—

వన : నిజమేనేమో! ఎంత తిరిగినా చివరికి నాచేతుల్లోకి వొస్తావుకదా అని నమ్మకం. ఈసారి యీవ్యవహారం చూస్తే, యింక నాకు దక్కవేమో ననిపిస్తోంది. ఇంతేనా-యీకలా మాయమేనా? నా జీవితమంతా

యీ కూపంలో, యీ నరకంలో గడపవలసిందేనా? యింక యీ జన్మకి ముక్తిలేదా అని దిగులేస్తోంది.

శ్రీని : నన్ను మోసం చేస్తుందిగా, అప్పుడు నీదగ్గిరికే వస్తాను.

వన : కాని మోసం చేసిందా వెర్రెత్తిపోతావు. నువ్వు పదిమంది వంటివాడివి కాదు. అంతా, కాడీమల్లే తాగుడు - బడాయిలేగాని, చంటిపిల్లవాడు నయం నీకన్నా. విశ్వాసంలో ఆమాయ అంతా నిజమను కుని నమ్మి నలిగిపోతావు, పాపం. (కన్నీళ్ళతో) ఇంక నా శ్రీనివి కావు. అంతం ... అంతా ఆఖరు ... ఈ నాటితో అంతం ... నేను చేసిన పాపాలు ... నేను డబ్బుకోసం ఛేదించిన హృదయాలు - కార్పించిన కన్నీళ్ళు నన్ను కొట్టాయి. నాముక్తిద్వారం ఒక్కటీ మూసుకుంది - నావొక్క కలా మాయిమైంది.

శ్రీని : కాని ఒకవేళ మనం వెడదామనుకున్నా డబ్బు లేదుగా ?

వన : అదెంతసేపు, కేశవరావు రాగానే మళ్ళీ లాగుతాను.

శ్రీని : చాలా ధనవంతుడా ?

వన : ఆ.

శ్రీని : వొచ్చేస్తాను, వెళ్ళిపోదాం.

వన : పిచ్చివాడా, ఎట్లాను రావు.

శ్రీని : తొరగావస్తాను - ఏం ?

వన : (చిరునవ్వుతో) వుత్తదే - మనం ప్రేమించవచ్చాడు జాలికూడా వుండదు. నీప్రియురాలే ఒక్క కన్నీటి

చుక్క రాల్చనీ, తహతహలాడిపోతావు. నిన్నని లాభం లేదు. మానవస్వభావం. వెళ్ళు.

శ్రీని : తొరగావొస్తాను ఏం?

వెళ్ళాడు. కళ్ళతో అట్లానే చూస్తో నుంచుంది. కేశవరావు వచ్చాడు.

వన : రండి.

కేశవ: రాకూడ దనుకున్నాను. కాని చేతకాలేదు.

వన : చాతకాక ఏ పనికీ లోబడకూడదు; చెయ్యాలనుకుని నిశ్చయించుకుని చెయ్యాలిగాని.

కేశవ: మాకే నిగ్రహముంటే మీదగ్గిరి కెందుకొస్తాము.

వన : మేము లేకండా మీకు జరుగుతుందా? ఈ ప్రతివ్రత లున్నంతవరకు మేము వుండాలి. కనకనే పతివ్రతలకి వినుతికెక్కిన దేశంలోనూ, వేశ్యఅనే కులాన్ని శాశ్వతంగా ఏర్పాటుచేశారు.

కేశవ: సరే లే—ముందుసంగతి యేమిటి?

వన : యేమిటి?

కేశవ: మరియింతకాలం నన్ను మోసంచేశావే! వాడికోసం నా డబ్బులాగావే!

వన : మిమ్మెన్నేం మోసం చేశాను? వాడికోసంకాదు, నాకోసమే తీసుకున్నాను. నేను డబ్బు అతనికిస్తే, నేననుభవించినదానికన్న యెక్కువతృప్తి నాకు.

కేశవ: అదే—వాడిమీద యెక్కువ ప్రేమ.

వన : వకవేళ ఔననుకోండి, ఏం?

కేశవ: నా డబ్బంతా లాగి — ప్రేమ వాడికా?

వన : మీ డబ్బుతో దేహాన్ని కొంటున్నారుగాని, హృదయాన్ని కొంటున్నారా?

కేశవ: ఆ!

వన : డబ్బుతో యింతవరకు హృదయాన్ని కొన్నారా? కొనగలరా?

కేశవ: మరి ఆ మాటలు, ఆ చూపులు...

వన : నగలూ, చీరల వంటివి.

కేశవ: ఛీ, యింతే?

వన : దేహానికి స్వేచ్ఛ లేకపోతేనే యింత ఉక్కిరిబిక్కిరై పోతామే; ఇంక హృదయానికికూడా లేకపోతే జీవించగలమా?

కేశవ: హృదయంతో దేహామూ ఇచ్చివుంటావు, అవునా?

వన : అవసరంలేని సంగతు లెందుకూ?

కేశవ: వాణ్ణి వొదిలెయ్యి.

వన : నా శ్రీనా? వీల్లేదు.

కేశవ: నువ్వు నాకే కావాలి. వాడు రావడానికి వీల్లేదు.

వన : చాతకాదు. మీకు కోపంవచ్చినా సరే.

కేశవ: వీల్లేదూ? నువ్వు నా దానివి. నేనోర్వను. వాడీ సారి యిట్లా వొచ్చాడా చంపుతాను.

వన : సులభం కాదు.

కేశవ: ఏమిటి; నన్ను బెదిరిస్తున్నావా? నిన్ను వొదులుతానా? ఈ కంఠంలో ప్రాణముండగా వొదలగలనా?

వన : ఏమిటిది? ఇప్పుడు—

కేశవ: ఏమిటూ ? నోరుమూసుకు పద. ఎవడికోసం ?

వన : మరి నా కిస్తానన్న ఐదువందలూ ఏవీ ?

కేశవ: పదిహేను వందలేగా నువ్వడిగింది. ఇవ్వాలా ?

వన : మీరు నే నడక్కుండానే ఐదువంద లెక్కువిస్తా నన్నారా, లేదా ?

కేశవ: ఇస్తానన్నాలే ఇస్తాగా. పద. నీ పని అయింది, పద.

వన : ఆ పళ్ళు కొరకడం, ఆ కళ్ళెర్ర చెయ్యడం ఎందుకు ?

కేశవ: ఎందుకా చెప్పతాగా (కావిలించుకొని మెడకొరుకు తున్నాడు)

వన : అబ్బా !

కేశవ: అబ్బా ! వాణ్ణి - నన్ను మోసంచేసి - వాణ్ణి— అప్పుడట్టాలేదూ. పద.

వన : ఏమిటి, తాగారా ?

కేశవ: నీ రక్తం. నాకు తెలుసు నాకు లోబడక యామవా తావు ? నన్ను వొదిలి బతకగలవా ? (జుట్టుపట్టుకుని లాగుతూ) నా కోసం ఏడుస్తున్నావని తెలుసు. పద ...రా...పద.

వన : వుండండీ.

కేశవ: వుంటూ – వుంటూ, నీ దుంప తెంచుతా.

వన : ఎందుకండీ...ఇదేమిటి...వుండండి.

కేశవ: ఐతే డబ్బు యిచ్చానన్న మాటే.

వన : కాసేండి. మీ యిష్టం.

కేశవ: నా యిష్టమే ! నా యిష్టమే ! నిన్నిట్లాపీకి, చంపి...

—: తెర :—

# ఐదో రంగం

సీతాకాంతం కిటికీలోంచి చూస్తోకూచుంది. భ్రమ
రాంబ తలుపుదగ్గిర నుంచుంది - మధ్యాన్నం.

భ్రమ: ఐతే నేను శ్యామలగారి యింటికి వెడతా.

సీతా : ఏమిటి రాత్రికి మళ్ళీ రావా యేమిటి?

భ్రమ: ఏమో! దానివొంటో నెమ్మదిగావుండినా అవసరం లేకపోతే వొస్తా......కాని మరీ ఆ రోడ్డుమీాదికి చూస్తో అట్లా కూచుంటావేం? మరీ వొస్తోంది. పురాణపఠనమునూ, అదీ యేమయింది? నాలుగు రోజులు అతిభక్తితో చదివింది. మరీ యింత చపల చిత్తురాలవేమా అనుకుంటా.

సీతా : మూలసూత్రం తెలిసిపోయిం తరవాత మరీ అదే పనిగా పుస్తకాలు చదవడమెందుకు? ... సీత – నీ అమ్మాయి వెర్రిదనుకున్నావు. వొట్టిమూర్ఖురాలు. దీని పెనిమిటి దీన్ని వొదిలి, భోగంవాళ్ళ వెంట పడ్డాడు. దీనికేం తెలుసు ననుకున్నావు. అనుకో— అనుకో.

భ్రమ: వెర్రిదానివి కాక—

సీతా : నేను ఆయన మర్యాదా, ఆయన వుద్యోగం నిల బెట్టాను. మహా మాట్లాడతావు.

భ్రమ: అదేమిటి?

సీతా : ఏంచేశారో తెలుసునా? బాంకిలో పదిహేను వందలు దొంగిలించి దానికిచ్చారు. మరి అది ఎంత

తప్పు! వూరుకుంటారాయేం? కనుక్కుంటే ఏమయ్యే
వారు చెప్పు? నీకు, నాకు, ఆయనకి ఎంత అమర్యాద!
ఖైదు! తెలుసునా—ఖైదు ... ఎక్కణ్ణించి యిస్తారు?
వూరికే చూస్తావేం? అంతసులభంగా కనపడు
తోందా నీకు? నేనేం చేశాను? ఆ రూపాయలు
దాని దగ్గిర్నించి తెప్పించి బాంక్‌లో కట్టించాను.

భ్రమ: ఎట్లా!

సీతా: అదే నా రహస్యం. చెప్పను...మాట్లాడవేం! ...
ఇంతేనా అనుకుంటున్నావు. నువ్వు చెయ్యి ...
ఎన్నడన్నా యిట్లాంటిపని చెయ్యగలవా? వొచ్చిన
ఆపదలన్నిటికీ తలవొంచి వూరికే ఏడుస్తూ కూచు
న్నావుగాని, దానికే నీకింత గర్వం.

భ్రమ: ఆయనకి తెలుసా?

సీతా: యెందుకు తెలియాలి? ఏం? యింకా నాకు ప్రేమంటే
త్యాగమంటే తెలీదంటావా?

శ్రీనివాసులు అవతల గదిలోకివొచ్చి తొంగిచూశాడు.

భ్రమ: సరే గొప్పదానివేగాని... వీడెవడు, చెప్పు? నేను
నిన్న చూశాను. కాని యిదివరకే నేను నిద్రపోయే
ప్పుడూ, లేనప్పుడూ వొస్తున్నాడా యేమిటి?

సీతా: అంతమాత్రం నమ్మలేకపోతే యెట్లా నామీద?
పూర్వపు పతివ్రతల్ని యిట్లానే ప్రశ్నించేవారా?
వాళ్ళు యిష్టంవొచ్చిన వాళ్ళతో మాట్లాడ్డానికి
వీలుండేదా, లేదా? భర్త లేనప్పుడు ఋషివొస్తే

దాక్కునేవారా, మాట్లాడేవారా? స్త్రీ త్యాగాలు మాత్రం చెయ్యాలి. పురుషుడు అనుమానాలు మాత్రం వొదలకూడదు. చంద్రమతిని అమ్మి హరిశ్చంద్రుడు కాలకౌశికుడి విషయంలో అనుమానపడ్డాడా?

భ్రమ: అనుమాన మేమిటి? జాగ్రత్త. అంతే! రాముడి అనుమానంవల్ల సీత ప్రేమ విరిగిందా!

సీతా: ఆ కవికి ప్రేమ అర్థంకాలేదు. ఏం తెలుసు నీ మొగవాళ్ళకి?

భ్రమ: ఆహా! నాకూ వాల్మీకికీ, ఇద్దరికీ బుద్ధులు నేర్పుతున్నావే!

సీతా: అవును మరి. పతివ్రత అంటే యేమనుకున్నావు? అనసూయ సూర్యుణ్ణి ఆపిందా! లేదా?

భ్రమ: మంచి అనసూయవే! నేను వెడుతున్నాను.

వెళ్ళింది. శ్రీనివాసులు వొచ్చాడు. ఆమెని కావిలించుకో బోయినాడు. ఆమె తప్పించుకొని అతన్ని కూచోపెట్టింది.

సీతా: మీ కోసం అట్లా ఎదురుచూస్తున్నాను.

పాడుతోంది:

కాపిరసాక్షు

నీ వెపుడు వొత్తువోయని,

తల వాకిలి ఇల్లుగ నిలబడియున్నదిర॥

ఏమాట లాడిన నీ మాటలేగాని——

పాడుతూ వుండగా శ్రీనివాసులు ఆమెని పట్టుకోవా
లని ప్రయత్నిస్తాడు; కాని చిక్కక నవ్వుతో పాడుతో
యిటూ ఆటూ తిరుగుతుంది.

వుండండి ... వినండి మరి ... ... యెట్లా కాచుకొని
వున్నాను. ఎంతోసేపు ... ఆపకండి మధ్యలో ...
బాగా పాడుతూన్నానా ? (పాడుతోంది) అట్లా మీా
కోసం ఎదురుచూస్తూ కూచుని కూచుని – అట్లా
కూచోండి ... అదీ మంచివాళ్ళలక్షణం ... పొద్దు
న్నుంచి ఏంచేస్తూన్నారు చెప్పండి.

శ్రీని : యేమీాలేదు. నిన్ను తలుచుకుంటూ కూచున్నాను.
సీతా : ఐతే మరి యింత ఆలస్యమేం ?
శ్రీని : మరి నువ్వు అయిదింటికి రమ్మన్నావు, వొచ్చాను.
సీతా : ఇంతేనా ?
శ్రీని : ఏం ?
సీతా : ఇంతేనా తొందరపడి ముందే రావొద్దూ? శుభ్రంగా
భోజనం చేశావా ?
శ్రీని : శుభ్రంగా అంటే – భోజనం చేశాను, ఒకసారి.
సీతా : కాఫీ—?
శ్రీని : (సిగ్గుతో) రెండుసార్లు – మామూలే – ఏం ?
సీతా : ఏం ? నే నింతవరకు వుపోసం ...
శ్రీని : ఎందుకు ?
సీతా : మీారు వొస్తారేమో – వొస్తారుకదా, అనుకుంటూ
వుంటే అన్నం సయిస్తుందా!

శ్రీని : ఐతే ముందు యామున్నా తిను. వెళ్ళు—అట్లా కాదు. నువ్విక్కడే వుండు. యామున్నా పట్టుకొస్తా.

సీతా : అక్కర్లేదు. మీరు రాగానే, మిమ్మల్ని చూడ గానే కడుపు నిండిపోయింది. సంపూర్ణమైన బలం వొచ్చింది. (అతని దగ్గిరకూచుంది) బావున్నానా? చూడండి... ఈ జుట్టెట్టాదువ్వుకున్నానో, మీరు చెప్పినట్టేనా... వుండండి మరి.

శ్రీని : (దయగా) నా జీవనమంతా, నా ప్రాణమంతా నీ పాదాలదగ్గిర పారేసి, నీచేతులో పెట్టాను.

సీతా : (అతనిమాటల Sincerityకి జాలిపడ్డది.) నన్నెందుకు ప్రేమిస్తారు? మీ వంటి హృదయ ప్రేమకి తగిన దాన్ని కాదు. దుర్మార్గురాలిని. పోనీండి నన్ను.

శ్రీని : నిన్నా పోనిచ్చేది నేను? ఈ లోకాలన్నీ యెదుగు తిరిగినా పోనీను.

సీతా : (భయంతో) నాలో యేమీ గొప్పదనంలేదు. సాధారణపు స్త్రీని. ఏదో గొప్పప్రేమగాని, సౌఖ్యం గాని వొస్తుందనుకోకండి. మిమ్మల్ని పిలిపించాను — చూశాను; కాని మీరుమాత్రం ఆ పెద్ద ఆశలు నిలపకండి. నాకు భయంగావుంది.

శ్రీని : నా బ్రతుకంతా నువ్వే.

సీతా : కాను; మీరెక్కడ? నే నెక్కడ! మన లోకాలే వేరు. ఏంలాభం చెప్పండి! యిది పాపం — యిది అన్యాయం—యిది అక్రమం—ఎన్నటికీ జరిగేపనికాదు.

ఇద్దరూ ఆలోచించుకుంటున్నాడు. ఐతే ఎందుకు పిలి
పించిందా అనుకుంటున్నారు? శ్రీనివాసులు మాట్లాడలేదు.

సీతా : 'ఆ రూపాయలు తీసుకుంది. దీని అవసరం తీరింది. ఇంక నన్ను వొదుల్చుకోవాలని చూస్తోంది' అనుకుంటున్నారు. 'పదిహేను వందలు లాగింది. ఎంత మోసంరా' అనుకుంటున్నారు. అవునా ?

శ్రీని : పూరుకో.

సీతా : నిజమే చూడండి – అన్యాయం చేశాను మిమ్మల్ని. తీసుకోండి. (మెళ్ళోంచి కాసులపేరూ, చంద్రహారం తీసింది) ఇది తీసుకోండి. అంతకన్న ఎక్కువ ఖరీదే! తీసుకోండి. వెళ్ళండి. ఇంక యీ నిర్భాగ్యురాలి మొహం చూడకండి. సంతోషంగా, కృతజ్ఞతతో యిస్తున్నాను.

శ్రీని : ఇవెందుకు ? నువ్వుకావాలి – నీ ప్రేమ కావాలి.

ఆమెని గట్టిగా పట్టుకున్నాడు.

సీతా : (మళ్ళీ అల్లరి తెచ్చుకుని) అంత సులభమే ! తపస్సు చెయ్యాలి కన్యలకోసం, యుద్ధాలు చెయ్యాలి.

శ్రీని : ఎందుకు నన్నింత బాధపెడతావు ? చచ్చిపోతున్నాను.

మళ్ళీ లాక్కున్నాడు.

సీతా : పోనీ యిప్పుడు – నిర్మలంగా, సఖ్యంగా యిట్లా మాటలు చెప్పుకుంటో——

శ్రీని: (కోపంతో) మళ్ళీ ఆమాటలే మాట్లాడుతున్నావు. చూపులతో మాటలతో తృప్తిపడను.

సీతా: అంటే—

శ్రీని: అంటే — యిద్దరికీ శరీరా లున్నాయి, మోహ ముంది.

సీతా: వొద్దు. ఈవాల్టికి వొద్దు.

మాట్లాడకండా ఆమెని ముద్దు పెట్టుకున్నాడు.

మరి నేను మిమ్మల్ని యిట్లాకోరానా? కబురు పంపాను — వినండి— వుండండి—మోహమున్న దన్నాను — కాని నాకెట్లా — అబ్బా వూరు కుందురూ ... లోబడడం యిష్టమన్నానా? ఒక్క సారి ... యీమాట ... (చప్పున వొదిలించుకుని నవ్వుతోంది) ఏం? చిక్కుతానా? ఇంక చిక్కను. (అతనిబాధ చూసి గొంతు మార్చి) మరి యిది తప్పేనా? అది చెప్పండి... ...మాట్లాడరేం?... తప్పు ఔనా? నేనింకోరి భార్యనా...

శ్రీని: అట్లా అనుకుంటే వొచ్చెయ్యి నాతో. ఈ నాడు రా...యిప్పుడే... వెళ్ళిపోదాం; రావా? లాక్కు పోతాను. ఈడ్చు కెడతాను. ఎవరడ్డమొస్తారో! రానీ నరుకుతాను. (భయపడుతో చూస్తోంది.) నీణ్ణక్కడ తెచ్చుకున్నానా అనుకుంటున్నావా? నీకు భయమెందుకు? నీ తలమీద వెంట్రుక కదలనిస్తానా! పారిజాత పువ్వుమల్లే చూసుకోనూ! రా, పోదాం, రా.

సీతా : (Serious గా) తప్పు, నే నెన్నడూ అట్లాంటి పని చెయ్యను. మీ మీద యెంత ప్రేమవున్నా అట్లాంటి పాడుపని చెయ్యను.

ఆమెని చప్పున పైకి తీసుకుని కావిలించుకుని ముద్దు పెట్టుకున్నాడు.

సీతా : వుండండి,

శ్రీని : నేనువుండను. నా అధికారం. నువ్వు మాట్లాడకు.

సీతా : ఐతే నేను మీకు కనపడను. మీరు నన్నిట్లా తాకడం నా కిష్టంలేదు.

శ్రీని : సరే, (మాట్లాడకుండా కూచున్నాడు.)

సీతా : కోపమా—

శ్రీని : (మాట్లాడడు)

సీతా : (అతని మెడమీద చెయ్యేసి) కోపమా ? అట్లా కోపగిస్తే నేను బతకగలనా ? (బుజ్జగిస్తో) వొద్దండీ, నన్ను తాకకండి. నేను అట్లాకాదు మీ స్నేహాన్ని కోరింది.

శ్రీని : సరే, నీ యిష్టం.

సీతా : (అతని ముఖంలోకి చూస్తూ) కోపం పోయిందనండి; అందాకా నేను నిలవలేను. అనండి.

శ్రీని : పోయింది.

సీతా : (ఆలోచిస్తో Cunning గా) నిజంగా నా మీద ప్రేమవుందా ?

శ్రీని : (ఆమెని పైకి తీసుకుని) అదే ప్రత్యుత్తరం, అడిగి నప్పుడల్లా.

సీతాకాంతం శ్రీనివాసుల్ని నిరాకరించడం మానింది.

సీతా : నా పైన తప్పు యెవరిపైన లేదుకద ?

శ్రీని : నిశ్చయంగా లేనే లేదు. ఇంక వేరేదూహానికి స్థలమే లేదు యీ మనసులో.

సీతా. మరి ఆ వనకుమారి—

శ్రీని : లేదు.

సీతా : మరి దాంతో యెందుకు వుంటారు ?

శ్రీని : దాంతోనా ? అదో కథ. ప్రస్తుతం యింక వుండే స్థలం లేదు గనక—

సీతా : ఆ కథ నా కెందుకుగాని, మరి ఆ సహవాసాలు వొదిలిపెట్టరూ ? మరి నా కవమానం కదూ ? ఈ మాట వినండి. నేను చాలా మర్యాదస్తురాలిని. మీ ప్రేమకూడా చాలా మర్యాదగా కోరాను. అట్లాంటప్పుడు మీారా సహవాసం మానెయ్యాలి.

శ్రీని : నామాట విను.

సీతా : దాన్ని వదులుతా నన్న దాకా మాట్లాడవద్దు.

శ్రీని : సరే, విను.

సీతా : వొదులుతారా ?

శ్రీని : సరే.

సీతా : దాంతో చెప్పిరండి.

శ్రీని : ఏమిటి ? యిప్పుడే!

సీతా ; యిప్పుడే.

శ్రీని : నేను చెపుతాగా.

సీతా : నేను నమ్మను, మళ్ళీ మొత్తపడతారు వెళ్ళండి.

శ్రీని : నిన్ను వొదిలి యిప్పుడా ?

సీతా : తప్పదు.

శ్రీని : పాపం. గోలపెట్టదా, నామీద పంచప్రాణాలు పెట్టుకుని—

సీతా : పిచ్చి !

శ్రీని : ఏం ?

సీతా : బోగంది.

శ్రీని : ఐతేమాత్రం ? నీకు తెలీదు దానిసంగతి.

సీతా : (వెంకిగా) ఐతే వొదలనంటారా ?

శ్రీని : వొదులుతా ... మరి వొదిలితే—

సీతా : చెప్పండి, దాంతో—

శ్రీని చెపుతా.

సీతా : ఇప్పుడు—

శ్రీని : అంత తొందరే ?

సీతా : మరి నన్ను— మీకు ఆ తొందరేం ?

శ్రీని : ఓసి వెర్రిదానా, ఇన్నాళ్ళూ నీ అభ్యంతరం యిదా ? ముందే చెప్పకూడదూ ? ఈ ఆడవాళ్లు తమాషా వాళ్లు ... సరే చెపుతాను. కాని దాన్ని వొదిలింతరవాత మళ్ళీ అభ్యంతరం పెట్టావా నాసంగతెరగవు మంచివాణ్ణి కాదు.

సీతా : (భయంతో) వెళ్ళండి.

శ్రీని : పాపం. నామీదే పంచప్రాణాలూ పెట్టుకుంది. ఏడుస్తుంది గావును.

సీతా : అంత కష్టమైతే పోనీండి.

శ్రీని : మాయిద్దరికీ ఎటువంటి ... చూడు, నన్నో శుద్ధ వెధవని – మురికిలోంచి, రౌడీతనంలోంచి, తాగుడు లోంచి, రక్షించింది. నే నాధారంగా కలలు కంటోంది——

సీతా : పోదురూ, దొంగంది, మీరుకాకపోతే ఇంకోరు.

శ్రీని : నాకు తెలీదు.

సీతా : (విసుకుతో) దాని దగ్గిరికే పొండి.

శ్రీని : ఛా, పూరికే ఆలోచించా గాని, ఏ త్యాగం చెయ్య డానికన్నా జంకుతానా నీకోసం.

సీతా : ఐతే మరి వెళ్ళి చెప్పిరండి.

శ్రీని : యిక్కడే-యిక్కడ కూచుని వుండాలి మరి– వెళ్ళే ముందు ఒక్కసారి ...

సీతా : (కఠినంగా) వీల్లేదు.

శ్రీని : పువ్వుమల్లే కనపడతావు. ఎంతకఠినత్వం! ఎట్లా ఓర్చుకోను, ఈ పదినిమిషాలూ! (వెడుతున్నాడు)

సీతా : మాట. (వెనక్కి వొచ్చాడు) యేమంటారు దాంతో?

శ్రీని : ఇంక రానంటాను.

సీతా : ఏడిస్తే—

శ్రీని : (అనుమానంగా) ఏం చెయ్యాను ?

సీతా : కరిగిపోదుగద !

శ్రీని : నీ ఆజ్ఞ జ్ఞాపకముండగానే—

సీతా : పాపం, మీరు రానంటే యెంత యేడుస్తుందో !

శ్రీని : ఏం చేస్తాం !

సీతా : మీమీద నిజంగా అంత ప్రేమా ?

శ్రీని : చాలా.

సీతా : మీకూ ?

శ్రీని : లేదు.

సీతా : అన్యాయం. ( మనసు సమాధాన పెట్టుకుంటూ ) వెళ్ళండి.

శ్రీని : ఎంత లేతహృదయం ! దాన్ని సమాధాన పెడతానుగా ! నేను ఏడిపిస్తే ఓదార్చేవాళ్ళు పదిమంది వున్నారు.

సీతా : ఓదార్చగలరా ?

శ్రీని : ఆ.

సీతా : నేనదే నమ్మలేదు. ప్రేమకి బదులు ధనం యెట్లా స్వీకరిస్తారో, పాపపుబతుకు—నాదీ అంతే !

శ్రీని : ఛీ, ఛీ, కాదు.

సీతా : మిమ్మల్ని యిద్దర్నీ విడతీస్తున్నా.

శ్రీని : నాకు ప్రేమలేందే !

సీతా : ఏమిటో— వెళ్ళండి.

శ్రీని : మరి నేను వొచ్చేప్పటికి యిక్కడే యిట్లానే కూచో. మాట చెప్పేసి వొస్తాను.

సీతా : చాలాసేపు, పాపం వొదలలేకపోతే.

శ్రీని : నేను వొస్తానుకదూ—

సీతా : తొందరపడకండి. యీ రాత్రంతా యిక్కడే—మీ కోసమే కాచుకుని వుంటాను. (పాడుతోంది)
"నిన్నెడబాసి అరనిమిష మోర్వ్వదుర..."
వెళ్ళిపోతున్నాడు. కొంచెంసేపుఆలోచిస్తో, భయంగా, సందేహంతో కూచుని వుంది సీతాకాంతం. తెరలోంచి 'ఆ' అని లోపలికి భ్రమరాంబ వొచ్చింది.

భ్రమ: వెళ్ళాడా, ఈ వాల్టికి వెళ్ళడనుకున్నా! ఏమిటా రహస్యాలూ? ఐపోయిందికద. నలుగురికీ తెలీ లేదు యింకా. రాడుకద—మాట్లాడవేం? ఈసారి వాడు గడప తొక్కడంటే నేవూరుకోను. ఏమిటా భయం? అట్లా వున్నావేం?

సీతా : (ఆలోచనగా) అమ్మా, యిది చెప్పు. ఒకావె— పూర్వపు పతివ్రతేననుకో—భర్తకోసం ఆయన ఆనందం కోసం, తన మానాన్నికూడా, త్యాగం చెయ్యవలసి వొచ్చిందనుకో—

భ్రమ: ఐతే—

సీతా : పూర్వపు పతివ్రతలు త్యాగంచేశారు; అవునా?

భ్రమ: ఐతే—

సీతా : అవునా, కాదా?

భ్రమ: అవునే, అనుకో. ఐతే—

సీతా: ఒకవేళ నాన్న ఆనందానికి నీశీలం త్యాగంచెయ్యడం అవసరమై వుంటే—

భ్రమ: నోరు ముయ్యి.

సీతా: మరి సీత జంకేదా?

భ్రమ: సీతదగ్గిరికి వొచ్చేటప్పటికి భస్మం కాడూ వాడు?

సీతా: రావణుడే బలం కల రాజై, రాముడి ప్రాణం రక్షించడానికి సీత—

భ్రమ: ఛో. యింక మాట్లాడకు. చాలు. రామాయణం చదివించడం నాబుద్ధి పొరపాటయింది.

కేశవరావు వొచ్చాడు. భ్రమరాంబ లోపలికి వెళ్ళింది. సీతాకాంతం ఆశ్చర్యంతో భయంతో చూస్తోంది.

సీతా: (విసుగుగా) ఎందుకొచ్చారు, ఎట్లా వొచ్చారు?

కేశవ: ఏం వొస్తే?

సీతా: చానన్నారుగా—

కేశవ: వొచ్చాను.

సీతా: గుంటూరు వెళ్ళలా?

కేశవ: లేదు.

సీతా: ఎక్కడ వున్నారు?

కేశవ: (తడుముకొంటూ) ఎక్కడా లేదు, ఆఫీసులో—

సీతా: మూసేశారుగా—

కేశవ: ఎక్కడో స్నేహితుడింట్లో చీట్లాడుతున్నాను.

సీతా : వెళ్ళండి.

కేశవ: ఎక్కడికి ?

సీతా : ఎక్కడికన్నాను.

కేశవ: ఎందుకు ?

సీతా : తరవాత చెప్తా.

కేశవ: చెప్పాలి.

సీతా : నమ్మరూ ?

కేశవ: నమ్మతా—కాని వెళ్ళడ మెందుకు ?

సీతా : మరి మీకు దాన్ని యిప్పించవొద్దూ ?

కేశవ: (నవ్వుతుంటో) అక్కర్లేదు.

సీతా : (ఆశ్చర్యంతో) అక్కర్లేదూ ?

కేశవ: అహ !

సీతా : ఏం ?

కేశవ: అవసరంలేదు.

సీతా : ఎందుకు లేదు ? (దిగులుగా) యింత కష్టపడి మీకోసం ...

కేశవ: పోనీ నాకవసరం లేదన్నాగా.

సీతా : సరేలెండి పోనీ — కాని నేను ప్రజ్ఞగలదాన్ని అంటారా, లేదా ?

కేశవ: కావచ్చును.

సీతా : అట్లా అంటేకాదు. మీరిప్పుడు వెళ్ళిపోవాలంతే.

కేశవ: ఎక్కడికి ?

సీతా : దాని యింటికి.

కేశవ: వెడితే——?

సీతా : మీకే తెలుస్తుంది. నే నేమీ చేతకాని మూర్ఖురాల్ని అనుకున్నారా, లేదా? నేను సాధిస్తాననా్ననా? ఈ గదిలో కూచుని ఎంతపని సాధించానో తెలుస్తుంది. సిహాం, చిట్టెలుకా కథ జ్ఞాపకముందా? వెళ్ళండి.

కేశవ: సరేగాని, యీ వేషమేమిటి? ఆ గంధమేమిటి? ఆ చీరె–ఆ పువ్వులూ–పేరంటమా?

సీతా : అదేలెండి, నా సంగతి, నా అందం మీకెందుకు?

కేశవ: కాదు. చెప్పు. ఈ అలంకారమేమిటి?

సీతా : ఆ దేవతని వుపాసించేందుకు యివన్నీ అవసరం. యీ వేషం?

కేశవ: ఏ దేవతని?

సీతా : త్యాగదేవతని. పూర్వపు పురాణాల్లో వర్ణించారే, మహా పతివ్రతలందరూ తదేకదీక్షతో వుపాసించారే, ఆ త్యాగదేవతని...

కేశవ: (అనుమానంగా) ఏదే, దేవత ఏదే? పూజ ఏదే?

సీతా : హృదయంలో. సరే యింక వెళ్ళాలి. మరి వీల్లేదు. వెళ్ళకపోతే మీకే నష్టం.

కేశవ: ఏం నష్టం?

సీతా : అది దక్కడు.

కేశవ: పోనీ,

సీతా : నాకు, నా సామర్థ్యం తెలుసుకోవాలని వుంది. వెళ్ళిచూసుకురండి. దాని మనసుమారింది. చూడండి నా ప్రభావం.

కేశవ: నీ కప్పుడే ఎట్లా తెలిసింది ?

సీతా : ఏమిటి ?

కేశవ: దాని మనసు మారిందని ?

సీతా : మారిందా ? మీకు తెలుసునా ?

కేశవ: నాకేం తెలుసు ? యిట్లారా. యేమిటీ కొత్తకళ ! కొత్తఅందం ! ఇట్లారా. ఇక్కడ నువ్వుండగా నే నెక్కడికో వెళ్ళడమెందుకు ?

సీతా : మీరు మళ్ళీరాగానే యింక యెంతో మిమ్మల్ని రంజింపచేస్తాను. మరి నేను మీదాన్నికద, మీ మీద యెంతో ప్రేమకద. మీరు చెప్పిన మాట లన్నీ ఎన్నిసార్లు విన్నాను ! కారణాలు అడిగానా! పోనీ, నన్ను సంతోష పెట్టడానికి వెళ్ళండి.

కేశవ: పో, పిచ్చిపిల్లా. యిట్లారా. నువ్వు కావాలి నాకు. యీ సాయంత్రం నిన్ను ఒక్కనిమిషం వొదలను...

సీతా: నన్ను తాకారా, చచ్చిపోతా. శాపం. ఈవాళ నా వొంక చూస్తోవున్నారా—

కేశవ: వూరుకో నాతో తమాషా నీకు. (పట్టుకుని) ఆ శాపమేదో — ఆ పాండురాజు శాపం చూస్తాను కదూ !

సీతా : నామీద నమ్మకం లేదూ? మీరు ఇక్కడే వున్నారా మంత్రం చెడిపోతుంది. మళ్ళీ వనకుమారి మీకు కనపడదు.

కేశవ: అక్కర్లేదన్నాగా—

సీతా : అక్కర్లేదు. అన్నీ అక్కర్లేదు. అబద్ధాలు. (కేశవరావు మెల్లిగా నవ్వుతున్నాడు) మీకెట్లాగో తెలిసింది. అది రమ్మని కబురంపింది. అవునా! అవునా? నాకు తెలుసు. తెలుసు. అందుకనే యీ ధైర్యం. అవునా? అబద్ధం చెప్పకండి.

కేశవ: అవును, కబురంపింది.

సీతా : అందుకనేనా, గుంటూరు వెడతానన్నారు?

కేశవ: కాదు లే—

సీతా : ఎందుకీ అబద్ధాలు—

కేశవ : చూశావా మరి—

సీతా : మరి నన్ను మెచ్చుకోరేం? ఈ వుపకారానికన్నా వెళ్ళవొచ్చునుకద నా మాటవిని. నా మంత్రం వల్లనే—

కేశవ : ఛా, పిచ్చిపిల్లా. నిన్ను మెచ్చుకోడ మెందుకు? దానికి బుద్ధిపుట్టి అది పిలిస్తే—

సీతా : ఆ, బుద్ధిపుట్టింది. నేను సాయం చెయ్యకపోతే—

కేశవ : నీ మొహం—

సీతా : ఎట్లా చెప్పను? మీకే తెలుస్తుంది లెండి.

కేశవ : వాడు పోయినాడు. నన్ను పిలిపించుకుంది. వాడి కింకెవత్తో దొరికిందట !

సీతా : అంతేనా ? నా ప్రయత్నమేమీ లేకండా యివన్నీ-

కేశవ : సరేలే ! నీ ప్రభావమే ననుకో-పోయిందేముంది. (తలుచుకుంటో) నిర్భాగ్యపు వెధవ-యే దరిద్రపు ముండనో-

సీతా : దరిద్రపుముండ యెందుకు కావాలి ?

కేశవ : అంతకంటె వాడి కెవత్తె దొరికివుంటుంది ? వాణ్ణి పిలిపించుకునేటంత దిక్కుమాలింది యెవతె వుంటుంది !

సీతా : అంతే నన్నారు——

కేశవ : దాన్ని యీవేళ-దాన్ని-యేంచేశా ననుకున్నావు ? నన్నావేళ చేసిందానికి ప్రతిఫలంగా——ప్రాయశ్చిత్తంగా-మెల్లిగా పక్కలో చేరినట్టు చేరి, గొంతుపిసికాను, చచ్చేట్టు గిల్లాను-కొరికాను-రక్తం వరదలు-పాడుముండ-డబ్బిచ్చేదీ —— మోహాపుసేదీ——రక్తం కార్చేదీ —— కాని గుడ్లిట్లా పెట్టుకు చూస్తోంది. యాభై రూపాయల నోట్లుమీద పారేశాను. నోరు మూసుకుంది. డబ్బుకి గడ్డితింటా రీ వేశ్యలు. వొచ్చేటప్పుడు దాన్ని డొక్కలో తన్ని తన్ని... కాని యేడుస్తో, చూస్తో వూరుకుంది. అదినాది. నాముండ నన్ను వెళ్ళగొట్టిస్తుందా ? ప్రేమో, ద్వేషమో ? ఏమిటో దానిమీద——కాదు... వొదల్లేను——భరించ లేను ఏం చెయ్యను ?

అట్లా చూస్తున్నావేమిటి? ఏమిటా భయం? బెను రుతో వుంటే నీకళ్ళు–ఈ రోజు మళ్ళీ చిన్నప్పుడు చూసినట్టుంది– ఆ రోజు బావిదగ్గిర స్నానంచేసి, నుంచుని వున్నావు. నేను వొచ్చాను. ఎవరన్నా వొస్తారని భయం—జ్ఞాపకముందీ– అట్లావుం దీనాడు —రా, వుండు ఇవన్నీ విప్పేసి వొస్తాను.

చీకటి పడుతోంది. కేశవరావు గదివెనక చీకట్లోకివెళ్ళి కోటువిప్పు తున్నాడు. సీతాకాంతం భయంతో చూస్తో నుంచునివుంది. చప్పుడు కాకండా వొచ్చి, శ్రీనివాసులు ఆమెని చప్పున కావిలించుకుని మెల్లిగా నవ్వుతున్నాడు. చప్పుడు కాకండా వొదిలించుకోడానికి సీతాకాంతం ప్రయత్నిస్తోంది. దీపం వెలిగించి కేశవరావు వాళ్ల వేపు తిరిగిచూశాడు. రెండు నిమషాలు నోటమాట రాలేదు.

కేశవ : ఏమిటి? ఇదేమిటి వీడెట్లావొచ్చా డిక్కడికి? అదే మిట్రా, వెధవా? ఏం పనిరా? నాకళ్ళముందే–

శ్రీనివాసులు సీతాకాంతంని వొదిలాడు.

శ్రీని : నీ డెవడిక్కడ! ఈ మూాల నక్కాడు. ఎవడవిరా నువ్వు? ఇక్కడకూడా దాపరించావా? నీకిక్కడేం పని యీ దివ్యస్వర్గంలో? ఒకసారి తన్నినా బుద్ధి లేదూ? నావ్యవహారాల్లో నీకు జోక్యమెందుకు? ఏం, చావు ఆశించావా? పో ముందు–నడు–ఇట్లాపద– సీతా, వీడిక్కడ దాక్కున్నాడుగావును. మనికి తెలీ... ...

కేశవ: సీతా! నీ తేమిటి? (సీతతో) వాడెవడు? ఎందుకు వొచ్చాడు?

శ్రీని : (సీతతో) సీతా, ద్రోహమే ద్రోహమే – వీడుకూడా నామల్లే... వీణ్ణికూడానా? నీమాటలు, నీచూపులు, అన్నీ ... ...

కేశవ: ఓసి లంజముండా! ఇదా నీ కుట్ర ... ఇదా ... ఇందుకా నన్ను వెళ్ళమంటున్నావు ?

శ్రీని : ఆ, ఆ, ఏమన్నావు ? ఆమెని, ఆ పవిత్రురాలిని ?– నీ నాలుక చీలుస్తా. ఇంక పూరుకోను.

కేశవరావుని కొడుతున్నాడు, సీత అడ్డం వొచ్చింది.

కేశవ: (దెబ్బలు తింటూనే) ఇదిటే నీ త్యాగం–నీ త్యాగం! చచ్చావే – నాచేతుల్లో చచ్చావే–

సీతా : తిట్టకండి, వృధాగా.

శ్రీని : (కేశవరావుతో) నువ్వు బతికి తేకద ... (తంతున్నాడు) నువ్వు వుండమ్మా వీడితోనేమిటి ? కాని నన్నెంత అన్యాయం, మోసం ... కొట్టరా, నన్ను ? ఎదురు తిరగలేని అక్క–పక్షీ, పోరా ... ...

బైట కీడుస్తున్నాడు. కేశవరావు వొదిలించుకుంటో—

కేశవ: చచ్చావే – నాచేతులో హత్య జరిగించే యీావాళ– వీణ్ణి, యీా వెధవని—

శ్రీని : ఈమెని తాకావా, చంపేస్తా — పో, యీావేపు వొచ్చావా ... సీతా, సీతా, యింతేనా ! వీడెవడు నీకు ? పోమ్మను.

సీతా : (శ్రీతో) అట్లా అనుకోకండి. నేనట్లాంటిదాన్ని కాను. యీాయన ... ...

కేశవ: నాకళ్ళముందే—ఓసి లంజా—నేను వింటోండగానే ఆ మాటలు—

శ్రీని : సీతా, నా హృదయం బద్దలుచేస్తున్నావు. వీడు — వీ డెవడో దెయ్యం—అబద్ధం — నీమీద వృథాగా అధికారం చలాయిస్తున్నాడు. నువ్వు అడ్డంరాకు — పచ్చడిచెయ్యనీ వీణ్ని — ఒరే, యింకోమాట అన్నావా—

సీతా : ఈయనా...యీాయన — ఎవరా ! నేనీయన పాదాల కింద ధూళిని — యీాయన నాదైవం—నా...

శ్రీని : వీడా—వనం యింటిముందటి కుక్క — నీచపు వెధవ—వీడు నీకు దైవమేమిటి ? ఏమన్నా దొంగ వేషాలు వేసి—

సీతా : ఏమైతేనేం ? ఎటువంటి వాడైతేనేం ? ఆయనే నాభర్తా !

శ్రీని : (ఆశ్చర్యంతో) భర్తా, నీభర్తా !

కేశవ: సిగ్గులేక చెప్పుకుంటావేం, నేనో భర్తనని ! ఎందరో భర్తలు నీకు — (సీతాకాంతం చిరునవ్వు నవ్వుతోంది.)

శ్రీని : భర్త...నీభర్తా యితను ? వీడేనా నీభర్త ?

కేశవ: (సీతాకాంతంతో) నువ్వు...నవ్వా నీకు ! జుట్టుపట్టుకుని, చెప్పుతీసుకుని—

శ్రీని : ఛో, వనం గుమ్మందగ్గిర పడియేడు. ఈమె — యీా పతివ్రత — దివ్యమూర్తి — ప్రేమరాణి— యీా పవిత్రాలయం—నీకెందు కీమె ? ఛో, ఛో—

కేశవ: నీ కెందుకురా?

శ్రీని : ఈమె నాది. ప్రేమవల్ల నాది. ఆమె హృదయం నాది. నేనే ఆమె భర్తని.

సీతా : ఏమి టామాటలు మతి పోయిందా? (కేశవరావుతో) ఆయనతో నేమిటిలెండి?

కేశవ : వాడిచాత నన్ను తన్నించి పైగా, ఆయనతో నేమిటి లెండి యేమిటే, నీ మొహం తగలపడా!

సీతా : మరి ఆయనజోలి కెందుకు వెళ్ళారు? అంత సన్నగా వున్నారేగాని ఆయన బలం మీ కేం తెలుసు!

కేశవ : నీకు తెలుసుటే—ఎట్లా తెలుసునే, నీకు—సిగ్గులేని పీడముండా, నిన్ను, నీ నాలిక చీల్చి—

శ్రీని : నోరుముయ్యి, యింక ఒక్క మాట—మిగిలావా పళ్లు రాల తంతాను. ఆమె పాదధూళిని నెత్తిన వేసుకు నేందుకు పనికివొస్తావా? ...రా సీతా, వాడితో నేమిటే? ఈ గోలంతా మన కెందుకు? వెడదాం రా—

కేశవ : ఏమిటీ వాగుడు? ఈ మాటు సీతా, గీతా – అను చెపుతాను. ఎవ రనుకున్నావురా? మర్యాదస్తుల యిల్లనుకున్నావా భోగంయిల్లనుకున్నావా? ఏమిటి? నీతో లేచివొస్తుందీ...ఏమే లేచిపోతావుటే? ఎట్లా వొస్తుంది? బైటికి కదలమను. యిద్దరికీ మొహాలు వాచేట్టు చెప్పుతీసుకు కొట్టిస్తాను. ఇదేం విపరీతం? పీడెవడో వొచ్చి దీన్ని, అమాంతం లేచిరా అంటా డేమిటి?

సీత ఆశ్చర్యంతో చూస్తోంది.

శ్రీని : వాడికీ, వాడి బెదిరింపులకేం ? పోదాం.

సీతా : వినండి –

శ్రీని : వినడం లేదు, యేం లేదు, రా.

చెయ్యి పట్టుకున్నాడు.

కేశవ : వొదులు–

సీతా : చూడండి–

శ్రీని : దూరంగా నుంచో–

కేశవ : వొదులు–దాని చెయ్యి వొదులు–

శ్రీని : నా చెయ్యి–నా సీత–

కేశవ : నీది–మళ్ళీ అను–ఎట్లారా నీది ?

శ్రీని : నాది–నాది–నాది. యింకా అరవనా ఆ కిటికీలోంచి?

కేశవ : ఒరేయ్——

సీతా : ఎందుకు యిద్దరూ అట్లా పోట్లాడతారు ?

కేశవ : ముందు వొదులు.

సీతాకాంతం చెయ్యి వొదిలించుకుంది.
శ్రీనివాసులు మళ్ళీ చెయ్యి చాస్తున్నాడు.

సీతా : వుండండి. ఎందు కట్లా పోట్లాడతారు ? ఏమిటిది ? (కేశవరావుతో) ఆయనేమంటేనేం మీ భార్యని, మీ దాసిని–మిమ్మల్నిన్ని విడిచి యెందుకు వెడతాను నేను ?

కేశవ : మరి వాడిట్లా అంటాడేం ?

సీతా : శ్రీనివాసులుగారూ, మీరు వూరుకోండి.

కేశవ : అసలు వాడితో నీకు మాటలేమిటి ?
శ్రీని : మరి నా దానివి, నాతో రావూ ?
సీతా : మీ దాన్నా ! ఆయన భార్యని—
కేశవ : అమ్మా, వెళ్ళటం లేదుకద ! ఎంత భయపడ్డాను ? కొంపతీసేశా వనుకున్నాను.
సీతా : ఎందుకు వెడతాను ?
శ్రీని : మరి నామీద ప్రేమలేదా ?
సీతా : (ఊరుకుంది)
కేశవ : ప్రేమేమిటి? నీ మొహం? అసలు వీడెందుకొచ్చాడు?
శ్రీని : సీతా, మాట్లాడవేం ?
కేశవ : అదుగో, సీతా మళ్ళీ ? పో, యింకపో! వాదిలి...
శ్రీని : అబ్బా, అబ్బా, కొంచంసేపు గోలచెయ్యక వూరుకో, నేను మాట్లాడాలి.
కేశవ : ఏమిటీ, ఇదా, ఈ పీడనెక్కడ సంపాయించావు !
శ్రీని : సీతా, మాట్లాడవేం ?
సీతా : ఏం మాట్లాడను ? నన్ను క్షమించాలి మీరు. కాని ఎట్లా క్షమార్పణ అడగాలో నాకు తెలీటంలేదు. నాలుక రావడంలేదు.
కేశవ : క్షమార్ప ణేమిటే ?
శ్రీని : (విచారంతో) మారిపోయినావు. అయిపోయిందా ? నే నన్నట్టే—నేను భయపడ్డట్టే...
సీతా : (హృదయం కదిలి) అయ్యో, యెట్లా చెప్పాలో తెలీటంలేదు. నేను మారలేదు—కాదు—నా హృదయం

...అది కాదండీ...ఏమిటో—నేను దుర్మార్గురాలిని
కాదు. మోసంచేసే మనిషినికాను.

కేశవ : ఏమిటే, ఆ మాటలన్నీ నీకేమన్నా మతిపోయిందా?
పద లోపలికి పదా, ముందు.

శ్రీని : ఎందుకు? ఎందుకు మారావు! వీడి భయంవల్ల
కాదుకద (సీత మాట్లాడదు) మాట్లాడు?

కేశవ : అదేమిటో తొరగా యేడ్చి యీ పిశాచాన్ని పంపవే!
నా భయం వల్లటే నువ్వు వీడిని—

సీతా : (కష్టంగా) భయంవల్లకాదు—భక్తివల్ల — కాదేమో—
భయమేనేమో కాని ఆయనే నా దైవం—ఆయనే నా
లోకం...

శ్రీని : వాణ్ణిచూసి భయపడుతున్నావు. నిన్నిక్కణ్ణించి
తీసుకుపోతేనే కాని—

సీతా : ఈయన పాదాల్ని విడిచి నే నెక్కడికి వొస్తాను?
అట్లాంటి మాటలు మాట్లాడకండి.

శ్రీని : నిజమా! మరి ఆ ప్రేమ—ఆ ముద్దులు...

సీతా : అంతా, అంతా త్యాగం?

కేశవ : ముద్దులేమిటే? ఒసే ప్రాణాలు నమలక తొరగా
యేడవ్వే. ఏం చేశావే?

సీతా : నేనేమీ చెయ్యలేదు. నా హృదయం, నా ప్రాణం,
అన్నీ మీవే. ఎన్నటికీ మీ...

కేశవ: పో, పో! నీ దొంగమాటలూ, నువ్వూ. నీహృదయం
నీ దరిద్రం—పో, పో—

శ్రీని : ఇదివరకటి దంతా నటనేనా? కలా? మాయా? అన్యాయం! అన్యాయం!

సీతా : అవును మరిచిపోండి.

శ్రీని : మోసం చేశావా? ఎందుకు-డబ్బుకోసమే?

సీతా : కాదు. నమ్మండి.

శ్రీని : ఇంక యింతేనా?

సీతా : ఆయన భార్యని, ఆయన ఆజ్ఞానుబద్ధురాలిని. నాకు వేరు మనసు లేదు, ఆలోచన లేదు, హృదయం లేదు.

శ్రీని : మోసం చేశావా? నా హృదయాన్ని నిర్దయగా చీల్చావా? నీ ఆటకోసం, కానీ, ఎందుకు ... ఎందుకు ... ?

సీతా : క్షమించండి.

శ్రీని : నేను బతకలేను. తోకావు— చితకతోకావు— నా హృదయాన్ని ...

సీతా : మీరంత విచారపడితే నేను భరించలేను. లోకం చాలా విశాలమయింది. ఈ క్షుద్రురాలిని మరిచి పొండి.

శ్రీని : నిజంగా, వాడిభయంవల్ల మాట్లాడటంలేదు కదా! అట్లా ఐతే వాణ్ణి నిముషాన-నీముందరే-

సీతా : కాదు, ఆయన్నేం చెయ్యకండి, నాకోసం-

శ్రీని : ఆ నటన అంతా...

సీతా : ఆయనకోసమే!

శ్రీని : జాలి. శ్రీరామా-జాలి. (సీతమాట్లాడదు)
శ్రీని : శెలవు...
సీతా : జాలిలేదు. నిర్భాగ్యురాల్ని. (శ్రీనివాసులు వెడుతున్నాడు) యూమండీ! (ఆగాడు) వెళ్ళకండి. మళ్ళీ రండి.
శ్రీని : ఎందుకు ?
సీతా : మాట్లాడతాను— మీతో స్నేహంగా మాట్లాడతాను.
కేశవ: మాట్లాడతావా ? ఆమాట నాముందే మాట్లాడు-వెముకలు విరగతంతాను-
సీతా : స్నేహానికేమండీ ?
కేశవ: స్నేహమా? ఆ రాడీవెధవతో నీకు స్నేహమా ?
సీతా : ఏమీ ?
కేశవ : ఆహా — చాలవరకొచ్చిందా ? ఏమో చెప్పనా ? (చెంపమీద వేశాడు)
సీతా : (శ్రీనివాసులుతో) వెళ్ళండి. నామనస్సు మీ మీదనే, ఎప్పుడూ... మీ క్షేమంకోసమే. కృతజ్ఞతతో.
కేశవ: ఏమిటి? నీమనసు వాడితో...ఓసి రంకుముండా,

జుట్టు పట్టుకుని తంతున్నాడు, శ్రీనివాసులు కోపంతో చూస్తున్నాడు. కేశవరావు పొదిలాడు. శ్రీనివాసులు వెళ్ళాడు.

సీతా : (విచారంతో) పాపం. పాపం...ఎంత అన్యాయం చేశానో ! గుడ్డిదాన్నైనాను-ఆలోచించాను కాని-పాపం !

కేశవ : కాని చెప్పు, వీడెట్లా వొచ్చాడు.

సీతా : పాపం. నేనే పిలిపించి—వొప్పించి, నమ్మించి—న్యాయమేనా, నేను చేసిన పని న్యాయమేనా—

కేశవ: ఏమిటే—పిలిపించి, నమ్మించి, ముద్దుపెట్టించి, పడుకోపెట్టించి—యింకా యేంచేశావు, తప్పడుముండా——నిన్ను నిలువునా నరికినా——(కొడుతున్నాడు.)

సీతా : అన్యాయంగా కొడుతున్నారు. వినండి నిజం తెలిసి మీరే దుఃఖపడతారు. (శ్రీనివాసులువొచ్చాడు.)

శ్రీని : అయ్యో సీతా, యిట్లా, నాకళ్ళముందు నీకు యిట్లా దెబ్బలు తగులుతోవుంటే, యీ పాపిష్టికళ్ళ చూడవలసివొచ్చిందా! ఒక్క మాట అను—ఆ నరహంతకుణ్ణి, నీకళ్ళముందే—వెమిక వెమికకీ సంబంధం లేకండా——

సీతా : వొద్దు... ఆయనకి తెలీక కోపంతో... పోసిండి... మీ రెందుకు వెళ్ళండి. నాఖర్మం.

శ్రీని : ఒక్కమాట అడగటానికి వొచ్చాను. నింజగా నువ్వు నన్ను ప్రేమించనే లేదా ? నమ్మలేకండా వున్నాను.

సీతా : ప్రేమించాను—కాని, అట్లా కాదు.

శ్రీని : మరి నేను వసంతో ఆమాట చెప్పివొ స్తే...

సీతా : ఏమో ! చెప్పలేను—

శ్రీని : మరి వాగ్దత్తం నిలుపుకునేదాని వేనా—

కేశవ: ఏమిటా వాగ్దత్తం.

శ్రీని : (కేశవరావుతో) నేను చాలా తెగించి వున్నాను. నువ్వు మాట్లాడావా, నిన్నేంచేస్తానో తెలీదు. వూరుకో. ఈసారి నోరెత్తావంటే! (కేశవరావు భయంతో వూరుకున్నాడు.) మరి వాగ్దత్తం?

సీతా : నిలుపుకునేదాన్నే.

శ్రీని : మరి ?

సీతా : అవసరంలేకపోయిందికూడాను. వీల్లేకపోయింది.

శ్రీని : నిజం చెప్పు – కడసారి నిన్ను చూడడం – నీ కే మాత్రమూ యిష్టం లేదా? (సీతమాట్లాడదు) చెప్పాలి.

సీతా : ఏమో——

శ్రీని : చెప్పాలి. నేను వెళ్ళిపోతున్నాను. నీకేమీ శ్రమ యివ్వను.

సీతా : పాతివ్రత్యం – మనసులోగాని – వాక్కులోగాని, ఆయన పాదపద్మాలుగాక–

శ్రీని : మరి యిది–

సీతా : త్యాగం – ఆయనకోసమే !

శ్రీని : నీయిష్టం యేమిటి ?

సీతా : ఏమో – ఆయన యిష్టమే నాయిష్టం. మీతో మాట్లాడవొద్దంటున్నారు.

శ్రీని : వాడికోసమా? ఆ వనంకోసం వీడు పన్నిన పన్నాగమా? దానికోసం నువ్వు నన్ను బలికి తీసుకున్నావా? వీడే ... చివరికి వీడే జయించాడు.

ఒరే! యిల్లాంటివాడవా! పెళ్ళాన్నమ్ముకునేవాడివా నువ్వు? చూసుకో ఈసంగతి లోకమంతా చాటిస్తా. సీతా, చంపావునన్ను. త్యాగం చేశావా ... నా ప్రాణాన్ని?

సీతా: మిమ్మల్ని కాదు; నన్ను—

శ్రీని: నిన్నా; పైగా—

సీతా: మీామీాద ప్రేమవుంది. ముందు నన్ను త్యాగం చేసుకుని—

శ్రీనివాసులు వెడుతున్నాడు.

కేశవ: ఏమిటే—ఆ సమాచారమేమిటో యాడవ్వేం?

సీతాకాంత అతనిమాటలు వినడంలేదు.

Strain భరించలేక వూగుతోంది.

సీతా: నాహృదయం చీలినా, మండిపోయినా, లెఖ్ఖ-చెయ్యక, నిగ్రహించి, కౄరంగా, కఠినంగా, పంపాను - జయించాను — జయించాను. ఆశీర్వదించండి.

కేశవ: నీకేం, పూర్తిగా మతిపోయిందా?

సీతా: పాపం—పాపం—ఆ జాలికళ్ళు—మరవగలనా— ఎన్నాళ్ళకైనా మరవగలనా?

కేశవ: ఇదో దొంగ వేషం—చెపుతావా, తన్ననా?

సీతా: అన్యాయమేనా ... ఘోరమైన అన్యాయం చేశాను కాని యీశ్వరుడు, దేవి—సీతాదేవి యెరగదా, నా బాధ ...

కేశవ : సీతాదేవి యెవరు ?

సీతా : క్షమించగలరా, మీరైనా... ఆయన యడల నేను చేసిన యీ దారుణమైన అన్యాయం... మళ్ళీ వొస్తే బావుండును—ఈ పాపపరిహారంగా...

కేశవ : ఏమిటా సంగతి, ఏడుపు.

సీతా : (మాట్లాడదు) తన ధ్యాసలోనే వుంటుంది.

కేశవ : నీకు తెలుస్తోందా, నువ్వు చేసినపని... నిజమేనా— వాడన్న మాటలన్నీ నిజమేనా ?

సీతా : అవును—అంతా నిజమే—నా ప్రాణంకన్న, నా అభిమానం కన్న ఆయన బాధకన్న, మిమ్మెన్నికుక్కవగా ప్రేమించాలని చూశాను.

కేశవ : పూరికే, అవసరంలేని వాగుడంతా వాగకు ప్రేమట.

సీతా : నా నాథులు, నా జీవన—

కేశవ : ఏంచేశావే, నిర్భాగ్యురాలా ?

సీతా : మీ సేవ చేశాను—మీ పాదసేవచేత—

కేశవ : ఏమిటి ? ఈ నాటకం—ఇదేదో వేషంవేసి తప్పించుకోవాలని చూస్తున్నావా ఏమిటి?

సీతా : పాపం, ఎంత బాధపడుతున్నారో ! ఏంచెయ్యను మీకోసం ?

కేశవ : నోరుముయ్యి. దొంగమాటలు మాట్లాడకు.

సీతా : లోకం యేమనుకుంటే మనకేం ?

కేశవ : మనమేమిటి ? నేనెవరు, నువ్వెవరు ? ఇంకా మనం యేమిటి ?

సీతా : అవును. నే నెవరు-మీ రెవరు, ఒకరి నొకరు అర్థం చేసుకోలేని వాళ్ళం, నే నెవరు, మీ రెవరు ?

కేశవ : పాడు రంకుపనిచేసి పైగా——

సీతా : (ఆలోచనగా) రంకుపనా ? అవును. రంకుపనే.

కేశవ : (తనలో) ఎంత మోసం ! ఎంత మోసం ! ఎంత నమ్మాను ! ఇట్లాంటిదానివని తెలీదుకదా ! తెలిస్తే దాన్ని-వనాన్ని-సుఖంగా యింట్లో నే పెట్టుకునేవాణ్ణి పాపం. యేదో యింత భక్తికలదే, ప్రేమకలదే, దాన్ని యేడిపించడం అన్యాయమని చూసి-యెంత సౌఖ్యాన్ని వృథాగా చేసుకున్నాను. ఎంత అన్యాయం, ఆ రోషమూ ఆ దుఃఖమూ, అన్నీ వేషాలే! యిట్లాంటిదానికి రోషమెందుకో ! ఏదో నాకు వుపకారమని వొంకపెట్టి, కళ్ళుకప్పి, దొంగముండా, యిదా చేసింది ! ఏమో యిప్పుడేం-యిట్లాంటి బుద్ధి కలది, యేమేం చేసిందో, యిన్నేళ్ళలో ! ఇట్లాంటి దాంతోనా, నేను కాపరంచేస్తోంది ? యీ రంకు ముండతోనా ! పండంటి పవిత్రమైన వంశంలో యిది ప్రవేశించిందా ! అవును. అట్లాంటి తల్లికి పుట్టిన దానికి యింతకంటే మంచిబుద్ధి ఎట్లా కలుగుతుంది. ఇంత ప్రేమజూపి నీకిన్ని సౌఖ్యాలిచ్చి, నా సౌఖ్యాన్ని, ఆనందాన్ని, అంతాతగలేశాను. ఇప్పుడు వాడీ సంగతి వూరంతా చాటిస్తాడు, నేనే నిన్ను తనకి వొప్పచెప్పానని ! ఎవరు నమ్ముతారు నా మాట-నే నేమీ ఎరుగనని... మాట్లాడవేం ? ఓసి

భ్రష్టుముండా, ఎంతపని చేశావే, నా సంసారాన్ని! నిన్ను వాడు—చెప్పుకుంటాడు — నోటికివచ్చినవన్నీ చెప్పుకుంటాడు— నేను నోరుమూసుకోవాలి. ఈ గోలంతా—యీ కష్టమంతా, నాకు నీకు నీ మూలం గానే—యీ పాడుముండ మూలంగానే...

సీతా : నేను పోతాలెండి, మీా కళ్ళక్లేకపోతే.

కేశవ : ఎక్కడికి—యేట్లోకి. పోయి—పోతే ఏంలాభం? పోయే దానివి యిన్నాళ్ళెందుకున్నావు? పోయేదానివి యెప్పుడో పోయి చావక! పీడ విరగడైపోను... నేనే చేశాననుకుంటారు — తప్పదు—నా పెళ్ళాన్ని నాప్ప చెప్పా ననుకుంటారు. నా ఖర్మంకాలా యింతబతుకు బతికి, యింతమంచి వంశంలో పుట్టి, పరువు ప్రతిష్ట లతో బతికి, పెద్ద వుద్యోగంచేస్తో — యీా సంగతి తెలిస్తే యింకేమన్నా వుందా? చెప్పావా నే నా సొమ్ము బాంకిలోంచి తెచ్చానని!... చెప్పావూ... ఇంకేం...నా పని సున్న ... అడుక్కుతిందాం— నువ్వడుక్కుతిను—నాకేం— నేనేం చేశాను? నాకొంప ముంచావుకద! ఎక్కడ దొరికావే, పిశాచీ నాకు... యిప్పుడన్నా అర్థమాతోందా?

సీతా : ఆ, చాలా అర్థమాతోంది—

కేశవ : ఎంతో నమ్మకమైనదానవని, అటువంటి కోర్కలేని నిర్మల చరిత్రవని, నా బలవంతం వల్లగాని, యెన్నడూ పశువృత్తినభిలషింపనిదానివని, నిన్నెంతో

గౌరవించాను—ప్రేమించాను—కాని యింత కడుపులో పెట్టుకొని మోసంచేశావనుకోలేదు.

సీతా : మిమ్మన్నన్యాయం చేసివుంటే క్షమించండి.

కేశవ : క్షమించి-ఏం చేసుకోను నిన్ను-ఎంగిలిపడ్డ నిన్ను, వూరకుక్క తాకిన నిన్ను-

సీతా : (ఆలోచిస్తో) ఇంకేం చేస్తారు? పెంటమీద పారెయ్యండి. తక్కిన కుక్కలు చీల్చుకు తింటాయి-

కేశవ : గొప్పమాటలు మాట్లాడకు.

సీతా : మీకు నిజంగా నన్ను చూడ్డమే బాధగావుంటే, వెడతాను-అదే మీ ఆజ్ఞ ఐతే-

కేశవ : ఎక్కడికి? 'వెళ్ళు' అన్నానో, లేదో, అప్పుడే ప్రయాణం ఎక్కడికి? వాడిదగ్గిరికేనా? కానీ, శుభమస్తు-శీఘ్రం-కాని వాడు నిన్ను పెట్టుకుని యీ వూళ్ళో-నా కళ్ళముందరే-వీల్లేదు, ఆగు-నీపని అట్లా కాదు. వొద్దు - యింట్లోనే పడివుండు. దాసీపని చెయ్యి - (కసిగా) నీవుంటే-నీ కళ్ళముందే, నా యిష్టంవొచ్చిన వాళ్ళని తెచ్చిపెట్టుకుంటా, నీ మొహంముందే-నాకూ, వాళ్ళకే వొండు - చాకిరీ చెయ్యి అంతే. (బైటతలుపు కొడుతున్నారు).

సీతా : ఎవరు?

శ్రీని : (బయటనించి) సీతా, సీతా!

కేశవ : వాడు. సీతట!—ఎందుకు?

శ్రీని : సీతా, ఒక్కసారి తియ్యి.

సీతా : ఎందుకండీ ?

కేశవ: వుండు. నువ్వు వూరుకో ఎందుకోవీడు మళ్ళీవొచ్చింది ఇంకా ఏం చెయ్యబోతున్నాడో! (శ్రీతో) పో, వెళ్ళు, తియ్యడానికి వీల్లేదు.

శ్రీని : సీతా, వొక్కసారి—ఆఖరుసారి-

కేశవ: ఎట్లా - అబ్బా! యేంగోల తెచ్చిపెట్టావే! వాడా నడివీధులో సీతా సీతా అంటాడు, సిగ్గులేకుండా: యెట్లా చావనే నేను? పో, సీతా కాదు, గీతా కాదు పో.

శ్రీని : తీసిందాకా కదలను.

కేశవ: అబ్బా ? యేం చెయ్యను ?

సీతా : తియ్యండి.

కేశవ: వాణ్ణా... మళ్ళీయింటో కా... ఇంకోసారి వస్తే తంతే, కళ్ళుచల్లగా చూడగలవా ?

సీతా : ఆయన్నేమీ అనకపోతే - ఆయనేమీ కొట్టడు.

కేశవ: ఓసి తప్పుడుముండా, నా యెదుటనేనా, వాణ్ణి పొగడ్డం !

శ్రీని : సీతా, ఒక్కసారి——

సీతా : మీరు తియ్యకపోతే, నేను తీస్తాను.

కేశవ: కదులు, చెపుతా, నరికేస్తాను - వాడితో లేచిపోవడానికేనా ?

సీతా : సరే, నరకండి.

కేశవ: చావు ముండా - (కొడుతున్నాడు)

సీతా : అబ్బా! అబ్బా!

శ్రీని : నా సీతదేనా ఆ కేక ? ఇంకవూరుకోను.

తలుపు పగిలేటట్టు తంతున్నాడు.

కేశవ : వెంకర్మ వొచ్చింది !

వెళ్ళి తలుపు కొంచెంగా తెరిచాడు- నెట్టు కొని శ్రీనివాసులు లోపలికి వొచ్చాడు.

శ్రీని : అమ్మా! సురక్షితంగా వున్నావుకద ?... నిన్ను—నా సీతని ఒక్క—సారి — ఆఖరిసారి చూసి వెళదామని వొచ్చాను. ఇంక శ్రీనివాసులు నిన్ను పీడించడు— నీకు కనపడడు ...(చూసి) అయ్యో! పాపం! కొడు తున్నాడా ? ఏం చెయ్యను ? వెళ్ళేవాణ్ణి వెడుతు న్నాను. వీణ్ణి చంపేసిపోతే... (కేశవరావు వొణుకు తున్నాడు)... అవును ... చంపేస్తే... నువ్వు సుఖంగా జీవిస్తావు. నీ పతివ్రతా దోషం, నీ పెద్ది వొదులు తుంది ... వుండు ... అవును ... వీణ్ణి చంపాలి ... రా, రా నిన్ను చంపుతాను. చంపించుకో !

పట్టుకొని గొంతు పిసుకుతున్నాడు. సీతకి అర్థంకావడంలేదు. కేశవ రావు కళ్ళుతేలేసి దణ్ణం పెడుతున్నాడు. సీతకిఅపాయం అర్థంకాదు.

సీతా : పాపం ! నెప్పి పెడుతున్నట్టుంది. వదలండి.

శ్రీని : యింకేమి, చస్తోవుంటే. (సీతకి తెలిసింది)

సీతా : ఆ, అ—ఎందుకు—అయ్యో—వొదులు—వొదులు—

శ్రీని : నిజంగా ఏడుబతకాలా ?

సీతా : ఆయన లేకపోతే నేనుంటానా ?

శ్రీని : పోనీలే. అంతా అంతంకానీ... నువ్వూ, వీడు, నేను
లోకం-అంతా అంతంకానీ యీనాటితో.

సీతా : మీ పాదాలు పట్టుకుంటా -వొదలండి – మిమ్మల్ని
ద్రోహంచేశాను. కాని నాకు పతిభిక్ష పెట్టండి-

శ్రీనివాసులు కేశవరావుని సీత కాళ్ళమీద పడవేశాడు.

శ్రీని : వేడుకో, ప్రాణదానం చెయ్యమని వేడుకో. పట్టుకో
కాళ్ళు (కేశవరావు అరవబోతున్నాడు) నోరెత్తావా
ఒక్క గుద్దుతో చచ్చావే, కాళ్ళు పట్టుకో.

సీతా : తప్పు, తప్పు.

కేశవరావు ఆమె పాదాలు పట్టుకున్నాడు.

శ్రీని : దేవీ, ప్రాణదానం చెయ్యి అను- అను-

కేశవ : దేవీ, ప్రాణదానం చెయ్యి -

శ్రీని : సీతా, శలవు. తెలిసింది నాకు-ఆపదిహేను వందలూ
వీడు మెత్తుకొచ్చినవి. వాడి మాన ప్రాణదానాలు
చేశావు. పాలించుకో. సుఖించు. వెర్రోళ్ళ-గంపెడు
బిడ్డల్నికని సుఖించు. కాని యితరులకికూడా హృద
యాలూ, ఆత్మలూ వున్నాయి, సీతా నీ భర్తకి
మాత్రమే కాదు- (వెళ్ళాడు)

కేశవ : పదిహేను వందలూ ఏమిటి?

సీతా : ఆయన ఎక్కడికి వెడతారు? ఏమౌతారు?

కేశవ : ఏమే ఆ సొమ్ము ఏదే?

సీతా : బీరువాలో వుంది – కాని ఆయన ఏమౌతారు?
ఎందుకు? ఏం చెయ్యను?

కేశవ : ఎక్కడివి ఆ పదిహేను వందలూ. వాడి దగ్గిర్నించి లాగావా ?

సీతా : అవును.

కేశవ : ఎట్లా ?

సీతా : త్యాగంవల్ల—

కేశవ : అంటే సరిగా యేడు.

సీతా : ఆయన తెచ్చియిచ్చారు. పాపం! యేమాతా రిప్పుడు ?

కేశవ : (సంతోషంతో) అమ్మా! నిజమే! ఆపద తప్పింది. ఈ బాంకిసొమ్ము సంగతి తెలిసి, నా పని పోతుందని యెంతో భయపడ్డాను, ఓ! యీ సొమ్ము తెప్పించ డానికా వాణ్ణి నీ వలలో వేసుకుంది!

సీతా : పాపం ఆయన్ని యెంతో అన్యాయం చేశాను— ఎంతో అన్యాయం చేశాను.

కేశవ : మరి అట్లా చెప్పవేం ? చాలా తెలివైన దానివే, ! ఏమో అనుకున్నానుగాని! కాని యీ డబ్బుకోసం, నువ్వు వాడితో మరీ చనువు చెయ్యలేదుకద ? వాడి కేమీ యివ్వలేదుగా!

తలుపు తోసుకుని వనకుమారి వొచ్చింది.

వన : ఏడీ, ఏడీ, అతనేడీ ?

కేశవ : ఎవరు ?

వన : అతనే, శ్రీనివాసులు.

కేశవ : వాడెందుకు నీకు ?

వన : అతనే, శ్రీనివాసులు.

కేశవ: వాడెందుకు నీకు?

వన : ఎందుకు... ఎందుకు... ఏడీ?

కేశవ: ఏమో! ఎక్కడ చచ్చాడో. ఐనా యీ ఆదుర్దా యెందుకిప్పుడు?

వన : రానే లేదా యిక్కడికి? చెప్పండి—నన్నేడిపించకండి.

సీతా : వొచ్చారు.

వన : వొచ్చి—

సీతా : వెళ్ళిపోయినారు.

వన : మీరేనా, సీతాకాంతం! మీరే! అతన్ని పొట్టన పెట్టుకున్న పతివ్రతలు మీరేనా? యేమైనాడు?

కేశవ: ఏమిటి వనం! అట్లా మాట్లాడతావు? మాకేం తెలుసు ఆ వెధవ సంగతి.

వన : అవును. అటువంటి దుర్మార్గులసంగతి మీవంటి వారికి అసలు తెలుస్తుందా? కాని యెక్కడికి వెడుతున్నాడో చెప్పనేలేదా? ఏం కాబోతున్నాడో!

కేశవ: లేదు.

వన : మళ్ళీ వచ్చి ఏమన్నాడు?

కేశవ: ఏమన్నాడు... రాడట. నోటికి వొచ్చినట్లు కూశాడు, పోయినాడు. వాడి నోటికి అడ్డమేమిటి? కాని నువ్విట్లా - యింతదూరం - బహిరంగంగా నడిచి వొచ్చావా ఆ అప్రాచకుడికోసం...

వన : (సీతాకాంతంతో) మీరన్నా చెప్పండి. ఈ కడపటి ఉపకారం చెయ్యండి. మీకు మొక్కుతాను.

సీతా : ఏమేమో అన్నారు. నన్ను 'చంపేశావు, నన్ను చంపేశావు' అని వెళ్ళి పోయినారు.

వన : అయ్యో శ్రీ! యెంతగతి పట్టింది నీకు! ఎక్కడికి వెళ్ళాడు? ఏమీ చెప్పలేదా? ఏమాంతానన్నాడు, నా శ్రీ? అయ్యో శ్రీ!

సీతా : ఏమీ చెప్పలేదు.

వన : చెప్పనేలేదా? ఏం చెయ్యను? ఎక్కడికి వెళ్ళను? ఎక్కడ వెతకను?

కేశవ: నా యిల్లు ఎట్లా తెలిసిందే నీకు?

వన : మొదటినుంచీ యింతే! చెప్పాను, నమ్మకు, శ్రీ, ఈకులస్త్రీలను నమ్మకు. వీళ్లైనంతవరకు ఆకర్షిస్తారు, సమయం వొచ్చేప్పటికి అంతా మొగాడిమీద తోసి, ఏమీ యెరగనట్టు తప్పుకుంటారంటే నమ్మాడు కాదు. నీ కళ్ళల్లో ముగ్ధత్వం-నీ మాటల్లో మాధుర్యం చూసి మోసపోయినాడు, నా శ్రీ.

కేశవ: ఏమిటిది? నా కర్థం కావటం లేదు.

వన : ఇక్కణ్ణించి వొచ్చాడు, పాపం, హృదయంలో గాయమైన పులివలె – పాపం! సరాసరి వొచ్చి నా వొళ్ళోపడుకుని ఆ తలని – (ఏడుస్తూ) అంతే– ఆఖరు సారి – నా కానించి, శూన్య దృష్టిని నా ముఖానికి తిప్పి– యిట్లా వొత్తుకున్నాను గట్టిగా – తెలుస్తుంది నాకు – చచ్చే దెబ్బతిన్నాడని – 'వనం చచ్చాను. చంపింది – చంపి వేసింది' అన్నాడు. నేను 'ముందే చెప్పలేదా' అన్నాను. కఠినాత్ముకాల్ని – యెత్తి

పోడిచాను. 'అవును చంపింది' అని లేస్తున్నాడు. 'ఎక్కడికి శ్రీ! వెళ్ళకు వెళ్ళానా, బతకవు' అన్నాను. 'యిదివరకే చచ్చాను, ఆ పాదాలదగ్గిర ఆమె చేతుల్లోనే - యీడవకు - నాపని అయింది' అని లేచి వొచ్చాడు. పాపం - యీ నాలుగు రోజులూ, యెంత ఆనందంలో మైమరిచి - 'నాకు స్వర్గం దొరికింది. నా జన్మ సఫలమయింది. నా అదృష్టం!' అంటో ఎంతో తలుచుకుని, తలుచుకుని ఆనందపడిపోయినాడు. ఏముందో నీలో-ఏం మాధుర్యమో, ఏం హాలాహలమో-చెట్టంతటివాణ్ణి నరికేశావు... తెలీదు ఎక్కడ వున్నదీ-సరే-పోతాను.

కేశవ: యేంచేస్తావు, వెళ్ళి ?

వన : వెతుకుతాను.

కేశవ: వాడితో నేమిటి, పోనిద్దూ-చావనీ.

వన : నా కెందుకు కోపం తెప్పిస్తారు, మాట్లాడకండి. ఎక్కడికి పోను ? ఏం చెయ్యను ? శ్రీ-(వెళ్ళబోతుంది)

కేశవ: ఏ కల్లుదుకాణంలోనో వుంటాడు. నువ్వెట్లా వెడతావు అక్కడికి ?

వన : బతికివుంటే మాత్రం - అవును తాగుతూ వుండాలి. కాని-నేలు పిలిస్తే వొస్తాడా, రాడు. (చప్పున సీతాకాంతంవేపు తిరిగి) నా శ్రీని చంపావు ! పోసీ నిన్ను క్షమించను. నీ కాళ్ళమీదపడతా (పడుతోంది)నా శ్రీని నాకియ్యి.

సీతా : నే నేం చెయ్యను ?

వన : దేవీ నీ ముందు, నీ పాదాలముందు పడి వేడు తున్నాను. వరమియ్యి.

సీతా : ఏం వరము ?

వన : యిస్తానను.

కేశవ: వనం, యేమిటీ పిచ్చి నీకు ?

సీతా : (ఆలోచిస్తో) నేను స్వతంత్రురాలనా ?

వన : (కేశవరావుతో) ఏమైనా కృతజ్ఞతవుంటే, నామీద ప్రేమవుంటే, కటాక్షించండి.

కేశవ: దానికేం ? నీ ప్రార్థన నిరాకరించగలనా ? పో, తీసుకుపో వాణ్ణి. కాని నీయింటో వుణ్ణీకు, పొమ్మను.

వన : అదికాదు. అడగనా ?

కేశవ: యింకేమిటి ?

వన : ఈమెని నాతో పంపండి.

కేశవ: ఎక్కడికి ?

వన : నాతో స్త్రీవి వెతకడానికి.

కేశవ: ఎందుకు ?

వన : ఈమె పిలిస్తేనేగాని రాడు.

కేశవ: నీకు మతిపోయిందా ? ఇది పిలవటమేమిటి, వాడు రావడమేమిటి ? సంబంధమేమిటి? మతిపోయిందా ?

వన : పోయింది. నా అవివేకం. పంపండి. అయ్యో! ఆలస్య మవుతోంది.

కేశవ: మంచిదానివే! నీతో కల్లుదుకాణాలు తిరగ మంటావా? ఎవరో, తెలుసునా యిది? నా భార్య... ఇంకేంకావాలి. నా పేరు నాలుగు దమ్మిడీలకి కొర అవుతుందా? పో, యింటికిపో. ఈ ఆవేశం అణు చుకో, తరువాత నేను వొస్తాను.

వన : ఏమమ్మా— రావుటమ్మా?

సీతా : నేనా?

వన : అయ్యో! రావు—నువ్వెందుకు వొస్తావు!

సీతా : ఆయన్ని బాధించాలని నా వుద్దేశ్యం కాదు. ఆయన నాపైన అంత మనసు పడతారనుకోలేదు.

వన : మరి ఆకర్షించింటి ఎందుకూ? మనసుపడాలనేగా?

సీతా : కాని అంత వెర్రిపడతాడనుకోలేదు.

వన : ఎవరితప్పు?

సీతా : నాదిలాగేవుంది. నాదిలాగేవుంది. నా అజ్ఞానం.

వన : లేకపోతే యీ గూట్లో బతికే నీకు ఏం తెలుసు?

సీతా : అవును గూట్లోనే బతికాను.

వన : పోనీ, చివరికి దెందుకు...

సీతా : నన్ను - నా దేహాన్ని - కోరాడాయన...

వన : కాని నిర్మలమైన పతివ్రతవు గనక నిరాకరించావు, అవునా?

సీతా : నా దేహమిస్తేనేకాని బతకనంటే నే నేంచెయ్యను?

వన : యిస్తేనేం?

సీతా : ఛా!

వన : పోనీ, పోనీ, నీ నిర్మలత్వాన్ని నువ్వేదాచుకో. అబద్ధాలాడావు, దొంగమాటలు చెప్పావు. నా శ్రీని ఏడిపించావు. నన్ను నాథను చేశావు. అంతకన్న - యీ ఘోరాలకన్న, యీ పాపాలకన్న, నీ దేహం-నిన్ను పంచప్రాణాలతోటీ ప్రేమించినవాడికి-పోనీ త్యాగమే ననుకో-నీ భర్తకోసమే, త్యాగం చెయ్యడం పాపమయిందా? ఎందుకిదంతా - నీ భర్తకి సానిదాన్ని వొప్పచెప్పడానికి - నాలుగురూపాయలు విలువగల, వీధిలోవుండే, నా దేహాన్ని యిప్పించేందుకు యింత ప్రయత్నమా? రా, నువ్వు చేసిన పాపపరిహారం చెయ్యి. రా, నా శ్రీని నాకియ్యి. అయ్యో! ఆలస్యమవుతోంది.

సీతా : అన్ని పాపాలుచేశానా? అవన్నీ నా భర్తకోసం త్యాగమేనా?

వన : లాభమేమిటి? ఎవరికి ఉపయోగం?

సీతా : అందరికీ-ఆయనకీ, నాకూ, ప్రపంచానికీ.

వన : ఆయనకా? నీ త్యాగంవల్ల ఆయన లాభమున్నా కృతజ్ఞత కనపరుస్తున్నారా?

సీతా : పోనీ నా ఆత్మ సంతుష్టి-

వన : ఇంకా అబద్ధాలే! నా శ్రీని బలియిచ్చినందుకు నీ ఆత్మ సంతోషిస్తోందా? అంత రాక్షసివా? కావు. ఇంక నీతో వాదించి ఏం లాభం? రాయి కరుగుతుందిగాని కీర్తిభ్రమలో పాతుకున్న పతివ్రతల

మనస్సు కరగదు. యీయనగారికి సానిదాన్ని వొప్ప చెప్పి, మెప్పుపొందేందుకు, దోపసపాద్యే అమాయకుణ్ణి పిలిచి, నమ్మించి మోసగించింది. ఏమీ అర్థం కనపట్టం లేదుట! నిన్నని ఏం లాభం! నాఖర్మ — నా శ్రీ ఖర్మం!

వెదుతోంది. సీత చాలా బాధపదుతోంది. ఆలోచిస్తోంది.

సీతా : వుండు.

వన : ఎందుకు?

సీతా : నన్ను యీ మెత్తో పెళ్ళనిండి!

కేశవ : దేంతో? ఎక్కడికి?

సీతా : ఆయన్ని వెతుకుతాను.

కేశవ : నీకు మతిపోయింది.

సీతా : అసలు మతివుంటేకదా, పోవటానికి.

కేశవ: ఈ బోగంముండ వెంబడీ—లోకం...

సీతా : లోకమా? శ్రీకన్న లోకం యెక్కువా?

కేశవ: దాని కెక్కువేమో! నీకెందుకు?

సీతా : పోనీ, ఆమెకోసమే. హృదయ బాధకన్న, ఈ అంతఃకరణ వేదనకన్న—లోకపరిహాసం చాలా సులభం.

కేశవ: బోగం ముండతో—

సీతా : నే నారాధించే దైవం, యెవర్ని ఆరాధిస్తాడో, ఆ పవిత్ర దేవాధిదేవత యీమె!

కేశవ: చాల్లే నోరుముయ్యి. బైట అడుగుపెట్టావా మళ్ళీ రానీను.

సీతా : రానీరా ?

కేశవ: సందేహమెందుకు ? నువ్వు పురుగులుపడి చస్తున్నా రానీను.

సీతా : సరేలెండి రాను-

కేశవ: ఏమిటి నీ యింటిని వొదిలి—

సీతా : నా యిల్లయితే మళ్ళీ రానీనంటారా ?

కేశవ: నీ యిల్లయితే మళ్ళీ రానంటావా ?

సీతా : ముందు తిరిగి రావాలనే అనుకున్నాను. కాని మీరు యీ పుణ్యకార్యానికి వెళ్ళవద్దనగానే నాకిక్కడ వూపిరి సలపదనిపించింది.

కేశవ: వెడతావు ! వెడతావు నువ్వు ! వాడేమైతేనేం. ఎందుకువెళ్ళడం ?

సీతా : నాకు బాగా అర్థంకాదు చెప్పడానికి. కాని చాలా ద్రోహం చేశాననే నీచత్వం నన్ను బాధిస్తోంది. ఏమైనాసరే వెళ్ళక తప్పదు.

కేశవ: తెలుసులే. వాడిమీదనే నీ మనసు.

సీతా : పోనీ.

కేశవ: మరివాడు కనపడగానే మళ్ళీ నిన్ను కోరతాడు.

సీతా : పోనీండి.

కేశవ: అప్పుడు ?

సీతా : నా మానత్యాగం యేమీ ఘోరంగా తోచడం లేదు. అంతకన్న నీచమైన పాపాలు చేశాను. ఏమో! ఆయనే కనపడి ఆయన ప్రాణాన్ని నిలపడానికి ఆ త్యాగమే అవసరమైతే... ఏమో !

కేశవ: వెళ్ళను.

వన : దారి వదలండి.

కేశవ: వీల్లేదు.

వన : నేను తెగించి వున్నదాన్ని-గోలచేస్తాను

కేశవ: చెయ్యి.

వన : మర్యాదగా వొదలండి. చెయ్యి చేసుకుంటాను.

కేశవ: నువ్వు నా ముండవి.

వన : లేవండి.

సీతా : దారి వదలండి, లేవండి. (భ్రమరాంబ వొచ్చింది)
ఇదుగోనండి-మీా ముద్దులకూతురు ఎవణ్ణోపట్టుకు లేచి పోతోంది. చూడండి.

సీతా : అమ్మా! త్యాగమాధుర్యం అనుష్ఠిస్తేనే కాని అర్థం కాదన్నావు. అనుష్ఠించాను. అర్థమైంది. యింక శెలవు.

# పిడాకులు

## మహిళా ఉన్నత పాఠశాల.

పూజామందిరం. స్కూలుపిల్లల పూజ. ముందు లలిత వీణపాట. లలితకు 17 యేళ్ళు. ఆమె అందం పురుషుల అనుభవానికి superior గా కనబడుతుంది. భక్తిపరురాలు. నవీన సాంప్రదాయాలు ఆమె వేషంలో యేమాత్రమూ కనబడవు. పురాతన సాంప్రదాయాలూ ఎక్కువలేవు.

తర్వాత పిల్లలందరూ కలసి సరస్వతీ స్తోత్రం.

పిల్లలందరూ తోటలోకి వెళుతున్నారు. గోడలకు ఋషులూ, పురాణ పురుషుల గాధలూ, దేశనాయకుల పటాలూ.

పిల్లల అల్లరి. .... ....

రాత్రి, వెన్నెల. లలితా, చంపక అనే class-mates డాబామీద నుంచున్నారు. కింద దూరంగా పట్టణపు electric lights కనబడుతున్నాయి.

చంపకం:

దిగులు పడకోయ్! ఎల్లుండికి మీ అమ్మనీ నాన్నగారినీ చూడగానే మమ్మల్నందర్నీ మరిచిపోతావు.

లలిత:

అదికాదు చంపకా! నా మనస్సంతా సంఘసేవమీద వుంది. సంస్కారం పొందిన మన స్త్రీలు దేశసేవకై జీవితాన్ని విని

యోగించాలి. పిల్లలు కనేందుకు లేగా స్త్రీలు? మనమూ అంతేనా?

చంపకం:

దేశసేవా! దేశాన్ని సృజించినవాడే దేశాన్ని సంస్కరించుకుంటాడు. నాకు మాత్రం ప్రేమించే భర్తా, చక్కని పిల్లలు, ధనం దొరికితే చాలు.

లలిత:

ప్రేమించగల భర్త దొరకవద్దా! దొరక్కనేగా పశ్చిమ దేశాల్లో అన్ని డైవర్సులూ, మనదేశంలో ఇన్ని సంసార విచ్ఛిన్నాలు.

చంపకం:

ఇక్కడకూడా మనవాళ్ళు ప్రయత్నిస్తున్నారుగా! విడాకుల చట్టం అమల్లోకి తేవడానికి.

లలిత:

(కోపంగా) వనభర్తని వదిలి, పరాయివాణ్ణి ఉంచేసి నన్నాగానీ,—— ఛీ! మన పుణ్యభూమిలో, హిందూ పవిత్ర సంసారాల్లో అటువంటి పరిస్థితులు వ్యాపించాయా, యిక పాతివ్రత్యమే నశిస్తుంది.

పిల్లలు గుంపులుగా వచ్చారు.

పిల్లలు:

లలితా! లలితా! యిక్కడ ఉన్నారా! యీ చివరరాత్రి అయినా మా అందరితో గడపకూడదా అమ్మా!

అల్లరి, నవ్వులు, ఆటలు.

♦ ♦ ♦

మధ్యాహ్నం. తోటలో చెట్లక్రింద బల్లలముందు స్కూలుపిల్లలు "టీ" తీసుకుంటూ ఉన్నారు. రేడియో సంగీతం! లలిత ఒక్కొక్కరి దగ్గరకే వెళ్ళి శలవు తీసుకుంటోంది. తోటలో ఒకమూల ప్రిన్సిపాలు మాట్లాడుతోంది.

ప్రిన్సిపాలు:

లలిత వెళ్ళిపోతే మన మధ్యనించి, సగం సంతోషం, ఉత్సాహం, వెళ్ళిపోయినట్టుంటుంది. కాని యీవిద్యాలయంలో యిన్నేళ్ళు శిక్షణ పొందినందుకు ప్రతిఫలంగా యీ సంస్కారం, లోకానికి మీరందరు నలుదిక్కులా ప్రతి సంసారం లోనూ వ్యాపింప జేస్తారని గదా మా ఆశయం! సీత, చంద్రమతి, సావిత్రి మొదలైన సాధ్వీమణులకు ప్రసిద్ధికెక్కిన యీ పురాతన దేశం యీనాడు సమస్తవిధాల అధోగతికి దిగిపోయింది. మనదేశానికి పూర్వౌన్నత్యం తీసుకురావడానికి ప్రతి విద్యావతి అయిన స్త్రీ నడుం కట్టుకోవాలి. తమ శీలం చేత, పాతివ్రత్య మహిమచేత, రాముల్ని, హరిశ్చంద్రుల్ని, సత్యవంతుల్నీ, శివాజీల్ని, రాణా ప్రతాపుల్ని సృజించాలి. మహావీరులు, స్వార్థత్యాగులు, దేశోపకార పారీణులైన పిల్లల్ని కనే వీరమాతలు కావాలి. నాకు మొదటినుంచి లలితమీద అపరమితమైన ఆశవుంది లలితమూలాన యీ విద్యాలయానికీ, యీ దేశానికి మహోన్నతమైన కీర్తి వస్తుందని నా గట్టి నమ్మకం. తనపిల్లల్ని యీ విద్యాలయానికి లలిత పంపగా చూడడానికి ఉంటానో లేనో నేను. మన మందరము ఆమెకు మనఃపూర్వకమైన వీడుకోలు ఇచ్చి పంపుతున్నాము (cheers).

లలిత ప్రిన్సిపాలు పాదాలమీద వాలింది. సామానులు బయటకారులో పెట్టారు. లలిత కారుఎక్కి వెళ్ళిపోతున్నది. లలిత దిగులుగా ఉంది.

  

లలిత రైల్లో సెకండుక్లాసులో ఎక్కింది. లలిత దిగులుగా, ఊరు దూరమవుతూంటే చూస్తూంది........రైలు ఒకస్టేషన్‌లో ఆగింది. ఎదురుగా రెండో పట్టాలమీద యింకోరైలు వచ్చింది. లలితపెట్టెకి ఎదురుగా ఇంటరుక్లాసు పెట్టెలో రమణ కూర్చున్నాడు. అతని పక్కన పోలీసులు.

రమణ లలితను చూడగానే తనసంగతే మరచి గబాలున బయటు దూకాడు. పోలీసులు వెనక్కి మర్యాదగా పిలిచి కూర్చోపెట్టారు. అక్కడినుంచే "లలితా! లలితా!" అని కేకవేశాడు. లలిత గుర్తుపట్టి తనపెట్టె దిగి అతని దగ్గరకు వెళ్ళింది.

లలిత:

ఇదేమిటి?

రమణ:

ఇదీ—దేశసేవలో అలసిపోయినానని యీ మిత్రులు విశ్రాంతికై నన్ను తీసుకొని వెడుతున్నారు.

పోలీసులు నవ్వుతారు.

లలిత:

నువ్వూనా? రమణా! నా చిన్నప్పటి మిత్రుడికి నీకింత గౌరవం కలిగిందని నాకెంత గర్వంగా ఉందనుకున్నావు? ఎంత కాలం?

రమణ:

రెండేళ్ళు.

లలిత:

రెండేళ్ళే?

రమణ:

నువ్వెక్కడికి?

లలిత:

ఇంటికి.

రమణ:

తర్వాత? (రైలుకూసింది. లలిత దిగుతోంది)

లలిత:

తర్వాత నాన్నగారికి తెలియాలి.

రమణారావు ఏదో చెప్పబోతున్నాడు. రైలు కదిలింది. రమణ ప్రయత్నించి కష్టంగా "నన్ను మరచిపోకు" అన్నాడు. ఆ మాటలు లలితకు వినబడలేదు. ఇద్దరూ ఒకరి నొకరు వీలయినంత దాకా చూచుకుంటారు. విధి కన్నీరు వదిలింది.

  

అపల్లెటూరుకంతా చెంచురామయ్యగారి భవనం పెద్దది జమీందారుగారి మేడతప్ప. ఉదయం మేడమీదగది. దుర్గమ్మ, లలితా.

దుర్గమ్మ:

ఇదేం పిల్ల! పెళ్ళి వద్దంటుంది. అందులో లక్షణమైన సంబంధం.

లలిత:

సంబంధం మంచిదేలే, నా కసలు—

అన్నం దగ్గరా నిద్దర్లోనూ నీ సంగతే. చివరకు జైలుకెళ్ళేప్పుడు కూడా నీ సంగతే. (దుర్గమ్మ పిలుస్తుంది)

దుర్గమ్మ:

అమ్మాయీ ! పట్నం నుంచి చీరెలొచ్చాయి.

లలితా, సీతాయమ్మగారు వెళుతున్నారు. మేడమీద బంగీలు విప్పి కొత్తచీరెలు, నగలూ చూస్తున్నారు, చెంచురామయ్య, దుర్గమ్మ బంధువులూ.

దుర్గమ్మ:

యిది అప్పగింతలపీట మీదికి.

చెంచురామయ్య చంద్రహారం లలిత మెడకిపెట్టి అందం చూస్తున్నాడు. సీతాయమ్మను అందరూ అనహ్యించు కుంటారు. లలిత వాటినిచూచి చాలా ఆనందిస్తున్నది.

సుందరి:

లలితా! లలితా! యీ రవ్వలడ్డిగె చూడు. ఎంత అదృష్టమే నీకు!

లలిత వాటినిచూచి చాలా ఆనందిస్తూంది.
పాడుతూ సీనయ్యగారు వస్తున్నారు.

సుందరి:

నాకీ చీర పెడ్తారూ? ఇంకేం అక్కర్లేదు. లలితా! ఇది ముహూర్తమునాటి జున మీఆయనకి. యీ చిలకలు చూడవే అంచుమీద.

లలిత సీనయ్యగారి పాటవిని తలుపువేపు చూస్తున్నది.

దుర్గమ్మ:

జ్ఞాపకంలేదూ! ఆ సీనయ్యే. యిట్లాచూడు. యీ జాకెట్టు—

లలిత దృష్టి అక్కడ లేదు. సీనయ్య వచ్చాడు.
లలిత ఒక్క గంతేసి ఆయనమీదికి పోయింది.

సీనయ్య:

నా అమ్మో! మా తల్లే! మా బంగారుబొమ్మో! యేదీ! యేదీ! చూడనీ యీ పాపిష్టికళ్ళు పావనం కానీ! పార్వతీదేవి మాతల్లి రూపాన సాక్షాత్కరించింది, యీ వూరికి దేవతలాగు.

లలిత చాలా సంతోషం కనబరుస్తున్నది.

లలిత:

ఇంకా పటికబెల్లం ముక్కలు పంచిపెడుతున్నావా? యేవీ? చూడనీ! యేదీ నీ ప్రపంచ? (సీనయ్య నవ్వుతాడు) నాతో చెమ్మచెక్క ఆడుతావా? రా!

సీనయ్య:

యిన్నాళ్ళెక్కడ వుందమ్మా ఆ వోపిక! నీ పెళ్ళి నా కళ్ళతో చూస్తాననుకో లేదు.

అంగడిలోంచి బట్టలూ నగలూ తీసుకొని అందరూ వెళ్ళిపోతున్నారు.

లలిత:

నాకు పెళ్ళి చేసుకోవాలని లేదు.

సీనయ్య:

(నవ్వుతో) చేసుకోక దొరసానులు మల్లె జుట్టు కత్తిరించు కోనా—

లలిత:

దేశసేవ చెయ్యాలనుకుంటే—

సీనయ్య:

దేశవీరులిన్ని కనమని దీవిస్తున్నా. హిందూమాత వున

రుద్ధారకులిన్ని. నలుగురు వివేకానందస్వాములిన్ని కను. వీరమాతవు కావాలి తల్లీ నువ్వు.

లలిత:

అట్లాంటి పిల్లలున్ను కని పెంచగల తల్లులిన్ని వెయ్యిమందిని తయారు చేస్తాను.

సీనయ్య:

హిందూ సాంప్రదాయకి విరుద్ధమున్నూ అది.

లలిత:

సాంప్రదాయాలకి నా జీవితాన్ని బలి ఇవ్వనా?

సీనయ్య:

బలి ఇవ్వడమేమిటి? ఎవరు చెప్పారు? పిచ్చిమాటలు. అందులో గొప్ప భూస్వామి. దేశభక్తుని భార్యవు కాబో తుంటివి.

లలిత:

ఆయనెన్నరుగుదువా?

సీనయ్య:

నేనే మెరుగుదును? ఆయన ఐశ్వర్యానికీ నా బీద భక్తికి కుదరదు.

సుందరి:

దర్జీవాడు వచ్చాడు. రమ్మంటున్నారు నాన్నగారు.

వెళ్ళుతున్నారు.

లలిత కాలువిరిగిన పిట్టలకి తిండిపెడుతూ ఉన్నది. చుటూ వూరి బీదపిల్లలు, బంధువులు, పెద్దవాళ్లు, పిల్లలూ వచ్చారు.

1 బంధువు:

లలితా! నేను జ్ఞాపకం లేనుటే? మీ అమ్మకి పినతల్లి మేనల్లుడి భార్యని. వీళ్ళు నా పిల్లలు. దిక్కు లేనివాళ్ళని చేసి వీళ్ళ నాన్న బైరాగుల్లో కలిసిపోయినాడుగా!

1 పిల్లవాడు:

ఇదేమిటి? పాముపిల్ల—ఇదెందుకూ నీకు?

2 పిల్లవాడు:

(గదిలో పెద్దబొమ్మను తీసుకొచ్చి) పిన్నీ? పిన్నీ! ఇది నా కియ్యవూ?

3 పిల్లవాడు:

అత్తయ్యా! యీ జాకెట్టు నేను వేసుకోవద్దూ?

1 బంధువు:

మా లలిత మళ్ళీ యిట్లా లక్ష్మీదేవి అవతరించింది. నీతోనే వుంటానమ్మా!

1 పిల్లవాడు:

ముసలిదాసివి నువ్వెందుకు? అక్క నన్ను తీసుకెళ్తుంది.

1 బంధువు:

నువ్వా రా!

ఇంకో బంధువు:

నన్ను నీ చేతులతోనే సాగనంపమ్మా! నీకంటే, దగ్గరివాళ్ళెవరూ!

1 బంధువుపిల్ల:

నేనూ అక్కతోనే వుంటాను. అమ్మా! నువ్వుపో! నేను రాను.

పరాక బంధువుల పిల్ల:

పిన్నీ! పిన్నీ! నన్ను తోడ పెళ్ళికూతురు చేసుకో. నేను ఎంచక్కా—

లలిత పేదపిల్లలకు బిస్కట్లు, మిఠాయిలు పంచుతుంది.

1 బంధువుల పిల్ల:

వాళ్ళకెందుకు అక్కయ్యా! అవన్నీని.

2 బంధువుల పిల్ల:

అయ్యో! ఎంతసామాగ్రి తగలేస్తుందో, దీనికి పిచ్చికాదు గదా!

3 బంధువుల పిల్ల:

పొమ్మను! మురికి వెధవలు వాళ్లు. పొండి, పొండి!

బంధువుల విధవ:

వాళ్ళేమన్నా నీకు చుట్టాలా? పక్కాలా? వాళ్ళకిస్తా వేమిటి? మా లక్ష్మడికిచ్చినా కడుపునిండా తింటుంది.

బంధువులపిల్ల:

మాకిస్తే చేదా? (దుర్గమ్మ వచ్చింది.)

దుర్గమ్మ:

ఇదేమిటి? యింకా యిట్లానే వున్నావు? సుందరీ! వీళ్ళంతా యేమిటి? పొండి, పొండి!

లలితను గదిలోకి లాక్కెళ్ళింది. సుందరివచ్చింది.

దుర్గమ్మ:

పూలేవే?

సుందరి పూలకోసం పరిగెత్తింది.

దుర్గమ్మ:

(లలితతో) యిదేం ముడి; గేగినట్టు జుట్లా వేసుకోడం? ఎక్కడ నేర్చుకున్నావు? మరీ వేషాలు. ఎవరన్నా చూస్తే యీ పిల్లకి జుట్టు దువ్వేవాళ్ళే లేరనుకుంటారు. (జుట్టువిప్పు తుంది.)

సుందరి పూలు తెచ్చింది. దూరాన మేళాలచప్పుడు.
సుందరి కిటికీ వద్దకు పరుగెత్తింది.

దుర్గమ్మ:

సుందరీ! నువ్వు లలితకు ముడి వెయ్యి, నేను కిందికి వెళ్లాలి.

దుర్గమ్మ వెళ్ళింది. సుందరి ముడిసంగతి చూడదు. కిటికీలోంచి చూస్తుంది.

సుందరి:

వస్తున్నారు! వస్తున్నారు! లలితా రా! రా!

లలిత కదలదు. సుందరివచ్చి కొంచెంగా సిగ్గుపడే లలితను కిటికీ దగ్గరకు లాక్కు పోతుంది.

సుందరి:

రా! సిగ్గుపడకు. యిక్కణ్ణించి కనపడతారు. ఆ బాజాల్లు, కుక్కలు, గుర్రాలు, జవాన్లు అదుగో చూడు! అటువేపు ఎవరో చెప్పుకో! తెలీదా! నీ హృదయమే చెప్పాలి నీకు. చెప్పనా? అటువేపు ఆ నీలంకోటు... చూస్తున్నాడా? ఏం? మాట్లాడు.

లలిత:

కాదు. వేళాకోళం చేస్తున్నావు.

సుందరి:

యేమమ్మా! సంగనాచితనం యేం అందంగా లేడా? పడెయ్యి మీద, ఆ పువ్వు పడెయ్యి.

సుందరే ఆ పువ్వు పడేసింది. లలిత పరధ్యాన్నంతో కదల్లేదు. సుందరి చప్పున లోపలికి వచ్చింది. మీద పువ్వుపడి మోటారులో నుంచి రామారావు తలెత్తి లలితను చూచి చిరునవ్వుతో అంగీకరిస్తాడు. లలిత అతనివంకే చూట్టంలేదు.

సుందరి:

యీ పాటికి రా! చాల్లే. (లలిత వచ్చింది)

సుందరి:

వచ్చాచ్చడా?

లలిత:

యేమో! యేం తెలుస్తుంది?

సుందరి:

ఎంత సరసుడనుకున్నావు! ఎప్పుడూ పికార్లూ, స్నేహితులూ వేట. పట్టణంలోనే ఏటికి పదినెల్లు కాపరం. ఒకరిద్దరు వున్నారనుకో (ఆడవాళ్ళని సూచన) ఒక లేడీ లెక్చరర్, ఒక భోగంది. (లలిత తెల్లబోయి చూస్తుంది) ఇంక అందర్నీ వదిలి వేస్తాడులే! ఏం అదృష్టమే! గుఱ్ఱాలూ, మోటార్లు, సినీమాలు. నీకేమే.

సుందరి జుట్టు ముడివేస్తుంది. సీతాయమ్మ వచ్చింది. లలిత "రండి రండి" అన్నదిగాని ఆలోచనలోనే వున్నది. సుందరి లోపలికి వెళ్ళింది. లలిత చప్పున ఆమెవైపు తిరిగి——

లలిత:

ఒక్క సంగతి చెప్పరూ! ప్రేమంటారే భర్తమీద ఏమిటది? పెళ్ళి చేసుకోకముందు ప్రేమ కగాలా?

దుర్గమ్మ వచ్చింది.

సీతాయమ్మ:

(ఆలోచిస్తూ) ఎంత ప్రశ్న! ముందో వెనకో ప్రేమకలగాలి. ప్రేమలేని వివాహమంత నరకం ఇంక లేదు. ప్రేమ ఉంటే అంత స్వర్గమూ లేదు.

లలిత:

ప్రేమ కలిగిందో లేదో ఎట్లా తెలుస్తుంది?

సీతాయమ్మ:

తెలీదా? వెయ్యిసూర్యుళ్ళు ఒక్కసారి వెలిగితే ఎట్లావుంటుంది కళ్ళకి? యీ కనపడే ప్రపంచంలో వస్తువులన్నిటిమీదా యీ మామూలు పాతదనంపోయి అన్నీ అద్భుతంగా తేజరిల్లుతూ వుంటే; ప్రతిపనికీ, ఆలోచనకీ, జీవించడానికే గొప్ప ఆనందమయమైన అర్థం గలిగితే యెట్లా ఉంటుంది?

లలిత:

(ఆలోచిస్తూ) నాకట్లా లేదు.

సీతాయమ్మ:

అతన్ని యెరగవు కదా? చూడనేలేదు కద యింకా!

సుందరి పరిగెత్తుకుంటూ వచ్చింది.

సుందరి:

యింకా రావేమిటి? కాచుకుని కూచున్నారు.

పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు ఎదురుగా కూచుని
చూ చు కుం టు న్నా రు. చుట్టూ పెద్దలు.
లలిత;— పూజచేస్తుంది. పాట.

చాలాసేపు పార్వతికేసి చూస్తుంది; ప్రశ్నలు అడుగుతున్నట్టు. అడా
విడిగా పనులు చేయిస్తూ దుర్గమ్మ ఉట్లా వె ళ్ళు తో ం ది.

లలిత:

అత్తా! మాట.

దుర్గమ్మ ఆగింది.

దుర్గమ్మ:

యేమిటి? అట్లా వున్నావు. నీకేం జబ్బులే; ఇంత సన్నాహం చేసిం తర్వాత కొంపముంచి పెళ్ళిని ఆపించవుకద!

లలిత:

ఆపించగలగడం చేతనైతే బాగుండును. (కంఠం మార్చి) అత్తా, నాకో సందేహం పట్టుకుంది—ఆయున-

లలిత రహస్యంగా మాట్టాడింది. దుర్గమ్మ నవ్వుతోంది.

దుర్గమ్మ:

అయితే?

లలిత:

నిజమేనా?

దుర్గమ్మ:

వుత్త అబద్ధాలు.

లలిత:

కాదులే.

దుర్గమ్మ:

నిజమైతే మాత్రం? లేకపోతే పాతికేళ్ల మొగాడు, అతనికేం లోటు? డబ్బా - అందమా? నీకోసం జపంచేస్తూ కాచుకుని కూచున్నాడు అనుకున్నావా? అయినా చిన్నపిల్లవి నీకీ విషయాలన్నీ ఎందుకు?

లలిత కష్టపడుతోంది మాట్లాడానికి.

లలిత:

మరి నేనేకదా బతుకంతా సంసారం చేయవలసింది! నాకు కాదా? ...... మరి వాళ్ళుంటే ఆయనకి నేనెందుకు?

దుర్గమ్మ:

పెళ్ళి అయిన తర్వాత ఇంకా వుంటారనుకున్నావా యేమిటి వాళ్లు?

లలిత:

నామూలాన వాళ్ళని వదిలేస్తే పాపం వాళ్ళు [illegible]?

దుర్గమ్మ:

నాకు చాతకాదమ్మా జవాబులు చెప్పడం. మహారాజు-ఆయనకేం.

లలిత:

నామీద ప్రేమవుందా ఆయనకి?

దుర్గమ్మ:

ప్రేమా? అప్పుడే! ఓహో? ఎంత తహతహ పడుతోందే పిల్ల! మా చిన్నతనంలో ఎరగమమ్మా యిట్లాంటివి. ప్రేమా?

ఉండు! రాత్రి గదిలో కావలసినంత ప్రేమ చూద్దువుగానిగా!
తినబోతూ కూరరుచి అడుగుతా వెందుకు?

లలిత హడిలిపోయి, కుంగిపోయి వెళ్ళి
పోతుంది, వెనక దుర్గమ్మ మాట్లాడుతుంది.

బుగ్గలనిండా ప్రేమ, పక్కనిండా ప్రేమ, కంటినిండా ప్రేమ·

♦ ♦ ♦

జైలులో పేపరు చూస్తున్నాడు రమణారావు,
లలిత పెండ్లి అనేసంగతి— బాధపడతాడు.

తోటిఖైదీ:

ఏమిటి బాధ రమణా!

రమణ:

ఏం లేదు. చాలా స్వల్పవిషయం. లోకంలోకల్లా సుకుమారమైన పుష్పాన్ని కోసి బురదలో పార్లేసి పందిమెళ్ళో కడుతున్నారు. చాలా స్వల్ప విషయం. యీ ఖైదులో నుంచి నేనేమీ చెయ్యలేను. (బాధపడతాడు.)

♦ ♦ ♦

సీనయ్య గుడిసె. చెట్లపాదులు తవ్వు
తున్నాడు. లలిత నుంచుని మాట్లాడుతుంది.

లలిత:

శ్రీరాముడు సత్యవంతుడు. ఉత్తమ పురుషులు గనుక చూడగానే ప్రేమకలిగింది భార్యలకి. కాని నాకు—

సీనయ్య:

ప్రేమ మన హృదయంలో వుంది. భర్త యెట్లాంటి వాడైతేనేం

లలిత:

ఏదో మీరు మాట్లాడితే మీ ఆత్మౌన్నత్యంలో విశ్వాసం వల్ల నమ్మాలనిపిస్తుంది. నాకేం తెలుసు, మీరు అనుభవం కలవారు.

సీనయ్య:

అంతకన్నా నీ మీద ప్రేమకలవారం. నీ పురోభివృద్ధిని కోరేవాళ్లం. నీమీద గంపెడాశ పెట్టుకున్నవాళ్ళం. వూరికే యీ పిచ్చి ఆలోచనలతో నీ మనసు కలత పరచుకోకు.

లలిత:

నేను వెళ్ళి వస్తాను.

సీనయ్య:

మంచిది.

లలిత మోటారెక్కబోతూంది. సీనయ్య వెనక, పనిచేస్తున్న శోభనాద్రి బైటికి వచ్చాడు.

శోభనాద్రి:

(లలితతో) నన్ను మరిచి పోయినట్టున్నారు. రవణ స్నేహితుణ్ణి.

లలిత:

ఓ!

శోభనాద్రి:

ఈ పెళ్ళికి వప్పుకోకండి.

లలిత:

(అనుమానంతో) ఎందుకు?

శోభనాద్రి:

తెలిస్తే నన్ను సరికేస్తారు. నప్పుకున్నారా యావజ్జీవము బాధపడతాను.

లలిత ధనగర్వంతో stiffen అవుతుంది.

లలిత:

నా సంగతి నేను చూచుకోగలను.

మోటారు బైలుదేరుతుంది.

శోభనాద్రి:

అదిగాక రవణకి మీామీాద——

మోటారు వెళ్ళిపోయింది——విధి పకాపకా నవ్వింది.

  

రాత్రి కొత్త పందిరి. దీపాలు. చెంచురామయ్య గర్వంగా నుంచుని చూస్తున్నాడు. లలిత ఇంట్లోనుంచి నిద్రపట్టక మెల్లిగా వచ్చింది.

చెంచురామయ్య:

ఏం? ఇంకా నిద్రపోలేదు?

లలిత:

నాన్నా నాకీ పెళ్ళివద్దు.

చెంచురామయ్య:

(హాస్యంగా) ఊ! ఇంకేం వద్దు?

లలిత:

అసలు నాకు పెళ్ళివద్దు. అదిగాక నాకు యీాయన మీాద ప్రేమలేదు.

చెంచురామయ్య:

ప్రేమ? ప్రేమేమిటి? అప్పుడే యేం ప్రేమ?

లలిత:

నాకేదో ఏమిటో భయంగా ఉంది. [illegible]

వెంచురామయ్య:

ఉండి తీరా యిప్పుడా? ఇంతవరకు ఖర్చు చేసి—ఇదంతా ఎవరి కోసమా? నేనా మొగుణ్ణి కట్టుకునేది? నవ్వుతూంది — ఇంత కట్నం ధారపోసి చేసి, ఎంతో గొప్పవాళ్ళ పట్టుపట్టి గొప్ప సంబంధం సంపాదిస్తే — బాగుంది — బాగుంది——

కోపం చూపుతున్నాడు. లలిత ఏడుస్తుంది.
వెంచురామయ్య చప్పున కరిగిపోయినాడు.

వెంచరామయ్య:

(బుజ్జగిస్తూ) పెద్దవాళ్ళని మమ్మల్నిద్దర్నీ అవమానిస్తావా? పుస్తకాల్లో యీ వెర్రి పిచ్చి విషయాలు చదివి బాధపడుతున్నావు. వక్కత్తైనే నాకు. నీకు హాని కలిగించే పని ఏమన్నా నేను చేస్తానా? వెర్రిపిల్లా! నామీద అంతమాత్రం విశ్వాసం లేదా? అమ్మనాన్న కాదూ? నీకేం తెలుసు. చిన్నదానివి. నీ కోసం కాకపోతే ఇదంతా నేను కట్టుకుపోతానా! పదమ్మా! పో; దిగులుపడకు.

మాట్లాడలేక లలిత మెల్లిగా వెళ్ళిపోతుంది.

◆ ◆ ◆

పెళ్ళి సీనులు, వాయిద్యాలు—హడావిడి.
లలిత అన్ని సందేహాలు మరిచి సంతోషంగా తిరుగుతోంది
పిల్లలకీ, గొప్పవారికీ, భోజనాలు—మధ్య లలిత నక్కతే.

లలిత:

ఎవరు చెప్తారు? నా కెట్లా తెలుస్తుంది? [illegible] ఏమిటి?

◆ ◆ ◆

రాత్రి పదకొండుగంటలు. మేడమీద అలంకరించిన శోభనపుగది. ముందుహాలులో నించి తలుపు. ఎదురుగా బాల్కనీకి తలుపు. రామారావు, స్నేహితులు గదిముందునుంచున్నారు హాయిగా.

రామారావు:

ఇంకా రాదేంరా?

ప్రకాశం:

వస్తుంది? మీనాక్షీ అనుకున్నావా యేమిటి? అడగం దేవచ్చి తొడమీద కూలబడేందుకు?

సోమశేఖరం:

నువ్వు దాన్ని తొడమీద ఎట్లా భరిస్తావో గాని నాకు భయమేసేది తొడ విరుగుతుందని.

ప్రకాశం:

పెళ్ళాలు వుత్త పింగాణీ బొమ్మలు. లాభం లేదురా! కాని యెట్లాగైనా మొదటిరాత్రి మొదటి రాత్రేననుకో.

లలితా దుర్గమ్మా మెట్లమీదనుంచి వస్తున్నారు. స్నేహితులు పరుగెత్తుకు పోయినారు. రామారావు గదిలోకి వెళ్ళి pose పెట్టి కూర్చున్నాడు. దుర్గమ్మ లలితను గుమ్మందగ్గిర ప్రేమగా వదిలి తలుపువేసి వెళ్ళిపోతుంది. లలిత సిగ్గుపడుతూ నుంచుంది.

రామారావు:

(మర్యాదగా) Sit down please.

ఆమెను పరీక్షిస్తూ ఎగాదిగా చూస్తున్నాడు. ఆమె చాలా ఇబ్బంది పడుతోంది. మెల్లిగా కిటికీదగ్గరకు వెళ్ళి బయటికి చూస్తూంది. రామారావు వెనకాతె వెళ్ళి దగ్గరగా నుంచున్నాడు. ఆమె కొంచెం దూరంగా జరిగింది.

నడుముమీద చెయివేశాడు. తీసివేసింది. మళ్ళా వేశాడు. మళ్ళీ తీసివేసింది. మళ్ళీ వేశాడు. గట్టిగా తీసివేసి దూరంగా వెళ్ళింది.

రామారావు:

ఆదేమిటే? ఓహో! కొంచెం బెట్టు ఎక్కువే?

బుజ్జగిస్తున్నాడు, నవ్వుతున్నాడు.

మాటలు లేకుండా అతను బుజ్జగించబోవడం, ఆమె నెమ్మదిగా తప్పించుకోవడం, చేతులు తీసేయ్యడం.

లలిత:

వద్దు.

రామారావు:

ఏమి?                                                            (లలిత మాట్లాడదు)

రామారావు:

ఏం సంగతి?

ఆమెకే తెలియదు. అతనికి విసుగుపుట్టి మోట సరసం ప్రారంభిస్తాడు. లలిత కోపంతో లేచి, విడిపించుకుని, అసహ్యించుకుని దూరంగా పోతుంది.

రామారావు:

చాలా కొత్తరకమే. మరీ అంతబెదురేం? చాల్లే- ఇకరా—

చేయి పట్టుకుని లాగుతున్నాడు.

వకటిరెండు సాగులు ముద్దు. ఆదేపనా?

నెమ్మదిగా వచ్చింది. పక్కమీద కూచోపెట్టి కౌగిలించుకున్నాడు. చివాలునలేచి దూరంగా పోయింది.

రామారావు:

ఏమిటిది? మాట్లాడు.

లలిత:

నాకు బాగుండదు తాకితే.

రామారావు:

బాగుండదూ? (నవ్వుతున్నాడు) పిచ్చిపిల్లా! ఏమిటా భయం! చూడు బాగుంటుందో లేదో! (దగ్గరకు వస్తున్నాడు)

లలిత:

అయితే నేను వెళ్ళిపోతాను.

రామారావు:

ఎక్కడికి వెడతావు? ఎన్నాళ్ళు వెడతావు?

నవ్వుతున్నాడు. లలిత భయంతో ఆలోచించుకుంటుంది.

రామారావు:

రా! దీపం తగ్గించనా? పడుకుందాం రా!

లలిత కదల్లేదు. దీపం తగ్గించాడు. గది చీకటవుతుంది. ఆమెను అతను పక్కదగ్గిరకు బలవంతంగా లాకెళ్ళడం వినపడుతోంది.

  

జైలులో రవణ. అతని cell లోకి వెన్నెల పడుతోంది. పేపరులో పడ్డ లలితబొమ్మ వంక చూస్తున్నాడు దిగులుగా.

  

లలిత పక్కమీదనుంచి చివాలున లేచి దీపం పెద్దది చేసింది. ఆమె జుట్టూ బట్టలూ అద్దంముందు సర్దుకుంటుంది, మంచానికి పక్కగా రామారావు నుంచుని వున్నాడు.

లలిత:

రావద్దు. నేను కిందికన్నా దూకుతానుగాని——

రామారావు:

ఆగు! ఆగు! లోపలికిరా అక్కణ్ణించి.

లలిత:

మీ రక్కడే నుంచోండి. (రామారావు వెనక్కి వెళ్ళాడు)

రామారావు:

యీ రాత్రికేనా? యెప్పుడూ యిట్లా విడిగా వుండ దలుచుకున్నావా?

లలిత:

(కష్టంగా) ఏమో తెలీదు. నాకు మిమ్మల్ని చూస్తే ఇష్టంగా లేదు.

రామారావు:

యిష్టంలేదూ. ఇదేం పెళ్ళి? ఇదేం రాత్రి?

కష్టపడుతున్నాడు. లలితకు జాలివేసింది.

రామారావు:

నేనేం చేశాను? నేనే మంత అసహ్యంగా ఉన్నానా?

లలిత:

కాదు—అట్లా తొందరపడకండి. మాట్లాడదాం.

రామారావు:

తెల్లార్లూనా?

లలిత:

(జాలిగా) పాడతాను.

రామారావు :

వృత్తిపాడినా? పురాణంకూడా వినిపిస్తావా? అయితే ఇంకేంచేయను నామీద అంత యిష్టంలేకపోతే నీకు? వేరే పెళ్ళి చేసుకుంటానా.

లలిత చాలా సంతోషం, ఆశ వినబడుతుంది. రామారావు disappoint అయినాడు. కోపం వచ్చింది.

రామారావు :

నేను నీకు బాగుండలేదా? నా మొహానికి. ఎక్కడికి పోతావు? (కౌగలించుకున్నాడు)

లలిత :

వదలండి! అరుస్తాను. గోలచేస్తాను. నన్ను తాకకండి!

రామారావు :

(రామారావు లలితను పక్కతోత్రోసి) యేమిటి! నా కర్మం. యేమనాలి యేమి!

మాట్లాడకుండా పడుకున్నాడు. లలిత సోఫామీద దిండు తీసుకుని, బాల్కనీలోకి పోయి, అటువేపు గోడ్యాం పెట్టుకుని పడుకుంది. అవమానపడ్డ తన వంటిపంక చూసుకుని, నిర్మలమైన చంద్రుడి వంక చూచి బాధ పడుతుంది. చాలాసేపు .... .... ...

  

మర్నాడు సాయంత్రం. సుందరి లలితకు జడ వేస్తుంది. లలిత పరధ్యానంతో పాడుకుంటోంది ఓగుబాగా. సుందరి మాటికే పలకరించి distrub చేస్తుంది. ....

సుందరి:

ఏం చేశాడు? చెప్పవూ నాతో. గదిలోకి వెళ్ళి నుంచు న్నావు. తర్వాత; అతను-

లలిత:

అబ్బ! ఊండూ! (పాడుకుంటోంది)

సుందరి:

ఇంక మాతో మాట్లాడతావా అమ్మా! అప్పుడే ఎంత గర్వమే! నీకేనుమ్మా!

దుర్గమ్మ వచ్చింది.

దుర్గమ్మ:

మీరందరూ వకసారి బైటికి వెళ్ళండి!

అందరూ వెళ్ళారు.

దుర్గమ్మ:

ఇదేమిటీ అమ్మాయీ, యీ గోలేమిటి? అయ్యో వెర్రి దానా! అంత రాద్ధాంతం చేశావుట నిన్నరాత్రి. (ఆపుకో లేక నవ్వుతోంది) యేమిటి; మరీ అంత యేడిపించటమా మనిషిని?

లలిత వూరుకుంది.

దుర్గమ్మ:

మాట్లాడవేం?

లలిత:

నా కిష్టంలేదు, ఆ గదిలోకి పోవడం.

దుర్గమ్మ మళ్ళీ నవ్వుతోంది. లలిత బాధపడుతుంది.

దుర్గమ్మ:

మంచిదానవే, వెళ్ళక!

లలిత మొహంచూచి తానూ serious గా అయింది.

యేమిటే? అసలు సంగతి చెప్పు! అతను యేమనుకున్నాడో తెలుసునా. దానికి సంసారం అంటే తెలియదన్నాడు. యెంత అప్రదిష్ట! యెవరన్నా వింటే నవ్విపోవరూ! (నవ్వు ఆపుకుంటూ కోపంగా) మాట్లాడవేం? ఎన్నడు వంటా యింటా లేని సంగతి.

లలిత:

నన్ను చంపండి! నాకు యిష్టం లేదు.

దుర్గమ్మ:

యిదేమిటే మరీ అంత సిగ్గులేని శిఖండివైనావు? కాపరం చేయవుటే నువ్వు? ఆడదానివి గావూ? మరి పెళ్ళి అంటే యేమనుకున్నావూ! మొగుడు తెల్లార్లూ రామాయణం పారాయణ చేస్తాడనుకున్నావా? ఛీ ఛీ! ఇదేంపుట్టింది? వదినా గ్రహబాధ కాదుగద!

లలిత:

యేమో నాకేం తెలీదు. నేనా గదిలోకి పోను.

దుర్గమ్మ:

ఎవడికోసం పోతావు! ఇంకా మంచివాడు గనుక వూరుకున్నాడు. రెండు తన్ని యిష్టపెడతాడు. ఊరుకుంటారా యేం? నీకు చేటుకాలం పుట్టిందే. విక్షేపంవంటి

మొగుణ్ణి తీసుకొస్తే నీకేం రోగమే! నాకు తెలీదమ్మా, మీ నాన్నగారు తీర్చవలసిందే. (వెళ్ళింది)

లలిత కిటికీలోంచి ఆకాశం చూస్తూ ఆలోచిస్తుంది. కిందనించి సంగీతం. చెంచురామయ్య అతి దూకుడుగా వచ్చాడు. లలిత యేడుస్తూ కౌగలించుకుంది. .... .... ....

లలిత:

నాన్నా! నీకూ నా మీద దయలేదా? నాకు పెళ్ళివద్దు, పెనిమిటీ వద్దు, మీతో వుణ్ణియ్యండి చాలు.

చెంచురామయ్య:

యేమిటి? చచ్చిచెడి, గడ్డితిని, చక్కని మొగుణ్ణి తీసుకొస్తే—ఇంకా నా పరువు గడ్డిపరక్కి అక్కరకి వస్తుందా? యీ పదివేలూ యెందుకు పోసినట్టూ?

లలిత:

మీ డబ్బుకోసం, మీ మర్యాదలకోసం, నన్ను నాశనం చేస్తారా?

చెంచురామయ్య:

నా మాట వింటావా? వినవా?

లలిత:

నా చాత కాదు.

విదిలించి ఆవతలికి తోశాడు.

చెంచురామయ్య:

చాతకాదా? మొగుడితో కాపరం చేయటం నాశనమా? ఇదుగో! నోరుమూసుకుని సరిగ్గా గదిలోకి నడు. అంతేకాని

పుట్టింటో కొన్ని తిని సుఖిస్తుందామని నే మెత్తగున్నాను. ఆ ఆశ వదులుకో! నాతో కాపురం చేస్తే చెయ్యి! లేకపోతే నీ గతి నువ్వు చూసుకో!

వెళ్ళిపోయినాడు. సుందరి వచ్చింది.

సుందరి:

ఏమిటిది లలితా! ఇట్లాంటి పని చేశావు?

లలిత:

సుందరి! సుందరీ! నీ కన్నా అర్థంకాలేదా? అట్లా చూస్తావేం నా వంక? నేనేదో హత్య చేసినట్లు.

సుందరి:

నువ్వు చేసినపని కన్నా అదే నయం.

లలిత:

నేను చేసిన పనా! అతనిమీద నాకిష్టం రాలేదు. నేనేం బాగుండాన్నా?

సుందరి:

ఎంత అప్రదిష్ట? యింక ముందు నీ గతేమిటి? ఎట్లా తప్పించుకో గలవు?

లలిత:

పోతాను. పారిపోతాను.

సుందరి:

ఊరుకుంటారా—లాక్కొస్తారు.

లలిత:

ప్రజలు లేరా? పోలీసులు లేరా?

సుందరి:

ప్రజలు విరగబడి నవ్వుతారు. పోలీసులు నిన్నే లాక్కుపోయి పప్పగిస్తారు.

లలిత ఆశ్చర్యంతో నమ్మలేక చూస్తోంది.

లలిత:

సుందరీ! సుందరీ! నావంక అట్లాచూడకు!

♦ ♦ ♦

సీనయ్య ఆశ్రమము. సీనయ్య తాంబూర మీటు
తుంటూ పాడుకుంటున్నాడు. లలిత వచ్చింది.

లలిత:

తాతయ్యా! మీరందరూ కలిసి యేంచేశారు నన్ను!

సీనయ్య:

(శాంతంగా) నాకు తెలుసు, అంతా విన్నాను. అతను కొంచెం తొందరపడ్డాడు. అంతకన్నా యేం లేదు.

లలిత:

నేనేం చేశాను? అందరూ పక్క నిముషంలో విరోధు లైనారు నాకు.

సీనయ్య:

లోకం వెర్రిలోకం.

లలిత:

నాన్నకూడా యింట్లోనించి పొమ్మన్నాడు. యేమైనా కానీ నన్ను చంపినా ఆగదిలో అడుగుపెట్టను. నువ్వు నన్నిక్కడ వుండనిస్తావా?

సీనయ్య:

ఇక్కడా ?

లలిత:

వద్దులే. నా గతి నేను చూచుకుంటాను.

సీనయ్య:

వుండు! విను!

లలిత :

నా గతి యింతే? నా కెవ్వరూ తోడు లేరూ! నువ్వూ వాళ్ళతో చేరిపోయినావా? లోకంలో నా కెవ్వరూ-వక్కరూ నా వేపు పలకరూ?

సీనయ్య:

నేనెవరూ? నేమెవరం? అతను నీ భర్త. చిన్నటినుంచి అతనే తల్లి, తండ్రి, దైవం. మీ రిద్దరూ వకటి. మే మెవరం?

లలిత:

నమ్మించి బోనులోకి పంపి, తలుపు బిగించి, నవ్వుతున్నారా?

సీనయ్య:

నీ బాధ నాకు తెలుసు - వోర్చుకోవాలి.

లలిత:

నీ కేం? చెపుతావు. నువ్వోళ్లు తెలుస్తుంది.

సీనయ్య:

భర్తని వదలమని యెట్లా చెప్పనూ? వచ్చే కష్టాలు నీకు తెలీవు.

లలిత:

యే కష్టాలు రానీ, నేనేమైనా కానీ, ప్రాణత్యాగమే కానీ, నేను...

వెళ్ళుతోంది.

సీనయ్య:

వుండు! వుండు! నీ ధర్మానికి నువ్వు తిరగబడడం అవివేకం, హిందూధర్మం—

లలిత:

యేం ధర్మం? యేమిటమది, నన్ను బోగందానికన్నా హీనురాలిని చేసే ధర్మం, నా స్త్రీత్వాన్ని శీలాన్ని, మలినం చేసుకోమనే శాస్త్రం నేనువప్పుకోను. నేను తిరగబడతాను. శపించండి! దండించండి! ఆడదాన్ని, దిక్కులేని దాన్ని, ధనమూ, శక్తి, లేని అనాధని, నాశనం చెయ్యండి అందరూ కలిసి. వీధులంబడి అడుక్కుతిని చస్తానుకాని, యీ అసహ్యానికి, రోతకీ వప్పుకోను.

వెళ్ళుతూంది.

సీనయ్య:

ఆగు! ఆగు! (ఆలోచిస్తున్నాడు) నేను అతనితో మాట్లాడుతాను. తర్వాత యోచిద్దాము. పద నేనూ వస్తాను.

ఇద్దరూ మోటారెక్కుతున్నారు.

చెంచురామయ్య యిల్లు, రామారావు గది.

సీనయ్య:

(కోపంగా) గొడ్డుకూడా అట్లా సంచరించవు. ఎదటివారి యిష్టం కనిపెట్టకుండా, మా లలిత హృదయాన్ని ఆకర్షించగల సౌన్నత్యం, అదృష్టం లేనివాడివి—

రామారావు:

నోరుముయ్! బైరాగివాడు నీతులు చెప్పవచ్చాడు! నా భార్య సంగతి నేను చూచుకోగలను బైటికి నడు.

సీనయ్య:

నీ భార్య నీకుదక్కదు జాగ్రత్త!

రామారావు:

ఏం చేస్తుంది?

సీనయ్య:

చస్తుంది. నా ఆశ్రమంలో దాచుకుంటాను, నా బిడ్డని ఏం చేస్తావు?

రామారావు:

దాచుకో! అంతా ఆడపిల్లలు.

సీనయ్య బాధతో వంగి ఆలోచిస్తున్నాడు.

సీనయ్య:

అవును. ఈ పుణ్యభూమిలో భార్యలు అతిచౌక. కాని యీ దరిద్ర దేశంలో, ఆస్తులు చాలా కరువు. మరి పెంచు రామలక్ష్మిగారి ఆస్తి కెట్లా దక్కుతుంది, లలితకు నగలు ఇంకేం? (వెళ్ళిపోతున్నాడు)

రామారావు:

వుండండి! నేను చేసిన తప్పేమిటి? నా కోర్కెలో అధర్మం వుందా? పైగా ఆ సిగ్గులేనిదాన్ని పెళ్ళిచేసుకొస్తున్నాను?

సీనయ్య:

లలిత అమూల్యమైనవరం నీకు. ఆమె ప్రేమనే సంపాదించగలిగావా, అంతకన్న నీకు స్వర్గం యేంగావాలి? నే నడిగేది

యేమీ లేదు, తొందరపడకు. ఆమెకి నీమీద ప్రేమ కలగడానికి వ్యవధినియ్యి! యేం?

రామారావు సరేనని తల వూపుతున్నాడు.

రామారావు:

యేం చెయ్యమంటారు నన్ను? మరి భార్య ఐనాక—

సీనయ్య:

అదంతా నాకు తెలుసు. లలితను నేను వొప్పిస్తాను మీతో వచ్చేట్టు. కాని ఆమె యిష్టపడందే మీరు మాత్రం—

రామారావు కష్టంగా సరే నంటాడు.

సీనయ్య:

వాగ్దత్తమేనా?

రామారావు:

నిజం.

(సీనయ్య, లలిత.)

సీనయ్య:

వప్పించాను. నువ్వుమాత్రం నీ మనఃపూర్వకంగా ప్రయత్నించాలి, అతన్ని ప్రేమించేందుకు.

లలిత:

వేట్లా ప్రేమించనూ?

సీనయ్య:

ఈశ్వరాంశలేని మానవుడు లేడు? వెతికి అతని ఔన్నత్యాన్ని ప్రోత్సహించి, నీ ప్రేమకి అర్హుణ్ణిగా చేసుకోలేకపోతివా, దౌర్భాగ్యురాలివౌతావు. ఈ లోపల నిన్ను బలవంతం చేయకుండా, నేను వప్పిస్తాను.

రాత్రి లలిత, రామారావు గదిలో. రామారావు మంచంమీద పడుకున్నాడు. లలిత నాల్కానీలోకి వెళ్ళి తలుపు బిగించుకుని సోఫామీద పడుకుని నిద్రపోయింది. రామారావు లేచి కిటికీలోంచి ఆమె అందము చూసి, కోపంతో దిండ్లు అవీ విసిరివేసి కోపం తీర్చుకుంటున్నాడు.



కాలం గడిచింది. కాంగ్రెసుకి, ప్రభుత్వానికి రాజీ కుదిరింది. ఖైదీ లందర్నీ వదులుతున్నారని న్యూస్‌పేపర్ల రేకలు. రాజమండ్రి జైలుదగ్గరనుంచి రమణారావుని ఊళ్ళో ఊరేగింపు. అతను యింటిదగ్గిర దిగడం, వెంటనే తల్లి కౌగలించుకుంది. అతను తొందరగా గదిలోకివెళ్ళి లలిత పటంవంక చూస్తున్నాడు. తల్లి వెనకగా వచ్చింది.

రమణ:

లలితకు పెళ్ళి అయిందికాదూ?

తల్లి:

చాలా రోజులైంది. మద్రాసులో వుంది.

రమణ:

రామారావుకి—వాడు—ఆ రామారావుకి. ఎంత విక్రుతాలు జరుగుతాయి యీ లోకంలో.

తల్లి:

ఏదో పెళ్ళి రాత్రి గొడవ జరిగిందనికూడా చెప్పుకున్నారు. కాని అందరూ చెప్పి బలవంతచేసి—పంపారట—స్నానం చేద్దుగాని రా! (వెళ్ళింది.)

రమణారావు ఫొటోవంక చూస్తో, అట్లానే చూస్తున్నాడు. చిన్నపిల్లలు, తాను, లలితా, చెట్లకింద గడ్డిమీద పడుకుని, ఆకాశమువంక చూస్తున్నారు. కాలవమీద తాటిబొందమీద ఆమె చేతిని పట్టుకుని నడిపిస్తున్నాడు. పిల్లలతో వాగుడు మాతలాడుతూ. ఆమెని వంటరిగా పట్టుకుని ముద్దుపెట్టుకుంటున్నాడు. చెట్లచివరి కొమ్మలకియెక్కి బాదంపళ్ళుకోసి ఆమెవడి నింపుతున్నాడు. అట్లతద్దెకి ఆడపిల్లలంతా ఆడుకుంటుంటే పక్కననుంచుని చూస్తున్నాడు. బైట దసరాపిల్లలు పాటలు పాడుకుంటూ పోతున్నారు. రమణకి లలితా తానూ బళ్ళోకి పిల్లంబులు పట్టుకుని వెళ్ళడం, ఆమెను చేయిపట్టుకుని బురదనుంచి తప్పించి తాను నడిపించడం కనపడుతున్నాయి. సీతాయమ్మ వచ్చి కూర్చున్నది.

సీతాయమ్మ:

అబ్బాయీ, మొన్న పాపయ్యగారు వచ్చార్రా; ఆయన పిల్లనిస్తామని. రెండువేలు కట్నమిస్తారట.

రమణారావు:

పెళ్ళిసంగతి యెత్తకు అమ్మా!

సీతాయమ్మ:

అదేమిట్రా అట్లా అంటావు ?

రమణ గదిలోంచి వెళ్ళిపోయినాడు.

  

మద్రాసులో రామారావు మేడ. పూజగది. ఉదయం లలిత పూజ చేస్తోంది. దేవీపటం పక్కన భర్తపటం. పూజనుండి లేచి పెద్ద పూలదండ తీసుకుని ముందు గదిలోకి వెళ్ళింది. అక్కడ రామారావు ఫొటో enlargement కు దండవేసి నమస్కరించింది.

ఆఫొటో కేసి చూస్తూ భర్త కోసం భక్తిని తెచ్చుకోవాలని ప్రయత్ని
స్తుంది. రామారావు వస్తాడు.

రామారావు:

నేను వుండగా ఆ పటానికి యెందుకే అలంకారం?

ఆమె అతని పాదాలకి నమస్కారం చేసింది.

రామారావు:

ఎంత అందంగా వుంది నీవిట్లా నమస్కరించడం. ఆ తీరు జన్మతో రావాలిగాని, ఆ ముందలికి వక్కదానికి చేత కాదు, ఆవోడుష్టు.

బుజ్జగిస్తున్నాడు. కష్టంతో ఓర్చుకుంటుంది.
కళ్ళముందు దేవిని నిలుపుకొని నవ్వుకుంటుంది.

రామారావు:

అట్లా నవ్వుకో! మంచిపిల్లవి.

పూజామందిరంలో దేవీ బొమ్మ నవ్వుతుంది. గదియారం మధ్యాహ్నానికి తిరిగింది. లలిత భర్తబట్టలను స్వయంగా చాటలికి వేస్తుంది. అప్పుడప్పుడు జేబులవాసనకి అసహ్యపడుతోంది. కోటు జేబులోంచి కాగితం కిందకిపడ్డది. అది యెవరో తైపో ఫోటో. కుక్క పిల్ల అల్లరి.

వంటమనిషి ఫలహారం తీసుకొచ్చాడు. Tray లో భర్తకీ, మిత్రులకీ ఫలహారాలు, టీ, అరేంజ్ చేసి పంపుతూంది.

లలిత:

ఇది ప్రత్యేకం అయ్యగారికి.

బైటగదిలో రామారావు స్నేహితులు చీట్లాడు
తున్నారు. వంటమనిషి ఫలహారాలు తీసుకొచ్చాడు.

వంటవాడు:

ఇది తమరికని చెప్పమన్నారు అమ్మగారు.

రామారావు చిరునవ్వుతో బడాయి మిత్రులతో కన్నుగీటుతున్నాడు.

◆ ◆ ◆

సాయంత్రం అయిదు అయింది. రామారావు తోచకుండా కూర్చున్నాడు. రేడియో పాడుతుంది. కామయ్య వచ్చాడు.

రామారావు:

ఏం?

కామయ్య:

దొరకలేదు.

రామారావు:

దొరకలేదంటే యెట్లా? వెళ్ళు. యీ సాయంత్రమే ఫూరికి వెళ్ళి రైతుల దగ్గరనుంచి ఎట్లాగనన్నా వసూలుచేయి. వేలాలు అమలు జరిపించి, వారంరోజుల్లో నాలుగు వేలన్నా సూరికి తేనే గాని యీ వారంటు ఆగదు.

కామయ్య:

చిత్తం. ప్రయత్నిస్తాను. కాలం యిదివరకు మల్లె కాదండి. యీ కాంగ్రెసువాళ్ళ దుర్బోధ వల్లా ప్రతివారికి నిర్లక్ష్యం యెక్కువైంది. (వెళ్ళుతున్నాడు.)

లలిత నెమ్మదిగా వచ్చింది.

లలిత:

ఎవరూ రాలేదా? నక్కరూ కూర్చున్నారు.

రామారావు:

ఎక్కడ చచ్చారో... అబ్బ! గోల! (రేడియో ఆపాడు)

లలిత:

పోనీ. నేను పాడనా?

రామారావు:

కానీ.

లలిత కృతులు పాడుతుంది, పియానో మీద వాయిస్తూ.

రామారావు:

మీనాన్నకు వ్రాసి ఆరువేలు అప్పు యిప్పించ లేవూ?

లలిత జవాబు చెప్పకుండా పాడుతుంది.

రామారావు:

ఏమి? నేనడిగిన సంగతి?

లలిత:

మొన్ననేగా రెండువేలు పంపాడు. ఇక వ్రాయమన్నా వ్రాయను.

రామారావు ఆవలిస్తున్నాడు. లలిత ఆపింది.

రామారావు:

చాల్లే క్లబ్బుకి పోతాను.

కోటు వేసుకుని మోటారులో వెళ్ళిపోయాడు. లలిత ఒంటరిగా చీకట్లో నుంచుని చూస్తూవుంది. మల్లెపిల్లి ఆమెను పలకరిస్తోంది.

♦ ♦ ♦

రాత్రి గదిలో పక్క అమర్చి లలిత బైటికి వెళ్ళబోతోంది. రామారావు వచ్చాడు. ఆమెను చూసి సంతోషపడ్డాడు.

లలిత:

అప్పుడే వచ్చారేం?

రామారావు:

ఇక్కడేం చేస్తున్నావు? పిచ్చిపిల్లా! నువ్వా యివన్నీ యింత శుభ్రంగా అమర్చేది? ప్రతి రాత్రి? వెంకయ్యకి యింత తెలివి యెట్లా వచ్చిందా అనుకుంటున్నాను. గది యింత అందంగా చేసేదానివి ఉండిపోతే సూత్రం యేం ?

ఆమెను కౌగలించుకుంటాడు. వోర్చుకుంటుంది, యింకా చనువు తీసుకుంటూవుంటే భరించలేక మెల్లిగావదిలించుకుని వెళ్ళిపోతోంది.

రామారావు:

ఇంకా యెన్నాళ్లు?

లలిత:

అదే నా ప్రయత్నంకూడా. నాకు సహాయపడండి?

రామారావు:

ఎందుకు?

లలిత:

మిమ్మల్ని ప్రేమించేందుకు.

వెళ్ళిపోయింది. అతను చిరాకుతో పెదవి కొరుక్కుంటున్నాడు. ఆమె బైటికివెళ్ళి వరండాలో చంద్రునివంక చూస్తూ విధిని ప్రశ్న అడుగుతూంటుంది. రామారావు గది కిటికీనుంచి ఆమె అందాన్ని చూచి బాధపడుతున్నాడు.

  

వీధిలో బిచ్చపు పిల్ల పాడుతూ వెళ్ళుతోంది. లలిత కబురంపి పిలిపించింది. పాటను పాడించుకుంటుంది మధ్యలో.

లక్ష్మి:

(రహస్యంగా) అమ్మా! అయ్యగారి గదిముందు వెళ్ళండి ఒక సారి.

లలిత:

ఏమి?

లక్ష్మి:

వెళ్ళండి! చెపుతా!

లలిత ఆలోచించకుండా పరధ్యానంగా వెళ్ళి తలుపుతీసింది. లోపల రామారావు సరస్వతితో సరసాలాడుతున్నాడు. లలిత తెల్లబోయి చూస్తుంది. సరస్వతి పారిపోయింది. లలితకు కోపము, అసహ్యమూ వచ్చాయి. రామారావు యికిలిస్తున్నాడు.

రామారావు:

యేదో పొద్దుపోక——

మళ్ళీ తన dignity ని తెచ్చుకున్నాడు.

రామారావు:

మరి భార్యలు భర్తల్ని వుపేక్ష చేస్తే——

లలిత:

భర్తలు భార్యల్ని వుపేక్ష చేసినప్పుడు ఇట్లాంటి పనులే చేస్తే——

రామారావు:

అప్పటి సంగతి అప్పుడు.

లలిత:

దాన్ని పంపెయ్యండి!

రామారావు:

పంపితే-నువ్వు- (చెంపను తాకాడు) నువ్వంటే నాకు వాళ్ళెందుకూ?

లలిత తనచెంపను తుడుచుకుంటూ అతన్ని వక్కతోపు తోసింది.

లలిత:

ఛీ ఛీ! నన్ను తాకవద్దు.

రామారావు:

అమ్మ పెట్టచూ పెట్టదు; అడుక్కు తిన్నియ్యనూ తిన్నియ్యదు.

లలిత:

వెళ్ళి తీరాలి.

రామారావు:

నీ దేమధికారం? నువ్వు నాకొక భార్యవికూడాను.

వెళ్ళిపోయినాడు. లలిత బైట బీదపిల్లని చూసింది.

లలిత:

పాపం! ఇంకా నుంచునే వున్నావా? పిచ్చిపిల్లా!

వెళ్ళి చెంపఊ తాకుతుంది, డబ్బు యిచ్చింది.

బీదపిల్ల:

ఇంత డబ్బు నా కెందుకమ్మగారూ?

లలిత:

మీకు పెళ్ళయిందా?

బీదపిల్ల:

ఊఁ.

లలిత:

నీ పెసిమిటి నిన్ను ప్రేమగా చూస్తాడా ?

బీదపిల్ల:

నే నెప్పుడు వస్తానా అని వీధికేసిచూస్తూ కూర్చుంటాడు. వెళతానమ్మా !

లలిత:

ఇంక వేరే పిల్లలకేసి చూడడా !

బీదపిల్ల లేనినవ్వు తెచ్చుకుంటుంది సిగ్గుతో.

బీదపిల్ల:

నేనున్నానుగా.

లలిత:

రేపు రా మళ్ళీ.

సీనయ్య వచ్చాడు.

లలిత:

వచ్చావా ! తాతయ్యా ! వచ్చావా !

సీనయ్య:

నీవట్లా రావాస్తే, రాకుండా నా ప్రాణం నిలుస్తుందా ?

ఆయనకోసం పళ్ళు తెప్పించింది.

లలిత:

కూచో ! ఏమిటి సంగతులు ? ఇంకా వూళ్ళంబడి పాటలు పాడుకుంటూ తిరుగుతున్నారా ?

సీనయ్య:

కాంగ్రెసువాళ్ళతో చేరాను.

లలిత:

నువ్వా?

సీనయ్య:

రవణా జైలునుంచివచ్చి తనతో కలుపుకున్నాడు. అతని దేశభక్తి, నా దైవభక్తి జోడించి ప్రచారం సాగించాము. సరేలే! ఇక్కడసంగతులెట్లా వున్నాయి.

లలిత:

లాభంలేదు. నా చాతకాదింక. నాకు మీరెవ్వరూ సహాయం చెయ్యనక్కర్లేదు. ఏదో నా స్వంతంగా బ్రతికేందుకు—

సీనయ్య:

వెర్రిదానా! వృత్తులన్నీ ఈ భర్తకి నువ్వేది నిరాకరించావో దాన్ని కోరే నీచులైన పురుషుల అధీనంలో ఉన్నాయి. ఒంటరిగా బ్రతికే స్త్రీకి కలిగే కష్టాలు నీకెట్లా తెలుస్తాయి? అందుకనే జ్ఞానం గలవాళ్ళం ఎంత బాధగా వున్నా, స్త్రీకి సంసారమే వుత్తమమని వాగుతాము ఇట్లా.

లలిత:

కాని నేనెంత నీచమైపోతున్నానో, నన్ను చూస్తే నాకే పరమ అసహ్యంగా వుంది. ఇది చెప్పడానికే నువ్వు—

సీనయ్య:

ముసలివాణ్ణి. నా మీద ఆగ్రహించకు.

లలిత యేడుస్తుంది.

సీనయ్య:

ఎప్పుడూ కష్టాలు వొక్కవిధంగా నిలవ్వు. ఆనందం కావాలని పోట్లాడ్డానికి యెవరికి హక్కువుంది. ఎంత చేశావో

అంత అనుభవించితీరాలి. పసుగత్తితే మాత్రం ప్రారబ్ధం తప్పుతుందా !

పాడుతున్నాడు. అతని వళ్ళో పడుకుని యేడుస్తో నిద్రపోయింది.

సీనయ్య :

పిచ్చిపిల్ల. ఎందుకో ఈశ్వరుడు యీ సుకుమారిని, యీ పద్మాన్ని యిట్లా వాళ్ళ మధ్య చితకగొట్టడం ? ఉద్దేశ మేమో !

[పల్లెటూరు]

రవణా, సీనయ్యా, శోభనాద్రీ, పల్లెటూరు పారిశుధ్యం కోసం ప్రచారం చేస్తున్నారు. వీధులువూడ్చి చూపుతారు. ఇళ్ళు బాగుచేస్తారు. బూజులు దులుపుతారు. .... .... ఒక యింట్లో గోల. కామయ్యా, మునసబూ, ఆ యింటి వాళ్ళ చెంబులూ, గేదెలూ, నాగలీ వేలానికి తీసుకు పోతున్నారు. సీనయ్య మొదలైనవాళ్లు అడ్డపడ్డారు.

కామయ్య :

మీ కెందుకయ్యా, అక్కర్లేని జోక్యం ?

శోభనాద్రి :

ఇట్లాంటి అక్రమాలు ఆపడమే మా ఉద్యోగం.

మునసబు :

మరి యీ వూరిమీద అయిదువందలు పోగు కావాలి.

రమణ :

నువ్వు రైతువి కాదూ ! నీ సోదరుడి నాగలిని వేలం వేయిస్తావా.

ప్రజలు పోగైనారు.

రమణ :

ఎవరూ ఒక్కరూ ఒక దమ్మిడీ యివ్వకండి. ఈ వొస్తువులు వేలం వేస్తే యెవరూ కొనకండి. ఈ దౌర్జన్యం ఈ నాటితో అంతమయ్యేట్లు చేద్దాం అందరమూ కలిసి.



లలిత గదిలో కుక్కతో ఆడుకుంటూంది. సుందరి వొచ్చింది. తటాలున లలిత లేచి సుందరిని కావిలించుకుంది.

సుందరి:

ఎన్నాళ్ళయింది ?

లలిత:

ఎట్లా వొచ్చావు ?

సుందరి:

నిన్ను surprise చేద్దామని నీకు వ్రాయలేదు. ట్రిప్లికేను స్కూల్లో కుట్టుటీచరు పని సంపాయించాను.

లలిత:

(సంతోషంతో) ఇంక యీ వూళ్ళోనే వుంటావా ?

రామారావు:

రామారావు అటువెడుతో కొత్తకంఠం విని తలుపులోంచి తొంగిచూశాడు. ఎవరో ఆడవాళ్ళున్నారని వెళ్ళిపోతున్నాడు.

లలిత:

ఇదేమిటి ? సుందరి నెరుగరూ ?

రామారావు:

అవునవును ... ...

సుందరిని admiration తో చూస్తున్నాడు. ఇకముందంతా లలిత తనకీ తన భర్తకీ all is well అని సుందరిముందు నటిస్తుంది.

సుందరి:

(helplessగా) నేను వెళ్ళి lodging కుదుర్చుకోవాలి. వూగు చూస్తే భయంగావుంది. ఎవర్నీ యెరగను. ఆడదాన్ని—

రామారావు:

అసలు ... (ఆగాడు)

లలిత:

అవును. నువ్వు వేరే వుండడమెందుకు? వీరా స్కూలు దూరమా?

రామారావు:

కారు వుందిగా !

లలిత:

అవును ఇక్కడేవుండు, సుందరీ.

సుందరి:

(రామారావువొంక చూస్తూ) మరిమీకు భారం కాకపోతే—

లలిత:

ఆయనకి insult. గొప్ప జమీందారుగారేమిటి —

♦ ♦ ♦

[వారం తరువాత]

సాయంత్రం. మోటారుముందు సుందరీ, రామారావూ నుంచున్నారు.

సుందరి:

లలిత లేకండా నేను బైటికిరాను. లలితని వొదిలి, పాపం—

రామారావు:

నిజం చెప్పరాదూ, నీ reputation కి భంగమని—

సుందరి:

అదికూడా అనుకోండి. ముఖ్యంగా మీవంటి reputation వున్నవారితో—(లలిత వొచ్చింది) కదిలిందయ్యా చివరకి! ఇన్నాళ్ళు madras లో వుండిట! సినిమా చూడలేదట. shameful! ఈభర్తల్ని అట్లా కళ్ళాలు బిగించి సేవచేయించుకోవాలి గాని, పాతముత్తయిదులవలె వొదిలామా—ఇంక మనవారు కారు.

లలిత:

వెడదాం పద!

రామారావు సుందరి వేషానికీ లలిత dress కీ భేదం చూస్తున్నాడు.

రామారావు:

సుందరీ, లలితకి drees చేసుకోడం నేర్పరాదూ?

సుందరి:

చెప్పాను, కాని వినటంలేదు.

లలిత:

ఏం? నన్ను మీ భార్య అని చెప్పుకోడం నామోషీగా వుందా?

రామారావు:

కాదుమరీ position కి తగినట్టు dress వుండకపోతే!

మోటారులో వెడుతున్నారు. flower show లో ముగ్గురూ తిరుగు తున్నారు. లలిత పువ్వుల్ని చూసి తన్మయు రాలౌతుంది. 'వాళ్ళిద్దరూ పువ్వులకన్న మనుష్యుల్ని ఎక్కువగా చూస్తున్నారు. సుందరి, రామారావు ముందుగా వెళ్ళారు. లలిత అట్లా పరధ్యానంగా వుండిపోయింది. దూరాన రమణ స్నేహితులతో వెడుతో లలితని చూశాడు. అట్లా చూస్తో నుంచుని వుండిపోయినాడు. ఆమెని పలకరిద్దామా, లేదా అని సందేహిస్తాడు, చివరికి వద్దనుకుని వెళ్ళిపోతాడు. సుందరి రమణని చూస్తుంది.

సుందరి:

(రామారావుతో) అతనే అతనే. మొన్న రమణ ఎవరని అడిగారే, అతనే. (రామారావు చూస్తున్నాడు)

రామారావు:

అతనే! మా రైతుల్ని పన్ను లియ్యకుండా దుర్బోధనలు చేస్తున్నాట్ట. ఒక దమ్మిడీ రాలేదు. కటకట పడుతున్నాను.

సుందరి:

పిలవనా?

రామారావు:

ఎందుకులే! సుందరీ! నువ్వీతన్ని బాగా ఎరుగుదువ్వుగా—
ఒక్క సహాయం చేసి పెట్టరాదూ?

సుందరి:

నా కన్న అతనికి లలిత స్నేహం యెక్కువ.

రామారావు:

లలిత యెందుకులే! నువ్వే చేసిపెట్టు. ఏవిధంగానన్నా అతను ఆ దుష్ప్రయత్నం మానుకోవాలి—

సుందరి :

అయితే పిలుస్తాను. రవణా, రవణా !

రవణారావు తలెత్తిచూసి విధిలేక వొస్తున్నాడు.

సుందరి :

పాత స్నేహితుల్ని మరచిపోయినారా ?

రమణ:

చూడలేదు.

సుందరి:

వీరే రామారావుగారు, లలిత భర్త.

రమణ:

ఓ, నమస్కారం.

సుందరి:

రవణని చూడలేదా నువ్వు లలితా !

లలిత అతన్ని చూసి చాలా సంతోషం కనబరుస్తుంది.

లలిత:

ఎట్లా వొచ్చావు యిక్కడికి ?

రమణ:

provincial congress meeting.

లలిత:

ఓ ! ఇంకా ఆ రాటాలూ అవీ మానలేదన్నమాట నువ్వు !
ఈయనే నా భర్తగారు !

రమణ :

తెలుసుకున్నాను. మరి—వెడతాను.

సుందరి :

అదేమిటి ? అప్పుడే వెళ్ళడం ? మా యింటికి రావాలి. మేమందరమూ కలిసే వున్నాము.

రామారావు:

తప్పకుండా రావాలి. (card యిస్తున్నాడు.)

రమణ :

టైమ్ వుంటే !

లలిత :

అదేమిటి రమణా ! అట్లా అంటావు ? నిన్ను చూస్తే నా ప్రాణం లేచివొచ్చినట్టుంది. promise. వొస్తానను.

రమణ సందేహిస్తున్నాడు.

లలిత:

నాకోసం రావూ ? నిన్ను చూస్తే—నావాళ్ళందర్నీ చూసి నట్టుంది.

రమణ :

వొస్తాను. అందరికీ నమస్కారము.

వెళ్ళిపోయినాడు.

దూరంగా వెళ్ళి లలితవంకే చూస్తున్నాడు.

♦ ♦ ♦

లలిత దేవీపూజచేసి బ్రాహ్మణ సంతర్పణ చేస్తోంది. సుందరీ, రామారావు నవ్వుకుంటున్నారు. రమణ వొచ్చాడు, ముందు గదిలోకి—

రామారావు:

రండి, కూచోండి. కాఫీ, సిగరెట్లు.

రమణ :

Thanks, వొద్దు.

రామారావు:

Anything stronger ?

సుందరి:

రమణ puritan, స్వదేశీ——

రామారావు:

స్వదేశి రకాలుకూడా దొరుకుతాయి. కొంచెందూరం—

నవ్వుతున్నాడు.

రమణ :

లలిత యేదీ.

సుందరి:

లలితా! మనకి కనపడుతుందా? ఆమె పూజలు బ్రాహ్మణ సత్కారాలూ——

రమణ :

ఈ కాలంలో కూడానా ? ఆ nonsense ఎట్లా పట్టుకుంది ?

రామారావు :

euxcuse me. (వెడుతున్నాడు.)

సుందరి:

రమణా, నువ్వు వెళ్ళిపోయింతరవాత ఎన్నాళ్ళు ప్రయత్నించినా మరపుకి రాలేదు నువ్వు——

రమణారావు ఆమె drive చూడతలుచుకో లేదు.

రమణ :

ఈ చీనాసిల్కులు మాని ఖద్దరు కట్టరాదూ నువ్వు ?

సుందరి :

కడితే నువ్వు—

రమణ :

దేశదరిద్రులకి సహాయము చేసినదాని వౌతావు.

సుందరి :

సరే కాని, రవణా నువ్వు రామూరావు peasants కి దుర్బోధలు చేసి—

రమణ:

మరి లలితరాదా ? రాకపోతే—

లలిత వొచ్చింది.

సుందరి :

వెయ్యేళ్ళాయుస్సు.

రమణ :

(సుందరితో) పోనీ, కొంచెం కాఫీ తాగుతాను తయారు చేయిస్తారా ?

సుందరి :

Order యిస్తాను.

రమణ :

నీ చేత్తో తయారు చెయ్యాలి మరి!

అర్థంచేసుకుని నవ్వుతో వెళ్ళింది.

లలిత:

ఎన్నాళ్ళకి చూశాను. జైలునుంచి రాగానే నన్ను చూడ్డానికి రాలేదుకదూ !

రమణ :

ఏమో అంతగా నన్ను చూడాలని నీకు వుంటుందనుకోలేదు.

లలిత:

అంత చెడ్డదాన్ననుకున్నావు. ఏం ?

రమణ :

పని !

లలిత :

ఏమిటో ఆ పని ! రవణా నీకు ఉద్యోగమూ, పెళ్ళీ యేవీ అక్కర్లేదా యేమిటి ?

రమణ :

(నవ్వుతో) అట్లాగే వుంది.

లలిత :

నిన్ను చూస్తే నాకేమనిపిస్తోందంటే; నువ్వు ఎవర్నినో చాలా ప్రేమించి disappoint అయినట్టు కనబడుతున్నావు.

అతను emotion లో struggle అవుతున్నాడు.

లలిత:

పాపం, నిజం. అవునా, రవణా, నిన్ను అంత క్రూరంగా గాయంచేసిన ఆ కఠినాత్మురాలెవరో ! నీవంటివాణ్ని తృప్తి పరచడానికి ఏ త్యాగానికైనా సంకోచించడం అన్యాయమనిపిస్తుంది.

రమణ బాధపడతాడు.

రమణ :

నువ్వూ సంతోషంగా లేవు. ఇంత ఐశ్వర్యంలోనూ ఏదో అసంతృప్తి, లోపలి బాధ కనపడుతున్నాయి.

లలిత :

(కన్నీళ్ళు ఆపుకుంటూ) ఏమీ లేదు.

రమణ:

ఐశ్వర్యభారమే బాధ అనుకుంటాను. (నవ్వుతున్నాడు) నేను వెడతాను.

లలిత:

కాఫీ !

రమణ :

అక్కర్లేదు. చూడు ఆ సుందర్ని, ఆ దెయ్యాన్ని ఇంట్లో చేరనిచ్చావేమిటి ? ఇంక నీకు సంసారంలో శాంతి వుంటుందా ?

లలిత:

అసలు ఒకప్పుడు (తెప్పరిల్లి) నా కా భయం లేదు లే. (అంది గర్వంగా)

రమణ :

నాకు సందేహమే. కళ్ళు చాలా గట్టిగా మూసుకున్నావేమో ! జాగ్రత్త (వెడుతున్నాడు) ఈ చీకటి దేశంలో అక్కడక్కడ నీవంటి నక్షత్రాలున్నాయి. కాని అవి ఐశ్వర్యమూ, మర్యాదా, ఇట్లాంటి మబ్బుల వెనక అణిగిపోయినాయి.

(వెళ్ళిపోయినాడు)

♦ ♦ ♦

వాలంటీర్ల camp. పెద్దచెట్టుకింద పందిరి. వంటలు చేస్తున్నారు. ఒక అతను మందుబుడ్లు తయారుచేసి, రోగులకి చూపుతున్నాడు. ఒక మూల కొందరికి ఒక అతను news paper వార్తలు చెపుతున్నాడు. దేశ నాయకుల పటాలు చూపుతున్నాడు. సీనయ్య ఒక మూల భక్తి కీర్తనలు పాడుతున్నాడు. పిల్లలూ తనూ కలిసి భజన చేస్తారు. రమణ రైలు దిగి నడిచి వొచ్చాడు. ....

అందరూ captain కీ జయ్! అంటున్నారు.

వాలంటీర్:

కాన్ఫరెన్సు విశేషాలేమిటి?

రమణ:

పేపరు చదవలేదా?

వాలంటీర్:

Office acceptance settle అయినట్టేగా?

రమణ:

ఊఁ.

వాలంటీర్:

ఇంకేం? రమణా నువ్వు మినిస్టరువి కాబోతున్నావు.

రమణ:

నోరుముయ్యి.

సీనయ్య:

వొచ్చావా, నాయనా, నువ్వు కనపడకపోతే అన్నమే సయించలేదోయి. (రమణని కావిలించుకున్నాడు.)

రమణ:

మద్రాసులో మన జమీందారుగారు కనపడ్డారు.

శోభనాద్రి:

కనపడి—

రమణ:

లోపల మండిపోతున్నారు. (సీనయ్యతో) లలితకూడ కన
పడ్డది. ఏమిటి ఆమె దిగులు!

సీనయ్య:

దిగులేమి వుంది?

రమణ:

ఆ భర్తే పెద్ద దిగులనుకుంటాను, ఆ రామారావు—

సీనయ్య:

నీ కళ్లకి వికృతంగా ఉన్నంతమాత్రాన, పతివ్రతైన భార్యనే-

రమణ:

ఇట్లా వాస్తవాన్ని కప్పి అంధుల్ని చేస్తున్నాయి గనకనే,
యీ పతిభక్తీ, దైవభక్తీ, ఈ తుప్పులన్నీ వొదిలి పోవా
లంటాను.

సీనయ్య:

ఎక్కడికిపోతాయి? సీనించి నువ్వెట్లా తప్పించుకుంటావు?
దైవం వేరు కాదయ్యా సీనించి—

శోభనాద్రి:

మళ్ళీ ప్రారంభించారూ వాదన! రవణా స్నానం చేసిరా!

రమణ వెడుతున్నాడు.

రమణ:

ఇట్లాంటి దురోచనలు చేసి, మతమని, కర్మఅని, నిర్వీర్యుల్ని చేసిపెట్టారు ప్రజల్ని! (వెళ్ళాడు)

భోజనాలు వొడ్డించారు.

శోభనాద్రి:

రమణ వాడేం? మీరే బెదరకొట్టారు అతన్ని యీశ్వరుడి పేరు చెప్పి.

సీనయ్య:

పిచ్చివాడు. రమణని చూస్తే శ్రీ శంకరుడి అవతారమని పిస్తుంది నాకు. స్త్రీ వ్యామోహంలో పడనివాడు అతను వొకడే.

రమణ నదివొడ్డున లలిత photoచూస్తో ప్రపంచాన్ని మరిచాడు.

ఏ ధర్మంలోనూ విశ్వాసం లేదంటాడా? అన్ని ధర్మాలూ అప్రయత్నంగా పాలిస్తాడు జీవితంలో. కూచోండి మీరు. తీసుకొస్తా నతన్ని.

వెళ్ళి రమణనీ ఫొటోనీ చూసి సీనయ్య నివ్వెర పోయినాడు. దూరంగా వెళ్ళి రమణని పిలుస్తున్నాడు.

చేతులు కడుక్కుంటున్నారు భోజనంచేసి.

సీనయ్య:

భక్తిలేని మనిషే వుండడు. కొందరు దేవుళ్ళని పూజిస్తారు. కొందరు దేవతల్ని ధ్యానిస్తారు. కాని ఏ ఆరాధనలోకూడా స్వార్థం వుండకూడదు. అది దేశసేవకి విషతుల్యం.

సాయంత్రం మీటింగు.

శోభనాద్రి ఉపన్యాసం యిస్తున్నాడు.

ఈ వూళ్ళలో సంఘీభావం లేక, కులాలని, పార్టీలని, ఒకరి నొకరు ద్వేషించుకుని, ఇతరులకి దాసులౌతున్నారు. మన దేశపతనమే యీ భేదాలవల్ల జరిగింది. అందరూ ఒకేమాట మీద నిలబడండి. అపదలు వొస్తాయి. స్థైర్యంతో వోర్చుకోండి. జయం నిశ్చయం. మీ రక్తాన్ని పీల్చి, మీ ప్రాణాల్ని తీసి, సుఖమనుభవించడానికి ఎవరికీ హక్కు లేదు.

(రమణ ఉపన్యాసం:)

ఈ దేవుళ్ళనీ, కర్మలనీ, మోక్షాలనీ, భారమంతా వారిదే ననీ నమ్మి, అన్ని అన్యాయాలనూ, అవమానాలనూ, దరిద్రాలనూ భరిస్తో, నోరుమూసుకుని, శతాబ్దాలుగా దాసులై పడివున్నారు. లేవండి. నడుం కట్టండి. మీ పౌరుషాన్ని, మీ పూర్వుల రక్తోద్రేకాన్ని తెలియచెయ్యండి. మాడండి, చావండి, కాని మీ ఆత్మగౌరవాన్ని విడవకండి.

(సీనయ్య వుపన్యాసం:)

ఈశ్వరుడు దయామయుడు. బీదలపాలిట కల్పతరువు. భయపడకండి. ఆయనే మీ అభ్యున్నతికి తోడుపడతాడు. భగవద్గీతలో శ్రీకృష్ణభగవాను డేమన్నాడంటే.

శ్లోకం. మీటింగు ఆఖరు — జయ జయ ధ్వనులు.

రాత్రి camp లో పడుకుంటున్నారు.

రమణ:

ఏ పనికన్నా ఆత్మవిశ్వాసం వుండాలి.

సీనయ్య:

ఇట్లా సమ్మెలు కట్టిస్తున్నామా, గెలిస్తే సరేసరి—కాని వోడామా—

రమణ:

వోడనీను. నా రక్తం వాళ్ల నాళాల్లో ప్రవేశపెట్టి గెలిపిస్తాను.

సీనయ్య:

నీకన్నా, నాకన్నా, యీ వుద్యమాలన్నిటికీ, యీ లోకాన్నే నడిపేశక్తి వేరేవుందయ్యా!

రమణ:

కాదు. ఆ ఈశ్వరుడే మన చేతుల్లో యంత్రంలా కాబోతున్నాడు.

అనాడు.

లలిత మనసులో ఏమిటో బాధ! మీకు చెప్పకుండా వుండను.

సీనయ్య:

ఆ బాధంతా నీ మనసులో వుంది. కాంతితోకూడిన నేత్రాలకి ఏదీ నిర్మలంగా కనపడదు. భక్తి అంటె త్యాగం. స్వార్థ విషయం త్యాగం చెయ్యలేని అల్పుడు, ఏ ఉన్నత కార్య దీక్షకీ అసర్హుడు, యోచించుకో.

ఈశ్వరుడు, ఉంటేనేం, లేకపోతేనేం, లోకాన్ని పాలించే నీతులూ ధర్మాలు మారవు, ఎవరికోసంకూడా.

  

నెల గడిచింది.

లలితా, సుందరీ, రామారావూ, షాపులు తిరుగుతున్నారు.

లలిత వేషమంతా మార్చింది. కుక్కని neglect చేస్తోంది. జడ

మాని, జుట్టుపైకికట్టి పువ్వులు పెట్టింది. చీరపైకి కట్టింది. చంకల వరకు జాకెట్. High heeled shoes. అంతా సుందరి కింద తరిఫీదు అవుతోంది.

ఇద్దరు అందమైనవాళ్ళతో రామారావు
చాలా గర్వంగా తిరుగుతున్నాడు.

సుందరి:

ఈ హారంచూడు లలితా, నీ మెళ్ళో చాలా బావుంటుంది. కొని పెట్టమను.

లలిత:

ఎందుకు లెద్దూ? ఆయనకి అసలే డబ్బు యిబ్బందిగా వుంటే!

సుందరి:

ఆ! యిబ్బందులు జమీందార్లకి మామూలేగా!

రామారావు దగ్గిరికి వొచ్చాడు.

సుందరి:

ఇది బావుండ లేదండీ! (లలితను చూసి ఫ్రూరుకున్నాడు)

సుందరి :

లలితకి అక్కర్లేదట.

రామారావు :

నీకు కావాలా !

సుందరి :

మరి మంగళవారం నా పుట్టినరోజు.

రామారావు ఆ హారం కొంటున్నాడు.

సుందరి :

(లలితను కావలించుకొని) ఎంత మంచిదానివి లలితా! ఎవరిస్తారు నువ్వు కాకపోతే, నాకు అతి విలువగల బహుమానం!

లలిత నివ్వెరపోయి చూస్తోంది.

  

బీచిమీద షికారు.

మోటారులో యెక్కి యింటికి వొస్తున్నారు. మోటారులో చీకటి. వీధిలైట్లు పడుతున్నాయి. లలితకి తెలీకండా రామారావూ సుందరీ సరసాలాడుతున్నారు. .... ....

  

లలిత తన గదిలోకి వెళ్ళింది.

కింద గదిలో సుందరీ, రామారావు వున్నారు. రామారావు వుత్తరం చదువుకుంటున్నాడు. .... .... ....

రామారావు :

(పళ్లుకొరుకుతో) ఈ రపణ ఎక్కడ పోగైనాడు, రైతులందరూ సమ్మె కట్టారు, సాగుచెయ్యరట - పన్నులు చెల్లించరట, వీణ్ణి సాధించేవాళ్ళు లేరా?

సుందరి :

ఉన్నారు.

రామారావు :

ఎవరు?

సుందరి :

లలిత.

రామారావు :

(అనుమానంగా) ఎట్లా !

సుందరి :

ఏం లేదు, అనుమానం పడకండి. లలిత అట్లాంటిది కాదు. అతను అంతకన్నా కాదు. కాని లలిత నిప్పులో మాడి చావమంటే చస్తాడు అతను.

రామారావు :

ఎట్లా తెలుసు ?

సుందరి :

ఆడవాళ్ళకి యెట్లాగో తెలుస్తాయి యిట్లాంటి సంగతులు.

రామారావు :

నువ్వు నాకు కార్యేషు మంత్రి.

సుందరి :

తక్కినవి——

రామారావు చుట్టూ చూసి స్విచ్చి ఆర్పి దావిలించుకుంటున్నాడు ఆమెని. లలిత వొచ్చింది. వాళ్ళు ఎడమై కుర్చీల మీద కూచున్నారు. స్విచ్చి వేసి వాళ్ళని చూసింది.

లలిత :

ఏమిట్రా చీకట్లో కూచున్నారు ? నా పర్సు చూశారా యిక్కడ.

రామారావు :

లేదే, మోటారులో వుంటుంది. చూస్తాను. (వెళ్ళాడు)

సుందరి :

పోడాడు. అతను నూరు రూపాయలు పోడాడు. లైటు

ఆర్పేస్తే, ఆ వీధి దీపం వెలుతురు గదిలోకి వొస్తుంది అని నేనూ, రాదని అతను——

లలిత :

పైగా ఇదో ఖర్చు ఆయనకి !

అని అమాయికంగా నవ్వుతూ వెళ్ళిపోయింది.

  

రైలులో - ప్లాట్‌ఫారం మీద లలిత, రామారావూ. సుందరీ ముగ్గురూ డ్రింకుప్రాగుతున్నారు. .... ....

సుందరి :

నీ విజయానికి !

రామారావు :

అతన్ని మీ నాన్నగారి యింటికి పిలిపించి, మాట్లాడు—కాని నేను పంపానని చెప్పకు. సరేనా !

లలిత :

ఏం భయం లేదు. రవణ నేను చెప్పినట్లు వింటాడు.

రైలు కదలలేదు.

మోటారులో రామారావు సుందరీ చాలా హుషారుగా వున్నారు. లలితకుక్క సుందరి వొళ్ళో కూచుంది.

  

లలిత పుట్టిల్లు. దుర్గమ్మా, చెంచురామయ్యా, బంధువులూ.

దుర్గమ్మ:

చాలా మారింది. ఎంత నాజూకు వొచ్చింది పిల్లకి? ఈ తల్లేనా ఆవాళ కాపరమే చెయ్యనని గంతులేసింది?

చెంచురామయ్య:

ఆడపిల్లలు ఎప్పుడూ అంతే లెద్దూ! మనం యీ నాటికి జ్ఞాపకం వొచ్చాం. అదికూడా ఆ భర్త పనిమీద పంపితే వొచ్చింది.

లలిత:

నాన్నా, రమణ కబురు పంపినా రాలేదే!

చెంచురామయ్య:

అతనికి మనం కనపడతామూ! రేపు ఎలెక్షన్లలో కాంగ్రెసుకి విజయమైతే, అతను మినిస్టరు కాబోతున్నాట్ట.

క్రింద కిటికీలోంచి ఎవరో కేకవేశారు.

చెంచురామయ్యవెళ్ళి మాట్లాడుతున్నాడు.

చెంచురామయ్య:

(లలితతో) మీ రమణ! రావడానికి తీరుబడి లేదని కబురు పంపాడు.

లలిత:

నేను కబురు పంపితే—(నొచ్చుకుంటోంది) కాని అవసరంగా మాట్లాడాలి నాన్నా! నేనే వెడతాను.

దుర్గమ్మ:

అదేమిటి? నీ తాపాతేమిటి? అతని దగ్గిరికి వెళ్ళడ మేమిటి?

లలిత:

మినిస్టరు కాబోతున్నాడుగా!

దుర్గమ్మ:

అయినప్పుడు చూసుకుందాములే.

లలిత:

వెళ్లాలి. భర్తగారి ఆజ్ఞ. సాయంత్రం మోటారులో వెళ్ళి చీకటిపడే లోపల వొచ్చేస్తాను.

దుర్గమ్మ:

సరేకాని, ఏమిటే, మీ నాన్నగారు మనుమడో అని తహ తహలాడుతోవుంటే, నువ్వు మాట్లాడకుండా వూరుకున్నావు.

లలిత మాట్లాడలేదు.

చెంచురామయ్య:

ఈ కొత్తపద్ధతులు ఏమన్నా అవలంబించలేదుకద!

లలిత తల వూపుతుంది.

చెంచురామయ్య:

అయితే ఆలస్యమేమిటి? మన డాక్టరు సిత్రత్తుకి ఓసారి చూపించుకో.

లలిత:

ఏం వొద్దు నాన్నా! (లేచిపోయింది)

మోటారులో లలితా డ్రైవరూ—మోటారు దోవ తప్పింది. డ్రైవరు అక్కడ దక్కడ మనుషుల్ని అడిగి తోవ కనుక్కుంటు న్నాడు.

రాత్రి. చీకటి. Camp. రమణా సహచరులూ నిద్రపోతున్నారు. మోటారు ఆగింది.

డ్రైవరు:

రమణారావుగారిని పిలవండి.

వాలంటీరు:

ఎవరు?

డ్రైవరు:

ఆయనతోనే పని!

వాలంటీరు:

పేరు చెపితేగాని పిల్లేదు. (రమణ వొచ్చాడు)

రమణ:

ఎవరు?

డ్రైవరు దూరంగా తీసికెళ్ళి మాట్లాడుతున్నాడు.
రమణ మోటారు దగ్గరికి వెడుతున్నాడు.

వాలంటీరు:

రమణా వెళ్లకు. జాగ్రత్త! నమ్మకు. ఏదో ద్రోహంవుంది.

రమణ:

భయపడకు. (మోటారుదగ్గిరికి వెళ్లాడు.)

లలిత:

రమణా నీకోసమే వొచ్చాను.

రమణ:

నా కోసం నువ్వు!

లలిత:

నీతో.మాట్లాడాలి. లోపలికి రా.

రమణ మోటారు ఎక్కాడు. కారుకదిలింది. వాలంటీర్లులేచి
గోలచేస్తూ కారువెంటపడ్డారు, ఏదో కుట్ర అని.

లలిత:

మరిచి పోయినావా నన్ను! ఆమాత్రం దయదలిచి రాకూడదా?

రమణ తన ప్రేమని దాచుకోవాలని ప్రయత్నిస్తున్నాడు.

రమణ:

ఏం చెప్పను? నీ మీద దయలేక కాదు. అట్లా అంటే నేను భరించలేను. వేరే కారణాలు.

లలిత:

చెప్పవా?

రమణ:

నువ్వు అడగడమూ ధర్మంకాదు; నేను చెప్పడమూ ధర్మంకాదు.

లలిత:

బలే ధర్మాలు నేర్చుకున్నావు. కానీ—

రమణ:

ఎక్కడికి మనం యిప్పుడు?

లలిత:

భయపడకు. నిన్నెవరూ తినెయ్యరు.

రమణ:

నీలో విశ్వాసమూ? నీ కెట్లా చూపను.

అతని కళ్ళలో గొప్పతనాన్ని తనమీదిగౌరవాన్ని లలితచూస్తోంది, మోటారు దీపం కింద.

నదివొడ్డున మోటారు ఆపారు. లలిత, రమణ దిగి యిసికమీద కూచున్నారు. వెన్నెల వొచ్చింది.

లలిత:

ఇట్లాంటి వెన్నెట్లో మనం ఆడుకోడం జ్ఞాపకం వుందా?

  

లలిత చిన్నపిల్ల—సాయంత్రం పిల్లలతో ఆడుకుంటోంది. ఉంగరం పడిపోయింది. పిల్లలు భయపడి పరిగెత్తారు. ఒకత్తే బిక్క మొహంతో నుంచుంది. రమణ వచ్చాడు. ఆవేపు వెతుకుతున్నాడు.

రమణ:

ఏమిటి లలితా?

లలిత:

ఉంగరం పడిపోయింది. అమ్మ కొడుతుంది.

వెతుకుతున్నాడు. కనపళ్ళేదు.

లలిత :

నేను వెళ్ళాలి.

రమణ:

నేను ఎట్లాగో తెచ్చిపెడతాగా!

ఈలోపల తనవుంగరం ఆమెచేతికిపెట్టి పంపాడు. ఒక్కడూ చాలా సేపు వెతికి దొరికించుకుని లలిత యింటికి వెళ్ళాడు. తలుపులన్నీ బిగించి వున్నాయి. జాలిగా ఆయింటికేసి చాలాసేపు చూసి, తన యింటికి వెళ్ళాడు. ఆలస్యమయిందని వాళ్ళ అన్నయ్య బెత్తం తీసుకొని అతనికోసం యెదురుచూస్తున్నాడు.

  

తెల్లారకట్ట. చలిలో లలితయింటికి రమణ వెళ్ళాడు. లలితవాళ్ళ ముసలమ్మ ముగ్గులు వేస్తోంది.

ముసిలమ్మ :

యీ అర్ధరాత్రి లలిత యెందుకు నాయనా ?

రమణ :

పనివుంది.

ముసిలమ్మ:

పని ! ఏం పని ! లలిత యిప్పుడు లేవదు.

ఎట్లాగా అని చూస్తున్నాడు. శాలువ
ముసుకుతో లలిత బైటికి వొచ్చింది.

ముసిలమ్మ:

ఎవడే! యీ అర్ధరాత్రి, పెళ్లు చెపుతా, నాన్న లేవనీ.

లలిత వినిపించుకోకుండా రమణతో తోటలోకి వెళ్ళింది.
ఆమె వుంగరం ఆమె వేలికిపెట్టి తనవుంగరం తీసుకున్నాడు.

లలిత:

నీ ఋణం ఎట్లా తీర్చుకోను ?

రమణ :

తీర్చుకోందుగాని, పెద్దయి—

♦ ♦ ♦

రమణ :

పని చెప్పవూ.

లలిత :

తొందరా ?

రమణ :

తొందరకాదు—

వూరుకున్నాడు. లలితవుండడం అతనికిబాధఅని యెట్లాచెపుతాడు?

రమణ :

ఇంత అర్ధరాత్రి యెందుకొచ్చావు.

లలిత:

తోవ తప్పిపోయినాము. సాయంత్రమనగా బైలుదేరి—

రమణ:

భోజనం లేదూ ?

లలిత:

ఉహూ.

రమణ :

చెప్పలేదేం అక్కడ ? అయినా నీకు ఏం పెట్టగలం. జొన్న రొట్టా —

లలిత:

ఆ సంగతే మాట్లాడ్డానికి వొచ్చాను. ఎందుకు అట్లా నీచంగా బతుకుతావు ? నీకేం ఖర్మం ?

రమణ :

కోట్లమంది ప్రజలు అట్లా బతుకుతున్నారు. పైగా సంసారాలు, జబ్బులు ...

లలిత:

సమ్మెలు కట్టించి మరీ దరిద్రంలో దింపుతున్నావు వాళ్ళని.

రమణ :

ఇంక మార్గంలేక—కాని నీ పని–

లలిత:

ఈ సమ్మెలవల్ల ఆయనకి, జమీందారుగారికి ఎంత హాని చేస్తున్నావో తెలుసా?

రమణ:

అదా?...— హాని చెయ్యాలనేగా నా ఉద్దేశ్యం?

లలిత:

ఆయన నీకేం అపకారం చేశారు?

రమణ:

నాకు కాదు. నోరులేని ఆ పేదరైతులకి—

లలిత:

పేదరైతులేం కాదు—అంతా దాచుకుని—

రమణ:

(జాలిగా) నాతో ఓ రెండురోజులు ఆ పల్లెటూళ్ళో వుండి study చేస్తావా? నీకా ధైర్యం వుందా?

లలిత:

వాళ్ళగతికి వాళ్ళనే పోనిద్దూ, ఈశ్వరుడు చూసుకుంటాడు.

రమణ:

ఏమిటి లలితా, ఇంత మారిపోయావు? ఏమైపోయినావు? ఐశ్వర్యమా? వివాహమా? ఏది సుందరమైన నీ ఆత్మని యిట్లా మైలపరిచింది? చిన్న చీమకాలు విరిగితే, పిల్లికి తిండి లేకపోతే, సహించలేవే—

లలిత:

(భరించలేక) మేము డబ్బులేక మాడిచస్తే—

రమణ:

మాటలు—అర్థంలేని మాటలు—నీకు తెలీడంలేదా?

లలిత:

వాళ్ళ అవసరము వాళ్ళదీ, మా అపసరం మాదీ. ఎంత ఎండకి అంత గొడుగు—

రమణ:

నీకర్థంకాదు—లాభంలేదు, మనం వేరేభాషలు మాట్లాడుతున్నాము.

లలిత:

పోనీ, నేను బతిమాలుతున్నా నని, — నా కోసమని, యీ సమ్మెలు మానెయ్యి. నిన్ను ప్రార్థించడానికే వొచ్చాను.

అతని చేతులు పట్టుకుంది. రమణ వొణికిపోయినాడు.
అతని స్థైర్యం యెగిరిపోయింది. .... .... ....

రమణ:

నీ కోసమా? అన్యాయం యీ వరం అడగడం—లలితా నీ కోసం, నువ్వు అడిగితే నేను చెయ్యననే పని లేదనుకుంటా యీ లోకంలో.

లలిత:

నాకు తెలుసు ఆ సంగతి—

రమణ:

కాని యీ దిక్కులేని ప్రజలని నమ్మించి సమ్మె కట్టించాను. పనులూ, వ్యవసాయం మాని మాడి చావడానికి సిద్ధమైనారు నా మాటల్ని నమ్మి. ఇప్పుడు నేను శత్రు

వుల్లో కలిసి వాళ్ళని ద్రోహం చెయ్యనా? నువ్వు చెయ్యగలవా అట్లాంటి పని?

లలిత:

నా కోసం——

రమణ:

నీ కోసం కాదు యీ అధర్మం నువ్వు అడుగుతోంది. నీ Nobility యిట్లాంటి అన్యాయాలకి దిగదు. ఇది నీ భర్త కోసం, నీ పాతివ్రత్యం నిన్ను యిట్లా అధర్మాన్ని యాచింపచేస్తోంది.

లలిత:

ఎవరికోసమైతేనేం——

రమణ:

ఎంత కఠినాత్మురాలివైనావు లలితా! వాళ్ళసంగతిపోనీ—— నాకు జీవితంలో యీ దేశసేవతప్ప ఏముంది? శూన్యమైన ప్రేమరహితమైన నా జీవితాన్ని వాళ్ళకి అర్పించి, వాళ్ళ సేవలో ఏ కొంచెం తృప్తినో పొందాలని ప్రయత్నిస్తున్నాను. నాకు నా ఆశలు అన్నీ అడుగంటి పోయినాయి. ఇదికూడా——నీ ఆజ్ఞవల్ల యీ ప్రజల సేవనికూడా వొదులుకొని నువ్వూ, నీ ప్రేమకూడా——(నాలిక కొరుక్కుని పూరుకున్నాడు.)

లలిత:

నేను? ఏమిటి?

రమణ :

ఏం లేదు.

లలిత :

రాజీ లేదా ?

రమణ :

ఆయన వొప్పుకుంటారా ?

లలిత :

నేను టెలిగ్రామిచ్చి పిలిపిస్తాను, నువ్వు మాట్లాడు.

రమణ :

అభ్యంతరం లేదు——

లలిత :

రా, పొద్దుపోయింది.

మోటారులో

రమణ :

నువ్వు చాలా మారిపోయినావు. ఎందుకు ఆ అలంకారాలన్నీ నీకు ? నిజంగా ఆనందాన్నిస్తున్నాయా ?

లలిత :

మరి position, society. అయినా ఏమీ బావుండలేదా నేను?

రమణ :

నువ్వు యీ ప్రపంచానికంతా కాంతివి. కాని యివి కప్పేస్తున్నాయి నీ గొప్పతనాన్ని. ఎంత దూరమై పోయినాము, లలితా !

ఎదురుగా గుంపు మోటారు ఆపారు.

గుంపు :

వీడీ, మా రమణ వీడీ, చెపుతారా, చంపమా ?

లలిత:

వాళ్లు నన్ను చూస్తారు—

రవణ దిగి వాళ్ళని దూరంగా నుంచోమన్నాడు.

లలిత:

(చెయ్యి బయిటికి పెట్టి) శెలవు.

రమణ :

(ప్రజలతో) వూరుకోండి. ఏమీ ఉపద్రవం రాలేదు.

  

రామారావు యింటో గదిలో, మధ్యబల్ల, కాయితాలు చుట్టూ. రామారావూ, రమణా, లలితా. లలిత కుక్కను తన్నితరుముతుంది.

రామారావు:

నేను వొప్పుకోకపోతే—

రమణ :

మీ పొలాలలో ఒక్క పచ్చని మొక్క మొలవదు.

రామారావు:

వాళ్ళూ—వాళ్ళేం తింటారు ?

రమణ :

మన్ను !

రామారావు:

మీరు బియ్యమూ అవీ పంచుకున్నారటగా!

రమణ :

అవును.

రామారావు:

ఎన్నాళ్ళు !

రమణ :

చూస్తారుగా !

లలిత:

(రామారావుతో) సంధికి ఒప్పుకుని తగూ పెట్టుకున్నా రేమిటి ? నీ షరతులు చెప్పు రమణా.

రమణ :

చెప్పానుగా ! నూటికి యిరవై ఒంతున పన్ను తగ్గించు కోడమూ—పంటలు రాగానే వాళ్ళ బాకీ కూలివాళ్ళకి యిచ్చెయ్యడమూ—

లలిత:

ఒప్పుకోండి.

రామారావు:

సరే.

రమణ :

ప్రమాణమేనా ?

రామారావు:

ఊ! రేపు ఎలక్షన్సులో కాంగ్రెస్ తరఫున మీరు నాకు rival candidate కాబోతున్నారటగా !

రమణ :

అవును. నన్నే nominate చేశారు.

రామారావు:

సరే, అయితే యుద్ధరంగం మీద మళ్ళీ కలుసుకుంటాం.

రమణ :

తప్పకండా,

నవ్వుతూ వెళుతున్నాడు. లలిత లోపలికి వెళ్ళింది.
కామయ్య వొచ్చాడు.

రామారావు:

సరేనయ్యా, సంధి కుదిరింది. ఇంక నేను వెళ్ళవొచ్చునా ?

కామయ్య :

పట్నం వెడతారా ? మరి elections ఏం చేశారు ? వాళ్ళ పలుకుబడి పాకిపోతుంది.

రామారావు:

ఏమిటీ ? మన రైతులు వాళ్ళకి vote చేస్తారా ? ఎన్ని గుండెలతో——

కామయ్య :

మీరు కనబడుతో వుంటేనే గాని మనవేపు నిలవరు.

రామారావు:

సరి.

చెంచురామయ్య కోపంగా వొచ్చాడు.

చెంచురామయ్య :

(కామయ్యతో) బైటికి వెళ్ళు——

కామయ్య వెళ్ళాడు

చెంచురామయ్య :

ఏమిటయ్యా! ఈ సుందరి మీ యింటో యెందుకు వుంటోంది?

రామారావు:

ఏం సంగతి! లలిత పైగా మీతో చెప్ప—

చెంచురామయ్య :

లలిత యేమీ చెప్పలేదు—

రామారావు :

లలితే వుండమంది సుందరిని.

చెంచురామయ్య :

లలిత! దానికేం తెలుసు — బుద్ధిహీనురాలు! ఒక్క సుందరి యేమిటి! నీ తిరుగుళ్లు, నీ తాగుళ్ళు, ప్రపంచ మంతా మోగిపోతో వుంటేనే—

రామారావు:

నా సంగతుల్లో మీకేం జోక్యం—

చెంచురామయ్య :

ఈ ఆరు నెల్లల్లో—పదివేలు యెవడిచ్చాడు—నీ ముండలకీ! నీ స్నేహితులకీ యిచ్చావనుకున్నావా?

రామారావు:

ఇవ్వకపోతే, ఆ పిల్లని కొవ్వెక్కి పెళ్ళి చేసుకున్నానా? పిల్లనిచ్చినవారు యెవరికోసం యిస్తారు?

చెంచురామయ్య:

నా పిల్ల కిచ్చుకుంటాను. నీ కేం ఆ బాకీ నేను—ఏమిటి! యివన్నీ మానేసి నా పిల్లని సరిగా చూస్తావా—?

రామారావు:

మీా పిల్లని సరిగా చూడమనండీ నన్ను.

చెంచురామయ్య:

నిన్నూ—(లలిత వొచ్చింది.) నాపిల్లని ఏడిపించావా నీకు యిక ముందు ఒక దమ్మిడీ రాదు.

లలిత:

ఏమిటి నాన్నా యీా గోల? ఎవరు చెప్పారు?

చెంచురామయ్య:

నువ్వు వూరుకో వెర్రిదాన్ని చేసి నిన్ను వీడు—

తన్నడానికి సిద్ధమౌతున్నాడు. లలిత అడ్డుపడుతోంది. రామారావు పారిపోతున్నాడు.

చెంచురామయ్య:

ఇదుగో! ఇట్లా పాడుముండల్ని యింట్లోచేర్చి నీ మొగుణ్ని వెనకవేసుకు రావడం ఏదో గొప్ప అనుకుంటున్నావు గావును. నీ కొంప నువ్వే తవ్వుకుంటున్నావు. తీరా మునిగిం తరవాత నా గతేమిటి? అంటూ వొచ్చావా, గుమ్మం తొక్కనీను భద్రం. ఏమన్నా కానీ, నీ పెనిమిటి గడప దాటావా, నీ మొహం చూడను. ఇప్పుడే చెపుతున్నాను.

♦ ♦ ♦

పల్లెటూళ్ళో సీనయ్య పట్టూ రైతులు—భజన

♦ ♦ ♦

రామారావు యిల్లు. ఉదయం-లలితా పిల్లలు చెట్లక్రింద. లలిత వాళ్ళకి ఫలహారాలు యిచ్చింది.

నరసమ్మ:

మా అమ్మ ఒకసారి నిన్ను చూడాలంటోంది. కాళ్ళు పడి పోయినాయి.

లలిత:

నన్నా! (అనుమానంగా) వొస్తాను, జమీందారుగారు కారులో వెళ్లారు రానీ!

ఇంకొక పిల్ల:

ఏమిటి? మోటారా? ఇక్కడేగా?

ఒకపిల్ల:

ఎందుకు అడుగుతావే? ముసుపటి లలిత అనుకున్నావా యేమిటి? మనతో మాట్లాడ్డమే మహాభాగ్యం.

ఇంకొక పిల్ల:

నడక అలవాటే తప్పిపోయింది లలితకి. మనకిమల్లే ఈ దుమ్ములో గుంటల్లో నడుస్తుందా యేమిటి మరీసి?

లలిత:

ఏమిటి ఎక్కిరిస్తారు? వొస్తాన్రా పదండి. (వెడుతున్నారు)

నరసమ్మ యిల్లు.

జబ్బుగావున్న ముసిలామె లలిత చేతుల్ని కళ్ళనద్దుకుంటుంది.

ముసిలమ్మ:

నువ్వెళ్ళిం తరవాత యీ వూరికి ప్రాణమే పోయిందమ్మా! బడినుంచి వచ్చి యే నాలుగురోజులున్నావో యేమో!

పెనిమిటి అనుకూలంగా ఉంటాడా? ఆడదానికి యేం కావాలి? మొగుడి ప్రేమా, పిల్లలూ, ఐశ్వర్యమూ, నగలు ఇస్తాయా సౌఖ్యం?

నరసమ్మ అక్కయ్య కిటికీదగ్గిర పాపాయికి పాలిస్తోంది. లలిత దృష్టి ఆపిల్ల మీదనేవుంది.

నరసమ్మ:

అక్కయ్య పాపాయిని చూశావా లలితా!

పాపాయిని యెత్తుకుంది. ఈర్ష్య, వాంఛతో బాధపడుతుంది.

  

లలితా పిల్లలూ తిరిగి వొస్తుంటారు. దోవలో రమణరావు యిల్లు. శీతాయమ్మ గుమ్మంలోనుంచుని లలితని లోపలికి పిలిచింది.

లలిత:

రమణ లేడా?

శీతాయమ్మ:

సాయంత్రానికి వొస్తాడు. కూచో. ఈ గది జ్ఞాపకంవుందా?

చిన్నప్పుడు ఆతనూ, తనూ, ఆ మంచంమీద రైలాటలాడుకోడం జ్ఞాపకం వొస్తోంది.

శీతాయమ్మ లలితని వొంటరిగా వొంటింట్లోకి తీసికెళ్ళింది.

శీతాయమ్మ:

చూడు, నీతో ఒక్కమాట చెప్పాలనుకుంటున్నాను. నీకు కోపం వస్తుందోయేమో కాని చెప్పకండా వుండలేకండా వున్నాను. దాచడమెందుకు? వాడి ప్రాణమంతా నీ మీద వుంది. నాకు తెలుసుగా! కాని ఏంలాభం చెప్పు? అట్లాంటి

వెర్రికోర్కె? నాకో భయంపట్టుకుంది ఇప్పుడు ఎలెక్షన్సుట! దీంట్లో కాంగ్రెసువాళ్ళే గెలుస్తారట. అప్పుడు మావాడికి గొప్ప పని అవుతుందట. ఇన్నాళ్ళు కష్టపడ్డానా, ఇకనైనా నాలుగురోజులు సుఖపెడుతాడేమో – యీకళ్ళతో వాడి పెళ్ళి చూస్తానేమోనని ఆశ. కాని ఎప్పుడూ నీ వంకే చూస్తాడు. పెళ్ళిఅంటే మండిపడతాడు. నాభయమేమి టంటె–నీమీది యిష్టంచేత వాడు చెయ్యకూడని పని ఏదైనా చేస్తాడేమో——

లలిత:

నాసంగతి యేమనుకుంటున్నారు మీరు?

సీతాయమ్మ:

పోనీ నువ్వన్నా వాడికి నచ్చచెప్పు, పెళ్ళిచేసుకోమని.

లలిత:

ఇంకనాతో మాట్లాడకండి. (వెళ్ళిపోయింది)

♦ ♦ ♦

లలితయింటికి వొచ్చేటప్పటికి రామారావూ
సుందరీ చదరంగం ఆడుతున్నారు.

సుందరి:

రాజుకట్టు మంత్రిచేత.

రామారావు:

మంత్రిని ఇంగ్లీషులో Queen అంటారు. రాణి చాతకట్టు. కట్టివెయ్యిమరి.

సుందరి చుట్టూచూసి అతన్ని కావిలించు కుంది. లలిత వచ్చి నిర్ఘాంత పోయి చూసింది. సుందరితీవిగా చూస్తో వెళ్ళిపోయింది. రామారావు లలితన్ని బుజ్జగించ పోయినాడు.

లలిత:

వుండండి. చాలు. ఈ నాటితో యింక ఆఖరు మనకి.

రామారావు:

ఆఖరా! అసలు మొదలనేది వుంటే——

లలిత :

ఎందుకు ? మానాన్నగారు తేలుస్తారు లెండి.

వెళ్ళిపోయింది. రామారావు భయపడుతున్నాడు.

♦ ♦ ♦

రవణారావు తన గదిలో పన్నెండైనా మేలుకొని కూచున్నాడు ఆలోచిస్తో. సీతాయమ్మ వొచ్చింది.

శీతాయమ్మ:

ఇంకా నిద్రపోవేం, నాయనా ? నాకు తెలుసు, అదీ ఆ లలిత నిన్నిట్లా రాత్రులూ పగలూ, కాల్చుకుని తింటోంది. నేను ఆమెతో మాట్లాడానని చెప్పినప్పటినుంచి యిట్లా ఐనావు.

రమణ :

నువ్వెంత తెలివితక్కువగా మాట్లాడతావనుకోలేదు. అయిం దేమో అయిందిలే, వెళ్ళిపడుకో.

దీపమార్పాడు. వెన్నెట్లో శీతాయమ్మ వెళ్ళడం కనపడుతోంది. ఆతను మాత్రం అట్లానే కూచుని వున్నాడు. కిటికీలోంచి చెరువు కేసి చూస్తాడు.

♦ ♦ ♦

లలిత నిద్రపోతోంది. సుందరిలేచి రామారావు గదిలోకి వెళ్ళింది. లలిత కల కంటోంది. తనూ రమణా చిన్నప్పుడు ఆడుకోవడం. అర్ధరాత్రికి తను లేవడం, రమణ యింటికి వెళ్ళి తలుపు కొట్టడం, కలకంటో నిద్దట్లోనే పక్కమీదనించి లేచి, నడిచి బైటికివెళ్ళి పోతోంది. లలిత గేటుగడియ తీస్తోవుంటె, అక్కడ పడుకున్న పనివాడికి మెలకువొచ్చి, లలితను చూశాడు. "అమ్మా యెక్కడికి?" అన్నాడు. లలితకి ఆ మాటలు వినపడవు. వెడుతోంది. ఆ పనివాడి కంఠం విని సుందరి కిటికీలోంచి లలితనుచూసి రామారావుకు చూపించింది. ఇద్దరూ కిందికి వెళ్ళారు, "మేం చూస్తాంలే" అని కావిలివాడితో చెప్పి లలితను వెంబడించారు.

రమణ కిటికీలోంచి తెల్లగా మంచులో చెరువుకట్టమీదనించి రావడం చూస్తున్నాడు. లలిత అతని కిటికీ దగ్గరనించి వెడుతోంది. గుర్తించాడు. పరుగెత్తికెళ్ళి తలుపులు తీస్తున్నాడు. సుందరీ, రామారావూ అదిచూసి వెనక్కివెళ్ళి, యింటి గడియలు వేసుకుని లోపలికి వెళ్ళారు.

ఈలోపల లలిత రమణయింటి తలుపుదగ్గిర ఆగి మూసివున్నదనుకున్న తలుపు కొట్టబోయి తూలింది. రమణ ఆమెను పట్టుకుని, మాట్లాడుతున్నాడు. నిద్రపోతోందని తెలిసింది. తీసుకుపోయి పక్కమీద పడుకోపెట్టాడు. ఆమె కలకంటోంది యింకా. ఆమెని తాకాలని, బుజ్జగించాలని, కోర్కెతో యుద్ధం చేస్తాడు. చివరకి నిలవలేక ఆమెని ముద్దు పెట్టుకున్నాడు. ఆమె నిద్దట్లోనే అతన్ని కావలించుకుంది.

రమణ :

లలితా !

లలిత :

రమణా !

చంద్రుడిమీద మబ్బు కప్పింది. గది చీకటయింది. మబ్బు పోయింది. లలిత కళ్లు తెరిచింది. వెంటనే రమణని తోసేసి లేచి భయంతో చూసింది.

లలిత:

ఏమిటిది ? ఎట్లావొచ్చాను ! రమణా !ఏమిటిది ?

రమణ :

నిద్రలో వొచ్చావు.

లలిత:

నిద్దట్లోనా ? అవును వొస్తున్నట్టు, కలగన్నాను. కల అనుకున్నా, నిజంగా వొచ్చానా, ఎందుకు వొచ్చాను ?

రమణ :

ఇంకా తెలీటం లేదూ !

లలిత:

ఏమిటి తెలియుడం ? ఎట్లా తెలుసు నాకు ?

రమణ:

లలితా నా లలితా, అక్కడ నిలవలేక నా దగ్గరికి వొచ్చావు. నా దగ్గిరికి, నీ రమణ దగ్గిరికి; ఇంక వెళ్ళవు.

కావలించుకో పోయినాడు. లలిత కోపంతో దూరంగా పోయింది.

లలిత:

రమణా నువ్వూ-నువ్వు అట్లాంటివాడివా ? నమ్మలేను.

రమణకి అర్థమవుతోంది, తన ప్రేమని అణుచుకుంటున్నాడు.

లలిత:

అవును. మీ తల్లి చెప్పింది. నామీద నీకు-పాపం రమణా! ఎందుకు? (రమణ మాట్లాడలేదు.) ప్రేమ వుంటేమాత్రం అణుచుకోవాలి కాని, పెళ్ళి ఐన స్త్రీ మీద చూపడం ఏం ధర్మం? ఎవరనుకున్నావు నన్ను! భర్తకి ద్రోహంచేసి, పవిత్రమైన వివాహబంధనల్ని——

రమణ:

(emotionతో) నీ వివాహమే పవిత్రమైతే, యింక పవిత్రతకి వేరే అర్థం చెప్పుకోవాలి. ఎంత వికృతం? నీకు అతనిమీద యిష్టంలేదు. నాకు తెలుసులే. అబద్ధాలాడకు నిన్ను చూస్తే అతనికి ద్వేషం. ఇంకెవతెతోనో అతనికి అనురాగం. ఇది. పవిత్ర వివాహమా?

లలిత:

నిన్ను ప్రేమిస్తే, అది పవిత్రమా?

రమణ:

అవును ప్రేమిస్తే! ప్రేమ ఒక్కటే పవిత్రమయింది.

లలిత:

ఛీ! అట్లాంటి ప్రేమా?

రమణ:

అబద్ధమా? దాస్తున్నావా? లేక నీకే తెలీదా? ఇందాక—

నాలిక కొరుక్కుని వూరుకున్నాడు.

లలిత:

ఇందాక ఏమిటి?

రమణ:

ఏంలేదు. కలవొచ్చి యిట్లానిచి వొచ్చావు.

లలిత:

మరి వెడతాను.

రమణ:

దిగవెడతానురా.

వెడుతున్నారు. తోవలో.

లలిత:

అవును. పాపం. పొరబడ్డావు. నీ హృదయములో ప్రేమ అట్లా అనిపించింది. ఏంచెయ్యను రమణా, నీబాధ తీసెయ్యడానికి? ఎందుకంటే. నీమీద నా కట్లాంటి ప్రేమలేదు. కాని నీమీద వున్నంత ప్రేమ నా కెవరిమీదా లేదు.

రమణ :

మరి నీ సంసారం——

లలిత:

నా సంసారం యెట్లావుంటేనేం? నేను ధర్మం మీరతానా?

రమణ :

సరేలే. ఒకటి జ్ఞాపకం వుంచుకో, హృదయానుబంధం వివాహం. తక్కిందంతా, ఎంత పవిత్రమైనా వ్యభిచారమే.

రమణా లలితా, లలిత యింటికొచ్చారు.

లలిత:

గడియ వేసివుందే! (నివ్వెరపోయివాడు) ఎవరో వేసివుంటారు.

రమణ:

ఇట్లారా!

పైనించి చూస్తున్న సుందరికీ రామారావుకీ లలిత ఇప్పుడు కన పట్టంలేదు. రమణవొంగి లలితని గోడమీదనించి దూకిస్తున్నాడు. తను వెనక దూకాడు, చప్పుడు కాకండా. మళ్ళీ మేడతలుపులు వేసివున్నాయి. రామారావు రివాల్వరు పట్టుకుని కిందికి దిగు తున్నాడు. రవణ మేడమీదికి పాకి కిందికి వొచ్చి లలితకి తలుపు తీశాడు. లలిత తన గదిలోనికి వెళ్ళింది.

రమణ:

లలితా. వెళ్ళివొస్తాను.

రామారావు రివాల్వరుని గాలిలోకి రెండుసార్లు పేల్చి "ఎవరది, ఎవరు, దొంగలు?" అనిఅరుస్తున్నాడు. లలితరవణని కావిలించుకుంది.

లలిత:

వెళ్ళకు. రవణా, నువ్వు వెళ్ళక.

రమణ:

వెళ్ళకపోతే సన్నూ సన్నూ యిక్కడే చూస్తారు. ఇదంతా యేదో—

లలిత:

చూడనీ. కాని నిన్ను చంపేస్తారు. నువ్వులేక నేను రవణా—

ఆతనిమీద ప్రేమ అని ఆమెకి తెలుస్తోంది. కావిలించుకున్నారు యిద్దరూ.

రమణ:

లలితా, నా లలితా—

లలిత:

రవణా! నువ్వు నా రవణవి.

రమణ:

నువ్వొచ్చాయి. రా వెడదాం ఏం చేస్తాగు ?

లలిత:

(చప్పున తెలుసుకుని) నీతోనా రమణా! నేను పెళ్ళియిన దాన్ని ! నీతో ఘోరపాపం (దూరంగా వెళ్ళింది)

రమణ :

ప్రేమలేకుండా ఆ భర్తతో-అదంతా పుణ్యమా !

లలిత:

లేదు, రమణా ఎన్నడూ - ఆయనతోనైనా-(సిగ్గుపడుతోంది)

రమణ :

(చాల దిగులుతో) లలితా ! వెర్రిలలితా !

లలిత:

ఎన్నో బాధలు పడ్డాను, నువ్వుతప్ప గతిలేదు నాకు ! నువ్వే నా భర్తవి. నువ్వే నా దైవం-అబ్బా-ప్రేమ అంటే యిదా రమణా చూడు, చూడు-ఈ హృదయం, భరించలేను యీ ఆనందాన్ని ... స్వర్గద్వారాలు తెరిచారు నాముందు. రమణా నాకోసం ఎంత బాధపడ్డావు ?

రమణ :

లలితా——

లలిత:

రమణా ! ఇంక నాకేంకావాలి ? నువ్వుకాక ! నువ్వు ! ఇన్నాళ్ళు ఎట్లా కళ్ళు మూసుకున్నాను ... (బైటగోల)

రమణ :

నేను వెడతాను.

లలిత:

వొద్దు. నిన్ను చంపేస్తారు. నిన్నువొదిలి నిలవలేను, వెళ్ళకు.

రమణ:

రేపు కలుసుకుందాం, పొద్దున్నే రా—

లలిత :

నేనే మీ యింటికి వొస్తాను.

రమణ :

వెడతాను.

లలిత:

మరి వెళ్ళు ...

రమణ :

భయంలేదు.

రమణ బైటికివెళ్ళి మెట్లు దిగుతున్నాడు.
రామారావూ గుంపూ యెదురు పడ్డారు.

అందరూ:

యిదుగో యిదుగో !

రామారావు:

ఎవరు, ఎవరు ? కదిలావా కాలుస్తాను... ...ఓహో,రవణా రావుగారా—ఇదేమిటి ? ఇక్కడేం చేస్తున్నారు ? (రవణ మాట్లాడడు.)

రామారావు:

ఏమిటి. చెప్పండి. పిలవండి పోలీసుల్ని. అప్పుడు చెపుతా డేమో;

(మాట్లాడ లేదు.)

లలిత గదిలోంచి వొచ్చింది.

లలిత :

ఈయన నాకోసం వొచ్చారు

రామారావు;

నీ కోసం !

లలిత:

అవును నాతో పనివుండి; వెళ్ళండి—అందరూ వెళ్ళిపొండి. వెళ్ళు. రమణా, రేపు మాట్లాడుకోవొచ్చు ఆ విషయం.

రమణ రామారావు లలితని ఏమన్నా అంటా
డేమో అని చూసి విధిలేక వెడుతున్నాడు.

రామారావు లలితమీదికి ఉగ్రంగా రాబోతున్నాడు. లలిత చప్పున గదిలోకివెళ్ళి తలుపువేసుకుంది. తలుపు కొడుతున్నాడు.

రామారావు;

నీతో మాట్లాడాలి, తలుపుతీయి.

లలిత:

రేపు తెల్లవారి. ఇప్పుడు వీల్లేదు.

రామారావు తలుపుకొట్టి చప్పుడు చెయ్యడానికి భయపడి తిట్టుకుంటో, బెదిరించుకుంటూ వెడుతున్నాడు. మాటలు వినబడవు.

  

సీనయ్యా, భక్తులూ, ఆశ్రమంలో సంకీర్తన చేస్తున్నారు.

  

ఉదయం లలితా, రామారావూ గదిలో.

రామారావు :

నిద్రలో నడిచిపోయినావా? ఒహో; ఎంత నంగనాచివి! పాపం, నిద్రలో, అతనియింటికే వెళ్ళవలసి వొచ్చిందా?

నవ్వుతున్నాడు.

లలిత:

పోనీ, తెలిసే, కావాలిసే వెళ్ళాను. ఏమంటావు? అతనిమీద నాకు ప్రేమగనక వెళ్లాను. నిన్నరాత్రి వెళ్ళాను. ఈవాళ పగలు వెడతాను.

రామారావు :

ప్రేమా? వాడిమీద ప్రేమా నీకు?

లలిత:

అవును.

రామారావు :

ఎన్నిగుండెలతో అంటావు ఆమాట నాముందు?

ఆమెని కొట్టేటట్టు లేచాడు. కుక్క అతనిమీద దూకింది.

లలిత:

నన్ను తాకవొద్దు. మీకేమీ అధికారంలేదు ఆయన్ని పెళ్ళి చేసుకో బోతున్నాను.

రామారావు:

పెళ్ళి! పెళ్ళిచేసుకుంటారా మీరు? చేసుకుందురుగాని, ముందు యిక్కడ పెళ్ళి కానీ.

Belt తీసుకొని ఆమెని కొడుతున్నాడు. ఆమె కుర్చీని అతనిమీద విసిరివేసి తప్పించుకొని పోయింది. అతను కిందపడ్డాడు. లలిత

మేడదాటి రోడ్డుమీద రవణయింటివేపు వెడుతూంది. కుక్క వెంట పోతోంది. రవణ ఆమె యింటివేపు వొస్తున్నాడు. ఒకరినొకరు పక్క సందుల్లో Cross చేస్తారు. విధి దిగులుగా నవ్వింది.

రమణ ఇంటిముందు.

లలిత:

రవణ లేడా?

శీతాయమ్మ:

అదేమిటె అట్లావున్నావు?

లలిత:

రవణ లేడా?

శీతాయమ్మ:

వొస్తాడు. లోపలికివొచ్చి కూచో.

ఆమెని భరించలేక లలిత వెనక్కి తిరిగింది. ఎక్కడికిపోనూ అని ఆలోచిస్తుంది. Despair తో వెళ్ళుతుంది.

రవణ సరాసరి లలిత గదిలోకివెళ్ళి గంద్రగోళమూ, రామారావుపీ చూశాడు. రామారావు మొహాన నీళ్ళుచల్లి లేవతీసి పక్కమీద పడుకోబెట్టాడు. రామారావు కళ్ళు తెరిచాడు.

రమణ:

లలిత యేదీ?

రామారావు:

ఊఁ! లలితా? లలిత! ఒరే నువ్వు నా Wife ని పెళ్ళి చేసుకుంటావురా. (అనిలేచి కొట్టబోతున్నాడు.)

రమణ:

పడుకోండి. తరవాత ఆలోచిద్దాము ఆసంగతి.

వెళ్ళిపోయినాడు.

♦ ♦ ♦

శీనయ్య ఆశ్రమంలో గది.

లలిత:

ఇదీ జరిగిన సంగతి. నేను యింట్లోంచి వొచ్చేశాను. ఇంక వెళ్ళతలుచుకో లేదు.

సీనయ్య:

ఏం చెప్పను? నీ భర్త సంగతి సరే. మళ్ళీ యీ రమణమీద మనసు కలిగిందంటావు అదేమిటి?
(ఆలోచిస్తో చప్పున దూకుడుగా) ఇంక [illegible] మాడకు- భయంకరమైన, బ్రహ్మహత్యాపాతకంనుంచి, ప్రళయజ్వాల నించి పరిగెత్తినట్టు, పో వెళ్ళిపో. నీకు యీమాత్రమన్నా జీవితంలో, శాంతిమీద ఆశవుంటే, యింక... చచ్చిపోవడం నయం.

లలిత:

నాకు యీ అంధకారపు బతుకులో అతనే వెలుగు. అతన్ని ఒక్కదినం విడిచి బతకలేను. ఈ లోకంలోని సౌందర్యానికీ, శాంతికీ అతనే అర్థం.

సీనయ్య:

ఘోరమైన పాపం యీ వాంఛ!

లలిత:

మరి ఆ పాపం, తలుచుకుంటేనే యింత ఆనందం యిస్తోందే!

ప్రేమ, ప్రేమ అంటే యేమిటని వెతికానా, ఆ ప్రేమ అర్థం అతను.

సీనయ్య:

ఇదంతా నాలుగుదినాల ముచ్చట. నీ ఆత్మనాశనం నేవు చేతులు జాస్తున్నావు.

లలిత:

అవును, ఇట్లాబతికి స్వర్గానికి పోవడంకన్న ప్రేమలో, ఆనందంలో నశించటమే నయం. ఇంక మీమాటలు వినను.

సీనయ్య:

కళ్లు మూతలుపడ్డాయి కామబాధతో, (దుఃఖంగా) వినవూ! నామాట వినవూ! ఎందుకు బతికివున్నాను, ముసలివాణ్ణాయి నేను! ఈ ఘోరం చూడ్డానికి. పాపిష్టిని! (కోపంగా) బోధించాడు, బాగా బోధించి పంపాడు. తుచ్ఛుడు వాడు.

లలిత :

పెళ్ళిచేసుకుంటే యేం పాపం!

సీనయ్య:

పెళ్ళి! ఎవరిని యెవరు పెళ్ళి?

లలిత:

రవణా, నేనూ.

సీనయ్య:

రవణ నిన్నా!...అమ్మా. ఇంకో విధంగా ఆలోచించటం లేదుకద! ఆట్లాదారికిరా—పెళ్ళి! ఎవరుచేస్తారు పెళ్ళి? పెళ్లి అయిన పిల్లకి మళ్ళీ పెళ్ళి యేమిటి? శాస్త్రం, న్యాయం, సంఘం, యేదీ వొప్పుకోదు.

లలిత:

అబద్ధం.

సీనయ్య:

ఎవరనాన్నా లాయర్ని అడుగు. నేను కబురంపిస్తాను వుండు.

బైటికివెళ్ళాడు. రమణ వొచ్చాడు. చప్పున లలితా రమణా కావలించు కున్నారు. సీనయ్య వొచ్చాడు.

సీనయ్య:

(బిగ్గరిగా) ఛీ, ఛీ! పో, దూరంగా పో, వీల్లేదు. ఇట్లాంటిది నా ఆశ్రమంలో వీల్లేదు. నా ఆశ్రమంలోనే కాదు యీ పవిత్ర భారతభూమిలో వీల్లేదు.

రమణ:

ఏమిటి సీనయ్యా!

సీనయ్య:

నాతో మాట్లాడకు. నువ్వు పరమపాతకివి. భరతమాతకి చెడపుట్టిన ద్రోహివి. ఈమెనెట్లా పెళ్ళి చేసుకుంటావురా? (లలితతో) అడుగు. ఆయన్నే అడుగు.

లలిత కళ్ళతో అడిగింది. రమణ వీల్లేదని తలవూయించాడు.

లలిత:

ఎంత ప్రేమించినా?

సీనయ్య:

హిందూ ధర్మభూమిలో వివాహవిచ్ఛేదన అనేది లేదు.

లలిత:

మరి యేంచేద్దాం?

రమణ:

లలితా, యీ వివాహం మూర్ఖత్వాలతో ఏం పని మనకి? నేను సర్వమూ నీకోసం త్యాగం చెయ్యడానికి సిద్ధంగా వున్నాను.

సీనయ్య:

నోరుముయ్యి. నీ దేశాన్ని, నిన్ను నమ్మిన ప్రజల్ని, నీ పురోభివృద్ధిని—

రమణ:

ఆ! చాలామంది వున్నారు దేశసేవకులు.

సీనయ్య:

నీ తల్లిని—

రమణ:

(బాధతో) నన్ను ప్రేమించేదైతే నా తల్లి నన్నర్థం చేసుకుంటుంది. లలితా నువ్వొ సిద్ధమైతే—

సీనయ్య:

కాదు, కాదు, కాదు, ముమ్మాటికీ కాదు.

లలిత:

ఇంక మరి వేరుగతి లేకపోతే —

సీనయ్య:

అనకు ఆ మాట అనకు.

రమణ:

అంటుంది. నన్నూ, లలితనీ, నువ్వే కాదు, నీయీశ్వరుడే, విధే వేరుచెయ్యలేరు. రా, లలితా!

సీనయ్య:

వెళ్ళి—

లలిత మాట్లాడలేదు.

వెళ్ళి-పాపంలో, వ్యభిచారంలో, రోతలో, అతనితో బతుకుతావా? ఫో, ఫో. నీభర్తనించి, నీ తల్లిదండ్రుల దగ్గిర్నించి, భాగవతుల నించి, నానించి, యీశ్వరుడినించి-దూరమైపో.

రమణ:

ఎందుకు యీశ్వరుడనీ, పాపమనీ లలితని బెదిరిస్తారు? ఆ మూఢనమ్మకాలకి జంకకు, లలితా!

సీనయ్య:

మూఢనమ్మకాలా! ఇంకోడి డబ్బూ, యింకోరి భార్యనీ లాక్కోడం తప్పనడం మూఢనమ్మకాలా! ఎవరు, ఏ శాస్త్రం, ఏ నీతి వొప్పుకుంటుంది?

లలిత:

ఇంక నాకు గతిలేదా? ఏం చెయ్యను?

రమణ:

లలితా, సంకోచించకు. సర్వమూ నాశనమే కానీ, నీతికీ, ధర్మానికీ, విరోధమే కానీ, మన ప్రేమకన్న ఉన్నతం లోకంలో లేదు. నీ హృదయాన్ని అడుగు కర్తవ్యమేమిటని. ఎవరి మాటలూ వినకు.

సీనయ్య:

ఇంకో సంగతి...రమణా నువ్వు కొంచెం బైటవుండు, లలితతో మాట్లాడాలి.

రమణ:

నేను వెళ్ళను, లలిత నాతో వొస్తే నే కాని.

సీనయ్య:

వెళ్ళమను లలితా?

రమణ :

అనకు లలితా. ఈ సీనయ్య మతపిశాచం చేతులో చిక్కి, పాతచచ్చు నీతులు బోధించి నీ మనసు చెరుస్తాడు. ఈ మతంగాళ్ళకి మనుష్య హృదయాలకన్న, వీళ్ళు గుడ్డిగా నమ్మే నీతులు యెక్కువ ముఖ్యం.

సీనయ్య :

(ఏడుస్తో) నమ్మరా ! నన్ను నమ్మరా ! నిన్నేం చేస్తాను లలితా ! రెండుమాటలు. అతను వినకూడని మాటలు.

లలిత రమణవంక చూస్తోంది. అతను సిగ్గుపడి వెళ్ళాడు.

సీనయ్య :

లలితా, నీకు నిజంగా రమణ మీద ప్రేమ వుందా?

లలిత :

అడుగుతారా? మాటలతో చెప్పలేను.

సీనయ్య :

అయితే అతన్ని చేతులారా నాశనం చెయ్యబోతున్నావు తెలుసునా ?

లలిత:

నేనా ?

సీనయ్య :

రేపు మీా యిద్దర్నీ పలకరించేవారు వుండరు. ఒకరి మొహాలు ఒకరు చూసుకుంటూ—బీదతనం, వెలి, పాపమనే దిగులు–

లలిత :

అవన్నీ సరేలెండి.

సీనయ్య :

తరవాత—చూడు. రేపు కాంగ్రెసుకి ఎట్లాగూ విజయం నిశ్చయం. రవణ తప్పక మంత్రి కాబోతున్నాడు. అది అతనికీ తెలుసు. కాని నీ సంసారబాధ చూడలేక తన జీవితాన్నంతా త్యాగాన్ని చేసి, నీ పాదాల ముందు పారెయ్యా తలుచుకున్నాడు. అతని ఘనస్వభావం అట్లాంటిది. అతని కృషికంతా త్యాగానికంతా ప్రతిఫలం, అతనికి దక్కే నిముషాన నువ్వు అతని నోటిముందునించి లాగేస్తున్నావు. అతని ముసలి తల్లి గతి తలుచుకో–

లలిత తల తిరిగి పడిపోయింది.

సీనయ్య :

(ఏడుస్తూ) నాకు ప్రపంచంలోకల్లా ఆప్తులు మీారిద్దరూ. మీారు పెళ్ళిచేసుకుంటామంటే, ఆనందంతో గంతులెయ్య వలసిన నేను, యిద్దర్నీ దుర్భాషలాడవలసి వొచ్చింది నా గతి! ముసలి పీనిగని బతికివుండకబోతేనేం, యింత కాలం. (లలిత లేచి యేడుస్తోంది) లలితా, లలితా, నేనేం చెయ్యను? అధర్మం, పాపం, ఘోరం, ఏ నాలికతో అంగీకరించను! యీా నాలుగు రోజుల దేహసౌఖ్యంకోసం, ఆత్మ వినాశనాన్ని! (లలితను బుజ్జగిస్తున్నాడు.) రవణని

పిలవరా ? పాపం రవణ – అంత ధీరుడు – ఉత్తముడు (నాలిక కొరుక్కుని ఫూరుకున్నాడు.) ఏమంటావు అత నితో—అతనికోసం త్యాగం అనకు. నీకేయిష్టంలేదు, ధైర్యంలేదను.

లలిత మాట్లాడకుండా కన్నీరు విడుస్తోంది. సీనయ్య క్రూరత్వం మొహంలోకితెచ్చుకుంటున్నాడు. రమణారావూ అని పిలిచాడు. రమణ వొచ్చాడు. ఇద్దరి మొహాలూ చూసేప్పటికి అర్థమయింది రమణకి. .... ....

రమణ:

(సీనయ్యతో) నువ్వుకొంచం వెళ్ళుమరి నేను, లలితతో మాట్లాడాలి.

సీనయ్య లలితవంక చూస్తోవెళ్లాడు. ఒక నిమిషం నిశ్శబ్దం.

రమణ:

లలితా, మారిపోయినావా !

లలిత:

రవణా, నేను ధర్మం మీరలేను.

రమణ :

లలితా, లలితా – ఎన్నాళ్ళు తపించాను నీకోసం ? (కావిలించుకో బోతున్నాడు)

లలిత:

అక్కడే రవణా, నేను నీ భార్యనికాను. నన్ను తాకకు, నన్ను భాధించకు, నువ్వు వెళ్ళు.

రమణ :

నన్ను ప్రేమించడంలేదా ?

లలిత:

(కష్టంతో) లేదు.

రమణ :

నిన్న రాత్రీ !

లలిత:

ఏదో కల రవణా ! నేను చెప్పలా – ఎప్పుడూ లేదు నీ మీాద అట్లాంటి ప్రేమ నాకు.

రమణ :

నిజమా !

లలిత:

నిజం.

రమణ:

ఇప్పుడేమవుతావు ?

లలిత:

తెలీదు. నువ్వు వెళ్ళు రవణా, నేనెవర్ని ! ఒక్క స్త్రీకోసం, నీ ఆదర్శాలన్నీ నాశనం చేసుకుంటావా ? వెర్రివాడా ?

రమణ:

లలితా, ఇంక నాకు జీవితమే లేదు, నువ్వు తప్ప !

లలిత :

నేనేం చెయ్యను ? నీమీాద నాకు మనసు కలగంది !

రమణ :

ఆ—అతనిమీాదనే యిష్టమా ?

లలిత :

అవును. (అతి కష్టంగా అబద్ధమాడింది)

రమణ తలవంచుకొని వెడుతున్నాడు. లలిత భరించలేకపోయింది.

లలిత :

రమణా, నన్ను మరిచిపో. నీ ప్రేమకి అనర్హురాలిని, సత్యమూ, నీతీ, ధైర్యములేని అప్రయోజకురాల్ని దీన్ని మరిచిపో. వొచ్చి నాతో నీకేంసౌఖ్యం, నీతి తప్పానసే దిగులుతో నీకు వొక్కరవ్వ విశ్రాంతి నివ్వను. వెళ్ళు, మరిచిపో—

రమణ :

చాతనైతే యింకేం ?

లలిత :

కాలం గడిచిన—

రమణ :

కాలమా ? కాలమంతా ఒక్క మొదతెగని అర్థంలేని అంధకార సముద్రం – బతుకా ? ఇంక నాకేం బతుకు ? ఎందుకు బతికి ? లలితా ! నా లలితా ! (అని నెమ్మదిగా అంటూ వెళ్ళిపోయినాడు.)

కుక్క యేడుస్తోంది.

లలిత కింద పడిపోయింది. సీనయ్య వొచ్చి లేవతీస్తున్నాడు. లలిత కళ్ళు తెరిచింది. .... ....

♦ ♦ ♦

పల్లెటూళ్ళలో కాంగ్రెసు election Propaganda.

♦ ♦ ♦

పల్లెటూళ్ళలో రామారావు elections Propaganda.
రామారావు ఇంటినిండా election guests అడావిడి.

♦ ♦ ♦

లలిత వొకర్తే గదిలో దిగులుగా కూచునివుంది.
దిగులుగా పాడుతోంది. కుక్క యెదురుగా కూచుని తల
ఊపుతోంది దిగులుగా. .... ....

[రామారావు ఇల్లు - కామయ్య]

కామయ్య :

మనం డబ్బు వెదచల్లి తేనే కాని, మనకి యేమాత్రమూ
Chance లేదు యీ election లో.

రామారావు:

ఏదయ్యా డబ్బు!

కామయ్య :

నేనేం చెప్పను? కుశాల్జీ దగ్గిర మళ్ళీ కాయితం వ్రాయండి!

రామారావు :

మూడు యేపాయలు వొడ్డీ అడుగుతున్నాడు. ఏం చేస్తాం?
ఎంత?

కామయ్య :

ఓ యిరవై వేలనాన్న...

రామారావు:

కానీ... మరి ఆ ముప్పైవేల వారంటు అట్లానే వుంది. ఈ
మేడకి యీ. వెధవ పల్లెటూళ్ళో చేరమే రాలేదు,
ఏంచేద్దాం? ఈ మామగార్తైనా తొరగా చావకూడాదూ?

(కాంగ్రెసు Camp.)

అందరూ వుత్సాహంగా Meeting కి బైలుదేరతున్నారు. రమణ ఒకమూల దిగులుగా కూచుని కదలడు. శోభనాద్రి సీనయ్యకి రమణ వాలకం చూపుతాడు. సీనయ్య తను అతన్ని తీసుకొస్తాను, వాళ్ళని వెళ్ళమంటాడు. వాళ్ళు వెడతారు. .... .... .... ....

సీనయ్య :

లే. లే. ఈ election సమరానికి నువ్వు అర్జునుడూ, నేను కృష్ణుడూ, పద. (రమణ కదలడు.) చూడు. ఈ మాయా ప్రపంచంలో యీ స్త్రీ వ్యామోహమే పెద్ద వల. నీ హృదయంలో వెలుగుతున్న లలితకి అంధుడివై, ప్రపంచమంతా వెతకడంవల్లనే ఈ బాధ-లలిత ఆ మహాజనని లావణ్యంలో రేఖ. పిచ్చివాడా, క్షణభంగురమైన మోహంకోసం, నీ ఆత్మనీ, దేశసౌభాగ్యాన్నీ త్యాగంచేసి, యీ మహాసంగ్రామం ముందు అస్త్ర సన్యాసం చేస్తావా? నీ విధిని నువ్వు నిర్వర్తించి, తక్కింది దైవానికి వొదులు.

రమణ :

దేవుడిపేరు యెత్తకు. దేవుడే - ఓ హృదయమున్న దేవుడే వుంటే, యింత దారుణం——అంతా, అంతా, లోకమంతా యింత అధర్మం తాండవమాడుతుందా!

సీనయ్య :

అధర్మమంతా నీ వాంఛా, నేత్రాలు కల్పిస్తున్న-

రమణ :

నోరుముయ్యి - నువ్వో ఆ దేవుడి బంటువి. నీమూలానే అహింసాతత్వం ఒకటి వొచ్చిందిగాని లేకపోతే నిన్ను -

ఆవేశం యెక్కువై సీనయ్య మీద పడి కంఠం నులుము
తున్నాడు. సీనయ్యకి వూపిరి ఆడదు. చస్తున్నాడు. కాని
చెయ్యి యెత్తికూడా Defend చేసుకోలేదు. నిస్సహా
యుడై రమణ వొదిలాడు. .... ....

సీనయ్య:

పద, పోదాం.

పొలాలమధ్య సీనయ్యా, రమణా పోతున్నారు.

రమణ:

ఈ కాంగ్రెసువల్లనే కైదుకిపోయి లలితని పోగొట్టుకున్నాను.
బైటవుండి చూస్తే, ఆ పెళ్ళికి వొప్పించావు-నువ్వు.

సీనయ్య:

నేనేమిటి? అట్లా వ్రాసివుంటె—

రమణ:

నువ్విప్పుడు చావాలని వ్రాసివుంది. (బురదలోకి సీనయ్యని తోశాడు)

తన కాలుకింది పురుగుకి దెబ్బతగిలిందేమోనని తీసేస్తున్నాడు సీనయ్య.

సీనయ్య:

పురుగుకి మరణం వ్రాసివుందిగావును-యీ సాయంత్రం.

రమణ సీనయ్యని యెత్తి ఉత్తరీయంతో
తుడుస్తున్నాడు. సీనయ్య పాడుతున్నాడు.

సీనయ్య:

ఏమో, లలితనే నువ్వు పెళ్ళిచేసుకుంటే, కాంగ్రెసు పని
యింతశ్రద్ధగా చేసేవాడివా? అందుకునే యీశ్వరుడు—

రమణ :

ఈశ్వరుడి పేరెత్తావా—

సీనయ్య:

ఈశ్వరుడు కాదులే, శూన్యం. ఆ శూన్యానికి నీమీద యెంత ప్రేమ లేకపోతే, నిన్నింత వియోగాగ్నిలోంచి...

రమణ కోపంగా మీదికి వొస్తున్నాడు.

ఈ పాలంలో తొయ్యకు, కర్షకుడికి నష్టం.

రమణ :

అంతేలే. అట్లా కుళ్ళి లలిత చచ్చిపోతుంది. నేనిట్లా వేదన పడి నశిస్తాను. నువ్వూ నీ హిందూధర్మమూ వెయ్యేళ్ళు శాశ్వతంగా జీవించండి.

సీనయ్య దిగులుగా యోచిస్తున్నాడు.

♦ ♦ ♦

కాంగ్రెసువాళ్ళ మీటింగు.

[శోభనాద్రి ఉపన్యాసం.]

మేము దేశంనించి యీ దారిద్ర్యాన్ని పారతోలడానికని కంకణం కట్టుకున్నాము. ధనం, భూమి, పదార్థాలు తమవిగా దాచుకునే వాళ్ళదగ్గిరనించి తప్పించి సర్వమానవులకు తిండీ, సౌఖ్యము కలిగేట్టుచేసి, 'సర్వేజనాస్సుఖినో భవంతు' అనే వేదవాక్యాన్ని యదార్థం చేయతలుచుకున్నాము. మాకు విజయాన్ని సమకూర్చే బాధ్యత మీమీద వుంది.

జాతీయగీతం.

♦ ♦ ♦

పల్లెటూళ్ళో రామారావు Camp. బంగళాలో రామారావు తోచక
అటూ ఇటూ తిరుగుతున్నాడు. సాయంత్రం చెరువుకి ఒకపిల్ల
నీళ్ళకి వొచ్చింది. చూశాడు.

రామారావు:

వెంకన్నా, ఆ పిల్ల యెవరో కనుక్కో.

ఇద్దరు నౌకర్లు వెళ్ళారు.

వెంకన్న:

దొరగారు రమ్మంటున్నారు, అట్లారా.

పిల్ల:

ఎందుకు ?

వెంకన్న:

ఎందుకేమిటి ? ఓసారి దొరగారు పిలుస్తూవుంటే ! మంచి
బహుమానం దొరుకుతుంది పద.

పిల్ల:

నాకు అఖ్ఖర్లేదు.

పోతోంది. సంజచీకట్లో నోరుమూసి ఆ పిల్లని యెత్తుకుపోతున్నారు.
అరుస్తోంది. ఒక వెట్టివాడు దూరంనించి చూసి వూళ్ళోకి పరి
గెత్తి గోలచేశాడు.

రామారావు తనని ఎదిరించే పిల్లతో గోల పడుతు
న్నాడు. వూళ్ళోవాళ్ళు కర్రలు తీసుకుని బైలుదేరారు.
రామారావు రివాల్వరు గాలిలో కాల్చి దడిపించాడు.
చివరికి భయపడి మోటారులో ఎక్కిపారిపోయినాడు
పిల్లనివొదిలి. గుంపు campని ధ్వంసం చేసింది.

  

కాంగ్రెసు camp. నిద్రలు-అర్ధరాత్రి. రమణ మేలుకొనేవున్నాడు. లేచి సైకిలుమీద చీకట్లో పోతున్నాడు. రామారావు మేడదగ్గిరికి పోయి లలితగదికేసి చూస్తూ నుంచున్నాడు. సంగీతాలు వినపడుతున్నాయి. చప్పున మళ్ళీ గోడదూకి పాకి, లలిత గదిముందు వరండాలో నుంచుని లలితకేసి చూస్తున్నాడు. లలిత దేవిపటం ముందు ప్రార్థిస్తో కూచుంది.

రమణ:

లలితా.

లలిత:

ఎందుకు యిట్లా వొచ్చావు? వెళ్ళు. నిన్నుచూస్తే నా నిశ్చయం చెడిపోతుంది.

రమణ:

ఏమిటి, బొమ్మల్ని ప్రార్థిస్తావు? ఏం వొస్తుంది లాభం? ఆ కాయితం వింటుందా!

లలిత:

మరి నాకు యింకెవరు దిక్కు?

రమణ:

నేను.

సంతోషంగా గర్వంగా చూస్తోంది అతన్ని.

లలిత:

అంత అదృష్టమా!

సుందరి వెనకాలేవొచ్చి వింటోంది.

రమణ:

ఎట్లా వున్నావు?

లలిత:

మామూలే.

రమణ:

నువ్వు ఏదో అపాయంలో వున్నావని భయమేస్తుంది. ప్రతి రాత్రీ-ఆ పశువు——

లలిత:

election గోలల్లో వున్నారు. భయంలేదు ప్రస్తుతం.

రమణ:

ఇంతేనా యింక ...

లలిత:

వెళ్ళు, ఎవరన్నా చూస్తారు. రావొద్దు ఇట్లా ప్రతిరాత్రీ. ఏం లాభం !

రమణ :

నిన్ను చూడ్డమే, లలితా ఇంతేనా మనకింక ! నేను వొప్పు కోను-నిన్ను భయపెట్టాడు ఆ సీనయ్య. నే నూరుకోను. నిన్ను ఎత్తుకుపోతాను - నిజంగా నా మీద ప్రేమలేదా లలితా ... మాట్లాడవు, అబద్ధమాడవు లలితా ! ఇద్దరి అమూ ల్యపు బతుకుల్ని నీతిపేర దగ్ధం చేస్తున్నావు. నిజం మాట్లాడు, నామీద ప్రేమలేదా ?

లలిత :

ఎందుకు అడుగుతావు రమణా తెలిసిందానికి.

రమణ:

(సంతోషంతో) ఐతే రా.

లలిత:

నా నిశ్చయాన్ని చెడకొట్టకు.

రమణ:

చెడకొట్టి తీరతాను.

లలిత:

ఇప్పుడు వెళ్ళవూ.

రమణ వెడుతున్నాడు.

రమణ :

ప్రతీరాత్రీ వొస్తాను, నువ్వు వొప్పుకున్నదాకా ?

రమణ camp చేరుకునేటప్పటికి శోభనాద్రి మేలుకుని వున్నాడు.

శోభనాద్రి:

ఇట్లా ప్రతిరాత్రి వెళ్ళివస్తావా, రవణా !

రమణ:

నిలవలేను.

శోభనాద్రి:

పరిస్థితులు తలకుమించినప్పుడు లొంగడం పవేకుల లక్షణం! ఈ బాధ నీదీ ఆమెదేకాదు. యీ సంఘం పుట్టినప్పణ్ణించి యెంతమంది, ఇకముందు యెంతమంది ప్రజలు ఇట్లా హృదయాలు చీలి నశిస్తారో యిట్లానిర్థకంగా ప్రేమించుకుని!

రమణ:

ఏం చెయ్యను?

శోభనాద్రి:

Assembly కి వెళ్లి Divorce Bill ప్రవేశపెట్టించు. నీబాధకి ప్రతిఫలంగా యీ వివాహపు సంకెళ్ళలో మూలిగే స్త్రీ జనాన్ని ఉద్ధరించు.

రమణ:

కాని యీలోపల-నా లలిత.

శోభనాద్రి:

రామారావుని చంపనా!

రమణ:

వృధాగా, ఇంగ్లీషువాళ్లని ద్వేషిస్తున్నాముగాని-మనచుట్టూ మనలోనే ఘోరమైన క్రూరత్వాన్ని చలాయించే ఆ భర్తల్ని-నరపశువుల్ని వధించి భూభారం తగ్గించడం చాలా ఉత్తమ కార్యం.

  

రామారావు యింట్లో ఆటలూ, పాటలూ. కామయ్య, ప్రకాశరావు వొచ్చి, రామారావుని పక్కగదిలోకి తీసి కెళ్లారు.

ప్రకాశరావు:

లాభంలేదు. ఇప్పుడన్నా మీరు with draw ఐతే మంచిది.

సుందరి వచ్చి వింటోంది.

రామారావు:

ఇంతడబ్బూ తగలేసి——

కామయ్య:

డబ్బు తీసుకుని వాళ్ళకి Vote చేసేట్టున్నారు.

రామారావు:

వోడిపోయినామూ — ఇంక Public insolvancy తప్పదు. ఏం చేద్దాం ?

కామయ్య :

ఆ రమణారావు తప్ప ఇంకోడైతే...

ప్రకాశరావు :

అతన్ని మాయించేస్తే—

అతనిమీద ప్రజలకి విశ్వాసం చెడకొట్టాలి.

రామారావు :

వ్యవధి ఏదీ దేనికీ ?

కామయ్య, ప్రకాశరావూ వెళ్ళారు. సుందరి వొచ్చింది.

సుందరి :

నేనున్నాను కదా, ఎందుకు దిగులు నీకు ?

రామారావు ;

ఎట్లానన్నా రవణారావుని లలిత గదిలోకి రప్పించగలిగితే—

సుందరి :

ఎప్పుడు రావాలి ?

రామారావు :

రేపు అర్ధరాత్రి.

సుందరి :

వొస్తాడు.

రామారావు:

ఎట్లా ?

సుందరి :

నాకు వొద్దులు. నేనున్నాననుకదా—ఎందుకు దిగులు నీకు?

రామారావు:

ఎట్లానన్నా! రమణారావుని ఇక్కడికి రప్పిస్తే—

సుందరి :

ఏంలేదు. లలిత అపాయంలో వుందని కబురు అందచెయ్యి—

రామారావు:

చేస్తే—

సుందరి :

నీకెందుకు? పంపించు.

  

రాత్రి కాంగ్రెస్ Camp. పెద్దమంట, చుట్టూ కూచుని వున్నారు. దూరాన్నించి రమణ వొచ్చాడు, దిగులు మొహం వేసుకుని.

వాలంటీర్లు :

కాబోయే మంత్రిగారికి జయ్!

ఒక వాలంటీరు :

ఏమైతేనేం? ఇంత మనోవ్యాధితో కుంగిపోయేవాడికి ఏం లాభం! నాకు కాకూడదూ?

రెండో వాలంటీరు :

తాతయ్యగారూ, మీరు వుండికూడా రమణ మనస్సుని—

సీనయ్య :

అది నిరీశ్వరత్వమనే వ్యాధి!

మూడో వాలంటీరు :

మందూ ?

సీనయ్య :

ఈశ్వర సంకీర్తన.

రెండో వాలంటీరు :

కానీండి, ఒక dose యిద్దాం రవణకి. (పాడుతున్నారు.)

శోభనాద్రి :

(రవణతో) రవణా, నువ్వు వెళ్ళడానికి వీల్లేదు, యీ రాత్రి.

  

రామారావుయిల్లు. బైట ఇద్దరు పోలీసులు పుత్త డ్రెస్‌లో; చెంచురామయ్య, ఇంకా ఇద్దరు వూరి పెద్ద మనుష్యులు, Sub-Inspector. ... ... ...

రామారావు:

ఈ యింట్లో జరిగే కుట్రలని మీ కళ్ళ పడేద్దామని పిలిచాను. అంతకన్న యేం లేదు.

  

అర్ధరాత్రి రవణ సైకిలు మీద వొస్తున్నాడు. వెనక కన పడకండా శోభనాద్రి బైలుదేరాడు, సీనయ్యావాళ్ళ భజన. లలిత దిగులుగా బల్లమీద తల పెట్టుకుని కూచుంది. రమణ గోడ దూకి లోపలికి వొచ్చాడు. రామారావు దూరంనించి చూస్తున్నాడు. .... ....

రమణ :

లలితా ... ఎట్లా వున్నావు ?

లలిత:

రావొద్దనలేదా రమణా ?

రమణ:

ఎంత చిక్కిపోయినావో ! ఎట్లా—

లలిత:

రమణా, నేనీ బాధని, యీ వొంటరితనాన్ని భరించలేను. నన్ను తీసుకుపో. (అతని చేతుల్లో వాలింది.)

రమణ :

వొచ్చెయ్యి - రా పోదాం.

లలిత:

ఇంక భరించలేను, నా చాతకాదు.

రామారావు సంజ్ఞచేస్తున్నాడు. అందరూ వచ్చారు.

పోలీసు :

మీరు arrest కింద ఉన్నారు. రండి.

రమణ నిశ్చలంగా నడుస్తున్నాడు. కుక్క గోలపడుతోంది. చెంచు రామయ్య మండిపడుతూ లలిత వంక చూస్తున్నాడు. ....

చెంచురామయ్య :

ఇదా సంగతి !

లలిత:

నాన్నా, రమణని జైలుకి పంపకండా చెయ్యలేవూ ? అతను ఏమీ ఎరగడు. నిర్దోషి.

చెంచురామయ్య :

ఛీ ! తప్పుడుదానా, మాట్లాడకు.

లలిత కొంచెం వూరుకుంది.

లలిత:

ఏమిటి నాన్నా, నేను చేసినపని! మీరు చేసిన పనులు ఏమీ దోషాలుగా నన్నా కనపడవు. నేను నాకీ సంబంధం వొద్దని యేడ్చిన సంగతి, చివరిదాకా తప్పించుకోవాలని నేను పడ్డబాధ - (రామారావు వేపు తిరిగి) ఈయన దుష్ప్రవర్తన, నా కళ్ళముందు సుందరితో వ్యభిచారం ఇవేమీ తప్పులుకావు. దిక్కులేనిదాన్ని యీయన చేతికి చిక్కి నాశనమవుతూవుంటే, నా జీవితంలోకి ఒక్కకొంచెం కాంతిని తెచ్చిన రమణకి కైదా!

చెంచురామయ్య:

నోరుముయ్యి. (అందరూ వెళ్ళిపోయినారు)

లలిత ఏంచెయ్యడానికీ తోచక నిర్ఘాంతపోయింది.

♦ ♦ ♦

రమణా పోలీసులూ వెడుతున్నారు, వీధులో.

శోభనాద్రి కలుసుకున్నాడు.

శోభనాద్రి:

ఇదేమిటి రమణా!

రమణ:

ఆలోచించుకో. రామారావు వేసినవల.

శోభనాద్రి:

ఏ నేరం?

రమణ :

అడగడమెందుకు? జైలు కొత్తేముంది? న్యాయచట్టాలు ఘాతకులిన్నీ, ధనవంతులిన్నీ, నిరంకుశులిన్నీ రక్షించే ధర్మచట్టాలు.

శోభనాద్రి:

ఈయన యెవరో తెలుసా!

పోలీసు:

ఏం లేదండీ— రేపొద్దున్న విడిచిపెట్టేస్తారు.

రమణ :

శోభనాద్రీ! లలిత జాగ్రత్త! ఏం చేస్తాడో ఆ దుర్మార్గుడు, ఇక్కడే వుండు తెల్లార్లూ. ఈ దేశరక్షకులు ననూ, నిన్నూ భద్రంగా దాచి వుంచుతారు. అపాయంలో వేళ్ళాడే లలితకే దిక్కూ వొక్కరూ వుండరు. భార్య! ఎంత చవక భార్య!

రమణని జైలులో వేసి తాళం వేశారు.

  

శోభనాద్రి లలితగది యేదో తెలీక యింటికంతా గస్తీ కాస్తున్నాడు.
హాల్లోకి వెళ్ళారు. రామారావూ, చెంచురామయ్యా.
సుందరి కూచుని వుంది.

రామారావు:

తెలిసిందా మీకూతురు ప్రవర్తన—

చెంచురామయ్య:

ఆ తెలిసింది. నువ్వూ, నీ ముండా యెన్ని నెలలనించి దాని ప్రాణం వుసూరుమనిపించి యీ గతికి తెచ్చారో అదికూడా

తెలుస్తూంది. (సుందరితో) పద ముందు; యీ యింట్లోంచి బైటికిపద. నాకిళ్ళ పద్దావా; (గెంటుకొని పోతున్నాడు)

సుందరి వెళ్ళిందని దిగులు. తాగుతున్నాడు.

తాగుతో లలిత గదికి వెళ్ళాడు.

రామారావు;

ఇంక యొక్కడికి పోతావే, తప్పదు ముండా! అయింది వాడి పని. పోయినాడు జైలుకి ఇంక నీకెవరు దిక్కు!

మీదకి పోయినాడు - లలిత తప్పించుకుంటోంది. కాని చివరికి కిటికీదగ్గిర ఇరికించి మీదికి వొచ్చాడు.

లలిత:

ఇంక రాకండి, చెప్తున్నా వినండి.

రామారావు;

**ఏమే! నీ మొగుణ్ణికానటే!**

**లలిత:**

కాదు.

రామారావు:

కాదా? ఎవడే నీ మొగుడు? వాడా! ఆ జైల్లోవాడా?

మీదికిపోయి పట్టుకో పోయినాడు. లలిత మేడమీదనించి కిందికి దూకింది. శోభనాద్రి ఆ చప్పుడు విని, ఆమెనెత్తి గోలచేశాడు. అందరూ వొచ్చారు. ఆమెకి స్పృహలేదు. ఆస్పత్రికి తీసుకుని వెళ్ళారు. కుక్క వెంట వెళ్ళింది.

♦ ♦ ♦

ఆస్పత్రి పక్కనే జైలు. రమణ ఆ గోల విని ఏమిటా అనుకుంటున్నాడు.

♦ ♦ ♦

డాక్టరు లలితని పరీక్ష చేస్తున్నాడు. తల పగిలింది, కట్టుకట్టారు.

♦ ♦ ♦

శోభనాద్రి congress campకి సైకిలుమీద వెళుతున్నాడు.

♦ ♦ ♦

రమణ పోలీసుల్ని అడుగుతున్నాడు, ఏమిటీ గోల అని.

పోలీసు:

ఆమె రామారావుగారి భార్య. మేడమీదనుంచి కిందికి దూకిందట?

రమణ:

ఏమయింది?

పోలీసు:

ఏదో కొంచెం దెబ్బ తగిలింది, డాక్టరు కట్టుకడుతోంది.

రమణ ఆదుర్దా.

♦ ♦ ♦

Mission hospital

లలితని కట్టుకట్టి పడుకోబెట్టారు.

డాక్టరు:

(నర్సుతో) ఈమెకి స్పృహరాగానే యీ మందివియ్యి. లేవనీ వొద్దు.

♦ ♦ ♦

తెల్లారుతోంది.

సీనయ్యా, వాలంటీర్లూ, శోభనాద్రీ పరిగెత్తుకుంటో వొస్తున్నారు.

పోలీసులు రమణని బావిదగ్గిరికి తీసుకొచ్చారు.

సీనయ్యావాళ్ళూ సమీపిస్తున్నారు.

♦ ♦ ♦

నర్సు కునికిపాట్లు పడుతోంది. లలిత కళ్లు తెరిచింది.
దీపం భగ్గున మండి ఆరిపోయింది. లలిత రమణని చూసింది. లేచి
పరిగెత్తింది. సగందూరంలో రమణా అని అరిచింది. రమణ వాదని
బావిలో వొదిలి పరిగెత్తాడు. ఆమెని పట్టుకున్నాడు. కుక్క చూస్తోంది.

♦ ♦ ♦

సీనయ్య పటాలం 'రమణారావుకీ జెయ్,
మా నాయకుడికి జెయ్' అని కేకలు
లలిత అతని మెడని కావిలించుకుని ప్రాణం వొదిలింది.
కుక్క యేడుస్తోంది.
సీనయ్యావాళ్ళూ వొచ్చారు.
రమణ ఆమెనెత్తుకుని పిచ్చివాడి
మల్లే ఆకాశంవంక చూస్తున్నాడు.

రమణ :

(వెర్రిగా నవ్వుతూ) సీనయ్యా, తీసుకుపోయి రామారావు
వప్పచెప్పు.

సీనయ్య:

ప్రభూ! ఏంచేశావు?

రమణ :

నీకూ నీ ప్రభువుకీ సంతోషంగా వుందా?

అని లలితనెత్తుకొని పరిగెత్తుతున్నాడు.

'జీవనే మరణ్
మరణే జీవన్'
అని పాడుతో.

— ... —

# మంగమ్మ

## ౧

సాయంత్రం నాలుగ్గంటలు. మంగమ్మగారి ఇంటిపక్కన మామిడి తోటలో నీరద, వసంతం కూచుని వున్నారు. ఇద్దరి జడలూ ఒకదానికొకటి ముడేశారు, చేతులు వెనక్కి కట్టేశారు. దిక్కు మొహాలు. నీరదకి యెనిమిదేళ్లూ, వసంతానికి యేడేళ్లూ.

నీరద:

అంతేకావాలి బాగాయేడు. నాజుట్టు కోస్తానంటావా?

వసంతం:

కోస్తా? ఇంకా బాగా కోస్తా... నొప్పి, నొప్పి అట్లాలాగకు.

నీరద:

వుండు, వసంత్, కొంచెంవుండు. కాలుమీద చీమ పాకుతోంది_ ఎట్లా తీసెయ్యను? వసంత్, నువ్వుతియ్యవూ?

వసంతం:

యెట్లా?

నీరద:

అవును, ఏంచేద్దాం? ఎవరూ రారేం?

వసంతం:

యెందుకువొస్తారూ? వాళ్ళకేం ... అక్కా యిట్లాగే పడుస్తూ వెళ్లిపోదాం, వీళ్ళకి కనపడకుండా?

నీరద:

యెక్కడికి?

వసంతం:

యెక్కడికన్నా సరే. ఈ పంజరంలోంచి యెగిరిపోదాం.

నీరద:

పంజరంలోంచా! అమ్మమాటలు మాట్లాడుతున్నావు.

వసంతం:

అమ్మయేడవడం, నాన్న మళ్ళీ పెళ్ళిచేసుకున్నందుకేగా!

నీరద:

అమ్మమ్మే పెళ్ళిచేసింది... నా చేతులునొప్పిపుడుతున్నాయి. (విమల వొచ్చింది. ఇరవై మూడేళ్ళు) అమ్మ అదుగో! అమ్మా!అమ్మా! కొంచెం వొదులు చెయ్యి నొప్పిపుతోంది.

విమల:

(తాళ్ళు విప్పుతో) మళ్ళీ కట్టించా, ఎందుకు?

నీరద:

పిల్లిని యేడిపించామని.

విమల:

దానికి పిల్లలకన్నా పిల్లి యెక్కువ!

వసంతం:

పిల్లి పీకిందమ్మా!

విమల:

అయ్యో, ఎంతెంత గాట్లుపడ్డాయో! ఆ గొడ్రాలు ముండ నా పిల్లలికి యిట్లా యాతన పడుతోవుంటే నోరెత్తేగతి లేదు నాకు!

వసంతం:

చూడమ్మా, ఎంత యెఱ్ఱపడ్డదో!

విమల:

అవును. బాబూ!

వసంతం:

అందుకని నాకు రెండు లడ్లెక్కువ యియ్యాలి.

నీరద:

నాక్కూడా ఇయ్యాలి .... చూడు అమ్మా .... అంతా వూడింది. మళ్ళీ కట్టు వొద్దులుగా! ... అమ్మా యెందుకు ఏడుస్తావు?

వసంతం:

కట్టించుకోకు, అక్కా.

నీరద:

అమ్మని కొప్పడుతుంది అమ్మమ్మ. (విమల మళ్ళీ కడు తోంది) అమ్మా ఎందుకు ఏడుస్తావట్లా?

విమల:

నేను... చచ్చిపోతే మీరేడుస్తారా?

నీరద:

ఎందుకు చచ్చిపోతావు?

విమల:

చచ్చిపోతే ఏడుస్తారా?

నీరద:

ఎందుకు చచ్చిపోవడం? నువ్వు చచ్చిపోతే మాకన్నం ఎవరు పెడతారు?

విమల:

మీకొత్త అమ్మలేదూ మరి?

వసంతం:

నీరదా, నీకు అమ్మవుండదు.

విమల:

నీకూ?

వసంతం:

వుంటుంది. ఎందుకంటే, ఇద్దరమూ పంచుకున్నాం. నువ్వే నీరదకీ, కొత్త అమ్మ నాకూ...కొత్త అమ్మతో చెప్పు మాకు సరిగా అన్నం పెట్టమని. అక్కడికీ లేకండా పెరుగంతా నాకే వెయ్యమను.

విమల:

నేను లేకపోతే మీకు చాలా దిగులేస్తుంది కదూ!

నీరద:

మరి కథలుకూడా చెపుతుందా! కొత్త అమ్మ!

విమల:

చెపుతుంది.

వసంతం:

సరేలే. అమ్మా ఐతే యేడవంలే!

విమల:

నేనింక ఎప్పుడూ కనపడను.

వసంతం:

మేము పెద్దవాళ్ళమైనాక కూడా?

నీరద:

మనం కూడా చచ్చిపోయినాక కనపడుతుంది.

వసంతం:

గోతులోనా?

విమల:

మీమీద యెవరికీ నిజమైన ప్రేమవుంటుంది. మీకు కావలసిన వొస్తువులన్నీ మీకెవరు—

వసంతం:

అమ్మమ్మవుందిగా! యీడవక అక్కమ్మా! మేము హాయిగా వుంటాము.

నీరద:

దేవు డెప్పుడన్నా వొదిలితే, వొచ్చిచూడు మమ్మల్ని. బొమ్మలూ, అవీ, పట్టుకురా!

విమల:

యీ కొత్త అమ్మ నిజంగా మిమ్మల్ని ప్రేమిస్తుందనా?

నీరద:

ఆ. మాతో ఒకటే ఆడుకుంటుంది.

విమల:

అమ్మమ్మ కొడితే, నన్ను తలుచుకుని యేస్తావుగా?

నీరద:

అమ్మమ్మ కూడా మంచికోసమే, మమ్మల్ని మంచివాళ్ళని చెయ్యాలనే కొడుతుంది.

వసంతం:

అమ్మమ్మ కొడితేనేం! మంచి బట్టలు కొనిస్తుంది నాకు

పెళ్ళి చేస్తుందట! మోటారులోయెక్కి ఒకటే వూరేగడం అప్పుడు. రెండుసార్లు పెళ్ళి చేసుకుంటా నాన్నమల్లే! నాకు కలెక్టరుపని ఇప్పిస్తుందిట!

విమల:

మీ అమ్మ యేదంటే యేమంటావు?

వసంతం:

చచ్చిపోయిందంటాను.

విమల యివతలికి వొచ్చి నిట్టూర్పువిడిచి వెడుతోంది.

వీరద:

అమ్మ యెప్పుడూ ఎందుకో అసహ్యంగా ఏడుస్తోవుంటుంది!

వసంతం:

అమ్మ చెడ్డది. అమ్మమ్మ చెప్పలా?

వీరద:

మన్నికూడా చెడకొట్టుతుందిట.

వసంతం:

యింకెంత సేపటికీ ఎవరూ రారేం?

వీరద:

ఆ పంజరంలో కూచుంటారు.

వసంతం:

యీసారి అల్లరి చేశానని వొప్పుకోవద్దు, అక్కా. వొప్పుకుంటే, ఏం చెయ్యనని, కట్టేశిందయ్యా అమ్మమ్మ, తను హాయిగా అబద్ధాలు చెప్పుకోవచ్చు. ఏం! నోరుతెరిస్తే యింతలో తన పిల్లి అరిగిపోయిందా? వూరికే తిని పడుకుని యేం చేస్తుంది?

నీరద:

ఎవరు, అమ్మమ్మా, పిల్లా?

కామాక్షి వొచ్చింది. పద్ధెనిమిదేళ్ళు - పెళ్ళికూతురు ముస్తాబు.

వసంతం:

అదిగో, పంజరంలోపడ్డ కొత్తపిట్ట

నీరద:

అమ్మ అందికదూ, అట్లా!

వసంతం;

కొత్త పెళ్లికూతురోయ్!

కామాక్షి:

ఇంకెప్పుడూ పిల్లిని యేడిపించనని అంటే వొదలెయ్యమంది అమ్మమ్మ.

వసంతం:

కనపడ్డ పిల్లుల నన్నిటినీ చంపుతాను.

నీరద;

పిన్నీ, లడ్లు తయారైనాయా?

వసంతం:

పిన్నీ, అమ్మ చనిపోతే, రాత్రి నన్ను నీదగ్గర పడుకోపెట్టు కుంటావా?

కామాక్షి:

అమ్మ చచ్చిపోవడ మేమిటి?

నారాయణ వొచ్చాడు. ఇరవై రెండేళ్ళు. షోకుగా బట్టలు వేసుకున్నాడు. అతన్నిచూచి కామాక్షి వెళ్ళిపోబోతోంది.

నీరద:

పిన్నీ వెళ్ళకు, నారాయణ నన్ను కొడతాడేమో ?

వసంతం:

నన్ను తప్పకుండా కొడతాడు కందువా చింపానని.

నారాయణ:

ఓరి దొంగ వెధవా, నువ్వేరా చింపింది ?

వసంతం:

అమ్మమ్మ మమ్మల్ని తిట్టడానికి పిట్టేదనలేదూ, పిన్నీ?

నారాయణ:

తిడతానా–కొడతానా! చంపుతానా– (కొట్టబోతున్నాడు.)

వసంతం:

పిన్నీ, పిన్నీ.

కామాక్షి:

(కామాక్షి అడ్డంవెళ్ళి) కందువా చింపితే మంగమ్మగారితో చెప్పండి.

నారాయణ:

ఏందయు, పిల్లలంటే అప్పుడే !

కామాక్షి:

ఎందుకు చింపావమ్మా ?

వసంతం:

వీడు నన్ను కొట్టాడు.

నారాయణ:

మళ్ళీ 'వీడు' అంటున్నావూ! (చెవిపట్టుకోబోయినాడు. వసంతం, కామాక్షి వెనక్కి వెళ్ళాడు) మీ అబ్బతో చెప్పకో.

కామాక్షి:

ఏమిటి అది అట్లా మాట్లాడుతావు ?

నారాయణ:

అబ్బో, యెంత అభిమానం అప్పుడే! ఇంకా ముడి పడ్డదో లేదో వాడిమీ దభిమానమేమిటి? ఆ! పందికొక్కు గాడిద మీద! ఇంత బోసుగా వున్నావు! ఈ పిల్లలతో నేంగాని, రా. అట్లా షికారుతిరుగుదాం. పెళ్ళి ముడిపడ్డాదిగా, ఇంకేం చేసినా స్వేచ్ఛ.

కామాక్షి:

ఛీ, ఛో, మళ్ళీ మంగమ్మగారితో—

నారాయణ:

టక్కులు చెయ్యకుమరి! మంగమ్మగారు నన్నేంచేస్తుంది? ఐనా వుత్త బెదరింపుతే కాని నువ్వేంమను చెపుతావు? నే నెరగనా ఈ అరవజట్టుని.

వసంతం:

పిన్నీ, నా చేతులు పీక్కుపోతున్నాయి. పిన్నీ—

కామాక్షి:

(కన్నీళ్ళతో) నాతో మాట్లాడమన్నానా నిన్ను. నేనుసీతో వొక్కమాట మాట్లాడానా? వూరికే వొచ్చినప్పణ్ణించీ నన్నిట్టా ఏడిపిస్తున్నావు. వుండారా! నీకు శాస్తి చేసే మొగాడు లేకపోబట్టే కదూ? ఈవాళ మా నాన్నగారు వొస్తున్నారు వుండు.

నారాయణ:

రానీ, నాలుగు తన్నులు తంతాను.

కామాక్షి:

తంతే వూరుకుంటారు ?

నారాయణ:

ఏనా నువ్వుచాలవూ, నలుగురు మొగాళ్ళకి... ఏడుస్తాం దోయ్, తుడవనా?

నీరద:

వెధవ, పిన్నిని ఏడిపిస్తున్నాడు.

నారాయణ:

అయ్యో, మనబతుక్కితోడు మనం ఇంకోళ్ళని దెప్పడం కూడాను ? దిక్కులేక కాదూ, ఈ రెండోపెళ్ళికి కక్కుర్తి పడ్డది ! డబ్బుకోసమేగా ? నాదగ్గిర దాస్తావు !

నీరద:

పశువుగాడు !

వసంతం:

వీణ్ణి చంపితే–

నారాయణ:

చంపుదురు గాని.

వసంతం:

నేను పెద్దవాణ్ణికానీ !

నారాయణ:

ప్రస్తుతం నేను నిన్ను చంపుతా.

నీరద:

నాన్న వీణ్ణి చంపకూడదూ ?

నారాయణ:

(కామాక్షిబుగ్గపట్టుకుంటో) చంపమను. (తటాలున కామాక్షి అతని చంప పగలకొట్టింది. రుద్దుకుంటో) అబ్బా ఎంత దెబ్బకొట్టావు! ఏదీ ఆ కోపం మొహం? నీ వంటిదాని కోసమే చూస్తున్నా నిన్నాళ్ళు, ఇంక నిన్నొదలను.

కామాక్షి:

పో వెధవా!

నీరద:

బాగా కొట్టావు, పిన్నీ.

వసంతం:

ఆడవాళ్ళను యేడిపించడం వొక్కటి చాతనవును.

వసంతుని తొడపాశం పెడుతున్నాడు. వసంతం అరుస్తున్నాడు. మంగమ్మ వొచ్చింది. ఆమెకి దాదాపు యాభైయేళ్ళు. ఆజాను బాహువు.

మంగమ్మ:

ఏమిటది? యెందుకు వసంతుని గిల్లుతున్నావు నువ్వు? కామాక్షీ! ఆ కాటికంతా కరిగిపోతో నువ్వెందుకు ఏడుస్తున్నావు?

వసంతం:

నారాయణ గిల్లాడు.

మంగమ్మ:

(కామాక్షితో) నువ్వెందుకు ఏడుస్తున్నావు? మళ్ళీ నిన్నేమన్నా అన్నాడా?

కామాక్షి:

పిల్ల లేడిస్తే నాకూ ఏడుపొచ్చింది.

మంగమ్మ:

(కామాక్షి చెంపల్ని అదిమి) ఏం హృదయమమ్మా?

వసంతం:

అమ్మమ్మా, మమ్మల్ని యెప్పుడూ కొడతాడు. వాణ్ణేమీ అనవు.

మంగమ్మ:

వాడేమిటే? వాడు!

నీరద:

నారాయణ పిన్నిని యేడిపించాడు.

మంగమ్మ:

(కామాక్షితో) చూస్తావేం?

వసంతం:

నన్ను కొట్టాడు అమ్మమ్మా. ఆ సంగతి అడగవేం?

మంగమ్మ:

యెన్నిసార్లు చెప్పాలి నీకు, పిల్లల్ని కొట్టవద్దని. ఈ సారి చెయ్యి చేసుకున్నావా, సరిగా జరగదు.

నారాయణ:

పోనీండి.

వసంతం:

వెళ్ళగొట్టు అమ్మమ్మా! నువ్వెంత చెప్పినా మళ్ళీ కొడుతూనే వుంటాడు. మా ముందు కొప్పడుతావు. మళ్ళీ రహ

స్యంగా బతిమాలుకుని, సైకిలూ, అదీ కొనిస్తావు. (మంగమ్మ ఆశ్చర్యంగా చూస్తోంది.)

నారాయణ:

చూశారా వాగుడు.

మంగమ్మ:

ఒకే, వసంత్ నేను నీకుమాత్రం యేం తక్కువ చేశారా? మరి నారాయణ మాత్రం మీవంటివాడు కాడూ?

వసంతం:

కాదు, నౌకరు.

నారాయణ:

చూశారా? చూశారా?

మంగమ్మ.

చిన్నపిల్లవాడు వాడితో నేం లే! కాని నువ్వుమాత్రం కొట్ట కూడదు.

నారాయణ:

పోనీ నేను వుండడం అంత కష్టంగావుంటే నేనే పోతాలెండి నా కండువా చింపటం బాగానేవుందీ? (వెడుతున్నాడు)

మంగమ్మ:

నారాయణా మాట. (నారాయణ రాలేదు) ఏం చెయ్యను, కామాక్షీ, యెంత చెప్పినా వాడికి బుద్ధిలేదు. ఎంత బెదిరించినా భయంలేదు. కాని మళ్ళీ చెపుతున్నాను. వాడు చాలా తుంటరి. టక్కులమారివాడు. నా ప్రాణాలు కొరుక్కు తింటున్నాడు. చావనన్నా చావడు. రాగానే చెప్పాను.

నీతో మళ్ళీ చెబుతున్నాను. వాడినించి దూరాన వుండు. వీడి మాటలు వినే విమల చెడిపోయింది.

కామాక్షి:

అసలు నాకు వాణ్ణి చూస్తే వొళ్ళుమంట. కన్నెత్తి చూస్తానా ఆ వెధవని? నీచుడు, ఏపాపిష్టిదానికి పుట్టాడోగాని—

మంగమ్మ:

అడుగో! తిట్టకు. యెవరు కంటె మనకెందుకు?

కామాక్షి:

యెట్టువంటి దుర్మార్గురాలు కనకపోతే, యీ పాడుబుద్ధులు—

మంగమ్మ:

వూరుకోమన లేదూ! యింతకీ యివన్నీ తల్లిబుద్ధులా? తండ్రివే ఐవుంటాయి. ఆ పరమ పాతకి వీడిమల్లేనే, ఆ తల్లిని వంచన చేసి వుంటాడు.

కామాక్షి:

వీడు అతి నీచుడు. తుంటరి——

మంగమ్మ:

ఆడవాళ్ళవిషయంలో అట్లా అన్నానే గాని, తక్కిన విషయాల్లో వీడు చాలా పెద్దమనిషి. స్త్రీవి గనక వాణ్ణించి దూరంగా వుండు. వాడిమాటలు నమ్మకు. అంతేగాని వాణ్ణేమీ అనకు. వీడిమల్లే వ్యవహారం చెయ్యగలవాడున్నాడా? సమయం వస్తే ప్రాణమిస్తాడు. ఎందుకు మీ ఆయన! అందానికిగాని, తెలివికిగాని, దర్జాకిగాని వీడికి దిగదుడుపేకాదూ!

కామాక్షి:

వూరికే పైకి షోకుగా వుంటే సరా? శూద్రబుద్ధి! వాడు——

మంగమ్మ:

వూరుకో యింక-నేను 'వాడు' అంటే నువ్వూ అంటావా?

కామాక్షి:

యేమనాలి. 'దొరగారు' అనాలా ఆ చాకలాణ్ణి.

మంగమ్మ:

యేం చెప్పాను.

కామాక్షి:

కాని నా వెంటబడి తిప్పలు పెడుతున్నాడు. మీతో చెప్పినా వూరుకున్నాడా? వాడికి భయం, భక్తి లేదు. నేను వూరుకునే మనిషిని కాను.

మంగమ్మ:

నేను చెపుతాలే, నువ్వు వూరుకో.

వసంతం:

అమ్మమ్మా యింక యెంత సేపు?

మంగమ్మ:

వుండు. (కామాక్షితో) నువ్వు ఆడదానివి. అది నీ జీవితంలో ప్రతి నిమిషమూ జ్ఞాపకముంచుకో

నీరద:

అమ్మమ్మా. అమ్మ చచ్చిపోతుందిట?

మంగమ్మ:

వుండు పెద్దవాళ్లు మాట్లాడుతో వుంటే, అడ్డం రాకూడదని

యెన్నిసార్లు చెప్పాలి? యిదుగో కామాక్షీ ఆడదానికి గొప్ప భూషణ మేమిటి?

నీరద:

రవ్వల అడ్డిగ.

మంగమ్మ:

అది కాదు. గుణాల్లో?

కామాక్షి:

తెలివి.

మంగమ్మ:

తెలివి? యెందుకు తెలివి? పుణ్యామా? పురుషార్థమా? శీలం, అడకువ, శాంతం, పాతివ్రత్యం—యివీ.

వసంతం:

హాయిగా మీరు తేలిగ్గా కూచుని మాట్లాడుకుంటున్నారు. మేం చస్తున్నాం. ఏమిటో భూషణంట. శాంతంట.

కామాక్షి:

పాపం వాళ్ళని వొదులుదాం.

మంగమ్మ:

విను ముందు.

కామాక్షి:

పాపం, చేతులు నొప్పి పుడుతున్నాయి.

మంగమ్మ:

మాటకి అడ్డం రావడం తప్పని ఒక్కసారే నేర్చుకో.

కామాక్షి:

అవును. ఇంక యెప్పుడూ అడ్డం రాను. వీళ్ళని వొదిలేద్దాం.

మంగమ్మ:

సరేలే విప్పు. ముందు వీళ్ళపని చూద్దాం (కామాక్షి విప్పుతోంది.) కాని మాటిమాటికీ నన్నిట్లా అడగవొద్దు. నువ్వు పుట్టిననాటినించి వీళ్ళని కడుపులో పెట్టుకుని పెంచుకుంటు న్నాను. ఆ తల్లి వల్ల చెడిపోకండా, దాని బుద్ధులు తల ఎత్తుతోవుంటే, జాగ్రత్తగా వాటిని నిర్మూలంచేస్తో, వాళ్ళ తాతగారి ప్రతిష్ట మళ్ళీ నిలబెట్టేవాళ్ళుగా తయారు చేస్తు న్నాను. తెలిసిందా? ఈ నాలుగురోజుల్నించి చూస్తోనే వున్నావుగా? (పిల్లల్తో) కుర్రాళ్ళూ! నా యెదురుగా నుంచుని నేను చెప్పేమాటలు శ్రద్ధగా వినండి. చేతు లిట్లా కట్టుకోండి. ఒరే, వసంతం, యిట్లా చూడు. మీరు మధ్యాన్నం చేసిన తప్పువిషయం తెలుసుకున్నారా? పిల్లి యెటువంటి మృగము.

వీరద:

క్రూరమృగం.

మంగమ్మ:

కాదు. నోరులేని సాధుమృగము.

వసంతం:

నోరువుంది దానికి.

వీరద:

కాదు. మా వాచకంలో క్రూరమృగమని వుంది.

మంగమ్మ:

కాదు. పిల్లి మన కేమన్నా హాని చేస్తుందా?

మంగమ్మ:

వినండి. కామాక్షీ ! నువ్వూవిను, ఈ సమస్త ప్రపంచమూ పరమాత్మనిండివుంది. నీలోఆత్మా, పిల్లిలోఆత్మా, చిలకలోఆత్మా అంతా ఒకటే! (వసంతు తొండమీద రాళ్ళేస్తున్నాడు.)

నీరద:

పందిలో ఆత్మ నాదికాదు.

మంగమ్మ:

ఒరే నేనుచెప్పేదేమిటి? నువ్వు చేసేదేమిటి? తొండ నిన్నేం చేసింది?

వసంతం:

కరుస్తుంది.

మంగమ్మ:

తొండ కరిచిందే!

వసంతం:

కరవలేదు. కరుస్తుంది.

మంగమ్మ:

నీకెట్లా తెలుసు?

వసంతం:

కరిచేట్టు చూస్తోంది.

మంగమ్మ:

సరేకాని మీరెందు కా పిల్లిని ఏడిపించారు?

నీరద:

మరి అది కీకింది.

మంగమ్మ:

వినుముందు. మీకు నేనేం తక్కువచేశాను? ఆడుకోడానికి వొస్తువులులేవా? యెన్ని బొమ్మలు కొనిపెట్టాను. నేను కొనుక్కుంటున్నానా?

వసంతం:

అది కాదు.

మంగమ్మ:

వినుముందు. యింతా మీకు నేను ప్రేమతో-

నీరద:

పిల్లి కాళ్ళకింద దిండువలె మెత్తగానుండును.

మంగమ్మ:

చాలు, వూరుకో దాన్ని బండికి యెందుకు కట్టాడు?

నీరద:

మరేం కట్టం? కుక్క కరవొచ్చింది.

మంగమ్మ:

మీవంశం యెటువంటిది, చీమచస్తే చూసి సహించలేని దయాపూరితులే మీపూర్వులు. మీతాత నల్లిని చంపడానికి సంకోచించేవారే!

వసంతం:

ఆ పఠంలోవున్న తాతయ్యేనా?

నీరద:

అది తాతయ్యకాదు, ఎవరో అబ్బాయి.

మంగమ్మ:

అవును అప్పుడట్టా వుండేవారు.

పీరద:

నువ్వు తాతయ్యతో యెప్పుడూ మాట్లాడనే లేదుటగా!

మంగమ్మ:

మాట్లాడాలా యేమిటి? మీ తాతయ్య నాకిక్కడ నివశిస్తున్నాడు. (గుండెచూపింది)

వసంతం:

తగలపెట్టారుగా?

పీరద:

పాతిపెట్టారు.

వసంతం:

మరి అమ్మమ్మలోపల యెట్లావున్నాడు? తాతయ్యని తిన్నావా, అమ్మమ్మా! కొన్నాళ్ళకి మళ్ళీ తాతయ్యనీ లోపల్నించి పుడతాడా?

పీరద:

గుండెల్లో కాదు పిల్లలుండేది, పొట్టలో.

మంగమ్మ:

వీళ్ళని తీసుకుపో, కామాక్షీ! అబ్బా యెక్కడి బుద్దులో వీళ్ళకి! యివన్నీ మీ అమ్మేనా చెప్పింది.

మంగమ్మ:

పొద్దున్న నన్ను లంజ—

కామాక్షి:

ఛీ, ఛీ, యీ తోటలో, యీ అవరణలో—

నీరద:

యీ పంజరంలో—

మంగమ్మ:

అట్లాంటి మాటలు వినపడకూడదు—వసంతం, అన్నావా—

వసంతం:

ఏమిటి!

మంగమ్మ:

ఆమాట.

వసంతం:

ఏమాట?

మంగమ్మ:

పిన్ని అనలా—

వసంతం:

యేముంది?

మంగమ్మ:

వెళ్ళండి. పొండి యిక్కణ్ణించి.

వసంతం:

మంచి అమ్మమ్మ (గంతులేస్తో వెళ్ళారు)

మంగమ్మ:

అబ్బా, యెక్కడిపిల్లలు! నా ప్రాణాలు తీస్తున్నారు. ఎంత భద్రంగా పెంచినా, యీ బుద్ధులు యెక్కణ్ణించి నేర్చుకుంటారో! ఆ గోల పోనీ, విను. నువ్వు చాలా అదృష్టవంతురాలివి. ఇంత యెదిగినదానికి నీకు సంబంధం దొరకడమే అదృష్టం. అందులో మావంటి వంశం వుండే ఆది

దొరకడం చాలా సుకృతం చేసుకుంటేనేగాని తటస్థించదు. మా తాత, మా అత్తవారి తాత, అందరూ యెంత మర్యాద, యెంత హోదా కలవారో నీకు రేపు చదివి విని పిస్తాను. యింతబీదదానివి–

కామాక్షి:

నేను బీదదాన్ని కాదు.

మంగమ్మ:

పోనీ పెళ్ళికాక ఎదిగిన–

కామాక్షి:

యేమీకాదు. నాకు చాలా మంచిసంబంధాలు వొచ్చాయి.

మంగమ్మ:

వొస్తే చేసుకోక పోయినావూ? యిదో, నీకంటె వయసులో మూడింతలు పెద్దదాన్ని. నీపుటకలకి అప్పుడే ముసలిదాన్నైనాను. నీకేం తెలుసునని వాదిస్తావు, వూరుకో.

కామాక్షి:

కాదు. ఐ.సి.యస్. పరీక్ష పాసైనవాళ్ళుకూడా నన్నిమ్మని వచ్చారు.

మంగమ్మ:

వాళ్ళసంగతి తెలీం దెవరికి! పోకిరీ, చెటకారీ దరిద్రులు. అట్లాంటివాళ్ళని యెంతమందిని చూశానో! మా కుటుంబానికి, మర్యాదకీ, సాంప్రదాయానికీ సాటా! వాళ్ళని గుమ్మం తొక్కనిచ్చేవారా, మా మామగారు!... నీకు తెలీదు. అట్లాంటి మొహార్చానీ పెట్టుకుని నువ్వు కోడలు

కావడం మాకేదో గొప్ప మొహర్బానీ అనుకుంటున్నావు గావును! ఆ వెర్రివేషాలు వదులుకో, నమ్రత నేర్చుకో, ముఖ్యం. యేదో తండ్రి బుద్ధితక్కువగా పాడుపని చేసినందుకు యిట్లా అయిందే దానిగతి, అని దయదలచి నీమీద—

కామాక్షి:

మా నాన్నగారి నేమీ అనకండి. ఆయనంత గొప్పాయన యీలోకంలో లేరు. యీవాళ వొస్తారు చూస్తారుగా !

మంగమ్మ:

మీ నాన్నగారు గొప్పవారే కావొచ్చు. కాని యింక మీనాన్నగారి గొప్పతనమా నువ్వు తలుచుకోవలసింది, లేక నీభర్త గొప్పతనమా?

కామాక్షి:

మా నాన్నగారంత గొప్పవారుకారు ఎవరూకూడా.

మంగమ్మ:

బాగానే చేస్తావు కాపరం! యిదుగో ముందే విను. ఎటువంటివాడుకానీ, భర్తని దైవంగా చూడడం సంసారంలో మొదటి విధి. నే నీవిధంగానే ప్రవర్తించానా! ఆయన పదమూడో యేటే చిన్నతంలోనే పోయినారు. గాని, మహాభక్తులు, మహావుదార పురుషులు కనుకనే ఈశ్వరుడు తీసుకుపోయినాడు. (వెంకటచలం వొచ్చాడు) సరే కామాక్షీ యింక వెళ్లు. ఆ పిల్లలేం అల్లరిచేస్తున్నారో! (కామాక్షి వెళ్ళింది.) చూశావా, మరి, యీ పిల్లని బాగా! చాలా చురుకయింది. బుద్ధిశాలి. నీ అదృష్టంకొద్దీ దొరికింది. విమల విషయం ఇంక దిగులు మానెయ్యి... దానిమీద దయదలచి

ఐనాసరే మాట్లాడావంటే లాభంలేదు. మరీ ఇంత అవి వేకివేం నువ్వు? నాముందు యిట్లా వొప్పుకుంటావు. మళ్ళీ బాని మాటలు వినగానే అన్నీ మరిచిపోయి మెత్తపడి అది అడిగిందల్లా అంగీకరిస్తావు.

వెంకటచలం:

ఆ న్నారాయణ మరీ మితిమీరిపోతున్నాడు. పొద్దున్న కామాక్షితో కలబడి—

మంగమ్మ:

వాడి సంగతి నేను చూస్తానులే.

వెంకటచలం:

అంతే, అట్లా అంటావు. వూరుకుంటావు. వాడునన్ను పెట్టే యిబ్బందులూ, అవమానాలూ నీకు తెలీవు. ఎక్కడ కనపడ్డా పందికొక్కు అంటాడు, నా పిల్లలముందు విమల ముందు, అందరిముందూ. యెందుకు వాణ్ణి యిట్లా వుణ్ణిచ్చి ఆదరిస్తావో తెలీదు. ఇంక నేను వూరుకోను.

మంగమ్మ:

ఆ విషయమైనై నేనుచాలా ఆలోచిస్తున్నాను. నా అక్క అంత విశ్వాసంతో నా బాధ్యతపైని వీణ్ణి వొదిలితే-

వెంకటచలం:

ఐతే వీణ్ణి యిట్లా నన్నేడిపించమందా యేమిటి, మీ అక్క!

మంగమ్మ:

(నవ్వుతో) ఏడిపించడం ఏమిటంత పెద్దవాణ్ణి మొగాడివి నువ్వో అట్లా దిక్కులేకండా యేడుస్తోవుంటే, నే నెంతవరకు తంటాలుపడను చెప్పు.

వెంకటచలం:

నే నేం చెయ్యను ?

మంగమ్మ:

చాతనైతే తన్ను.

వెంకటచలం:

తన్నులా! ఇంక తన్నవలసిందే!

మంగమ్మ:

అది చాతకాకపోతే, భార్యనన్నా జాగ్రత పెట్టుకో.

వెంకటచలం:

పెట్టుకోవడమెట్లా? వాడు మరీ మితిమీరి, భయం భక్తి లేక మరీ పైకి వొస్తోంటే! పాపం విమల మాత్రం యెంత యేడ్చింది మొదట్లో వాడు తనని అవమానం చేస్తున్నాడని.

మంగమ్మ:

దొంగ యేడుపులు.

వెంకటచలం:

కాని, నేను వాణ్ణేమన్నా చేద్దామంటే దుండగీడు, దానికి పదిరెట్లు చేస్తాడని వూరుకున్నాను. వెళ్ళగొట్టమంటే నువ్వు వొప్పుకోవైతివి!

మంగమ్మ:

ఇక నీతో పోట్లాడేవాణ్ణల్లా వెళ్ళకొడుతోంటే బాగానే జరుగుతుంది నాకు!

వెంకటచలం:

ఇప్పుడు కామాక్షిని సాగించాడు చూడు. వీడినోటికీ చేతికీ అడ్డంలేదు. గ్రహచారమన్నా తప్పించుకోగలంకాని వీణ్ణింటి

తప్పించుకునేది దుస్సాధ్యంగావుంది. ఎట్లా వొదుల్చుకోడం! ఒక్క-నిమిషం నాకు శాంతి నిద్రలేకండా నన్ను కాల్చుకు తింటోంది యీ పిశాచం చిన్నప్పణ్ణించి! నన్నుచూస్తే వాడికంత కడుపుమంట యెందుకు ?

మంగమ్మ:

నీకు సమస్త సౌఖ్యాలు వున్నాయి, నీ యీడువాడే కదా, వాడి కేముంది మరి! ఈర్ష్య వుండదూ?

వెంకటచలం:

అదుగో మళ్ళీ, వాడికీ నాకూ సాపత్యం తీసుకొస్తావేమిటి! చాకలి వెకలి వెధవకీ నాకూ! నా భార్యల్నిచూస్తే వాడి కెందుకు కాంతు! ఇంక లోకంలో ఆడవాళ్ళు లేరూ!

మంగమ్మ:

వాళ్ళనిమాత్రం వొదిలాడా ?

వెంకటచలం:

వూరికే వాణ్ణెందుకు వెనకవేసుకు వొస్తావట్లా! ఇంక నేను వూరుకోను. నాకు వెర్రెక్కుతోంది. నేనేం చెయ్యలేనివాణ్ణి, చాతకాని వాణ్ణి అనేకదా, బహిరంగంగా నాకళ్ళముందే, నా భార్యతో యిట్లా పరియాచకాలాడ్డం! పోనీ విమల ఐతే సరే-యిప్పుడీ-

మంగమ్మ:

నేను చివాట్లువేస్తాలే వాణ్ణి. చెడ్డవాడు. వాడిజోలికి వెళ్ళకు.

వెంకటచలం:

యెన్నిసార్లో యిట్లా-

మంగమ్మ:

ఏం చెయ్యను? వినడు. ఇంత బుద్ధిహీనుణ్ణి చూడలేదు. ఎందు కిట్లా ఐనాడో! నా పాపఖర్మం! నా ప్రాణాలు తింటు న్నాడు. చావన్నా చావడు.

వెంకటచలం:

చావకపోతే, చంపితే సరి!

వెంకటచలం వెళ్ళాడు. కొంచెంసేపు ఆలోచనలో బాధలో మంగమ్మ కూచుంది, తోటవాడు వొచ్చాడు.

తోటమాలి:

అమ్మా యీ సపోటా చెట్టు యెండిపోతోందండి!

మంగమ్మ:

సరేకాని నీ కూతురుసంగతేం చేశావు? దయ చూపి చూపి దాన్నికాస్తా చెడకొట్టావుకద! మొదటినుంచీ నేను చెపు తోనే వున్నాను. దాని విసురు నడకలు, వెకిలి నవ్వులూ, దొంగ చూపులూ చూడగానే అనుకున్నాను, అది ఏనాడో నీకొంప ముంచేదేసని. నామాటలు విన్నావా దాన్ని జాగ్రత్త పెట్టమంటే! నేనన్నదంతా అక్షరాలా జరిగిందా?

తోటమాలి:

ఏదో ఐపోయింది. బీదవాళ్ళంగనక మాసంగతి బైటి కొచ్చింది.

మంగమ్మ:

సరేలే యిదుగో; యిట్లాంటివి యెక్కడ జరిగినా వూరుకోను నేను. నీకు తెలుస్తోనేవుంది, ఆ సంగతి మళ్ళీ చెపుతున్నాను.

అది అక్కడ వుండడం మాకూ అపరిదిష్ట. ఇంక దానికోసం వొచ్చేవాళ్ళూ, పొయ్యేవాళ్ళూ—

తోటమాలి:

(కోపంతో) యెవరండీ వొచ్చేవాళ్ళూ, పొయ్యేవాళ్ళూ! అందరూ లోపల్నించేగాని, బైటనుం చెవరూ లేరు.

మంగమ్మ:

ఈనాడు యిక్కడా, రేపు వూరు వెంబడీ—అదంతా నా కెందుకు? అది యిక్కడ వుండడానికి వీల్లేదు. దాన్ని వొదల్లేకపోతే మీరుపొండి.

తోటమాలి:

ఇంక తప్పకపోతే, వెడతాలెండి, కాని మా మక్తాడబ్బు ఇచ్చెయ్యండి.

మంగమ్మ:

యెందు కిస్తాము?

తోటమాలి:

ఏం న్యాయమండీ? బిడ్డ పొరపాటు పనిచేస్తే, కడుపులో పెట్టుకుంటారా, యింటోంచి తరిమేస్తారా? నాలిక తిట్టిందని కోసి పారేసుకునే వా డుంటాడండీ? బిడ్డల్ని కన్నకడుపైతే నా మాటలు మీ కర్థమవును! మీ కేం అపకారం చేసిం దండీ! దానికి అపకారం చేసినవాళ్ళు మీ మనసుకి బాగానే వున్నారు!

మంగమ్మ:

అదంతా సరేనోయ్, బిడ్డలువుంటే గుణవంతులుగా వుండాలి ఈ నీచప్పు పను లేమిటి? అందులో ఆడది! ఇదుగో లోక

మెంత పాడవుతునాా సీతి, దుర్నీతీ విచక్షణ యింకా నన్ను వొదల్లేదు మరి. మా వంశం అట్లాంటిది.

లోపలినుంచి లక్ష్మి "అయ్యా-ఈయనచూడు" అని కేకేసి పరిగెత్తుకుంటో వొచ్చింది. పన్నెండేండ్లు.

మంగమ్మ:

(లక్ష్మితో) ఒసే, నీ కెన్నిసార్లు చెప్పాను. ఆడపిల్ల లట్లా బిగ్గిరిగా కేక లెయ్యకూడదని! దూడలాగు అట్లా పరుగెత్తుతావు సిగ్గులేదూ!

లక్ష్మి:

ఆ నారాయణగారు చూడండమ్మా!

మంగమ్మ:

ఏమిటి?

లక్ష్మి:

వొద్దంటే యెప్పుడూ పట్టుకుంటారు?

మంగమ్మ:

ఐతేమాత్రం, ఆడపిల్లవి అట్లా అరుస్తావా?

లక్ష్మి:

(సిగ్గుతో) పట్టుకుంటారండీ!

మంగమ్మ:

ఐతేమాత్రం——

తోటమాలి:

ఐతే, ఐతే,-యేం తెలీటంలా?—యీడొచ్చిన పిల్లని యేమిటది? వాడితల పగలకొడతా, యేడీ?

మంగమ్మ:

వుండు, నే మాటాడతాను (లక్ష్మితో) నారాయణ ఎక్కడా?

లక్ష్మి:

అదుగో, ఆ కుండు దగ్గిర!

మంగమ్మ:

రా, రా, నేను కనుక్కుంటాను.

మంగమ్మ వెళ్ళింది. నారాయణ పక్కనించి నవ్వుతోవొచ్చి లక్ష్మిని పట్టుకున్నాడు.

నారాయణ:

ఇప్పుడేం చేస్తావు?

లక్ష్మి:

అమ్మగారూ, అమ్మగారూ! లంజ-

నారాయణ:

అమ్మా లేదు, ఏమీా లేదు. (నోరుమూస్తున్నాడు. సుందరేశయ్య రైలుసంచితో వచ్చాడు లక్ష్మి పారిపోయింది,) ఎవడోయ్, ఈ అవతారం?

సుందరేశయ్య:

మంగమ్మగారు వున్నారా?

నారాయణ:

నువ్వా! అరవపిల్ల అబ్బవి కాదుకద!

సుందరేశయ్య:

యెవరు నువ్వు?

నాయరాణ:

దాని మొగుణ్ణి.

సుందరేశయ్య:

(ఆశ్చర్యంతో) నేను నీ మామని!

నారాయణ:

మామోయ్, నీ అల్లుణ్ణి ముద్దెట్టుకోవూ! చాలా దొడ్డ మామవి!

సుందరేశయ్య:

అంటే–

నారాయణ:

అంటే, అంట్లవెధవ్వి అన్నమాట.

సుందరేశయ్య:

నేనా! యెందుకు?

నారాయణ:

ఎందుకా, అంట్లవెధవంటే ఊరుకున్నవాడివి అంట్లవెధవ్వి కాక ఇంకేమిటి?

సుందరేశయ్య:

నీకా, కామాక్షి నిచ్చింది!

నారాయణ:

(పాడుతున్నాడు) నాకేనోయ్, మామయ్యా, నాకేనోయ్!

సుందరేశయ్య:

ఆపాట ఆపి విను.

నారాయణ:

నాకేం కట్నాలు తెచ్చావు, ఆ సంచీలో!

సుందరేశయ్య:

మందులు!

నారాయణ:

మందులు దేనికి?

సుందరేశయ్య:

పిచ్చికి.

నారాయణ:

(నవ్వుతో) అయిపోయింది. ముడిపడ్డది పిచ్చివాడికి. రా, మామా కావిలించుకో. కాని బలే చమత్కారాలు నేర్పావు కుర్రదానికి. చాలా జాణ.

సుందరేశయ్య:

హరహరా! తాగావా?

నారాయణ:

నీ కూతుర్ని,

సుందరేశయ్య:

ఇదేం సాంప్రదాయంరా నాయనా!

నారాయణ:

తాగుడు సాంప్రదాయాలు. సంచీలో బుడ్లున్నాయా, గుడ్లున్నాయా?

సుందరేశయ్య:

తుపాకీ గుళ్ళున్నాయి.

నారాయణ:

బలే ముసలివాడివి. రాత్రికి చెట్టుకింద దాగుదాం. నీకు గుంటలేదే? వంటది బోడిదిగాని, ఇంకా బిగువు చెడలేదు.

సుందరేశయ్య:

సదాశివ, సదాశివ.

మంగమ్మ:

(వొచ్చి) ఏదో తగాదా పెట్టావా, అప్పుడే. వెధవా పో!

నారాయణ పోతున్నాడు.

సుందరేశయ్య:

ఈయన-యీయాయన-

మంగమ్మ:

యెవడో లెండి వాడిమాటలకేం, ఏమనుకోకండి!

సుందరేశయ్య:

మంగమ్మగా రనుకుంటాను.

మంగమ్మ:

అవును. మీరు కామాక్షి తండ్రిగారేనా?

సుందరేశయ్య:

వాడేనా నా అల్లుడు?

మంగమ్మ:

కాదు.

సుందరేశయ్య:

అమ్మయ్యా! అవుననుకుని చచ్చిపోయినాను.

మంగమ్మ:

(చిరునవ్వుతో) సలక్షణంగా అమ్మాయి వివాహం జరిగింది. ఏదో అడావిడి కాకండా కానిచ్చాను.

సుందరేశయ్య:

అవును రెండో పెళ్ళికద!

ఒకరినొకరు బాగాచూసి, జ్ఞాపకం తెచ్చుకుని అనుమానంపడుతున్నారు.

మంగమ్మ:

మీరు పెళ్ళికి లేకపోవడం చాలా లోపంగా కనపడ్డది. పెళ్ళికి వొచ్చిన బంధువులెవరూ లేకపోవడంచాత సరిపో యిందిగాని, లేకపోతే చాలా వికృతంగా కనపడి వుండును.

సుందరేశయ్య:

మరేం చెయ్యను? రాజానుగా? సరిగా ఆనాటికి మళ్ళీ నా దగ్గు తిరగబెట్టింది. (ఒకరినొకరు చూసుకుంటున్నారు)

మంగమ్మ:

(నెమ్మదిగా) మీ పేరు-సుందరేశయ్యగారు-పూర్వం-యిరవై యిరవై ఐదేళ్ళ కిందట-

సుందరేశయ్య:

మీరే, మంగమ్మగారంటే?-నువ్వే!

మంగమ్మ:

(మంగమ్మ మాటాడకండా చూస్తోంది) యింకా జ్ఞాపక ముందీ?

సుందరేశయ్య:

ప్రతి వుదయమూ, సాయంత్రమూ, జ్ఞాపకజలం ఆ నామ దేవతతో అభిషేకం చేస్తోవుంటే!

మంగమ్మ:

(కోపంతో) యిన్నేళ్ళు వొచ్చినా, దొంగమాటలు మానలేదా?

సుందరేశయ్య:

(ఆశ్చర్యంతో) దొంగమాటలా, యెందుకు?

మంగమ్మ:

కాక—

సుందరేశయ్య:

ఆ కోపమేమిటి ?

మంగమ్మకు జ్ఞాపకం తిరగబెట్టి కోపం యెక్కువై పోతోంది.

మంగమ్మ:

మళ్ళీ ఆ పాడు పేరు విన్నానా, ఈ జన్మకి వొదిలిపోయిం దనుకున్నాను కద శని ! ఆ పేరులో యే అక్షరంగాని విన్నానా, ఆనాటి కింక ఆనందమూ, శాంతీ ధ్వంస మౌతాయి. మీరా ! మళ్ళీ—మీరా—నిజమే !

సుందరేశయ్య:

యేమిటీ !

మంగమ్మ:

నేనని తెలిసే యీా పన్నాగం పన్నావు. ఆహా ! లోకంలో ఎక్కడ కనపడతావోనని, భయంతో, ఈమూల దాక్కుంటే యిక్కడికి దాపరించావా ! ఈ సంబంధం, వియ్యంకుడివా, పిల్లేదు. ఎంత ద్రోహం ! అప్పుడు తెలీకూడదూ ! అందుకే పెళ్ళిముందు పాడు మొహం చూపించలేదు.

సుందరేశయ్య:

ఏదో భ్రమలో మాట్లాడుతున్నావు. ఎందుకీ దురావేశం ?

మంగమ్మ:

అడుగుతున్నారా ? ఎంత నటన ! ఎంత నిర్మాలిన్యం ఆ కళ్ళలో.

సుందరేశయ్య:

నన్ను 'మీరు' అంటావేమిటి ?

మంగమ్మ:

కాక యేమనాలి. సిగ్గుగా లేదూ?

సుందరేశయ్య:

సిగ్గా! దేనికి?

మంగమ్మ:

అన్నిటికీనీ—చివరికి ఈ మోసానికి.

సుందరేశయ్య:

ఏ సాక్షిగా ప్రమాణం చెయ్యమన్నా చేస్తాను. నేను మోసాన్ని యెన్నడూ నీయడల తలపెట్టలేదు. ఈ గడిచిన నిమిషంవరకు మంగమ్మగారంటే నువ్వని తెలీదు.

మంగమ్మ:

నమ్మగలనా?

సుందరేశయ్య:

నమ్మాలి.

మంగమ్మ:

(కోపంతో, దుఃఖంతో, అణుచుకోలేని సిగ్గుతో) నమ్మను. ఒకప్పుడు నీనోటినించి యింతకన్న అనృతాలైన మాటలే నమ్మాను. కాని, యింక నమ్మను. నమ్మమని అడగడానికి నోరెట్లా వొచ్చింది, సిగ్గులేనివాడా!

సుందరేశయ్య:

(కొంచెం కోపం తెచ్చుకుని) ఎందుకట్లా దూషిస్తావు? సిగ్గా! యెందుకు నాకు సిగ్గు? నేను నీకోసం చేసిన త్యాగానికా? అపకారం జరిగింది. వొప్పుకున్నాను. నేను తలవొంచుకున్నాను. వొక్కణ్ణేనా? ఒక్క మొగవాడే అన్నిటికీ—

మంగమ్మ:

కాని నీకేం? నువ్వేమన్నా-

సుందరేశయ్య:

అవును. కాని లోకం స్త్రీయెడల కఠినం కావడంచాత నువ్వు కలిగివుంటావు. దానికీ నాదే తప్పా!

మంగమ్మ.

లోకమేనా? లోకం వొక్కటే? నువ్వేం చెయ్యనేలేదూ! నువ్వేమీ అన్యాయం యెరగనే యెరగవూ?

సుందరేశయ్య:

నాకు సిగ్గుపడవలసిం దేమీ జ్ఞాపకం రావడంలేదు.

మంగమ్మ:

(ఆవేశంతో) లేదూ? సిగ్గుపడవలసిందేమీ లేదు? నిజంగానే! ఇంత అన్యాయం, ఇంత ఆత్మవంచన యెక్కడనా వుంటుందా? దినదినమూ నేనెంత బాధపడ్డాను! నన్నా బాధలో ముంచడానికి కారణమైన ధూర్తుడు, దిగులుపడి, పశ్చాత్తాపంతో దహించుకుని ఏడుస్తున్నాడనే నమ్మకము వల్లనే జీవించగలిగాను ఈ యిరవై యేళ్లూ. నిజమే! సిగ్గుపడనేలేదూ? పైగా యెదురు త్యాగమూ! సిగ్గుకదూ? నీ నాలిక చీలికలు కాలేదూ! నన్ను మోసంచేసి నమ్మించి గోతులో కీడ్వడం—

సుందరేశయ్య:

నా అంతరాత్మ నిర్మలమని నాకు తెలిసినప్పుడు, నేను తెలుసుకోవలసిన అవసరమేమిటి? పరస్పర భిన్నాభిప్రాయాలను యెవరిదివారు దాచిపెట్టుకుని, మసిచి, ప్రస్తుత వ్యవ

హారంవేపు కళ్ళు తిప్పకూడదూ? పోనీ భవిష్యత్తు ఆలోచించకూడదా?

మంగమ్మ:

భవిష్యత్తా! నీతో వియ్యమా? పో, నీ అమ్మాయిని తీసుకుపో. యీవేపు రావొద్దు నువ్వు. వెళ్లు నీ మొహాన్ని భరించలేను.

సుందరేశయ్య:

నిజంగా నే! పిచ్చా?

మంగమ్మ:

ఈనాడేం? యిరవై యేళ్ళకిందటే ఎత్తింది పెద్దపిచ్చి - మదపిచ్చి.

సుందరేశయ్య:

సరే! ఇంకే మనను!

మంగమ్మ:

వెళ్ళండి. యేమీ అనవొద్దు.

సుందరేశయ్య:

సరే. వెడతాను. ఇంక అంత కారణంలేని మూర్ఖానికి జవాబేముంది?

మంగమ్మ:

వెళ్ళు.

సుందరేశయ్య:

కామాక్షి?

మంగమ్మ:

(ఆలోచనగా) కామాక్షి! కామాక్షి కేం? వుంటుంది.

సుందరేశయ్య:

ఇంత ఘాతకురాలి పిల్ల-

మంగమ్మ:

అవును. దాన్ని చూసినప్పుడల్లా మీరు జ్ఞాపకం రాకుండా వుంటారా? ఆ కళ్ళు అవే. మొదటిరోజే తోచింది, యీ చల్లని కళ్ళని యెక్కడో ఇదివరకు చూశానే అని. కాని, పోనీ వుణ్నుండి. దాన్ని వుణ్నుండి లెండి.

సుందరేశయ్య:

నన్ను ద్వేషించే హృదయం నా కూతుర్ని ప్రేమిస్తుందా! కామాక్షిని వొదిలి లోకంలో నే నేంచెయ్యను? అదిమాత్రం నన్ను వొదిలి వుండగలదా? మేమిద్దరం కలిసివుండే పద్ధతి మీదనే కద, యీ వివాహం యేర్పాటు అయింది.

మంగమ్మ:

దాసి కాపరం పాడుచేసి తీసుకుపోయి పిల్ల నేంచేసుకుంటారు? పాడుచేసిన జీవితాలు చాలవూ?

సుందరేశయ్య:

యేదో వొకటి చేసుకుంటాను. అమ్ముకుంటాను. నీకెందుకు? రమ్మను.

మంగమ్మ:

అట్లా ఐతే తీసుకుపో. నీ వెనక అది పరిగెత్తుకుని లేచిపోతే అదో అపరిదిష్ట, (తోటవాడితో) వొరేయ్, కామాక్షిని రమ్మను.

కొంచెంసేపు మాట్లాడకండా నుంచున్నారు.

మంగమ్మ:

నువ్వింత సులభంగా పొమ్మంటున్నావుగాని, ఆ కొత్తదంపతుల కెట్లా వుంటుంది?

మంగమ్మ:

ఆ సంగతికూడా మీకెందుకు?

సుందరేశయ్య:

నా హృదయమింకా జీవించివుంది గనక.

మంగమ్మ:

యెందుకు? యితరుల హృదయాలను భగ్నం చేసేందుకేనా?

సుందరేశయ్య:

కాదు, యీ విచారాలూ నిందారోపణలూ అనుభవించేందుకు.

మళ్ళీ వూరుకున్నారు. కామాక్షి; వెంకటచలం వొచ్చారు.

కామాక్షి:

(సంతోషంతో) నాన్నా, వొచ్చారా. (పాదాలకి నమస్కారం చేసింది. సుందరేశయ్య యేమనడానికి తోచక ఆలోచించి)

సుందరేశయ్య:

దీర్ఘ సుమంగలీభవ? (అని లేవతీసి కావిలించుకున్నాడు. వెంకటచలం నమస్కారం చెయ్యబోయినాడు.)

మంగమ్మ:

వుండు. వుండు. తరవాత చెపుతాలే. (వెంకటచలం ఆశ్చర్యంతో చూస్తున్నాడు. సుందరేశయ్యతో) వెళ్ళండి.

వెంకటచలం:

యేమిటి?

మంగమ్మ:

ఆయన కూతుర్ని ఆయన తీసుకువెడతారుట.

వెంకటచలం:

మరి –

మంగమ్మ:

నీకు తెలీదు వూరుకో. ఈ సంబంధం కాకపోతే యింకోటి–

కామాక్షి:

యేమిటి నాన్నా?

సుందరేశయ్య:

నే నిదివర కీమె నెరుగుదును. నేనిక్కడ వుండడం ఈమె కిష్టం లేదు.

మంగమ్మ:

నేనన లేదు ఆ మాటలు–

సుందరేశయ్య:

అన్నావు.

మంగమ్మ:

అనలేదు. మీరూ అన్నది.

కామాక్షి:

(మంగమ్మతో) నేను వుండడం మీకిష్టంలేదా?

మంగమ్మ:

మీ నాయనగారు వుంచనంటున్నారుగా–

సుందరేశయ్య:

నే ననలేదు.

కామాక్షి:

మరి—

మంగమ్మ:

కామాక్షీ, నీమీద నాకు చాలాదయే, కాని నీవంశం సంగతి తెలిసిం తరవాత నిన్ను నిరాకరించడం నావిధి అయింది.

కామాక్షి:

(కోపంతో) యేం వంశ మేమిటి మాది ?

సుందరేశయ్య:

నీ కప్పుడే యీ విషయా లర్థం కావు.

కామాక్షి:

యింకా తెలీవా, పెళ్లైనా ? పొద్దున్న పెళ్ళిచేసి సాయంత్రం పొమ్మనేవాళ్ళని, దీని అర్థమేమిటో చెప్పమని అడగడానికి నా కర్హతలేదా ?

మంగమ్మ:

(ఆలోచించి) యివి చిన్నపిల్లలు జోక్యం కలగజేసుకో వలసిన విషయాలు కావు.

కామాక్షి:

(మంగమ్మతో). మీ రేమంటారు ? మీరూ చిన్నపిల్లలే నేమో !

వెంకటచలం:

(వెంకటచలంతో) యీ గొడవ యేమిటో చెప్పకూడదూ ?

మంగమ్మ:

యేం చెప్పను ?

సుందరేశయ్య:

ఆమెకి తెలిస్తేగా?

కామాక్షి:

కాని నేను వెళ్ళాలి! నాన్నా నేను నీ దగ్గిరే వుంటాను, పెళ్ళివొద్దు యేమీవొద్దని యెంత యేడ్చినా, యేదో నీ తర వాత నే నేమౌతానో అని భయపడి, నన్ను బతిమాలు కుని, నీ కోసమని ఒప్పించావు. యీమెని నమ్మి నన్ను ముందు పంపించినందు కేగద యింత చులకనైనాము. (మంగమ్మతో) యేమండీ! మీరు పెళ్ళయిందంటే, అయిందీ, కాలేదంటే కాలేదు! పైగా మావంశ మంటారు! ఏమిటండీ మావంశం సంగతి? చెప్పరాదూ!

మంగమ్మ:

మీ నాన్న చెపుతారు.

కామాక్షి:

యేం నాన్నా, ఏమిటది?

సుందరేశయ్య:

యేమో! ఏం చెప్పను! ఏం లేదసలు.

కామాక్షి:

ఈ గోలంతా ఎందుకు? ఇప్పుడు నేనిక్కడనించి ఎందుకు కదలాలి!

సుందరేశయ్య:

నన్ను పొమ్మన్నది గనక.

కామాక్షి:

యెందుకు?

సుందరేశయ్య:

నాకూ తెలీదు.

కామాక్షి:

సరే, పోదాం పద (వెంకటచలంతో) వెడతానండీ!

వెంకటచలం:

(కన్నీళ్ళతో) వొద్దు.

కామాక్షి:

మరి యేంచెయ్యను?

సుందరేశయ్య:

నేనూ వొస్తాను.

కామాక్షి:

యేం నాన్నా?

సుందరేశయ్య:

అంతకంటేనా; కాని మేము బీదవాళ్ళం. ముందు చెపుతున్నాను.

మంగమ్మ:

(వెంకటచలంతో) యేమిటీ! నువ్వూ వెడతావా?

వెంకటచలం:

మరి (కన్నీళ్ళు పెట్టుకుంటున్నాడు)

సుందరేశయ్య:

పోనీ నేను వెడతాను. మా అమ్మాయిని వుంచుకో.

కామాక్షి:

యేమిటినాన్నా! కారణం లేకుండా పొమ్మంటే, నువ్వట్లా వూరుకుంటున్నావుగాని, యేం గతిలేదా మనకి! కావలిస్తే

యీాయన వొస్తారు, లేకపోతే లేదు. వెడదాం, రా. నిన్ను మర్యాద చెయ్యకపోయిం తరవాత నేనెందు కిక్కడ!

వెంకటచలం:

అంతేనా కామాక్షి!

కామాక్షి:

యేంచెయ్యను? మీారూ రండి.

సుందరేశయ్య:

(మంగమ్మతో) కారణమేమీా లేనిది, ఏదో భ్రమ మనసులో పెట్టుకుని మమ్మన్నందరిన్నీ అవస్థ పెడుతున్నావు. స్పష్టంగా మాట్లాడితే యెంత బావుంటుంది!

మంగమ్మ:

యేమీా లాభంలేదు.

సుందరేశయ్య:

పోనీ నేను వేడుకొంటున్నాను. అమ్మాయీా, నువ్వూ నీ పెనిమిటీ లోపలికి వెళ్ళండి ఒక్కసారి. నేను—

కామాక్షి:

యేమిటి నాన్నా, యింకా మాట్లాడే దేమిటి? యేమిటీ ఆ వినయం, విధేయతా! పోనీ, పొమ్మంటే పోదాం.

సుందరేశయ్య:

నేను చెవుతాగా, నువ్వు వెళ్లు.

కామాక్షి:

కావలిస్తే నువ్వుండు, నేనుమాత్రం—

మంగమ్మ:

యిందాకణ్ణించి నీకు బోధించిన నీతులన్నీ యేమైనాయి.

కామాక్షి:
అవన్నీ మీ కోడలికి బోధించుకున్నారు, నాకుకాదు.

సుందరేశయ్య:
అమ్మాయీ, యేమిటా మాటలు. (కామాక్షీ వెంకటచలం వెడుతున్నారు.) నేను దాని దుఃఖాన్ని చూడలేను. దాన్ని వొదిలి నేను జీవించలేను. వాళ్లిద్దరి భావిసౌఖ్యమూ అభివృద్ధీ మన చేతులో వున్నాయి. నువ్వేదో జీవితమంతా భంగపడ్డానన్నావు నామూలంగా. మనిద్దరమూ కలిసి దాని జీవితాన్ని భగ్నం చేస్తాము. నాబిడ్డకోసం నా అభిమానాన్నంతా దిగమింగుకుని నీచేతులు పట్టుకున్నా. నేను నీకు ద్రోహం చేశానో, లేదో—చేశానే అనుకో, బుద్ధిపూర్వకంగానే చేశాననుకో, క్షమించు.

మంగమ్మ:
ఆసంగతి సరేలే, క్షమించటానికి నేనెవర్ని, పరమేశ్వరుడున్నాడు. కాని నిన్ను ప్రతిదినమూ యిక్కడ చూస్తూ వుంటే నాకు శాంతి వుంటుందా? ప్రతి దినమూ యెవరిని నా హృదయ శాంతికై శపించుకుంటున్నానో, ఆ మనిషిని నా అతిథిగా, మిత్రుడిగా ఎట్లాచూసుకోను? ఏమో చిన్నప్పుడు నన్ను మోసంచేసినట్టే, ఆజాలికళ్ళతో అట్టా చూసి మళ్ళీ ఈనాడు—

సుందరేశయ్య:
(కొంచం సంతోషంగా) అన్యాయం, అన్యాయం. ఇన్నేళ్ళొచ్చి—

మంగమ్మ:

వినండి. ముసలివారైనారు. దేహం ముడతలు పడ్డది. కాని మీకళ్లు అట్లానే - నాటిమల్లేనే సరిగ్గా—(అప్రయత్నంగా జ్ఞాపకస్ఫురణలోపడుతో) ఆ వుదయం పెద్దగాలిలో, నీ గది ముందు నుంచుని, నావంక జాలిగా—రాత్రంతా నిరాశ చెందించిన క్రూరత్వానికి నేను బాధ్యురాలనైనట్టు, చిన్న వెలుతురులోనుంచుని—(తెప్పరిల్లి) ఏమో, ఏనిమసాన, అప్రమత్తతలో—మళ్ళీ, మళ్ళీ నన్ను అవివేకినిచేసి-వెళ్లు, వెళ్లు-(పెద్దగా) వొద్దు, వొద్దు మీరు వొచ్చినప్పణ్ణించి - పోండి మీరూ మీసంతానం, అందరూ నా జీవితంలోంచి, నా కళ్ళముందునించి, వెళ్ళిపోండి ముందు. ఇంత విశాల ప్రపంచం వుండగా నేనే దొరికానా నీకు వియ్యమంద డానికి? ఏమిటిది? యేమిటి? (ఒక్కనిమిషం వూరుకుని మంగమ్మ శాంతపడ్డది.)—ఆశ లేదు. ఏనాడు నువ్వే హృద యాన్ని అంత గాఢంగా గాయంచేశావో, ఆనాడే నాకూ నీకూ ముగిసింది. ఆనాడే శాశ్వతంగా లత తెగింది. యెప్పుడు నిన్ను చూసినా ఆగాయం రక్తంకారక మానదు.

సుందరేశయ్య:

అన్యాయం, అన్యాయం, అంటావు. నేనుచేసిన అన్యాయ మేమిటో స్పష్టంగా మాటలతో చెప్పు.

మంగమ్మ:

చెపుతాను. చెప్పడానికేం! (ఆలోచిస్తోంది) యేం చెప్పను! యెట్లా చెప్పను! యెంత ఆవేశంకిందో, ఆగ్రహం- కిందనో మణిచి దాచిన వ్యవహారాన్ని విప్పనా! (ఆగింది) ముందు

యే మెరగని నాతో ఆ దురుద్దేశ్యాన్ని, మలినమైన అను
రాగాన్ని ప్రేరేపించింది నువ్వేనని వొప్పుకుంటావా ?

సుందరేశయ్య:

నేనా ! మలినమా ! కానీ–

మంగమ్మ:

యేమిటి ? యిదికూడానా, దుర్మార్గుడా ! నువ్వు కాదూ
ద్రోహీ ?

సుందరేశయ్య:

నేనేమన్నాను ?

మంగమ్మ:

పైగా యేమన్నానా ! పురుషస్పర్శ అనేది అర్థం కాకముందే
భర్తపోయిన నన్ను, తలిదండ్రు లతిజాగ్రత్తతో, శాస్త్ర
పారాయణంలోనూ, ధర్మవ్రతాచరణంలోనూ, పారమార్థ
చింతలోనూ పెంచుతో వుంటే బంధుత్వమిష చేత, యింటో
స్వేచ్ఛనుపొంది క్రమంగా నా మనసులో విషసర్పంవలె
ప్రవేశించి, ఒక్కటొక్కటిగా, నా దమన శక్తుల్ని నాశనం
చేసి పైగా, పైగా–వుండు ఆ రాత్రి ఉత్తరరామ చరిత్ర
చదువుతో, సీతచూపును వర్ణించి–అప్పుడుకదూ నావంక–

సుందరేశయ్య:

(ఆగలేక) అప్పుడేనా ! నిజమా ! (సంతోషంతో) అప్పు
డేనా మొదట నీ మనస్సు స్పృశించింది; మొన్నాళ్ళు బాధ
పడ్డాను నీ మనోభావం తెలీక ! మరి అన్ని రాత్రులు, అన్ని
గో[illegible]లు–ఆ వర్ష రాత్రివరకు–దాదాపు నెలరోజులు, ఎందుకు
నన్నింత బాధపెట్టేవు ! అబ్బ ఆ వేదన ! మధురమైన—

మంగమ్మ:

(లజ్జతో) కాకపోతే, కన్యను, నవయువ్వన వంతురాలను మరి
-(తెప్పరిల్లి) పోనీలే, అదంతా యెందుకు? నువ్వు—

సుందరేశయ్య:

అట్లా కాదు నిజం చెప్పు. అంతకుముందే నాపైన అనురాగ
మంకురించిందా. యింకా అంతకు ముందో! అసలు నన్ను
మొదట చూచినప్పుడు—వెనుకటింటి కిటికీదగ్గిర సగం చీక
ట్లోనూ—

మంగమ్మ:

చాల్లే అదంతా వుండనీ, కాని అమాయకురాలిని, నన్నం
టావా ఆ మాట!

సుందరేశయ్య:

(మరిచిపోయి) యేమాట?

మంగమ్మ:

(మరిచిపోయి) ఏ మాటా? (ప్రయత్నపూర్వకంగా ఆలో
చిస్తుంది) ఏదో, పోనీలే!

సుందరేశయ్య:

మరి చెప్పు నేనేం అన్యాయం చేశానో?

మంగమ్మ:

(ఆలోచించి) ఆ నువ్వేవొచ్చి, పారమార్థిక ధ్యాసలో—

సుందరేశయ్య:

ఏం దొంగమాటలు! ఆ వయసులో పారమార్థిక చింతలా?

మంగమ్మ:

వెక్కిరించకు. వూరికేనూచో—అపును పారమార్థిక చింతలో
కళ్ళు మూసుకుని నిద్రపోతున్న నా మనసుని బలవంతంగా
రేకులు విప్పి—

సుందరేశయ్య:

నువ్వే అంటివికద! ఆ రాత్రే ఉత్తరరామాయణం చదివిన రాత్రే—అప్పుడు నేనింకా కలలోనన్నా యీ విషయమై అట్లాంటి—

మంగమ్మ:

అవునేమో! కాని నీకేం తెలుసు? నేనిప్పుడు చెపితే తెలిసిందిగాని—

సుందరేశయ్య:

నాకు స్పష్టంగా తెలీకపోవొచ్చు. కాని నా అంతరాత్మకి తెలిసివుండదా? నీకే వ్యక్తంగాని, సిగ్గుతో కూడిన ప్రణయ దృష్టులూ, నిద్రలో స్ఫురించే రహస్యపు కోర్కెలూ, నీవేళ్ళలోని కంపనా, నడకలోని సంభ్రమమూ, నా మనసు కనిపెట్టి వుండదనా? నేను చూట్టంలేదనుకున్నప్పుడు, నీకూ తెలీకండానే నీ చూపులు నా ముఖంసించి దొంగిలించిన ఆనందాన్ని నే నెరగనా?

మంగమ్మ:

కాదు. అంతా నీ భ్రమ.

సుందరేశయ్య:

ఇంకేం చెప్పను?......పోనీ ఆ వర్షరాత్రి, వొక్కత్తవూ ఆ పెద్ద విసురుగాలిలో నుంచున్నప్పుడు—(మైమరచి) నీ పమిట దానిమ్మచెట్టుపైకి యెగురుతో, నీ నున్నని నుదురు మీద నల్లగా చీకట్లో చీకటివలె ముంగురులు కదులుతో, నీ హృదయంలోని భావాలవలె పరువులెత్తే కారుమబ్బుల కేసి, నీ లేత ముఖాన్ని తిప్పి— (ఆనందంలో మునిగి మాట్లాడం మరిచిపోయినాడు)

మంగమ్మ:

అప్పుడు——

సుందరేశయ్య:

అప్పుడు చప్పుడుకాకుండా పక్కనవొచ్చి నుంచున్నాను. నువ్వు అట్లానే నుంచుని, వేళ్ళతో ఏదో పెతుకుతున్నట్టు, నీ చెయ్యి నా చేతివేపు చాచి——ప్రేమతో——నా వేళ్ళని-

మంగమ్మ:

కాదు భయంతో——

సుందరేశయ్య:

ప్రేమతో-ఆ భేదం తెలీదా!

మంగమ్మ:

(కోపంతో) నీ హృదయ మాలిన్య మట్టా అనిపించింది. కాని భయంతోనే. ఎన్నోసార్లు నేను ఆలోచించుకుని రూఢి చేసుకున్నాను- భయంతోనే నని-నేనేమీ లజ్జలేని దాన్ని కాదు-భయంతోనే-

సుందరేశయ్య:

అట్లా అనకు ఆపొక్క ఆనందాన్ని ఛేదించకు.

మంగమ్మ:

(విసుకుతో) సరేలే-అప్పుడు నువ్వేంచేశావు - అసహాయనైన నన్ను దగ్గిరికి చేర్చుకుని-అదేదో చంపక పువ్వుల వాసన తైలం——

సుందరేశయ్య:

అదీజ్ఞాపకముందే! నాకు మావాళ్లు పుస్తకాలకిచ్చినవాటిల్లో రూపాయిన్నర మిగిల్చుకుని కొన్న దది-

మంగమ్మ:

వుండు నీవూపిరితో నా చంపల్ని గాఢంగా కాలుస్తో దగ్గి
రగా నీకు, నీ పెదిమలకి, దగ్గిరిగా, నా చంపని... అబ్బా!
(అతని చెయ్యి గట్టిగా పట్టుకుంది.) జన్మానికల్లా—ఆవొక్క—
రాత్రి—యింక రాదుకదా! నన్ను బోలినదాన్ని - (తెప్పరిల్లి)
పోని, అదంతా, పోనీ ఇప్పుడెందుకు? ... ఆరాత్రి యేమ
న్నావు? ఇంక మనిద్దరి జీవితాలూ వొకటేననీ, నన్నెప్పుడూ
అన్యాయం చెయ్యననీ—నువ్వు నన్ను బలవంతంచేసి, చేసిన
అపరాధానికి నేను పశ్చాత్తాపపడి, భయపడి ఏడుస్తోవుంటే—
అనలేదూ? జ్ఞాపకంవుందా?

సుందరేశయ్య:

అన్నాను—ఏమీ?

మంగమ్మ:

మరి ఆమాటలు నమ్మేకద—నువ్వుపోగానే యిల్లంతా చీకటై
నట్టయి; వేదాంతం నిస్సారమూ, శాస్త్రాలు వెర్రిపేలాప
నలుగాతోచి, యింక నిలువలేక, అన్ని బంధనాల్నీ,
బంధువుల్నీ త్యజించి, ఇల్లువొదిలి, నీకోసంవొచ్చి, కోమల
మైన నా యవ్వనాన్ని—నీ చేతులకి వొప్పగించింది; అందు
కేగా! (కోపంతో) అవునా, ఏంచేశావు, రాక్షసీ, పాతకీ,
ఏంచేశావు!

సుందరేశయ్య:

(నెమ్మదిగా) ఏంచేశానా? నువ్వు మరిచిన నీతినీ, ధర్మాన్నీ
శ్రేయస్సునీ నీకు బోధించి, తీసుకుపోయి, ఏదోవొంకచెప్పి
నీ తల్లిదగ్గిర దిగపెట్టా. అదే నీకుచేసిన పరమ ద్రోహం—
అవునా?

మంగమ్మ:

కాదూ !

సుందరేశయ్య:

ద్రోహమే !

మంగమ్మ:

నాతో పరియాచకమా! నీవేపుచూచిన నా మృదు ప్రేమ లతని ఖండించి, నలిపి-సమ్మోంచి, గొంతు నులిమి——

సుందరేశయ్య:

(ఆలోచనగా) ద్రోహమేనా? సరే, పోనీ. మరి యిందుకా ద్రోహం చేశాననుకున్నావు? నిన్ను అంతగా ప్రేమించుకున్న, నిన్ను, నీ ప్రేమని నిర్మూలం చెయ్యటం నాకు ఆనందమే అనుకున్నావా?

మంగమ్మ:

కాకపోవచ్చు——

సుందరేశయ్య:

నువ్వొచ్చిన సాయంత్రం - ఈనాడు జరిగినట్టు అంతా జ్ఞాపకముంది-నువ్వు బండిదిగడం-సిగ్గుతోనుంచోడం - నల్ల చుక్కలచీర కట్టుకున్నావు అవునా-నా ఆశ్చర్యం-నీ-పెదిమ వొణకడం-

మంగమ్మ:

అబ్బా!

సుందరేశయ్య:

ఆసాయంత్రం-నిన్ను-ఒకరోజున-కాదు-ఆరాత్రికి నాకోసం, స్వేచ్ఛగా, స్వతంత్రంగా ప్రేమించుకోవాలని, నిర్భయంగా కావిలించుకోవాలని, నామనసెంత తెంపుచేసుకుందో నీకేం

తెలుసు? కాని నేను ఒక్కచూపు దయగా చూశానా! ఒకసారి ముద్దుగా పిలిచానా? ఇద్దరమూ మహాపాతాళంలో కుంగిపోతా మనుకుని—

మంగమ్మ:

కాదు, ఏమీకాదు. ఏదో తాత్కాలికంగా నా హృదయంతో ఆడుకున్నావు - అవసరంతీరింది. యత్నం సఫలమయింది. నువ్వు వెలిగించినమంట కన్నీళ్ళతో చల్లారుతుం దనుకున్నావు. కాని భగ్గుమని నలుగురి కళ్ళముందూ మండింది. నా తెగింపు నీకు వుపద్రవం తీసుకొచ్చేటప్పటికి- ఏం చేశావు? నాపతనానికి-వినాశనానికి హేతువైన నువ్వేం చేశావు! స్వార్థపరుడివై, భీరుడివై, నా అవస్తను యోచించక కుంగిపోతున్న నా అభిమానాన్ని-ఎండిపోయ్యే నా రసభావాన్ని, మండిపోయ్యే నా యవ్వనాన్ని తలుచుకోక నీతిబోధలతో నాతల విరిగేట్టు——

సుందరేశయ్య:

వుండు_అన్యాయం-జరిగిపోయింది-పాతికేళ్ళకిందటి ముచ్చట ఎట్లా నీకిప్పుడు రుజువు చెయ్యడం! ఎన్నటికైనా ఆ యీశ్వరుడు నిజం తేల్చవలసిందే! ఎట్లా నమ్మతావు. ఇరవైయేళ్లనించి పాతుకున్న అబద్ధం - అపనమ్మకం - యీనాటి పది మాటలతో చెదిరిపోతుందా!

మంగమ్మ:

చెప్పరాదూ, ఆ నిజమేమిటో?

సుందరేశయ్య:

ఆ నిజమేమిటంటే-నమ్మవు-లాభ లేదు.

మంగమ్మ:

చెపుదూ.

సుందరేశయ్య:

నువ్వు పసిదానివి. లోకమూ, దాని అసహానమూ, దాని వంకరదృష్టి తెలీనిదానివి. అమాయకురాలివి.

మంగమ్మ:

అందుకనే అట్లా మోసపోయినాను.

సుందరేశయ్య:

నన్ను నమ్మివొచ్చావు. అటువంటి నిష్కపటురాలిని—నిన్ను—నా స్వలాభం చూసుకుని 'ఎన్కరేజ్' (Encourage) చేసి, నాతో వుంచుకుంటే పర్యవసాన మేమవుతుంది? వుండు. నువ్వనేది నాకు తెలుసు. అది నిజమే. నేనేమీ యోగిని కాదు. అసాధారణ సహనవంతుణ్ణీ కాదు. నిన్ను పెట్టుకున్నా ననగానే మా తండ్రి డబ్బు పంపడు—నాకు భయమే—మా వాళ్ళూ, మీ వాళ్ళూ, మనని రానీరు. బీదతనం, అమర్యాద సంఘ దౌర్జన్యం ఆజన్మాంతమూ హీనత్వం – లేచిపోయిం దనే హేళన—మన పిల్లలకి తలవొంపులు – ఇన్నీ ఆలోచించాను. నా కప్పుడే తెలుసు—స్త్రీ హృదయం కదలనే కదలదు, కదిలిందా అది జగన్నాథుడి రథమేనని. ఎవరికేం ముప్పు మూడుతుందో, తాముగాని యితరులుగాని తమ ప్రవర్తనవల్ల యెంత నలుగుతారో, యేమీ ఆలోచించదు. బంధనాలకూ, వివేకానికి అంధమౌతుంది. కాని పురుషుడికైనా కలగవొద్దా జ్ఞానము——

మంగమ్మ:

నిజమేనా! నమ్మనా?

సుందరేశయ్య:

నీయిష్టం.

మంగమ్మ:

కాని తరవాత......తరవాత...నా శిశువు నా గర్భంలో కదిలినప్పుడు, నేను నీకు రాసిన వుత్తరాలు—

సుందరేశయ్య:

అవును. ఏం చెయ్యనూ...చేశాను. మహాపాపం చేశాను. ఏనాడు నీ లోతైన రొమ్ముల వేపు నా మనసు చలించిందో ఆనాడే పరిగెత్తుకుపోవలసింది. ఏనాడు నా చూపులు నీ మెడచుట్టూ తిరిగాయో, ఆనాడే కళ్ళు పొడుచుకోవలసింది. కాని నీ సామీప్యానపొందే మాధుర్యం నన్ను అశక్తుణ్ణి చేసింది.

మంగమ్మ:

మరి నా సంగతీ—

సుందరేశయ్య:

నీవెంత దురదృష్టంలోపడ్డా, నాతో నిన్నిడ్చే అవస్థకన్న నయమేగా! అదీగాక పెళ్ళి అయినవాణ్ణి, ఇంకో వ్యక్తి బాధ్యత నా చేతులపైనవుంది. నేనేం చెయ్యగలను.

మంగమ్మ:

నీ అంతరాత్మకి యీ కారణాలు చెప్పి నోరుమూసి, ధర్మమే ఆచరించానని సంతోషించావు. అవునా......నా బాధ, నా బాధ!

సుందరేశయ్య:

ఆ బాధ నా నెత్తిన రుద్దుతావేం? నీ ప్రారబ్ధం అనుభవించక ఏం చేస్తావు?

మంగమ్మ:

(కోపంతో) ప్రారబ్ధమా! నీ గొంతువూడిపోనూ! అమాయకురాల్ని నన్ను తప్పుతోవ కీడ్చి, శిశువుని కల్పించి, నన్ను నాగతికి వొదిలి, నీ భార్యతో సుఖించడం నా ప్రారబ్ధ ఫలమా? ప్రతిరాత్రి శూన్యంతో, నీకోసం చేతులు చాచి, చాచి-ఏడ్చి, గర్భంలో శిశువు కదిలినప్పుడల్లా, ఆ ఆనందం జ్వాలవలె నన్ను కాలుస్తోవుంటే ఆ దొంగతనమూ, సిగ్గూ, భయమూ - అబ్బో - దాన్ని-ఆ నోరులేని దాన్ని తిట్టుకుంటో యెన్ని జన్మాలకైనా మరవగలనా? అదంతా నా పూర్వజన్మ ఫలమా? ధూర్తుడా, పిశాచీ, సిగ్గులేదూ, నీ మొహానికి!...ఎంత నమ్మాను నిన్ను! ఎన్ని సార్లు ప్రయత్నించాను, ఎట్లాగో తప్పించుకుని నీ దగ్గిరికి వొచ్చి, నీ గుండెలమీద అర్ధరాత్రి కూచుని, కత్తితో, నీ కళ్ళు తెరిచి, గుడ్లుపెరికి, మాట్లాడకుండా నీ నాలికకోసి, నన్ను కావిలించుకున్న నీ చేతులు నరికి "నేనే! నేనే! అంత సులభంగా మోసపుచ్చి వొదిలిన దిక్కుమాలిన పిల్లని-నేనే నోరులేని ఆడపిల్లకదా, అని వొదిలేస్తే, వొదిలించుకున్నావా? నేనే, పిశాచిని రాక్షసిని నేనే" అని—

సుందరేశయ్య:

తిట్టు, వుమ్మెయ్యి-పాపంచేశాను. కాని నేను కరుణ తలచక నన్ను వుపేక్ష చేసినందువల్లనే కద-యీ భాగ్యము-కొడుకు కోడలు-యిన్ని యేర్పడి సౌఖ్యపడుతున్నావు? నేనే నిన్ను తెచ్చుకుంటే-మనిద్దరి గతీ యేమయ్యేది!

మంగమ్మ:

ఇప్పుడు సరే! చేసినపని మంచిగా వుండవొచ్చు, పర్యవసానం వల్ల కాని అప్పుడు యివన్నీ ఆలోచించేనా, నా విచారానికి నన్ను • వొదిలిపెట్టి[illegible]రాయివలె వూరుకున్నావు? చెప్పు, నువ్వెట్లా నిర్దోషివి!

సుందరేశయ్య:

వూరికే, మానినపుళ్లు రేపుకుని యేమి ప్రయోజనం!

మంగమ్మ:

లోపలంతా కుళ్లు. బైటపెట్టడం భయం. నిజం చెప్పు. ఇన్నేళ్లొచ్చాయి. ఇప్పటికైనా నిజం మాట్లాడితే చేం!

సుందరేశయ్య:

(ఆలోచించి) చెపితేనేం! నీ వుత్తరాలు చూసి, మనసు నిలువక నిన్ను తెచ్చుకుందామనుకున్నాను. కాని భార్య వొప్పుకోలేదు. చస్తానంది. పుట్టింటికిపోయి గోలచేస్తానంది. మరి దాని ఆస్తిమీద బతుకుతో వుంటిని! (సిగ్గుతో తల వొంచుకున్నాడు.)

మంగమ్మ:

అదే నిజం! నీభార్యకి దడిశి నన్నెట్లో వొదిలావు.

సుందరేశయ్య:

నా భార్యనుచూసి ఈర్ష్యపడుతున్నా వెందుకు?

మంగమ్మ:

ఈర్ష్యా! నీకేం మతిపోతుందా? ఈర్ష్య కాదు. నా విధ్యుక్తం నుంచి భార్యనిచూసి భయపడ్డ నిన్నుచూసి అసహ్యం.

సుందరేశయ్య:

విధ్యుక్తమా? నా భార్యనీ, సంసారాన్నీ పాలించడమా - కడుపుతున్న వితంతువుని తెచ్చుకుని సంసార విచ్ఛేదనం చేసుకోడమా? అగ్నిసాక్షిగా చేసిన ప్రమాణాలను ధ్వంసం చేసి——

మంగమ్మ:

ఔను. పంచభూతసాక్షిగా చేసిన ప్రమాణాలేమైనాయో! ఇది బహిరంగమూ, అది రహస్యమూ! అంతే భేదం—ఛీ! నీతో మాట్లాడ్డం పాపం.

సుందరేశయ్య:

నా కాపరాన్ని నేను నాశనం చేసుకోని పాపానికి, నా కూతురు సంసారం నాశనం చెయ్యాలంటావు అంతేనా? సుఖంగా యిట్లాబతకడం నీకేం చేదుగావుందా? (కంఠం మార్చి) ముసుపూ యింతే-ఏదోవొంక పెట్టి నాతో తగాదా పెట్టుకుని కన్నీళ్లు కార్తేనేకాని తృప్తి—

మంగమ్మ:

మరినువ్వు వోదార్చడం యెంతబావుండేది! పకపకానవ్వి, నా మాటల్ని తప్పించి, దొంగపలుకులు పలికి యిట్లానే - యెప్పుడూ మోసపోవడమే నేను!

సుందరేశయ్య:

ఏం మోసపోయినావు? హాయిగా యిల్లూ వాకిలీ, బంధువులూ——

మంగమ్మ:

కాని శాంతియేదీ? నా గర్భంలో అగ్ని -

సుందరేశయ్య:

ఎందుకు ?

మంగమ్మ:

ఆ మూడు రాత్రుల పాపాగ్ని నిన్ను వొదిలిందిగాని, నన్ను జన్మాంతమూ పట్టుకుంది.

సుందరేశయ్య:

అంటే ?

మంగమ్మ:

మనకొడుకు.

సుందరేశయ్య:

కొడుకూ!

మంగమ్మ:

అవును — ఓ పల్లెటూళ్ళో యెవరికీ తెలీకండా కానిచ్చే యేర్పాటు చేశారు. అక్కడ, ఆగుడిశలో కని (కన్నీళ్ళతో) పాలు తాగుతున్న పిల్లని, నా మెడమీద చిన్న చేతుల్తో, తడుముతున్నకూనని లాగి, విడదీసి, యిచ్చేశాను—చాకలి వాళ్ళకి—పెంచుకోమని (కోపంతో) సంతోషించు. కడుపు నిండిందా ?

సుందరేశయ్య:

తరవాత—

మంగమ్మ:

ఎంత బతిమాలుకున్నా, వుపవాసాలుచేసి, చస్తానని బెదిరించినా, నా బిడ్డని నేను తెచ్చుకోడానికి—ఒక్కసారి చూసి రావడానికి వొప్పుకోలేదు, మావాళ్ళు—నా ప్రియమైన తలి

దండ్రులు. వాళ్ళు మర్యాదవుంచేసరి! నా గర్భంకాలి నేను చస్తే వాళ్ళకేం!

సుందరేశయ్య:

మళ్ళీ తల్లితండ్రులకే కృతజ్ఞత చూపాలని నీతిపుస్తకాలన్నీ బోధిస్తాయి.

మంగమ్మ:

వాళ్ళుమాత్రం – ఏంచేస్తారు పాపం, వాళ్ళకీ—

సుందరేశయ్య:

(హడలిపోయి) వుండు. ఆ, ఆ, వుండు... ...నిజమే! అవును– అదేయీడు ... ఆ, ఆ. అన్నకీ చెల్లికీ పెళ్ళిచేశామూ! శివ, శివా! ఎంత ఘోరపాపమిది! పోనీ, నన్ను తీసుకుపోనీ, దాన్ని కామాక్షిని. ఇంకానయం, రాత్రికాకముందే వొచ్చాను – ఎంత–

మంగమ్మ:

వుండు. గోలపడకు. ఈ వెంకటచలం కాదు.

సుందరేశయ్య:

కాదుగద! అమ్మ! ఐతే నువ్వు తెచ్చుకోలేదన్నమాట! వాడెక్కడ?

మంగమ్మ:

ఎట్లా చెప్పను? నా చిన్నిపాపని ఆ చాకలాళ్ళు ఏం కొడుతున్నారో, ఆకలి అని గొంతుచించుకున్నా పాలు పోస్తున్నారో లేదో–పరాయిపిల్ల వాళ్ళకేంముద్దు! ఏం రోగం వొచ్చి, ఏంబాధ పడుతోందో–అని ఆలోచించుకుని, ప్రతి రాత్రి, చీకట్లో చేతులుచాచి, చచ్చాను. ఎన్నాళ్ళకీ మరుపు

రాదు. ఎన్నటికీ చల్లారదు మంట, ఏదన్నా పనివుంటే మరవగలంగాని దుఃఖం-వూరికే తిని కూచున్నవాళ్ళ కదే పని! కడుపంతా మండేది. గిలగిల తన్నుకునేదాన్ని. మళ్ళీ పిల్లల్నికన్న కడుపే అమ్మంది-వూరికే తిట్టేది నన్ను - పన్నెండేళ్ళు ఎండబెట్టుకున్నాను హృదయాన్ని, కాల్చేవిరహాగ్నికి వొదిలేశాను గర్భాన్ని. స్వేచ్ఛగానే; యెవణ్ణిగురించి ప్రతిదినమూ కలలుకని, రూపాన్ని వర్ణించుకుని, చిత్రించుకుని బాధపడుతున్నానో; వాణ్ణి నౌకరుకింద తెప్పించుకున్నాను. కాని నేను వొదలిన పసిపాపకీ, వీడికీ సంబంధమేదీ! వీడువొచ్చినా నా పాప యెక్కడో ఏడుస్తున్నట్టే వుండేది. సరిగా పాలుపడుతున్నారా, కొడుతున్నారా, అని వులికిపడి లేచేదాన్ని! యెట్లాగో సమాధానం పెట్టుకుని ప్రేమించడం నేర్చుకున్నాను, యీ నౌకరు కుర్రాణ్ణి.

సుందరేశయ్య:

వున్నాడా, యిక్కడ!

మంగమ్మ:

అప్పటినించీ, నా బాధ ప్రారంభం.

సుందరేశయ్య:

యేం?

మంగమ్మ:

నాకో అబ్బాయి ఇదివరకే పెంపకంచేశారు, యీ వెంకటచలాన్ని - వొచ్చినరోజునించీ వీడికీ వాడికీ విరోధం. ఆ వెంకటచలం మేధకత్వం పురస్కరించుకుని వీడుచేసిన దుండగం అంతా, యింతానా! నేనేమీ అనలేను. నా బిడ్డకి జరిగిన అన్యాయం నా కళ్ళకి కట్టినట్టు కనపడి, కొట్టబోయ్యే

నా చెయ్యి ఆగేది. నా కొడుకు నౌకరు వాడిమల్లే తిట్టుతింటే, యెంత వేదన కలిగేది! బంధువులూ నౌకర్లూ వీణ్ణికొడితే వాళ్ళని చంపెయ్యాలనిపించేది. ఏం చెయ్యను? వీడేడిస్తే వాడి పౌరుషమూ, కళ్ళల్లో అధికారమూ వెలిగితే, వెళ్ళి కావిలించుకోవాలని, నా శరీరమంతా లాక్కుపోయ్యేది. యెంత ప్రయత్నించినా నాకొడుకు, నాసంపదకంతా ప్రభువు లాగూ, ఆ వెంకటచలం అన్యాయంగా, అక్రమంగా ఆక్రమించుకున్నట్టూ తోచేది. నిన్ను తలుచుకుని వాణ్ణెంత ద్వేషిద్దామన్నా నాచాత నయేది కాదు. వాడు నవ్వినా, తలతిప్పినా, నువ్వే, నీ అందమే జ్ఞాపకం వొచ్చేది. నీమీది ద్వేషమంతా వాడిమీది ప్రేమలో కరిగిపోయేని.

సుందరేశయ్య:

కరిగిపోయిందా?

మంగమ్మ:

వెల్లి విరిసి ప్రేమ పుట్టుకొచ్చేది. చూపలేను. కన్నీళ్ళు తుడవాలని, నీళ్ళుపొయ్యాలని, కావిలించుకోవాలనిపించేది. యెట్లా? యెవరు ప్రేమించేవారు లేక, నౌకర్లై, సహజ అహంభావంలో ప్రతివారిమీదా, అజ్ఞలమీదా నామీదా తిరగపడే వాడిస్తితిచూసి... అబ్బా, ఏం బాధపడేదాన్ని? రాత్రులుపోయి, చాపమీద దొర్లే వాడిపక్కన పడుకుని, తెల్లవార్లూ కావిలించుకోవాలని పించేది. పూరికే చూస్తో రాత్రంతా నుంచునేదాన్ని. చాటుగా తినే వన్నీ పెట్టాను. చాటుగా ముద్దు చేశాను. కాని నా రహస్యప్రేమ వాడికి విషంగా పరిణమించింది. అన్నీ దొంగబుద్ధులు; తిరగపడటం

పొగరుబోతుతనం! వాడుచేసే పాడు పనులు ఎన్నని చెప్పను? ఎట్లా చెప్పను? నా గర్భం అట్లా తగలపడి పోతోవుంటే నే నెట్లా వోర్వను? ఒక్క రోజు శాంతి నెరగను. ఇంతకంటే నన్ను మీరు మీతో తీసుకుపోతే బాగుండేదేమో!

పరుగెత్తుకుంటో వీరదా, వసంతం వొచ్చారు.

వీరదః

అమ్మమ్మా, అమ్మమ్మా! రా, చూడు, ఆగది ఎంత అందంగా చేశారో!

వసంతం:

చాంటో హల్వా నాకు కొంచమన్నా యియ్యర్ట. అంతా నాన్నకే పిన్నికీట! కొంచెం యిప్పించవూ, అమ్మమ్మా!

మంగమ్మ:

అవి మనం తాకకూడదు. ఇంటో చోకలెట్లు పెడతారండి.

వీరదః

అమ్మ యిచ్చింది. ఇన్ని! నా పొట్టనిండా పోసింది.

వసంతం:

వీరదా, అమ్మ యేమంది?

మంగమ్మ:

యేమంది?

వీరదః

యేంలేదు. ఏడుస్తోంది.

వసంతం:

యేడుస్తోందని చెప్పవొద్దన్లేదూ అమ్మ!

మంగమ్మ:

యేడుస్తోందా? యేడవనీ, అమ్మకి శాస్తి కావలసిందే!

యింకా యేదో అనబోయి ఆలోచించి వూరుకుంది.

పీరద:

అమ్మవన్నీ దొంగయేడుపులు కదూ, అమ్మమ్మా!

మంగమ్మ:

ఊఁ!

వసంతం:

అమ్మ పాపాత్మురాలు. పెద్దవాళ్ళు చెప్పినమాట వినదు.

మంగమ్మ:

వూరుకో, అమ్మని అనడం తప్పుకదూ?

వసంతం:

తప్పా అమ్మమ్మా! అమ్మని అనడమూ తప్పేనా?

మంగమ్మ:

పిన్ని నాన్నగారు వొచ్చారు చూశారా? తాతయ్యగారు. నమస్కారం చెయ్యండి.

నమస్కారం చేశారు.

సుందరేశయ్య:

యెంతచక్కని పిల్లలో! ఇంకేం కావాలి యీ తోటని స్వర్గతుల్యం చెయ్యడానికి!

వసంతం:

(సుందరేశయ్యతో) పిన్ని మంచిది. మాకు అన్నీ యిస్తుంది. అందుకనే మా నాన్న యెప్పుడూ ముద్దుపెట్టుకుంటాడు.

మంగమ్మ:

యింటోకి రండి. ఇంతసేపు మిమ్మన్ని అలసట పెట్టాను. మంచి ఆతిథ్యమే! చక్కని వియ్యపురాల్ని దొరికాను.

కామాక్షి యింకోరకం ముస్తాబై వొచ్చింది.
సుందరేశయ్య ఆమెని కావిలించుకున్నాడు.

కామాక్షి:
నాన్నా, ఇంకా యిక్కడ వున్నావేం!

సుందరేశయ్య:
వేం?

కామాక్షి:
అంత హీనంగా చూశాక యింకా నువ్వెందు కిక్కడ! నావిధి నేనుంటాను. నువ్వు వెళ్ళు.

మంగమ్మ:
అంత కోపమూ! ముసలిదాన్ని నన్ను క్షమించవా?

సుందరేశయ్య:
రాత్రికి చెపుతాలే అంతా కామాక్షీ!

మంగమ్మా సుందరేశయ్యా వెడుతున్నారు. నారాయణ పాడుతో వొచ్చాడు.

నారాయణ:
కులాసగుంటాది నా మొంకి!
కులుకుతూ పెడతాది నా మొంకి!
ఆ ముసలినక్కేనా నిన్ను కన్నాది?

కామాక్షి:
ఫో, వెధవా, మా నాన్న నేమన్నా అన్నావా?

నారాయణ:
మేళంలో మద్దెలవాడిమల్లే అదేం వేషం!

కామాక్షి:
అత్తగారూ, వీడు, చూడండి. (మంగమ్మా సుందరేశయ్యా తిరిగి వొచ్చారు)

నారాయణ:
ఓరి ముసలినక్కా !

సుందరేశయ్య:
ముసలినిగా! చూద్దుగానిరా, రారా. (మీాదికి వెడుతు న్నాడు. ఆయన జబ్బలుచూసి నారాయణ వెనక్కి తగ్గు తున్నాడు.)

కామాక్షి:
పోనీ నాన్నా, పిరికివెధవ.

సుందరేశయ్య:
ఎవడు వీడు ?

మంగమ్మ:
మాయింట్లో వుంటాడులెండి.

సుందరేశయ్య:
ఒక్క తడాఖా చూపిస్తాను.

కామాక్షి:
వీడసలు నౌకరుట నాన్నా! (సుందరేశయ్య చప్పున వెనక్కి తగ్గి చూస్తున్నాడు. మంగమ్మ మొహం తిప్పుకుంది)

సుందరేశయ్య:
ఏమిటయ్యా, యీా దౌర్జన్యం? పెద్దవాళ్ళని గౌరవిస్తే పాపమా ! వొచ్చిన నిమిషానే నిష్కారణంగా తగాదా పెట్టుకున్నావు. ఈపిల్ల నిన్నేం చేసిందని అట్లా ఏడిపించడం? నీకు చెల్లెలుకాదూ! అన్యాయం !

నారాయణ:
నా చెల్లెలూ (నవ్వుతున్నాడు) ఓరే, అరవోడా, నీకూ నీ కూతురికీ——

మంగమ్మ:
నోరుముయ్యి. పో అవతలకి.

నారాయణ:
వీళ్ళందరూ యెందుకు బంగాళాలో—

మంగమ్మ:
నోరుముయ్యి, వెళ్ళుముందు. (నారాయణ వెడుతున్నాడు)

వీరద:
యింతమంచి తాతయ్యని తిడుతున్నాడయ్యా, ఈ నారాయణ. అసలు మన యింట్లోంచి పంపెయ్యి.

వసంతం:
తాతయ్యా, వొదలకు. వాణ్ణికొట్టి బాగా వాడి కండుపాచింపెయ్యి.

సుందరేశయ్య:
యెందుకు వాడికంత—

వసంతం:
నారాయణకిమల్లే తాతయ్యకికూడా యెర్రమిరపాలే.

వీరద:
తాతయ్యా, మాకేమన్నా తినడానికి తెచ్చావా?

మంగమ్మ:
అట్లా అడగ వొచ్చా.

వసంతం:
తాతయ్య ట్రంకు చూశాను. ఏంలేవు, చుట్టలకంపు.

మంగమ్మా, సుందరేశయ్యా, కామాక్షి నడుస్తున్నారు.

వీరద:
తమ్ముడూ, యిదిగో నేలపిల్లి,

వసంతం:

ఏది, ఏది!

పెద్దవాళ్లు వెళ్ళారు, పిల్లలు పిల్లులకోసం నేలలో వెతుకుతున్నారు.

వీరద:

పుమ్మొయ్యి, పుమ్మొయ్యి పైకివోస్తుంది.

లక్ష్మి:

(వచ్చి) పిల్లులా, నేను తీసిపెడతాను.

వసంతం:

లక్ష్మి, ఏమిటి తింటున్నావు?

లక్ష్మి:

సీమచింత కాయలు.

వసంతం:

నాకో. (యిస్తోంది.)

వీరద:

పాపం! దాని కాయలు తీసుకోకు, తమ్ముడూ! మనం ఎన్ని అప్పచ్చులు తిన్నాముకాము యీవాళ!

లక్ష్మి:

ఇంతవరకు మాకు బువ్వ పెట్టలేదు. పొద్దుణ్ణించి గంజేలేదు ...యిదుగో పిల్లి, యిందండి.

వసంతం:

ఏం?

లక్ష్మి:

బాబూ, అక్కా తగూలాడుకున్నారు.

వీరద:

ఎందుకు?

లక్ష్మి:

అమ్మగారు అక్కని వెళ్ళగొట్టమన్నారు. ఎక్కడికి పోవాలని అక్క యేడుస్తోంది.

వసంతం:

మీ అక్క యెందుకేడుస్తోంది?

లక్ష్మి:

అమ్మగారు పొమ్మన్నారుగా!

వసంతం:

ఎందుకు?

లక్ష్మి:

అక్కకి కడుపొచ్చింది.

నీరద:

పాపాయి పుడుతుంది. దాన్ని నాకియ్యాలి.

లక్ష్మి:

అక్కకి పెళ్ళి కాలేదుగా?

నీరద:

ఓ!

వసంతం:

మరి యెందుకు పెళ్ళి చెయ్యలేదూ.

లక్ష్మి:

చెయ్యకపోతే, మరి కడుపు తెప్పించుకోవచ్చా

వసంతం:

ఎందుకు తెప్పించుకుందో!

నీరద:

పాపాయికోసం.

విమల:

(విమల వొచ్చింది) బాబూ, యిట్లారా.

వసంతం:

ఉండు, యీ పిల్లి రావటంలేదు.

విమల:

నేను వెళ్ళిపోతున్నా, ఒక్కసారి రావూ?

వసంతం:

(వచ్చి) ఎక్కడికి అమ్మా?

విమల:

ఎక్కడికో చాలాదూరం.

వసంతం:

మళ్ళీ యెప్పుడొస్తావు?

విమల:

ఎన్నో యేళ్ళకి యెప్పుడో! నన్ను గుర్తున్నా పట్టవు, అప్పుడు.

వీరద:

మళ్ళీ చామంతిపువ్వులొస్తాయీ, అప్పుడు?

విమల:

కాదు. ఇంకా చాలా యేళ్ళకి చూడండి. అమ్మమ్మమ్మయీత్తో నేను చెడ్డదాన్నని చెప్పిందికదూ? అవునా? (వూరుకున్నారు) నేనేం చెడ్డదాన్ని కానమ్మా! నాకే మీమీద చాలా ప్రేమ. నేనే తొమ్మిది నెలలు పొట్టలో మోసి కష్టపడి కన్నాను.

వీరద:

అవును. వీణ్ని కన్నప్పుడు ఆ మూలగదిలో మూలిగావు. నేనేడ్చాను.

విమల:

అవును. నిన్నూ అట్లానే కన్నాను. అప్పుడు చచ్చిపోతానని కూడా అనుకున్నాను. తరవాత మిమ్మల్ని యెంతో కష్టపడి పెంచుకున్నాను.

వసంతం:

అమ్మమ్మ కదూ మన్ని పెంచింది, అక్కా?

విమల:

అమ్మమ్మకి డబ్బువుంది. కనక మీకు అన్నీ కొని పెడుతుంది. నాకు డబ్బులేదు. నాకే డబ్బువుంటేనా అమ్మమ్మమల్లే దాచుకునేదాన్నా! ప్రతి దమ్మిడీ మీకే యిచ్చేదాన్ని.

వసంతం:

దమ్మిడీ లేనా?

నీరద:

నీకు డబ్బెందుకు లేదూ?

వసంతం:

డబ్బులేకపోతే యెందుకేం?

విమల:

పోనీ, నీకు తేలుకుట్టిన రాత్రి తెల్లార్లూ నేను కూచున్నానా అమ్మమ్మా! అమ్మమ్మని మీరుకొడితే వూరుకుంటుందా? నన్ను కరుస్తావా! నేనేమన్నా అంటానా?

నీరద:

(విమల మెడ కావిలించుకుని) అమ్మ మంచిది, తమ్ముడూ! ఎక్కడికీ వెళ్ళకు అమ్మా.

విమల:

నన్నే-చెడ్డదాన్ననుకోకండి. అమ్మమ్మ వూరికే అట్లా చెపుతుంది. నామీద కోపం. ఆ మాటలు నమ్మకండి. నా

ప్రాణాలన్నీ మీామీాదనే వుంటాాయి- (పిల్లల్ని ముద్దుపెట్టు కుంటోంది) చిన్నప్పటి సంగతులేమీా జ్ఞాపకంలేవూ! నా మీాద యెంత ప్రేమగా వుండేవారు! ఎట్లా ఆడుకునేవాళ్ళం! ఆవాళ, గడ్డివాము తగలబడ్డరాత్రి, బొమ్మరిల్లు కట్టుకుని యెట్లా దాక్కున్నాము. అమ్మమ్మ కొట్టవస్తే నా వెనకాలే కాదూ దాక్కునేవారు. (సగం తనలో) నిర్భాగ్యురాల్ని. మిమ్మల్ని కాపాడుకునేశక్తి వుంటే నామీాద ప్రేమపోయ్యేదే కాదు మీాకు! భయపడి, దిక్కులేక, చేతులారా, మిమ్మల్ని మీా ప్రేమనీ ఆ రాక్షసి చేతి కందించుకున్నాను. నే నెవ్వరికీ అక్కరలే దిప్పుడు.

నీరద:

కావాలి అమ్మా-నువ్వు నాక్కావాలి.

విమల:

ఎందుకు?

నీరద:

ఎందుకా, వుండు ... వుండు ...

విమల:

నీకేమీా తెలీదు, అవునా? ... అంతే నాగతి ... నాకు ప్రాయశ్చిత్తము ... నా పిరికి పాపానికి.

నీరద:

వుండు అమ్మా! మా కోసం వుండు.

విమల:

నేను వెళ్ళిపోవడంకూడా మీా కోసమే!

నీరద:

మా కోసమా! మేం మిక్కడే వున్నాముగా!

విమల:
(సగం తనలో) నే నిప్పుడు మీ కేం వుపయోగం? వుండి వొకటే లేకా. వొకటే! మొన్నటికి మీ ప్రేమకి అర్హురాల్ని కాగలను? పూరికే, తొమ్మిది నెలలు మోసి కన్నందుకు, వొస్తుందా మీ దగ్గరనించి ప్రేమ! ఏ మృగమన్నా చేస్తుం దాపని. శక్తి లేనిదానిమీద భక్తి ఎట్లావొస్తుంది? డబ్బు సంపాయించి మీకు ఎన్నో వొస్తువులు పట్టుకొస్తా. నన్ను మరిచిపోకండి. (లక్ష్మి యేడుస్తూ విమలదగ్గిరికివొచ్చింది)

లక్ష్మి:
నన్ను తీసుకెళ్ళండి, అమ్మా! నేనూ వొస్తాను మీతో.

విమల:
(ఆశ్చర్యంతో) నువ్వా!

లక్ష్మి:
నేను మీకు పనిచేసిపెడతాను. ప్రేమిస్తాను. నన్ను తీసుకెళ్లండి.

విమల:
ఎందుకే నువ్వు నాతో?

లక్ష్మి:
వొస్తానమ్మా!

విమల:
మీ అయ్య కొట్టడా?

లక్ష్మి:
అదికాదమ్మా, మీరొక్కరు వెళ్ళొద్దు. ఆ వెధవ నారాయణ మిమ్మల్ని బాధలుపెట్టాడు. నేను చూశాను. తీసుకెళ్ళండి నన్ను.

విమల:
(దాన్ని ముద్దుపెట్టుకుని) వొద్దమ్మా! నాకే గతిలేదు. నిన్నేం చేసుకోను (వెళ్ళింది)
నీరద:
పాపం! అమ్మ వెళ్ళిపోతుంది.
వసంతం:
అన్నీ వుత్తదే! వెళ్ళదు నీరదా! ఎక్కడికి వెడుతుంది?
నీరద:
లక్ష్మీ! ఎందుకు ఏడుస్తున్నావు?
లక్ష్మి:
కడుపు పీక్కుపోతోంది. బువ్వలేదు.
నీరద:
వుండు, ఇక్కడే వుండు. (లోపలికి వెళ్ళింది)
లక్ష్మి:
మీ అమ్మగారు అట్లా యేడ్చి వెళ్ళిపోతూవుంటే, అట్లా వూరికే నుంచున్నారేం?
వసంతం:
అంతా దొంగవేషం.
నీరద పలహారాలు తెచ్చి లక్ష్మికి యిచ్చింది. లక్ష్మి తింటోంది.
లక్ష్మి:
చల్లని చిన్నమ్మగారు! మీకు పుణ్యముమ్మా! విమలమ్మ గారికి బువ్వలేకపోతే, యెవరో యిట్లానే పెడతారు.
నీరద:
అమ్మకి అన్నం యెందుకు వుండదు?
లక్ష్మి:
ఎట్లా వొస్తుంది?

పేరద:

అవును. పాపం, అమ్మ ఏమౌతుంది! అన్నంలేక చచ్చి పోతుందేమో!

మంగమ్మ:

(వచ్చి) ఇవన్నీ తీసుకొస్తోవుంటే ఎందుకో అనుకున్నా. దీనికి పెడుతున్నారా? ఓసీ, చిన్నపిల్లల్ని చేసి బెల్లించుకు తింటున్నావా? మిమ్మల్ని దీంతో సావాసం చెయ్యావొద్దన లేదూ? ఈ నీచుల– (ఆగి ఆలోచిస్తోంది.)

పేరద:

లచ్చికి ఆకలివేసింది.

మంగమ్మ:

లచ్చికి ఆకలేస్తే, నిన్నింటోవన్నీ తెచ్చి పెట్టమన్నారా? అవి నీవా?

పేరద:

నా కిచ్చారుగా!

మంగమ్మ:

నిన్ను తినమన్నారుగాని పంచిపెట్టమన్నారా? ఆ చోకలె క్కడివి?

పేరద:

అమ్మ యిచ్చింది.

మంగమ్మ:

అమ్మ కెక్కడివి?

పేరద:

అమ్మవే!

మంగమ్మ:

అమ్మవే ? అమ్మవీ, నీవీ–

వీరద:

అమ్మ మంచిది, అమ్మమ్మ ! నువ్వన్నీ అబద్ధాలు చెప్పావు.

మంగమ్మ:

ఆ, అంతవరకొచ్చిందీ ! అదేనా చెప్పింది, మీ అమ్మేనా (తగ్గి పస్తాయించి) అవును. అమ్మ మంచిదే! (తనలో) మంచి దేనేమో ! ఏమో ! యెవరికి తెలుసు ? యెవరనగలరు ?

వీరద:

చాలా మంచిది.

మంగమ్మ:

(దయగా) లచ్చీ, యెందుకే ఆకలి ?

లక్ష్మి:

మా యింటో గంజి కాచలా.

మంగమ్మ:

ఏం ? ఏదో పెధవతగూ మళ్ళీ పెట్టుకున్నారు గావును! నాయన తాగాడా ?

లక్ష్మి:

లేదు. అక్కని యింటోంచి పొమ్మన్నాడు. అక్క యేడ్చింది. కొట్టాడు. మీరు అక్కని పొమ్మన్నారుటగా ?

మంగమ్మ:

(ఆలోచిస్తో) అవును, పొమ్మన్నాను–పోనీ వుండమను. (సగం తనలో) నే నెవర్ని పొమ్మనడానికి !

వీరద:

పొమ్మను, అమ్మమ్మా, మన యిల్లు.

మంగమ్మ:

అందరం అట్లాంటివాళ్ళమే నమ్మా.

వసంతం:

కాదు. వాళ్ళు చెడ్డవాళ్ళు, లేకివాళ్ళు. బుద్ధిలేదాశూద్రా ళ్ళకి. పొమ్మను.

వీరద:

మనకి పనెవరు చేస్తారు?

వసంతం;

బైటవుండి పనిచెయ్యమను.

మంగమ్మ:

లక్ష్మీ, ఆకలేసిందా? వెళ్ళు. వెంకమ్మని అన్నం పెట్ట మన్నానని చెప్పు, (వెడుతోంది ఆలోచిస్తో)

వీరద:

అమ్మమ్మ, లక్ష్మిమీాద యింత దయగావుండే యివాళ!

వసంతం:

ఆ లడ్లు యిచ్చినందుకు, నిన్న గదిలో పెట్టడం మరిచి పోయింది.

వీరద:

వరేలే. ఆ పిల్లిని అగ్గిపెట్టెలో పెట్టు.

# మంగమ్మ

## ౧

రాత్రి తొమ్మిదిన్నర వెనకగది-ముందు చెట్లు. గదికి తలుపూ, కిటికీ తలుపు మూసివుంది. లోపల దీపం వెలుతురు. కిటికీ వెలుతురు కింద, గదిబైట, సోఫామీద వెంకటచలం కామాక్షీ కూచునివున్నారు.

కామాక్షి:

రాత్రి తక్కిన పిల్లలందరూ పడుకున్న తరవాత ఒక్కర్తెసి 'బాల్కనీ'లో నుంచుని ఆలోచించుకునేదాన్ని, యీ రాత్రిని గురించి.

వెంకటచలం:

యేదన్నా రూపం కళ్ళముందు వుండేదా!

కామాక్షి:

ఆ రూప మెప్పుడూ మారేది. ఆనాళ్ళ చూసిన మంచిరూప మేదో అది కనపడేది.

వెంకటచలం:

(బుగ్గ గిల్లుతో) అంత చంచలమే!

కామాక్షి:

యింక చలించదు.

వెంకటచలం:

యేమో!

కామాక్షి:

నన్నట్టా అనవొద్దు. నవ్వులాటకైనా వొద్దు.

వెంకటచలం:

సరే !

కామాక్షి:

నాకు నిద్రొస్తోంది.

వెంకటచలం:

అప్పుడే ?

కామాక్షి:

కూచుని యేంచేద్దాం ?

వెంకటచలం:

మాట్లాడుకుందాం.

కామాక్షి:

యేం మాటలు ? మాటలేమిటి ? పూరికే మాట్లాడితే వేం బావుంటుంది !

వెంకటచలం:

నీ నోటినించి వొస్తోవుంటే, నీకళ్ళు కదిలకనీ, నీ పెదిమల తొందరనీ, నీ మెడవొంపునీ చూడ్డం బావుంది.

కామాక్షి:

బొమ్మని చూసినట్టు !

వెంకటచలం:

వెంకటచలం:

ఛా! యేమిటంటే, యింకా నాకేదో నువ్వు కొత్తదానివి మల్లేనే వున్నావు. నీ స్వేచ్ఛా, సిగ్గు లేకపోవడమూ,-ఎవరో ఆడటీచరుతో- కాదు, యేలోకంనించో నాతో ఒకగంట మాట్లాడ్డానికి వొచ్చిన కిన్నెర కన్యవేమో అనుకుంటు న్నాను.

కామాక్షి:

ఏమిటి నావల్ల మీకు వుపయోగం?

వెంకటచలం:

ఇట్లా కనపడ్డమే! యిట్లా కూచోడమే! ఎందుకూ యింకా సందేహిస్తో అట్లా వోరగా నా ముఖం చూస్తావు? నేను విశ్వాసపాత్రుణ్ణిగా కనపట్టంలేదా?

కామాక్షి:

నాకేమీ సందేహంలేదు, మీమీద. నన్ను నమ్మండి. రండీ, యిట్లా దగ్గిరగా, రండి. వూరికే మాట్లాడుకుంటో కూచుంటే, యిట్లాంటి సందేహాలే తోస్తాయి—(వెంకటచలం ఆమె దగ్గిరగా కూచుని ఆమె మొహం చేత్తో పట్టుకు చూస్తు న్నాడు) యేం కనపడుతోంది?

వెంకటచలం:

మాధుర్యం!

కామాక్షి:

వాలికిపోతోంది (నవ్వుతోంది.)

వెంకటచలం:

అబ్బా, యీ ఆనందం! ఆ బుగ్గలమీద ఆ చిన్ని సొట్ట లెక్కడ సంపాయించావు? (ముద్దెట్టుకుంటున్నాడు.)

కామాక్షి:

బావున్నాయా ?

వెంకటచలం:

అడుగుతావా ? ఎందుకు అడుగుతావు ?

కామాక్షి:

ఏంలేదు. మీ కళ్ళకి బావున్నాయో, లేవో అని.

వెంకటచలం:

ఎవరికళ్ళకి బావుండవు ?

కామాక్షి:

కొందరి – కొందరికి.

వెంకటచలం:

నీకెట్లా తెలుసు ?

కామాక్షి:

చెపితే!

వెంకటచలం:

ముద్దు పెట్టుకునే !

కామాక్షి:

ఛీ ! (అతని చెంపమీద కొట్టింది )

వెంకటచలం:

మళ్ళీ నవ్వూ.

కామాక్షి:

నవ్వించనా? (చక్కిలిగింత పెడుతున్నాడు) వుండండి.

వెంకటచలం:

అబ్బా, నిన్నేంచేసుకోను ! ఇదంతా నాదే !

కామాక్షి :

మీదే ! ఎవ్వరన్నా ఎత్తుకుపోతారు, భద్రం.

వెంకటచలం:

ఎవరు?

కామాక్షి;

ఎవరంటే వారే.

వెంకటచలం:

ఎత్తుకు పోనిస్తావా?

కామాక్షి:

ఆడదాన్ని నే నేంచెయ్యను? మగవారు మీరు జాగ్రత్త పెట్టుకోవాలి. ఇంకరండి లోపలికి వెడదాం.

వెంకటచలం:

ఇట్లా బావుండ లేదూ?

కామాక్షి:

బావుంది. కాని పడుకుందాం, పోయి—

వెంకటచలం:

పడుకోడానికి రాత్రంతా వుంది. కాని నీమీదనించి విసిరే యీ గాలి ననుభవించడానికి వీలుంటుందా?

కామాక్షి:

ఎంతసేపు వూరికే నావంక యిట్లా చూస్తో కూచుంటారు; చేతులో వెన్నముద్ద పెట్టుకుని చూసినట్లు.

వెంకటచలం:

కాకి తన్నుకుపోతుందా?

కామాక్షి:

ఏమో!

వెంకటచలం:

నీకూ ఆ సందేహమే?

కామాక్షి:

ఏ సందేహం?

వెంకటచలం:

వుంది, వుంది. ఆ సందేహం వుంది. నీ మనసులో వుంది.

కామాక్షి:

చెప్పండి, ఏమిటో అది?

వెంకటచలం:

అంతేకాదు. ఎవరిమీదో కాదు. నీమీదే నీ మనసుమీదే లేదు, నీకు విశ్వాసం — అదేకాదు, నామీద లేదు. అవును. వొట్టి బలహీనుణ్ని. నేనేం కట్టివేయగలను నీ మనసుని. ఏ నిమిషాన ఏ దురదృష్టదేవత తన్నుకుపోతుందో నాయీ నిధానాన్ని. ఇంత సౌందర్యం, ఇంత చతురత్వం యీ నిర్భాగ్యుడికి దక్కుతుందా?

కామాక్షి:

ఏమిటా పిచ్చివాగుడు?

వెంకటచలం:

అవును, అదే, అదే! అవును పిచ్చివాగుడు, వాగే పిచ్చి వెధవను.

కామాక్షి:

అయ్యో! మీ మీద ప్రేమలేకపోతే, మిమ్మల్ని ప్రేమించ తలుచుకోకపోతే మిమ్మల్నెందుకు పెళ్ళిచేసుకుంటాను?

వెంకటచలం:

అట్లాంటి అబద్ధాలే నాకు మరింత భయం పుట్టించేది, పోనీ మాట్లాకండా వూరుకోరాదూ?

కామాక్షి :

ఎందుకట్లా అంటారు? నేనేచేంశాను? లోపలికిరండి అన్ని సందేహాలూ పోతాయి.

వెంకటచలం:

నువ్వేం చెయ్యలేదు, నా జాతకం. నా ఖర్మం. నేను వెధవని. నన్నెవ్వరూ మోహించరు. మోహించినా త్వరలోనే తెలుసుకుని మానేస్తారు. నిశ్చయం, ఇది నిశ్చయం.

కామాక్షి:

అంత నిశ్చయమైపోతే యెందుకుపెళ్ళి-అందులోనూ రెండు పెళ్ళిళ్లు చేసుకున్నారు.

వెంకటచలం:

అందుకనే శుద్ధ వెధవని గనక. ఎదురు చెప్పడం చాతగాని చచ్చు పీనిగిని గనక. తిరగబడాలనే వుంటుంది. అనుకుంటా. మాటకూడా చివరికి నోటిచివరికి వొస్తుంది. అనలేను. నడుమెత్తాలనే వుంటుంది. కాని యెవరో విరకొట్టినట్టు కిందికి వొరుగుతాను ... ...

కామాక్షి :

పోనీండి.

వెంకటచలం:

ఇదివరకంతా అదొక లోపంగా కనపళ్ళేదు. కాని నిన్ను చూసినప్పణ్ణించి నాకు నువ్వెక్కడ తప్పిపోతావోననే భయం పట్టుకుంది. నా అశక్తతేకద దానికి కారణం. విమలతో వున్నన్నాళ్ళూ నాకెప్పుడూ యిటువంటి బాధ కలగలేదు. నిన్నుచూసిన ప్రతిసారీ నాగుండె బిగపడుతోంది. (మెల్లిగా ఆమె పాధాలదగ్గిరికి జారుతో) లాభంలేదు. నా

కా శక్తిరాదు. నాకు తెలుసు. నిన్ను నిలుపుకోలేను. నువ్వే నన్ను కటాక్షించాలి. నామీద జాలితలిచి నన్ను వొదిలి పోకు. నన్ను చంపివెయ్యకు. నన్ను ద్రోహం చెయ్యకు.

కామాక్షి:

అయ్యో! మీ భార్యని, మీ దాసిని, నా పాదాలముందు యిట్లా పడతారేమిటి?

వెంకటచలం:

నా భయం. అదే కారణం. నాకు తెలీదనుకోకు, ఎంత దాచినా. నేను శుద్ధ అవివేకిని కాను. ధైర్యంలేదు గాని కుశాగ్రబుద్ధిని-నాకు తెలుసు-అసలు నన్నెందుకు పెళ్ళిచేసుకున్నావు-మీ నాన్నబలవంతం. కాదనకు-ఎందుకా అబద్ధం. కాకపోతే నన్నువొలిచి చేసుకొన్నావా!

కామాక్షి:

బలవంతం ఏముంది? మంచి సంబంధం వస్తే చెయ్యాలను కుంటున్నారు, చేశారు అదీ తప్పే!

వెంకటచలం:

అందుకనే-నామీద నీకేం నిలకడవుంటుంది! నీ కళ్ళలోనే తెలుస్తోంది. భర్త గౌరవం, భక్తి లేదు! నీ కళ్ళల్లోనే తెలుస్తోంది!

కామాక్షి:

ఐతే, అసలు, పెళ్ళి ఎందుకు చేసుకుంటాను? భర్తని గౌరవించాలనే కదూ?

వెంకటచలం:

అదుగో, యింకా అబద్ధాలాడుతున్నావు. ఇప్పుడే యిన్ని అబద్ధాలాడేదానివి నన్నెంత క్షోభ పెడతావో యికముందు. ఎందుకు పెళ్ళిచేసుకున్నావు? నా డబ్బుచూసి, నా యిల్లు

చూసి, సుఖపడవొచ్చునని! సుఖపడగానే యింక పోకిళ్ళు పుట్టుకొస్తాయి.

కామాక్షి:

అటువంటి నీచజాతికి పుడతాయి ఆ బుద్ధులు!

వెంకటచలం:

అదుగో! ఆమాటలు! ఎంత అనుభవమో! ఎంత తెలివో! ఏం చెయ్యను నిన్ను! పో, పో, వొద్దు... ...వెళ్ళకు. నన్ను వొదలకు ... ... ఎందుకింత అందంగా వుంటావు. అందరూ చూస్తారు నీవొంక! అందరూ కోర్తారు నిన్ను! నీ అందాన్ని నాశనంచేస్తే నీకు బాగ్గుపూస్తే, నీకన్ను పోడిస్తే. అదికాదు, నీముక్కు కోస్తాను.

కామాక్షి:

(లేస్తో) పిచ్చా, యేమండీ?

వెంకటచలం:

పిచ్చే! పిచ్చే!

కామాక్షి:

నిజంగా పిచ్చిలాగేవుంది. నాకు భయమేస్తోంది. (వెళ్ళబోతోంది)

వెంకటచలం

వుండు; వెళ్ళకు. నాతోడు-ఆగు.

కామాక్షి:

పోవే, ఛమిటి!

వెంకటచలం:

పోనీ, వోకర్క వరంయియ్యి. తమాషాకి అంటే, నిజంగా పట్టుకుని భయపడతావేం? పిచ్చిపిల్లా! నిజంగా కన్నుపొడిచే ఘాతకుణ్ణనుకున్నావా. కూచో, ముందుకూచో, చెపుతా! సరే ఒకవరం ఇస్తావా?

కామాక్షి:

వరమా! వరమేమిటి? ఇది యింకోపిచ్చి, నన్ను వెళ్ళిపోని య్యండి, (వెడుతోంది.)

వెంకటచలం:

వెడుతున్నావా! నేను ముందే చెప్పలా. నాదగ్గిర యెందుకు కువుంటావు నువ్వు. నాకు తెలుసుగా ! అయిపోయింది. ఆఖరే! అప్పుడే! ఈ గంటలోనే నాబతుకు ఆఖరా! ఆఖరా! అయ్యో! చంపావా నన్ను! రాక్షసీ! దెయ్యం! పో, పో, ఇంకేం, పో. కాచుకుని ఉన్నారు అందరూ. పో.

కామాక్షి:

ఇదేమిటీ రాత్రి నాకు! ఎంతో ఆశపడి, ఎన్నోకలలుగని—

వెంకటచలం:

నిజంగానే! అయ్యో, పాపం! నిజంగానే నామీద మోహపడి వొచ్చావా అంతగా!

కామాక్షి:

నిజంగా! చెపితే నమ్మరుగా.

వెంకటచలం:

నమ్ముతాను, నమ్ముతాను, యిట్లారా.

తొరగావొచ్చింది-ఖాజ్జగిస్తున్నాడు. కామాక్షి చాలాసంతోషం చూపుతోంది.

కామాక్షి:

యీ కాస్తభాగ్యానికీ, యెందుకు అంత బాధపడ్డారు. పోయి నాయీ మీ భయాలన్నీ?

అతన్ని వొత్తుకుంటోంది. వెంకటచలం ఆమెని చప్పున వొదిలాడు.

వెంకటచలం:

ఎందుకీ అబద్ధాలు నాతో? అన్నీ అబద్ధాలే! అన్నీ నీకు కొత్తా! మోహం! నీకు కొత్తా! ఎన్నోసారి యిది?

కామాక్షి:

ఇంకేం మాట్లాడను?

వెంకటచలం:

నాకు తెలీదూ? కొంచెం సిగ్గు-కొంచెం కొత్త-యీమనాను వున్నాయీ? నేను నిన్నేంచేశానని, నీ కేద్రోహం చేశానని యింత మోసం చేశావు? ఇప్పుడింకేం చెయ్యను!

కామాక్షి:

ప్రమాణ పూర్తిగా—

వెంకటచలం:

నోరుముయ్యి. నిన్ను చంపనా, కొయ్యనా?

కామాక్షి:

ఎందుకండీ, యిట్లా తిడతారు? నాకేమీ అర్థంకావటం లేదు... ...ఏం మాట్లాడను? ఏం చెయ్యను? మీకు సంతోష మెట్లా కలుగుతుంది.

వెంకటచలం:

ఎట్లా కలుగుతుంది! ఎట్లానూ కలగదు. నాకీబాధ అర్థం కాదు. నిన్ను కావిలించుకుంటే, దాచుకుంటేమాత్రం నాకీ

అనుమానం, నువ్వు తప్పించుపోతావనే భయం పోతుందా! నిన్ను చంపితే-అవును నిన్ను ఎవరికీ దక్కకుండా కోసేస్తే-

కామాక్షి:

పిచ్చి మళ్ళీ, నేను వెడతా.

వెంకటచలం:

వెడతావా! నానించి పోతావా! పో, తప్పుదుముండా, యెట్లాపోతావు? (గట్టిగా పట్టుకున్నాడు)

కామాక్షి:

మీ కాళ్ళు పట్టుకుంటా, ఎన్నడూ మిమ్మల్ని వొదలను.

వెంకటచలం:

నిజమేనా ?

కామాక్షి:

నిజం.

వెంకటచలం:

నే నెన్నోవాణ్ని? నిజం చెప్పు.

కామాక్షి:

అట్లా అనకండి. మీరే-

వెంకటచలం:

అబద్ధం. చెప్పు-

కామాక్షి:

ఏం చెప్పను ?

వెంకటచలం:

నాలుగోవాణ్ణా, ఐదోవాణ్ణా-

కామాక్షి:

నాలుగోవారు.

వెంకటచలం:

మంచిది. ఇంక నన్నువొదిలి యింకోరిదగ్గిరికి వేంచెయ్యావు కద?

కామాక్షి:

నిజంగా వెళ్ళను.

వెంకటచలం:

ఇట్లారా (దగ్గిరిగా కళ్ళల్లోకి చూస్తున్నాడు) నిజమా?

కామాక్షి:

నిజం.

వెంకటచలం:

(చప్పున) కాదులే. ఎట్లానూ వొదులుతావు. ఎట్లానూ పోతావు. నమ్మకంగా కనపడ్డా పైకి, నావెనక నీకళ్ళు వెతుకుతోనే వుంటాయి. నువ్వు విశ్వాసంగా వుండాలనుకున్నా, ఆ కళ్లు నిన్నీడ్చుకుపోతాయి. అయ్యో! యీ అగ్ని తెచ్చిపెట్టుకున్నానే ... ఏంచెయ్యాను ... సరేలే... మరిచిపోయినాను... సరే. ఎట్లానూ పోతావుగాని—పోనీ వరం ఇయ్యి.

కామాక్షి:

వరమా!

వెంకటచలం:

అదుగో, వరమా అంటున్నావా? నాకు తెలుసు మళ్ళీ వెనక్కు తగ్గుతావని! అబద్ధపుబతుకు. పో, పో, కనపడక పో.

కామాక్షి:

వరమేమిటి? ఏమిటా వరం? చెప్పండి.

వెంకటచలం:

ఇస్తావా?

కామాక్షి:

చెప్పండి.

వెంకటచలం:

ముందు చెప్పు.

కామాక్షి:

ఆ !

వెంకటచలం:

విను. ఎట్లానూ నేను నీకు సరిపోను. నా అమ్మ డబ్బు కాశపడి యిక్కడ చేరావు. ఎట్లానూ యితరుల్ని వెతుక్కుం టావు. ఆ గతి నీకూ, యీగతి నాకూ యెవరూ తప్పించ లేరు. నీ యిష్టం. నేనేమీ అనను. ఎవడైనాసరే, ఎవడితో నన్నాసరే— ఆ తోట రాముడితో, ఆ పోస్టు సాయేబుతో బండీవాడితో—నీ యిష్టం—నాకేమీ అభ్యంతరం లేదు. కాని నాకో మాటయియ్యి—వాగ్దత్తం చెయ్యి—ఆ నారాయణ, ఆ నారాయణ వెధవ—ఆ పాతకి—ఆ చండాలుడు – వాడి మొహం చూడనను—ప్రమాణం చెయ్యి—చేస్తావా ?

కామాక్షి:

ఇంతేనా ? మీరు నన్నడగాలా ? మీరు అడక్కపోతే మాత్రం—అసలు మొదట వాణ్ణిచూడగానే—

వెంకటచలం:

సరేలే. ప్రమాణం చెయ్యి.

కామాక్షి:

(గోముగా) చేస్తాను. దానికేం ? కాని మీ కాయనమీద ఎందుకంత కోపం ? తోటవాడికంటె—

వెంకటచలం:

ఆహా, బాగావుండడా అంటున్నావు, అవునా? అదుగో, దుర్బుద్ధి-నాకు తెలుసు.

కామాక్షి:

ఛా, ఛా, వాణ్ణిచూస్తేనే నాకు అసహ్యం. నాకు కోపం.

వెంకటచలం:

నిజమేకద! నీకు వాడిసంగతి తెలిస్తే ఇంకా అసహ్యపడతావు. ఆడవాళ్ళని పురుగుల్లాగు లాగుతాడు. మంత్రిస్తాడు. మందులు పెడతాడు.

కామాక్షి:

అన్నీ విచిత్రాలు, పొండి.

వెంకటచలం:

ఆ, లేకపోతే ప్రతి ఆడదీ, చివరికి విమలవంటి గుణవంతురాలు సహితం వాడివెంట యెందుకు పడుతుంది!

కామాక్షి:

విమల గుణవంతురాలా ఏమిటి!

వెంకటచం:

అత్యుత్తమరాలు.

కామాక్షి:

మరి యీ పని?

వెంకటచలం:

నేను చెప్పేదేమిటి? అది వాడి మంత్రప్రభావం.

కామాక్షి:

మంత్రంకాదు. ఏంలేదు. శుద్ధపోకిరీ-

వెంకటచలం:

వాడి అందం—

కామాక్షి:

అందం వుండనీండి. శుద్ధపోకిరీ యేనా ?

వెంకటచలం:

వాడి ధైర్యం—

కామాక్షి:

అవును. అది నిజమే కాని పోకిరీ కదూ !

వెంకటచలం:

ఆ, బలే పోకిరీ !

కామాక్షి:

చాలామంది ఆడవాళ్ళని మోసంచేశాడా?

వెంకటచలం:

ఆ, ఎందరినో—

కామాక్షి:

ఇప్పుడింకా వున్నారా, ఆ వెధవకి !

వెంకటచలం:

ఎంతమందో !

కామాక్షి:

ఇంక నే నెందుకు లెండి. నావంక చూడనే చూడడు.

వెంకటచలం:

వాడికి యెంతమందైతేనేం! ఇంకా కావాలంటాడు. అందులో నీవంటి అందమైనది కనపడ్డదంటే, వెంబడి తిరుగుతాడు.

కామాక్షి:

కాని నాకు లక్ష్యమా ! నేను కన్నెత్తి చూస్తానా ? అప్పుడు వాడే నన్ను వెంబడించడం మానేస్తాడు.

వెంకచలం:

మరి నా వరం—

కామాక్షి:

చెప్పండి, వెంబడించడం మానతాడుకద ! కాదు అదే పనిగా, సిగ్గులేకండా, నేనే కావాలని మదమెక్కి తిరుగు తాడా !

వెంకటచలం:

ఎందుకు అడుగుతావు !

కామాక్షి:

అట్లా తిప్పి తిప్పి ఏడిపించాలి, అల్లాంటి-పోకిరీ ముండాకొడుకుల్ని.

వెంకటచలం:

వాణ్ణి తిప్పనూవొద్దు-వాడివంక చూడనూవొద్దు – సరేతే. యిన్ని మాటలు మాట్లాడతావుగాని, ఆ ప్రమాణం చెయ్యవు కద ముందు—

కామాక్షి:

అసలు ఏమీ సంబంధం వుండడానికి వీల్లేనప్పుడు, నామనసు గట్టిదైనప్పుడు—ఆ కుక్క వెంటబడితే మాత్రం—

వెంకటచలం:

వెంటబడ్డాడు, అవునా ?

కామాక్షి:

పడితేమాత్రం—

వెంకటచలం:

వెంటబడ్డాడు—యింక వూరుకోడు. నిన్ను పట్టిందాకా వూరు

కోడు. నాకు తెలుసు. ఏం చెయ్యను? ఎట్లానూ వాడి దానివే!

కామాక్షి:

ఛీ, ఛీ!

వెంకటచలం:

ఆ, ఆ నిన్ను తీసుకుంటాడు. వాడికి నిన్ను దక్కనీను. వాడు నన్నుచూసి నవ్వితే నేను భరించలేను. నా కొత్తపెళ్ళాన్ని, యీ అందాన్ని, నిన్నుకూడా, నాకు దక్కకుండా, వాడే లాగితే-యిదివరకే లాగేడేమో-అవునా! అవునా? నిన్న సాయంత్రం, ఏం చేస్తున్నావు? ఆ, ఆ-నిజం చెప్పవే, నన్ను చంపకే!

కామాక్షి:

ఛీ, ఛీ! ఆ కుక్క! ఆ వెధవ!

వెంకటచలం:

ఎందుకు? లే, రా. యీ రాత్రికన్నా నాదానివే! ఆ తలుపు నిన్ను నాకిస్తుంది. లోపలికిరా. ఈ రాత్రికి నిన్ననుభవించి తరవాత-తరవాత-చంపుతానో-ఏం చేస్తానో-రా (లోపలికి తీసికెడుతున్నాడు.)

విమల వొచ్చింది.

విమల:

(వచ్చి) నేను - విమలని - ఒక్కసారి బైటికిరండి. అవసరం. (వెంకటచలం తలుపు తెరుచుకుని వొచ్చాడు) మీ ఆనందానికి విఘాతం కలగజేశాను క్షమించండి. మీ దగ్గిర శలవు తీసుకోడానికి వొచ్చాను. నేను వెడుతున్నాను.

వెంకటచలం:

వెడుతున్నావూ, ఎక్కడికి ?

విమల:

ఎక్కడికో! ఎక్కడికైతేనేం ?

వెంకటచలం:

వెళ్ళి-

విమల:

ఏమో, నాకు తెలీదు.

వెంకటచలం:

నీకేదో మనస్తిమితం తప్పింది. పాపం, నీకింత కష్టంగా వుంటుందనుకోలేదు. అమ్మని పిలుస్తాను వుండు.

విమల:

వొద్దు. ఇద్దరిభార్యల సమస్యమీాకు వుండదు.

వెంకటచలం:

అంత కోపమా ?

విమల:

మీా మీాదా! ఏమీా కోపంలేదు.

వెంకటచలం:

మరి—

విమల:

నా విధిని నెరవేర్చుకుంటున్నాను.

వెంకటచలం:

ఏమిటా విధి!

విమల

వెళ్ళడం.

వెంకటచలం:

ఇన్నాళ్ళమట్టి యెట్లా వున్నావు, మరి ?

విమల:

ఈనాడు మాయ విడిపోయింది. జ్ఞానదృష్టి కలిగింది. సత్య దర్శనమైంది.

వెంకటచలం:

ఏం మాయ ?

విమల:

భార్యా, భర్తా, తల్లి, బిడ్డ—అనే మాయ.

వెంకటచలం:

వేదాంతం మాట్లాడుతున్నావు!

విమల:

మాయకాదూ ? నన్ను భరించడానికి శక్తిలేని మీరు నా భర్తా! ఎన్నడీ పంజరంలోంచి బయటపడగలనా అని తీగెలు కొరికే నేను, భార్యనా? పుట్టిన నాటినించి నామీద ద్వేషం, ఉగ్గుపాలుగా పెరిగిన వీళ్ళు నా పిల్లలా ! ఒక్క చోకా, ఒక్కకాని కలకండ కొనిపెట్టలేని నేను తల్లినా ! ఈ కలల్లో నించి నా స్వతమైన విశాల ప్రపంచంలోకి ప్రయాణ మౌతున్నాను. ఆశీర్వదించండి.

వెంకటచలం:

ఏమిటీ అట్లా మాట్లాడుతున్నావు ?

విమల:

పిల్లలిద్దరూ అమ్ముమ్మ కుట్టించిన పట్టుపరుపుమీద నిద్ర పోతున్నారు. మీరూ, మీ నూతన వధువూ, యిక్కడ క్రీడిస్తున్నారు. ఆ ముసలావె తన ప్రియశిష్యుడు నారాయణ రావుని ఎమూలో లాలిస్తోంది–నేనే ఏకాకిని! ఎవరికీ కానిదాన్ని. ఒక్క హృదయంతో ఏ బంధమూ లేదు. నిరర్థక జీవిని. జీవ కళేబరాన్ని!

వెంకటచలం:

పోనీ వెళ్ళడమెందుకు?

విమల:

వుండడమెందుకూ

వెంకటచలం:

వుంటేనేం! మాకన్న నీ కాప్తులెవరు! పుట్టిల్లనేదికూడా లేదుకద నీకు?

విమల:

ప్రేమశూన్యమైన బంధనాలుగల ఆప్తులకన్న, ముఖమెరగని కొత్తవారు ఎక్కువ ఆదరిస్తారు. ప్రేమకోసం చాచే చేతులు ప్రతినిమిషం గాయపడవు.

వెంకటచలం:

లోకమంటే నీకేం తెలుసు!

విమల:

తెలుసుకోడానికే ఈ యాత్ర.

వెంకటచలం:

ఎందుకు తెలుసుకోడం!

విమల:

లోకం సంగతి తెలీదనే, లోకమంతా దుర్జనమయమనీ, కఠినమనీ భయపడి ఇంట్లోపడి వుండాలనేగా, ఆడదానికి లోకమంతా తెలీకండా చేసేది! ఆభయం పోగొట్టు కునేందుకే.

వెంకటచలం:

నలిగిపోతావు!

విమల:

ఇక్కడ!

వెంకటచలం:

అది వేరు.

విమల:

చూస్తాను. నేర్చుకుంటాను.

వెంకటచలం:

ఎందుకు?

విమల:

నా ఆత్మవికాసానికి.

వెంకటచలం:

పాపంలో పడిపోతావు. నీ స్వతంత్రంవల్ల ఫలమదే!

విమల:

అవును. అవసరమని తోచినప్పుడు, పాపం చెయ్యడానికి స్వతంత్రం కావాలి. ఇతరులు కల్పించే దుర్గతికాక స్వబుద్ధి కల్పించుకున్న నరక సౌఖ్యం కోరుతున్నాను.

వెంకటచలం:

ఎక్కడో ఆ గుడిపాడివాడి పుస్తకాల్లో చదివావు యీ మాటలు. కాని ఆడదానివి, వొంటరిదానివి-

విమల:

ఆడదాన్ని, దిక్కులేనిదాన్ని, కనకనే నన్నింత అన్యాయం చెయ్యగలిగారు. ఇక్కడైనా ఏకాకినే-

వెంకటచలం:

పదేళ్ళు కాపరంచేసికూడా, ఎవరిప్రేమా సంపాయించలేని లోపం నీది కాదూ!

విమల:

అవును. ఆలోపనివృత్తికోసమే వెడుతున్నాను. నన్నెందుకు ప్రేమిస్తారు, యిక్కడ! ప్రేమించేవారికి యివ్వడానికే, హృదయసంపదలేని, ఈ శూన్యురాలి నెవరు ప్రేమిస్తారు! జ్ఞానభాగ్యాన్ని, భావసువర్ణాన్ని - సంపాయిస్తాను. ప్రేమకోసం ప్రతి గుమ్మందగ్గిరా భిక్షమెత్తుతాను.

వెంకటచలం:

మోసపోతావు.

విమల:

ఇక్కడకంటేనా! పెళ్ళి, భర్త, గృహం, భార్య గృహలక్ష్మి, అనే మాటలు బోధించే నీతివేత్తల చేతులో మోసపోయినాను. అవి విచ్ఛేదం చేసుకుని ఐనాసరే జీవితంలో అనుభవ భాగ్యాన్ని పొందమనే వారి మాటలు అనుకరిస్తాను. ప్రతి అపజయమూ, ప్రతి మోసమూ, ప్రతి నైతికపతనమూ, నా కాళ్ళకి బలము నిస్తుంది. నా కళ్ళకి వెలుగు నిస్తుంది.

వెంకటచలం

నామీద కోపమైతే, పిల్లలేంచేశారు? తల్లివి. కన్నగర్భమా, లేక—

విమల:

కన్నగర్భం కనకనే, ప్రేమో, ప్రేమో, అని అరిచి, అరిచి. భగ్గుమని దహించింది. నన్ను, నా గర్భం ద్వేషిస్తోవుంటే సహించగలనా? ఈ నాడా యిద్దరూ నాకళ్ళముందు చస్తే నా కింత బాధవుండదు వాళ్ళ చూపులముందు సిగ్గుతో తల వొంచుకోడంకన్న అసలుమాలుమైతే చాలామంచిది. ఇంకా వుంటే ఇంకా చులకనౌతాను. పోతే, నాప్రేమ కార్యాలు జ్ఞాపక ముంచుకుంటారు. నాప్రేమ వాళ్ళకి అవసరంలేదు.

వెంకటచలం:

కాని వొదలగలవా ?

విమల:

వొదలలేను. కాని తప్పదు.

వెంకటచలం:

చంటిపిల్లలు వాళ్ళకేం తెలుసు ?

విమల:

అవును. వాళ్ళకేం తెలుసు ?

వెంకటచలం:

ఎందుకని వొదలడం?

విమల:

నాప్రేమ వాళ్ళకి అవసరమూ, వుపయోగకరముగా చేసేందుకు. మాతృత్వానికి కావలసిన జ్ఞానాన్ని, అధికారాన్ని,

యోగ్యతనూ సంపాయించేందుకు, వాళ్ళని, నా వాళ్ళని చేసుకునేందుకు.

వెంకటచలం:

నీవాళ్ళుగాక యెవరివాళ్ళు?

విమల:

నిజమా! నాపిల్లలేనా!

వెంకటచలం:

కాదూ? తొమ్మిది నెలలు మోసి, కని, పెంచి—

విమల:

అవును, నాపిల్లలే! ఆడి తప్పరుకద?

వెంకటచలం:

అంటే—

విమల:

నా పిల్లలేగా! నా వెంట తీసుకువెడతాను.

వెంకటచలం:

నీ వెంటా?

విమల:

నా వాళ్లుగా!

వెంకటచలం:

తీసికెళ్ళి ఏంచేసుకుంటావు?

విమల:

అదంతా చెపుతాలెండి. తీసుకువెళ్ళనా?

వెంకటచలం:

తీసికెళ్ళడానికా! నాకో?

విమల:

మీకా? మీకు కలుగుతారు.

వెంకటచలం:

అమ్మగారో! అమ్మ యేమంటుంది?

విమల:

ఆమె పిల్లలా? తల్లిని–మొయ్యడానికి, బాధలు పడడానికి, చాకిరి చెయ్యడానికి – తీసుకువెళ్ళడానికి కాదు. నా పిల్లలే! పిల్లలు! నా పిల్లలా? ఎప్పుడు? ఆకలేస్తే 'అమ్మా, అన్న' మన్నప్పుడు నేను అన్నం పెట్టగలిగితే 'చలివేస్తే' బట్టలు నేను కుట్టించగలిగితే, ఆపదలు వొస్తే రక్షించగలిగితే, అప్పుడూ అమ్మను. అప్పుడూ వాళ్ళకి నామీద ప్రేమ! వృద్ధురాలిని నామీద గౌరవమా? 'ఛీ! ముండా' అంటే, 'నువ్వేముండవి' అని ఆమెనీ 'నువ్వే వెధవ్వి' అని మిమ్మన్ని అనగలిగినప్పుడు నామీదగౌరవం వాళ్ళకీ వొస్తుంది, మీకూ వొస్తుంది. నామీద నాకు గౌరవం కలిగినప్పుడు, మీ అందరికీ కలుగుతుంది.

వెంకటచలం:

సంసారివై, నీ బాధ్యతలను నెరవేర్చటంవల్ల గౌరవమొస్తుందిగాని–ధర్మాన్ని, నీతిని–

విమల:

ఏమిటా బాధ్యతలు? ఏమిటాధర్మం? అత్త వేరేకోడల్ని తెచ్చుకోవొచ్చు, కోటువలె భర్త భార్యని మార్చుకోవొచ్చు. పిల్లలు అమ్మమీద తిరస్కారం చూపవొచ్చు. [illegible]టికీ మార్పులేదీ, [illegible]గనిదీ శాశ్వతశృంఖలమై దాస్య

వృత్తికన్న హీనమైన స్థితిలో బంధించేది ఒక్క భార్యత్వమేనా?

వెంకటచలం:

ఆడదానవైనాక-

విమల:

దాస్యానికికాను - నా భార్యత్వంతో, నా మాతృత్వంతో బాటు క్షుద్రమైన నా స్త్రీత్వాన్నికూడా త్యజిస్తున్నాను.

వెంకటచలం:

త్యజించవు - పంచిపెడతావు.

విమల:

అవును. ఒక గడియస్వేచ్ఛకు, జీవితానికి అపురూపమైపోయిన మాధుర్యంకోసం, అమ్ముకున్నాను నా దేహాన్ని! నిజం! అవును. నాకోసమే, నన్ను కోరాడు అతను-అతను వొక్కడే, ఈ ఘోరపంజరంలో రెక్కలు చప్పుడు చెయ్యసాహసింపగలడు. అతడు వొక్కడే - పాపం చెయ్యడానికైనా స్వేచ్ఛవున్న ధీరుడు, అతను వొక్కడే!

వెంకటచలం:

ఆహా, చాలా యోగ్యుడు దొరికాడు, నువ్వు మెచ్చుకోడానికి!

విమల:

నాకు తెలుసు, అతనిమాటలు అబద్ధాలని, అతని చూపులు అస్థిరాలని. కాని మీతల్లి శలవుమీద ఆధారపడే, మీ విధేయ ప్రేమకన్న, నీతిబంధాలు తెంచుకునే సాహసంతో నన్ను యీడ్చుకుపొయ్యే తాత్కాలిక కామమే మధుర

మయింది. హేయమే! కాని దుంగవలె మూలపడి బూజు పట్టిన నా జీవితానికికూడా వుపయోగముంది. ఎంత నీచమైనా, తాత్కాలికంగానైనా యింకొకరిని తృప్తిపరచగలదనే ఆశ యెంత ఆనందకరమైనది!

వెంకటచలం:

కాని, నీ పాతివ్రత్యం, నీ నీతి—

విమల:

నా నీతా! మీరు, మీరుకూడా నా నీతిని ఖండించేవారేనా! వొట్టిపోయిన గొడ్డుని వొదిలినట్టు పదేళ్లు వుపయోగించుకుని, కొత్త భార్యకోసం, వొదలడం ధర్మమేనా! మీ శాస్త్రాలు స్త్రీలకు బుద్ధిలేదని ఎంత ఘోషించినా, ఈశ్వరుడిచ్చిన బుద్ధి నశించలేదుమరి! ఎందుకు ఈ వాదన. వెడుతున్నాను.

వెంకటచలం:

ఈ అర్ధరాత్రి యెక్కడికి?

విమల:

జీవితమంటే యింతే. ఈరాత్రి బెంగపడతారు, ఆ గదిలోకి వెళ్ళిందాకా. రేపు పడతారా! వెడుతున్నాను.

వెంకటచలం:

వీల్లేదు.

విమల:

అబ్బలు వినేకాలం దాటిపోయింది. అన్నిభయాలూ విచ్ఛిన్నమైనాయి

వెంకటచలం:

అమ్మ యేమంటుంది!
(విమల నవ్వింది) అమ్మా, అమ్మా!

విమల:

అమ్మ ఏంచేస్తుందండీ! ఇక్కడ వుండ తలుచుకున్నవారికి భయాలుగాని నాకేమిటి?

మంగమ్మ:

ఏమిటిది?

వెంకటచలం:

ఇది యెక్కడికో వెడతానంటోంది.

మంగమ్మ:

వెళ్ళ తలుచుకుంటే వెళ్ళనీ.

వెంకటచలం:

ఎమిటే, అమ్మా! నీకూ డా మతి భ్రమించిం దీ రాత్రి? పిల్లేదు.

మంగమ్మ:

ఐతే ఆపు.

వెంటచలం:

అందుకనే నిన్ను పిలిచాను.

మంగమ్మ:

ఇంత శుద్ధ అప్రయోజకుడివి కనకనే నీ భార్య నిన్నొదిరించి పోతానంటోంది. నీ కళ్ళయెదటే యింకో మొగాడితో నాట్యమాడింది.

విమల:

ఆయన్ననకండి. అన్యాయం! పదేళ్ళనించి చూస్తున్నాను. ఆయన పాపాలకి, లోపాలకీ, వసంతునంటే, ఎంతకార్యమో అంతే. (వెంకటచలంతో) నేను కాపరానికొచ్చి వారం రోజులయిందిగావును. జ్ఞాపకంలేదూ? ఆరోజు మధ్యాహ్నం 'చిత్రాంగి' చదవొద్దన్నారు. ఆ పుస్తకాన్ని సంతోషంతో చించి పారేశాను. ఇంగ్లీషు మాట్లాడుతోవుంటే, వొద్దన్నారు, జాకెట్లు మానమన్నారు. కారణమడిగానా? నా దైవానికి, మీకు, ఇష్టంలేదన్నారు. ఆనందంతో మానాను. కాని ఆ మర్నాడే తెలిసింది. ఆ చిత్రాంగిమీది కోపం మీదికాదని, ఇంగ్లీషుమీది ద్వేషం, జాకెట్లమీది అసహ్యం, అవన్నీ, అన్ని—మీ భావాలు, ఆజ్ఞలు, రుచులు, పుణ్యాలు, అన్నీ ఆమెవని. మీరు వుత్సవిగ్రహం. ఆమెచేతుల్లో కీలుబొమ్మ, ఆమె పెంచుకున్న కుక్కపిల్ల. ఈనాడు, ఇప్పుడు మీ స్వబుద్ధితో ఆజ్ఞాపించండి—నిప్పుల్లో నడుస్తాను. కాని 'ఏం చదవ'నంటే 'అమ్మనడుగు' 'ఏం కట్టుకుంటే మీకు బావుంటుం'దంటే. 'అమ్మయేమంది' ... అంతా. అమ్మ, అమ్మ, అమ్మ. ఇంక మీమీద నాకేం గౌరవం, భక్తి. అవును, నేను అధర్మంచేశాను. కొట్టండి, నరకండి. కాని 'అమ్మా చూడు' అనకండి—మీరూ ఒక మనుషులే? మీరూ ఒక భర్తేనా? (మంగమ్మతో) నేను చూశాను. మీరూ నా పిల్లల్ని పెంచేవిధంలోనే తెలుస్తోంది — యీయన్ని యెట్లా నడుంవిరిచి, వెన్నముక మడిచి, మెదడుని చితకకొట్టి, ఈ చలిమిడి ముద్దను తయారుచేశారో! నేను కాపరానికి

రాగానే నన్నూ అట్లా మీ చేతులో మైనంవలె వొత్తి మీ చిత్తానుసారం మార్చాలని చూశారు. నేను స్వాధీనం కాకపో వడం చేత నేకద, నేను విరోధినైనాను. ఇంటిదగ్గిర మాఅమ్మ నేర్పిన పద్ధతులన్నీ యిక్కడ అపచారాలైనాయి. సన్నని చీరెలు, పక్కపాపిడి, సబ్బు, అన్ని ఘోరపాపాలా? నా భర్తని ఆకర్షించడం భోగంటక్కులా? ఎన్నడూ నా మన సులో లేంది, నారాయణకూ, నాకూ సంబంధం పుకారు పెట్టింది, మొదట మీరు కాదూ? అదే కారణం, ఆ అను మానం నిజం కావడానికి. ఈమె మనసుకి ఆ నిమిషాన యేది మంచిదనితోస్తే అది నాకు వేదమా? మా అమ్మని పది మాట్లు తలుచుకోడం, ప్రేమించడం బూతా? పూజ్యు రాలైన మా అమ్మని, నా చాతనే, 'లంజ' అనిపించింది, ఇది, ఈ ముసలిముండ.

మంగమ్మ:

అయిందేమో, అయింది. ఇప్పుడవన్నీ ఎందుకులే.

వెంకటచలం:

వెళ్ళడానికి వీల్లేదు.

విమల:

(మంగమ్మతో) చూడండి.

మంగమ్మ:

(చిరునవ్వుతో) నేనెవర్ని? నీ భర్త! ఐనా కొత్తగా స్వతం త్రురాలివి నువ్వు—నేను వెడుతున్నాను. అబ్బాయిా నీకు యుక్తమని తోచింది చెయ్యి. నాకు తెలీదు. (వెళ్ళింది)

విమల:

వెడతాను-ఒక్క- వరమియ్యండి.

వెంకటచలం:

వరమా ?

విమల:

అవును-నా పిల్లకి నామీదంతా అబద్ధాలు చెపుతుంది ఆమె-నేను దుర్మార్గురాలిననీ, లేచిపోయినాననీ-మీరన్నా కనికరించి, నామీద వాళ్ళకి గౌరవం నిలపండి - నిర్భాగ్యురాలనండి-దుర్మార్గురా లనకండి-చచ్చిందనండి-లేచిపోయిందనకండి.

వెంకటచలం:

(కన్నీళ్ళతో) నువ్వు వెడుతో, ఇంకా యెందుకదంతా-వాళ్ళే మనుకుంటే నీ కేం ?

విమల:

ఎందుకంటే-ఎందుకంటే, నాకు మళ్ళీరావాలని వుంది.

వెంకటచలం:

వీలుంటుందా ?

విమల:

మీ దగ్గిరికి కాదు-వాళ్ళదగ్గిరికి. నామీద వుమ్మేసేట్టు చెయ్యకండి-మీపాదాలు పట్టుకుంటా-వెడుతున్నాను శలవు. (వెళ్ళింది)

వెంకటచలం అట్లానే నుంచుని వున్నాడు. కామాక్షి వొచ్చి [illegible]నుంచుంది. వెంకటచలం భుజంమీద చెయ్యేసింది.

వెంకటచలం:

ఈ గోలల్లో, పాపం, నిన్ను మరిచిపోయినాను. ఏం చేస్తు న్నావు వొక్క తెవ్వూ?

కామాక్షి:

వింటున్నాను.

వెంకటచలం:

రా.

కామాక్షి:

ఏం చేస్తారిప్పుడు?

వెంకటచలం:

ఏం చేస్తానూ?

కామాక్షి:

వెళ్ళిపోతోంది.

వెంకటచలం:

రెండురోజులు తిరిగి మళ్ళీ వొస్తుంది.

కామాక్షి:

వెళ్లాలనే వుద్దేశ్యమోనో, కాదో.

వెంకటచలం:

కాక?

కామాక్షి:

వేరే వుద్దేశ్యమా?

వెంకటచలం:

అంటే—

కామాక్షి:

సాహసంచేసి, ఈ వైరాగ్యంలో—

వెంకటచలం:

ఆ !-

కామాక్షి:

విచారం భరించలేక-

వెంకటచలం:

అవును-భరించలేక-

కామాక్షి:

ద్యాయనాన్నా దుండగం_

వెంకటచలం:

అవును, అవును.

కామాక్షి:

ఏం చేస్తారు ?

వెంకటచలం:

ఏం చెయ్యను ?

కామాక్షి:

వూరుకుంటే యెట్లా ?

వెంకటచలం;

ఘోరం——

కామాక్షి:

చాలా... ...ఆపండి.

వెంకటచలం:

ఆపాలా ?

కామాక్షి:

అవును.

వెంకటచలం:

ఎట్లా ?

కామాక్షి:

వెళ్ళండి.

వెంకటచలం:

వెళ్ళి... ...ఏం చెయ్యగలను.

కామాక్షి:

కాని మన సంగతీ—

వెంకటచలం:

ఏం ?

కామాక్షి:

మనమీదికి—

వెంకటచలం:

మనమీదికా—

కామాక్షి:

అవును—మనమే చేశామని—

వెంకటచలం:

మనమా... ఛా !

కామాక్షి:

నమ్ముతారు...ఆమె అడ్డం తొలిగించాలని—

వెంకటచలం:

అవునా? ఛా! నిజమా! ఎట్లా? ఏం చెయ్యను?

కామాక్షి:

వెళ్ళండి.

వెంకటచలం:

అమ్మతో చెపుతా.

కామాక్షి:

అమ్మేం చేస్తుంది ?

వెంకటచలం:

నేనేం చెయ్యను?

కామాక్షి:

జుట్టుపట్టుకు లాక్కురండి—

వెంకటచలం:

మళ్ళీ వెడుతుంది.

కామాక్షి:

గదిలో తాళం వెయ్యండి.

వెంకటచలం:

ఎన్నాళ్లు?

కామాక్షి:

ముందు తీసుకురండి—

వెంకటచలం:

రాదు.

కామాక్షి:

ఆ... ...వంసంతు లేచి ఏడుస్తున్నాడని చెప్పండి

వెంకటచలం:

వాళ్ళంటేనే కోపం — రాదు.

కామాక్షి:

కోపంలేదు—ఏంలేదు. తొరగా వెడుదురూ.

వెంకటచలం:

తరవాత—

కామాక్షి:

[illegible]ళ్ళేం వెయ్యండి—తరువాత చూసుకుందాం.

వెంకటచలం:

ఎంత తెలివైనదానివే. (వెంకటచలం వెళ్ళాడు.)

కామాక్షి వాకిట్లో నుంచుంది. నారాయణ సిగరెట్టు కాలుస్తో వొచ్చాడు.

నారాయణ:

ఎవరు ? నాకిన్నరసానేనా ... ఏదీ ... ఒక చిన్న కీర్తన కానీ, విని ఆనందిస్తాను.

కామాక్షి:

నీ మొహానికి పాట కాదు వుమ్మేస్తాను.

నారాయణ:

వెయ్యిపోనీ. ఇంతదూరంగా పడదు. దగ్గిరికి వొస్తాను.

కామాక్షి:

అడుగు కదిలావంటే అరుస్తాను, పో.

నారాయణ:

లోపల వున్నాడా ?

కామాక్షి:

ఆ.

నారాయణ:

(నవ్వుతూ) తొరతొరగా తలవొంచుకు పరిగెత్తుతున్నాడు. కొత్తపెళ్ళాన్ని వొదిలి ఎందుకు పరిగెత్తుకు పోతున్నాడో చూడ్డానికి వచ్చాను.

కామాక్షి

ఇప్పుడే వొస్తారు.

నారాయణ:

సగంలో యిట్లా నిన్ను వొదిలిపెట్టిన రసికుడికోసం చూస్తు న్నావా ? ఈ కొత్త శోభనపురాత్రి, వొక్క తెవ్వూ, యిట్లా

విరహబాధతో జాగరణ చెయ్యమని వ్రాశాడా ఈశ్వరుడు?
పాపం! చూస్తో, చూస్తో నే నెట్లావూరుకోను?

కామాక్షి:

ఆ చెట్టుకు వురేసుకో, చూసి సంతోషిస్తాను. (నవ్వుతోంది)

నారాయణ:

చచ్చిన నన్నుచూస్తే అంత సంతోషమైతే, బతికివున్న వాణ్ణి నేను యెంత ఆప్యాయంగా వుండాలి!

కామాక్షి:

నీ దెయ్యాన్ని చూస్తే, మరీ గంతులేస్తాను.

నారాయణ:

కాని నీ భర్తకూడా దెయ్యమంత అపురూపమైనవాడుగా!

కామాక్షి:

నీవల్లనే.

నారాయణ:

అంత అదృష్టమే! ఐతే ఆ లోపం తీర్చే బాధ్యత నాదన్నమాటే!

కామాక్షి:

నీకో బాధ్యతలు కూడాను, నీ మొహానికి! (వుమ్మేస్తోంది)

నారాయణ:

నా మొహాన్నేమీ అనకు. అనేక మళ్ళీ నువ్వే ముద్దుపెట్టుకుంటావు దాన్ని.

కామాక్షి:

ముద్దులుకాదు—తంతాను.

నారాయణ:

తన్ను. (దగ్గిరికి వొస్తున్నాడు)

కామాక్షి:
దగ్గిరికి వొచ్చావా, తలుపు వేసుకుంటాను.
నారాయణ:
నన్నూ లోపలికి రానిచ్చి వేసుకో.
కామాక్షి:
నీ మొహం పగిలేట్టు వేస్తాను.
నారాయణ:
ఎందుకు అంత ఆగ్రహం నామీద? వెనుకదీపమూ—గుమ్మంలో నువ్వూ, గాలిలో యెగరేజుట్టూ—కళ్ళకియెంత—
కామాక్షి:
ఛీ! నీతో మాట్లాడ్డమే మహాపాపం. మా నాన్నగారిని అట్లాంటి మాటలన్నీ అని సిగ్గులేక నాతో మాట్లాడుతున్నావా?
నారాయణ:
నీమీది మమతచేతనే తిట్టాను.
కామాక్షి:
అబద్ధం.
నారాయణ:
మనిద్దరికీ అడ్డం వొస్తాడని కోపం.
కామాక్షి:
నోరుముయ్యి—నేనెవరు? నువ్వెవ్వరు?
నారాయణ:
అయ్యో, అడుగుతావా?...నువ్వు చంద్రబింబం, నేను చాతకం. నువ్వు పద్మం, నేను తుమ్మెద. నువ్వు పచ్చని జామిపండు, నేను ఆకుపచ్చని—

కామాక్షి:

చాలించు కవిత్వం.

నారాయణ:

నిన్ను చూస్తే, ఒక్క కవిత్వమేమిటి ? ఎన్ని పుట్టుకొస్తున్నా యనుకొన్నావు ? నీ తెలివికల కళ్ళూ, గుండ్రని రొమ్మూ, చూడగానే—

కామాక్షి:

ఫూరుకో.

నారాయణ:

ఇక్కడ వాకరికీ కళ్ళులేవు. నీ అందాన్ని చూసి మెచ్చుకో డానికి—చూడు, ఆ రొమ్మూ, ఆ మెడా. చూసుకో—ఒకసారి నువ్వే చూసుకో.

కామాక్షి:

(చూసుకుంటూ) ఏముందేం ? (కోపంతో) ఏమిటా మాటలు ?

నారాయణ:

కుచ్చెళ్ళతో పాదాలమీద జార్చడం, చస్తే ఈ దేశం వాళ్ళకి చాతవుతుందా ? బుజంమీది ఆజుట్టు వేళ్ళాడ్డం చూ—

కామాక్షి:

ఉత్తమాటలు—అన్ని అబద్ధాలు—

నారాయణ:

విమలలోని అందాన్ని చూడలేని నిర్భాగ్యుడు నిన్ను యేమాత్రం సంతోషపెట్టగలడు ?

కామాక్షి:

విమల నాకన్నా బాపుంటుందా ?

నారాయణ:

చూడ్డానికి బావుంటుంది. కాని నీ సంగతి వేరు.

కామాక్షి:

అంటే—

నారాయణ:

నీ ఆకర్షణ వేరు—పానకానికీ, సారాయికీ వున్న భేదం—

కామాక్షి:

తెలీటంలేదు. సరిగా చెప్పు, కవిత్వం మాని.

నారాయణ:

అసలు మాటలవసరం లేకండానే రూఢిచేసి చెపుతాను. (వస్తున్నాడు)

కామాక్షి:

ఏం వొద్దుతే, అక్కడే ఆగు.

నారాయణ:

నీ చూపులు నన్ను నిలవనీక కుదుపుతున్నాయి. పడిపోతున్నాను (మాటాడుతో గుమ్మం దగ్గిరికి వొచ్చాడు) నిజం చెప్పు, ఏం కావాలని అట్లా చీకట్లో వెతుకుతున్నావు, నీ చూపులతో?

కామాక్షి:

(ఆలోచిస్తో) నాక్కావాలిసిందంతా.

నారాయణ:

అమ్మా!

కామాక్షి:

ఏమిటీ?

నారాయణ:

చెప్పను.

కామాక్షి:

చెప్పాలి.

నారాయణ:

చెప్పను.

కామాక్షి:

చెపుతావా, చెప్పవా? కొడతాను.

నారాయణ:

చెపితే.

కామాక్షి:

ఏం. లేదు.

నారాయణ:

చెప్పను. కొట్టు.

కామాక్షి:

పో, దూరంగా, పో.

నారాయణ:

[illegible]?

కామాక్షి:

చెప్పు [illegible]

[illegible]యణ:

చెపితే, ఏమిస్తావు[illegible]

కామాక్షి:

చూద్దాంలే, చెప్పు.

నారాయణ:

ఏమంటే, చాలా అనుభవశాలివి.

కామాక్షి:

(కోపంగా) ఏం అనుభవం?

నారాయణ:

రసికత్వం.

కామాక్షి:

(ఏడుస్తూ) నన్ను పాడుమాటలన్నీ అంటున్నావు వొంటరి దాన్ని చేసి. (కోపంతో) పో, వెళ్ళు, దుర్మార్గుడా!

నారాయణ:

నేను వెళ్ళను.

కామాక్షి:

ఆయన వొస్తారు.

నారాయణ:

నాకు భయంలేదు.

కామాక్షి:

నాకు భయం.

నారాయణ:

ఆ కారణమేనా?

కామాక్షి:

ఏది?

నారాయణ:

పెళ్ళిచేసుకున్న కారణం.

కామాక్షి:

అంటే?

నారాయణ:

డబ్బు.

కామాక్షి:

(కోపంతో) డబ్బుకి నన్నమ్ము కుంటా ననుకున్నావా? అంటావా! నీ మొహం ముండా, వెధవా, పో, నాతో మాట్లాడకు.

నారాయణ:

ఏడిశావు నోరుముయ్యి. నిజం మాట్లాడితే నే, అట్టా అదిరిపడ తారు, చిందుల గుర్రంలాగు. ఏమిటది?

కామాక్షి:

నాకేం నీతిలే దనుకున్నావా?

నారాయణ:

అబ్బో నీతి! స్కూళ్ళలో చదివిన పిల్లల నీతి నేనెరగనూ!

కామాక్షి:

ఆ మాటకూడా అన్నావా? నన్ను, నన్ను, అన్నావా? (ఏడుస్తోంది) ఆడదాన్ని, ఒంటరిదాన్ని చేసి—చిక్కింది కదా అని—

నారాయణ:

[illegible]క్కా—వా! (పట్టుకున్నాడు.) చిన్నపిట్టలాగు యెట్లా ఒణుకు [illegible]వో, గూళ్ళలోదూరి, తోకలాడిస్తున్నట్టు (కామాక్షి లో[illegible] తలుపేసింది.) అయ్యో, అయ్యో, చచ్చా!

[illegible]క్షి తలుపు కొంచెం తీసి చూసింది.

ఏమిటి?

నారాయణ:

అమ్మా! నా వేలు తలుపు సందు[illegible]లిగింది చూడు.

కామాక్షి:

పాపం ! (వేలు పట్టుకుంది)

నారాయణ:

ఒక్క వేలు నలిగితే యింత కరుణ కలిగితే, నేనంతా నలిగి పోతున్నాననే, జాలిరాదూ ? ఏం వేషాలు ? (కావిలించుకున్నాడు. చప్పున వొదిలి నవ్వుతున్నాడు.)

కామాక్షి:

ఏమిటి ? (నారాయణ నవ్వుతున్నాడు) ఎందుకు నవ్వుతావు? (నారాయణ నవ్వుతున్నాడు) చెపుతావా; చెప్పవా ? చెప్పు ముందు. చంపుతాను. చెప్పు. .

నారాయణ:

ఓహో, ఓహో, వేలు నగలనూ లేదు, ఏంలేదు.

కామాక్షి:

అది నాకూ తెలుసు. కాని యింకా యెందుకో నవ్వుతున్నావు. చెప్పు ముందు.

నారాయణ:

(నవ్వుతో) ఏం లేదులే-

కామాక్షి:

ఇంక ఆ నవ్వు మానవూ !

నారాయణ:

ఇంతదానివని తెలీదు.

కామాక్షి:

అదుగో మళ్ళీ! ఎంతదాన్ని ?

నారాయణ:

నిజం వొప్పుకుంటావా ?

కామాక్షి:

నిజమైతే—

నారాయణ:

చెప్పనా ? కోపంరాదు కద ! ఇంతవరకు ఎంతమంది మొగా
ళ్ళని ఎరుగుదువు ?

కామాక్షి:

నేనా, నేనా ? (ఏడుస్తోంది) నన్ను అంటావా ? పో. (తోసి
వేసింది అతన్ని.)

నారాయణ:

నిజమానా, కాదా ?

కామాక్షి:

పో, పో. వెధవా, పో.

నారాయణ:

ఇంకెందుకు నేను వెళ్ళడం ? తెలిసిపోయిందిగా !

కామాక్షి:

ఏమిటి తెలిసింది ? ఎట్లా తెలిసింది ?

నారాయణ:

ఏం లేదులే.

కామాక్షి:

చెపుతావా, తన్ననా ?

నారాయణ:

చెపితే ఒప్పుకుంటావా ?

కామాక్షి:

చెప్పాలి ! చూద్దాం.

నారాయణ:

నువ్వు... నీ రొమ్ము నాకు తగలగానే తెలిసింది. నీ చెంపలు నా బుజాని కానించే విధమే చెప్పింది. బలేదానివి. ఏం టక్కులు చేశావు ? (నవ్వుతున్నాడు)

కామాక్షి:

(భయంతో) ఏం తెలుస్తుంది నీ మొహం ?

నారాయణ:

అది కూడానా ?

కామాక్షి:

ఏది ?

నారాయణ:

అదే !

కామాక్షి:

అంటే–

నారాయణ:

ఓ, ఓ, బలేదానివి. ఎన్నెళ్లు.

కామాక్షి:

పో, పో, వెధవా ! (కలియుబడ్డది. చెయ్యికొరికి, తప్పించుకుని తలుపు వేసుకుంది. లోపల నవ్వుతోంది. నారాయణ తలుపునెట్టి, కొట్టి, బతిమాలుతున్నాడు.)

నారాయణ:

ఒకసారి తలుపుతీసి చూడు–ఒకమాట వినిపో–ఇంక నిన్నేమీ అనను–అన్నీ అబద్ధాలు. నువ్వు యేమీ ఎరగవు. (ప్రతి మాటకీ కామాక్షి లోపల నవ్వుతోంది. నిరాశపడి, దిగులు పుట్టి, నారాయణ ఏడుస్తున్నాడు.) నువ్వు కనబడకపోతే,

ఇక్కడే చచ్చిపోతాను. ఎందుకు యింత నిర్దయ!... ఎందుకు నన్ను చంపుతా విట్లా! నేనింక బిగ్గిరిగా యేడుస్తాను. ఎవరు రానీ, నాకు సిగ్గులేదు. భయంలేదు. తలుపు తెరుస్తావా, బద్దలు కొట్టనా ?

కామాక్షి తలుపు కొంచెంగా తెరిచి చూస్తోంది.

కామాక్షి:

వెళ్ళు, ఎవరన్నా చూస్తే అపరిదిష్ట. ఆయన వొస్తారు. ఎప్పుడన్నా, ... ఇప్పుడు కాదు.

నారాయణ:

(కాళ్ళమీదపడి) నన్ను చంపకు – నేను బతకలేను – నేను వొంటరివాణ్ణి – నా కెవరూ దిక్కులేదు. నా కామాక్షి కాదూ ? నా మనోహారి కదూ, నా కిన్నెరవి కాదూ.

మాట్లాడుతో కామాక్షిని లోపలికి తీసుకెళ్ళి తలుపు వేసుకున్నాడు.

మంగమ్మా సుందరేశయ్యా వొచ్చారు.

మంగమ్మ:

యెక్కడ కళంకం బైటికి వొస్తుందో, ఎక్కడ నామూలంగా ఈవంశానికి అపకీర్తివొస్తుందోఅని యెన్ని అబద్ధాలాడాను! ఎంత వంచనకి లోబడ్డాను !

సుందరేశయ్య:

ఎంత అనలం తెచ్చి పెట్టాను?

మంగమ్మ:

నువ్వు తెచ్చేదేముంది! విధి.

సుందరేశయ్య:

అంతకన్న నిగ్రహం వుండవలసింది నాకు. మొగవాణ్ని తప్పించుకున్నాను. ఆడదాన్ని నిన్ను బైటపెట్టింది సృష్టి !

మంగమ్మ:

గర్భం రాకుండా జరుపుకునే పద్ధతులు కనిపెట్టారటగా?

సుందరేశయ్య:

అదికూడా తెలిసింది నీకు?

మంగమ్మ:

పాడుప్రపంచం! ఇంక అంతమాత్రం భయమూ వుండకపోతే పాపం పెరిగిపోదూ?

సుందరేశయ్య:

కాని నీవిషయం ఆలోచించుకో. ఎంత పాపం తగ్గేది. ఎన్నేళ్ళ నరకం తప్పేది నీకు.

మంగమ్మ:

నావిషయంలో సరే! కాని లోకమంతా యిట్లా చేస్తే-ఇంక నీతి, దుర్నీతి – (ఆగి) అవును. నేనెవర్ని, లోకపు నీతి, దుర్నీతి శాసించడానికి?

సుందరేశయ్య:

ఇంక విరహంలేదు మనకి. మన స్నేహాలతకి జననం, భయంకరమైన ఝంఝూనిలంలో అంతం యీ మధురమైన విశ్రాంతిలో!

మంగమ్మ:

ఆ మొదటి స్నేహం వేరు, ఈ చివరిది వేరు—

సుందరేశయ్య:

ఏం?

మంగమ్మ:

నీకు తెలీదూ?

సుందరేశయ్య:

అంటే, ఎప్పుడు వొంటరిగా కలుసుకుందామా అనే మహా జ్వరం, ఇంక యీ జన్మానికి రక్తం అనుభవించదు.

మంగమ్మ:

కాని వొంటరిగా మునుపు గదిలో కలిసినప్పుడు మాత్రం, ఆ భయమూ, తొందరా —

సుందరేశయ్య:

స్వేచ్ఛగా ఎప్పుడు కలుసుకునే వీలు కలుగుతుందా అని తపనపడతాము — ఆ స్వేచ్ఛ తీరా కలిగేప్పటికి మధురమైన ఆ తపన మాయమౌతుంది. జీవితమంటే అంతే!

మంగమ్మ:

అబ్బా! ఎంత భయమేసేది!

సుందరేశయ్య:

ప్రతి కిటికీ తలుపూ బిగించమనేదానివి — ఎండాకాలం వుక్క——

మంగమ్మ:

మళ్ళీ యిదీ ఎండాకాలమే! వాళ్ళు గదిలో యెట్లా వున్నారో గాని!

సుందరేశయ్య:

దీపం తగ్గించారు. కిటికీ తెరిచే వుంది.

మంగమ్మ:

(గదివేపు చూస్తూ) అట్లాంటి స్వేచ్ఛను యెన్నడూ యెరగను కదా! భయంతో నిండిన బతుకే ఐపోయింది ఆ నాలుగు దినాలూ!

సుందరేశయ్య:

కాని ఆ భయంలోనే వుంది, మాధుర్యం. స్వేచ్ఛ త్వరలో తృప్తినిస్తుంది.

మంగమ్మ:

తృప్తి నెరిగిన వాళ్ళంటూ రా మాటలు! జన్మంతా వుత్త వూహాలోనే తప్ప –

సుందరేశయ్య:

వెంకటచలానికైనా ఆ మొదటిభార్య సంగతి మనసులో గుచ్చుకుంటూనే వుంటుందనుకుంటాను యీరాత్రి! నాకూ అంతే! ఎన్నిమేళ్ళు దాంతో కాపరంచేసినా, మళ్ళీ తొలకరి వొచ్చినప్పుడల్లా నువ్వే జ్ఞాపకంవొచ్చి బాధపెట్టే దానివి. నిన్ను మరిచిపోయిన తరవాతకూడా ఏదో అర్థం కాని ఆనందం ఆ వాన గాలిలోంచి వొచ్చి, నా హృదయాన్ని కలత పెట్టేది. కాని కామాక్షి మాత్రం యేచింతా లేకండా ఆనందంగా వుండి వుంటుంది.

మంగమ్మ:

అవును సంసారంలో మొదటి అమృతాన్ని రుచిచూస్తో వుంటుంది–ఏ కలతా లేని ఆనందాన్ని. తెల్లారిన దగ్గిర్నించి, యింక జన్మంతా బాధ్యతలే! కాని యీ ఆరుగంటలూ ఆతలుపు కాపాడుతుంది, వాళ్ళని. యీ వుక్క–కి, ఆవాళ రాత్రి – కిటికీలోస్తే గదిలోకి రోడ్డుమీాది లాంతరు వెలుతురు పడుతుందని భయం.

సుందరేశయ్య:

నీ చీరకొంగుతో నా చెమట తుడిచావు. ఆ ప్రేమని తలుచు

కుంటే, ఈనాడు మనసు ఎట్లానో అవుతుంది. జీవితానికంతా అందమైన కల——

మంగమ్మ:

నిజంగా నా?

సుందరేశయ్య:

నీతిగా, మర్యాదగా, నా భార్యతో గడిపిన యిరవై ఐదు ఏళ్ళలోనూ, ఒక్క దివ్యమైన మెరిసే క్షణం జ్ఞాపకంరాదు— కాని నీతో భయంలో, పాపంలో గడిపిన ఆ ఒక్కరాత్రీ... నిజంగా పాపమేనా? పాపమైతే ఎందుకు నా హృదయం ఆనందంలో నృత్యం చేస్తుంది! ఆ పాపం, తిరిగి అట్లాంటి పాపం యెందుకు తటస్థించలేదా, అని ఇట్లా వేదనయెందుకు? మన రొమ్ముల మధ్య నలిగిన జాజిపువ్వుల వాసన జ్ఞాపకం లేదూ? ఏరోజు, ఎంత పనిలోవున్నా, ఏదో ఆలోచిస్తున్నా, ఆ జాజిపువ్వుల వాసన తగిలేప్పటికి, గుండె అకాత్తుగా పట్టినట్టు అయ్యేది—ఎందుకో అని—

మంగమ్మ:

ఏంచేస్తున్నాను, ఇన్నేళ్ళు నేను? ఎందుకు బతికాను? ఎందుకోసం? నీతికర్తలకి, తుచ్ఛప్రపంచానికీ భయపడి, దివ్యమైన ఆనందాన్ని వొదులుకున్నాను. నా ఆస్తిని, నామర్యాదనీ, చూసుకుని జీవితమంతా కష్టపడి బంగారాన్ని పోగు చేశాననుకున్నా. సత్యకాంతి మీద పడేప్పటికి, అంతా, అంతా, గడ్డి, మన్నుగా మారింది. మర్యాదా, నీతీ అంతా కలిపి—మనం వేడి శ్వాసల్లో, చూపుల కలయికలో, దగ్గిరిగా చేర్చి వొత్తుకున్న చంపల స్పర్శలో, అనుభవించిన రెండు నిమిషాలకి సాటి వొస్తాయా? ఎందుకీ ప్రపంచం తన ఆనం

దాన్ని వొదిలి, మర్యాదలూ, ధనమూ, ఆస్తీ, కీర్తీ, సంపాయించడానికి తంటాలు పడుతుందో నీ కర్థమాతుందా ?

సుందరేశయ్య:

మనం పడలా ?

మంగమ్మ:

ఇట్లా పశ్చాత్తాపమనా్న వొస్తుందా ?

సుందరేశయ్య:

మనకున్నంత వివేకం లేదనుకుంటూ ప్రపంచానికి – ఏ రసికులకో తప్ప.

మంగమ్మ:

ఏం చేశాను, యిన్నేళ్ళు ? ఇతరులని సంస్కరించడంలో నా వెమికలు విరుచుకు, సార్థకపడ్డదనుకున్నాను నా జీవితం. ఆ యిరవై ఏళ్ళూ ఒకరం యింకోర్ని చూసుకోడానికి భయపడి–(గదిలో పల్కించి నవ్వులు) ఒక్కసారి జన్మానికల్లా, ఒక్కసారి అట్లా–వెళ్ళిచూస్తాను పోసి, నా కన్నులు సార్థకమయ్యేట్టు–

సుందరేశయ్య:

వుందూ ! వాళ్ళతో నేమిటి ? వాళ్ళ ననుభవించనీ – మనం మాత్రం–

మంగమ్మ:

ఇంకానా ! ఇప్పుడా ! ఎంత ప్రయత్ని స్తేమాత్రం ఎండాకాలపు గాలికి ఆ రాత్రివలె, రక్తం పొంగుతుందా, వొళ్ళట్లా నరనరం లాక్కుపోతుందా, ఇంక నాకళ్ళు అట్లా మెరవగలవా, ఆ పువ్వుల వాసనతో తల మధురంగా తిరుగుతుందా ? లాభంలేదు, (విమల వెడుతోంది) ఎవరది ? అదే,

విమల... ఎందుకో, చీకట్లో మళ్ళీ ఇంటివేపు వెడుతోంది. రండి మెల్లిగా వెనక్కి వెళ్ళిచూద్దాం. (వెడుతున్నారు)

సుందరేశయ్య:

పాపం, దాన్నిచూస్తే నాకు దిగులుగానే వుంది. ఏదో అదీ వయసులో వుందా —

మంగమ్మ:

కాని అదిచేసిన దుర్నయమో! ఎన్నిసార్లు మందలించినా మెదిరించి, బుద్ధిపూర్వకంగా — అందులో ఇద్దరు పిల్లల్ని ముందు పెట్టుకుని—కాని— (ఊరుకుంది) యీవాళ ప్రయాణం కట్టింది.

సుందరేశయ్య:

ఎక్కడికి ?

మంగమ్మ:

చెపుతా. ఇందాక భోజనమైన తరవాత, అరుగుమీద కూచున్నప్పుడు, వెంకటచలం నాకోసం కేకవెయ్యాలా! విసుక్కుంటూ వెళ్ళానే...

వెళ్ళారు- వెంకటచలంవొచ్చి తలుపుకొట్టాడు.

వెంకటచలం:

కామా, కామా, (పలకలేదు) అప్పుడే నిద్ర! దీనికి (బిగ్గిరిగా) వొచ్చాను. చూడు. కామూతల్లీ! దీనికి కోపం వొచ్చినట్టుంది నే నాలిస్యం చేశానని? ఈ రెండునిమషాలుకూడా నన్ను వదిలివుండలేకపోతే ఎట్లా చెప్పు! నువ్వేగా పంపింది! (లోపల నవ్వు) ఏమిటీ హాస్యం? తలుపు తీ. అబ్బా! ఎంత సేపు? ఇట్లా సగంరాత్రి గడిచిపోయింది ఏదో గోలతో! మాట్లాడవేం? అప్పుడే నిద్రా! ఆ, నిద్రపడుతుందా ఏమేం?

తమాషా! లేక నే నాలస్యం చేశానని కోపమా? ఎంత జాణవి! తలుపు తీ. (ఊరుకుని వింటున్నాడు) అబ్బా! తీద్దూ, ఎంత సేపు యీ హాస్యం? ఈ ఆలిస్యానికంతా నాలు గింతలు కసి తీర్చుకోనా? (లోపల నారాయణ నవ్వు తున్నాడు. వెంకటచలం ఆశ్చర్యపడుతున్నాడు) ఆ దుష్టుడి నవ్వు యెప్పుడు నేర్చుకున్నావు? వాడినవ్వు! ఎంత సరిగా, అట్లానే నవ్వావులే. గట్టిదానివి. నన్ను భయపెట్టాలనే! నేనా భయపడేది!

వెంకటచలం:

లోపల్నుంచి నారాయణ "నడు నడు చలిమిడి ముద్దా" అన్నాడు. అదుగో అదే వాడి కంఠమే! వాడి మాటలే! ఎంత తెలివి గలదానివో?

లోపల్నుంచి నారాయణ 'ఆడముండా నువ్వునాకు మొగుడేమిటే! అంట్లముండా, నీ మొహానికో భార్యకూడానా' అన్నాడు.

వెంకటచలం:

(భయపడుతో) కామాక్షీ, ఒసే, ఒకసారి కిటికీదగ్గిర కనపడు పోనీ! కనపడవా! తలుపు బద్దలుకొడతాను. (తంతున్నాడు. కిటికీ దగ్గిరికి నారాయణ వొచ్చాడు.)

నారాయణ:

నీ కామాక్షి నారాయణరూపం ధరించడంకూడా నేర్చుకుంది. (వెంకటచలం మాట్లాడలేకపోయినాడు) పో, నీ అవసరం లేదిక్కడ. మాట్లాడకండా వెళ్ళు. పో, అమ్మతో చెప్పుకో, యింకో పెళ్ళి చేస్తుంది.

వెంకటచలం:

నీ మృత్యువే నిన్నిక్కడికి తెచ్చిందీ రాత్రి!

నారాయణ:

నా ఊర్వశి నన్ను తెచ్చింది !

వెంకటచలం:

సరేలే ! (వెడుతున్నాడు. నారాయణ నవ్వుతున్నాడు. వెంకటచలం కొంచెందూరంవెళ్ళి తిరిగివొచ్చాడు.)

వెంకటచలం:

కామాక్షీ!

నారాయణ:

ఎందుకది ?

వెంకటచలం:

ఒకసారి కనపడు.

నారాయణ:

ఎందుకో ! ఒక్కసారి చూచుకుందామనా ! వెధవ దర్తి !

వెంకటచలం:

కామాక్షీ !

నారాయణ:

రావటంలేదు. సిగ్గుపడుతోంది. జుట్టంతా బుజాలమీద పరుచుకుని తల దిళ్ళల్లో పెట్టుకుని పడుకుంది. రావటంలేదు. పొద్దున్న చూపిస్తానులే !

వెంకటచలం:

కామాక్షీ, వీడు నిన్నేం బలవంతం చెయ్యలేదుకద ! నువ్వే పిలిచావా ?

నారాయణ:

చెప్పవే, పాపం ! (లోపలికివెళ్ళి, కామాక్షిని బలవంతంగా లాక్కొచ్చాడు కిటికీ దగ్గిరికి) నేనా బలవంతం చేసింది, ఇందాకట్నించీ నన్ను చంపేస్తోవుంటే ! (కామాక్షి సిగ్గుతో

తలవొంచుకుంది. వెంకటచలం వెడుతున్నాడు. ఇంకో పెళ్ళాన్ని తెచ్చుకో. అప్పుడే యిది పాతపడుతోంది.

వెంకటచలం చెట్లపీడలో మాయమైనాడు.

నారాయణా కామాక్షీ లోపలికి వెళ్ళారు.

కళ్లు మూసుకుంటున్న వసంతుని ఒకచేత్తోలాగుతో, ఇంకో చేత్తో బరువైన ట్రంకు పట్టుకుని విమల వొచ్చింది.

వసంతం:

ఎక్కడికమ్మా? నిద్ర వొస్తోంది. నేనిక నడవలేను.

విమల:

ఇంక కొంచం నడు- నా బాబువి కదూ! అమ్మచూడు- ఎంత ట్రంకు మోస్తోందో! ఏడవకు.

వసంతం:

ఎక్కడికి? ఎక్కడికి-

విమల:

బిగ్గిరిగా మాట్లాడకు-రా, రెండడుగులు. నీకు మిఠాయి కొని పెడతా, రా. రైలు, పొగొచ్చే నిజం రైలు కొనిపెడతాను- (వసంతుడు కింద పడుతున్నాడు) ఒక్కసారి లే! (విమల ట్రంకు కిందపెట్టి, అతన్ని ఎత్తుకుని ట్రంకు ఎత్తుకోబో యింది, ఎత్తలేకపోయింది, వసంతుని దింపి తనూకూచుంది) నిన్ను వొదిలి బతకలేనురా, నాయనా ఎట్లాపోను! ఎట్లా వుండను. నువ్వు పిచ్చిమాటలు మాట్లాడుతోవుంటే విన కండా-నీ చిన్ని చేతులతో పుస్తకాలు పట్టుకు నడుస్తోవుంటే- చూడకండా యెట్లా బతకను-నిన్నెక్కడ కొడతారు. అమ్మ చెడ్డదని నేర్పుతారు.

వెంకటచలం వొచ్చాడు.

విమల:

వొద్దు, వొద్దు, తీసుకుపోకండి. నా బిడ్డని లాక్కుపోకండి. నేను బతకను. మీకు తెలీదు, నా గర్భశోకం. తీసుకోకండి- మీ పాదాలమీద పడుతున్నాను.

వెంకటచలం:

వుండు. మాట——

విమల:

చూడండి-మన ప్రేమ జ్ఞాపకం తెచ్చుకోండి. నీరదని కన్నప్పుడు నాకు జబ్బుచెయ్యలా! నేను చచ్చిపోతానని నామీద చూపిన ప్రేమ జ్ఞాపకం లేదూ?...ఇంక మీకు కనపడను-ఇంక జన్మలో ఏమీ అడగను-ఒక్కటే-నా బిడ్డని నా నాయనిన్ని-

వెంకటచలం:

ఎందుకట్లా గోలపెడతావు? వుండు-

విమల:

ఆ, ఏమంటారు? ఏమిటి? లాక్కుపోకండి - పోయ్యేదాన్ని ఎందుకు వెనక్కి పిలిచారు. అబద్ధాలు చెప్పి - నాబాబుని చూసేటప్పటికి నాకు కాళ్ళాడలేదు. అందుకుని తీసుకు పోతున్నా. క్షమించండి - మీ కాళ్ళు పట్టుకుంటా - దిక్కుమాలిన పక్షిని - దరిద్రురాలిని - నాయనా!

వెంకటచలం:

ఎందుకు గోలపెడతావు! లాక్కెళ్ళను.

విమల:

నిజమా? తీసికెళ్ళరా? నిజమా! నన్ను చంపకండి - వేళా కోళం కాదుగద!

వెంకటచలం:

నిజమే, వెళ్లు. తొరగా పద-నాకు పనివుంది.

విమల:

అవును. మీా ఆనందభంగం చేశాను. క్షమించండి.

వెంకటచలం:

(కోపం అణుచుకుంటో) పద, మాట్టాడకు. తీసుకుపో తొరగా.

విమల:

ఏమిటి అట్లా వున్నారు! (విమల ట్రంకు తీసుకోబోయి) అబ్బాయి బట్టలు-నాచేతకాదు-బలువు (ఏడుస్తోంది)

వెంకటచలం:

పద! (పెట్టి తీసుకున్నాడు)

విమల:

మీారే, మీారే - వొద్దులెండి - పెట్టి అసలు వొద్దులెండి - బట్టలు వుండవేమో, దరిద్రురాలిని, కట్టించలేనేమోనని కాపీనపడ్డాను - వొద్దులెండి -

వెంకటచలం:

వొస్తా పద.

విమల:

పాపం, యీా మొదటిరాత్రి మీాకీ క్షోభ కల్పించానేమిటి! నిజం, వెళ్ళండి - పాపం కామాక్షి ఏం గోలపెడుతోందో!

వెంకటచలం:

మాట్లాడకు, పద !

విమల:

వొద్దండీ, నేను వెడతాను – మీరు వెళ్ళండి. రండి – నేను వొదుల్తాను మిమ్మల్ని – వొద్దు – పదండి. (ట్రంకులాగి కిందపెట్టింది) ఇంక వెళ్ళండి. నా దిగులుచూసి వెళ్ళటం లేదు మీరు. నాకేమీ దిగులులేదు – నా అబ్బాయిని యిచ్చారు–నాకదే పదివేలు – చాలా సంతోషంతో వెడుతున్నాను. వెళ్ళండి. పిలవనా కామాక్షిని ?

వెంకటచలం:

వొద్దు–ముందుపద నువ్వు.

విమల:

ఎందుకు కోపం ?

వెంకటచలం:

కోపం లేదు. ఈ ట్రంకు వొద్దులే. వాడికి చొక్కాలు కుట్టించు. (చేతి వుంగరం ఇస్తున్నాడు) నాలుగు వందలు ఖరీదు అది. భద్రం, పద.

వసంతు లేస్తున్నాడు.

విమల:

నేను వెళ్ళలేను. నా కాళ్ళు వొణుకుతున్నాయి – నేను వెళ్ళను–ఇక్కడే వుంటాను... ...కాదు.... వెడతాను. ... తెండి. (వసంతుని తీసుకోబోయింది. వెంకటచలం విమలని కావలించుకున్నాడు.)

వెంకటచలం:

వెళ్ళకు నాతో వుండు.

విమల:

(ఏడుస్తో) యెన్ని సంవత్సరాలయింది.

వసంతం:

(లేచి) యెవరు నాన్నా! అమ్మని కావిలించుకుంటున్నా వేమిటి?

వెంకటచలం:

(వెంకటచలం విమల్ని వొదిలి, వసంతుని యెత్తుకొని కావిలించుకున్నాడు) వసంత్! నిన్నెన్నాళ్ళయింది యిట్లా ఎత్తుకుని; నా బాబూ. నీకు రేపు యెన్నో బొమ్మలు కొనిస్తాను.

వసంతం;

నీరదకి వొద్దు, నాకు ఎలుగుబంటిని కొనిస్తావా?

వెంకటచలం:

అన్నీ కొనిస్తాను. యెప్పుడూ యెత్తుకుంటాను. నేను లేకండా, నేను ముద్దుచెయ్యకండా, ఎంత ఏడ్చావో!

వసంతం:

నే నేడవలేదు నాన్నా. వొదిలెయ్యి నన్ను–నిద్రవొస్తోంది. (క్రింద దిగాడు)

వెంకటచలం:

విమలా, వెళ్ళవుకదూ!

విమల:

వెళ్ళక–

వెంకటచలం:

వొద్దు. వుండు.

విమల:

యెంతకాలం వుంటుం దీ బుద్ధి! తెల్లారి ముసలావిడి మొహం చూడగానే-

వెంకటచలం:

కాదు. నేను వెళ్ళమనను—నేనూ నీతో వొస్తానో, లేక ఇంకెప్పటికీ నీకు కనపడనో—యేమీా తెలీదు.

వెళ్ళారు. తలుపు తెరుచుకుని గుమ్మంలోకి నారాయణ వొచ్చాడు. వెనక తొరతొరగా కామాక్షి వొచ్చింది.

కామాక్షి:

వెళ్ళకు.

నారాయణ:

మీావాడు గోలచేసే వుద్దేశంతో వెళ్ళినట్టున్నాడు. చూస్తా పోయి.

కామాక్షి:

యేమన్నాకానీ, అంత నిందా నామీాదే వేసుకుంటా, రా, వెళ్ళకు, ఆ చేతులిట్లా తే – (తనచుట్టూ పెట్టుకుంటోంది) ఇంకెట్లా వెడతావు? రా, లోపలికి, రా' ఈసారి చెపుతారా నీసంగతి—ఎట్లాంటివాడివి నువ్వు! నాకు వెర్రెత్తింది. నన్ను స్వర్గానికెత్తావు. జీవితంలో ఇంత మాధుర్య ముంటుందని తెలీదు నాకు, రా.

నారాయణ:

ఇంక చాలు వెళ్ళనీ.

కామాక్షి:

(అడ్డంగా మెట్లమీద పడి) నామీదనించి నడు. నా రొమ్ము మీద పాదాలతో తొక్కుతో పో. వెడతావా? నన్ను చంపుకున్నట్టే! నాకు సిగ్గుపోయింది. నీ వెనక కేకలేస్తాను. ఏడుస్తాను. నీవెంట పడతాను-నీతో యెక్కడికన్నా సరే బైలుదేర్తాను - ఇందాకటిమల్లే - మళ్ళీఓసారి ... ... ఒక్క నిముషంకూడా వుండలేను, నువ్వు వెడితే చస్తాను. నువ్వెవరు? ఎవరు నువ్వు? రాక్షసివా? ఇట్లా వుడుకెత్తించే పిశాచివా? ఎవరన్నాకానీ, నా బతుకంతా నీకు దాస్యం చేస్తాను. వెళ్ళకు.

నారాయణ:

ఎవరో వొస్తున్నారు-వుండు.

కామాక్షి:

కానీ అందరిముందూ, నీ మెడమీద వేళ్లాడతా-నీ చేతుల్ని యిట్టా అందుముకుంటా-నాబాబు కదు-రా.

నారాయణ:

నీ బాబే వొస్తున్నాడు.

కామాక్షి:

రానీ! అలిసిపోయినావు. మళ్ళీ ఫలహారాలు తిను. వూరికే పడుకో-నా తల నీపాదాలకానించి కూచోనీ. నన్ను మాత్రం వొదిలి వెళ్ళకు. వుమ్మెయ్యి-తన్ను-చంపు-కోసెయ్యి, నన్ను మాత్రం వొదలకు.

నారాయణ:

ఛప్. వొదులు - సిగ్గులేనిదానా!

కామాక్షి:

వొదలను.

నారాయణ:

లే. అడ్డంలే. ఆడదానివా, కుక్కవా?

కామాక్షి:

కుక్కనే.

నారాయణ:

కుక్కకి తన్ను. (తన్ని) ఎవరో వొస్తున్నారు. పద. లోపలికి పద.

నారాయణ కామాక్షిని లోపలికి తీసుకువెళ్ళాడు.
మంగమ్మా సుందరేశయ్యా వొచ్చారు.

మంగమ్మ:

ఇంక యేం చేద్దాం?

సుందరేశయ్య:

ఈ రాత్రికి పడుకోడానికి బుద్ధి పుట్టడంలేదు. ఇంకా తిరుగుదాం. ఎన్నేళ్ళయింది నీ దగ్గిరిగా నుంచుని, నువ్వేనా! ఇంకెవరన్నా పోషిక, నామీద దయదలచి నన్నిట్లా పుల కొంకురాల్లో ముంచుతోందా!

మంగమ్మ:

అబ్బా, ఆమాటలు మాట్లాడకండి.

సుందరేశయ్య:

పోనీ, అన్నచెల్లెళ్ళవలె, నిర్మలంగా, శాంతంగా వెళ్ళబుచ్చుదాం జీవితాన్ని-

మంగమ్మ:

అవును, యీ తోటలలో, చెట్లనడుమ, పిట్టల్నీ, మబ్బుల్నీ చూస్తో—

సుందరేశయ్య:

కాని పొద్దస్తమానం యెట్లా తోస్తుంది నాకు. క్లబ్బు లేదు, పేపరు లేదు... ...కాని ఒకరో యిద్దరో మనుమలు కలిగితే ఆడుకోవొచ్చు వాళ్ళతో, వాళ్ళకి కథలు చెప్పి -

మంగమ్మ:

అవును. నీ కూతురుబిడ్డలు కనక నీకు ప్రేమ —

సుందరేశయ్య:

నీ కొడుకు బిడ్డలు కారా?

మంగమ్మ:

కాని నా రక్తమా?

సుందరేశయ్య:

అవును కొడుకే ఐతే-

మంగమ్మ:

ఏం చేస్తున్నారో! మళ్ళీ నాటిమల్లే-యిద్దరూ, సంతోషంగా చూద్దాం-యేం చేస్తున్నారో!

సుందరేశయ్య:

ఛీ!

మంగమ్మ:

కాదు. వొకసారి (వెళ్ళి చూసింది కిటికీలోంచి. ఆశ్చర్యంతో, భయంతో, నోటమాట రాక, వొచ్చి కూలబడ్డది.)

సుందరేశయ్య:

ఏమిటి? ఏమిటి?

వెళ్ళిచూడమని సౌజ్ఞచేసింది. అతనూ అట్లానే వొచ్చి పక్కనపడ్డాడు.

మంగమ్మ:

అవునా?

సుందరేశయ్య:

అట్లానేవుంది.

మంగమ్మ:

ఎట్లా?

సుందరేశయ్య:

ఘోరం! ఘోరం!

మంగమ్మ:

సరిగా చూశావా?

సుందరేశయ్య:

సందేహంలేదు.

మంగమ్మ:

ఏదన్నా మాయా?

సుందరేశయ్య:

రాక్షసం.

మంగమ్మ:

ఎట్లా వొచ్చాడు?

సుందరేశయ్య:

వెంకటచలం యామైనాడు!

మంగమ్మ:

మళ్ళీ చూడు.

సుందరేశయ్య:

అక్కర్లేదు.

మంగమ్మ:

ఏం చేద్దాం? అన్నా, చెల్లెలూ—

సుందరేశయ్య:

హర, హర !

మంగమ్మ:

మన పాపమే !

సుందరేశయ్య:

మనదే, మనదే !

మంగమ్మ:

నీదే !

సుందరేశయ్య:

నాదేలే ! ఏం చెయ్యను ? ఏం చెయ్యను ? ఈ పాడుకళ్ళు—

మంగమ్మ:

మన పిల్లలిద్దరూ – సంతోషించు – నాట్యమాడు – కడుపు నిండిందా ?

సుందరేశయ్య:

హర హర ! ఇప్పు డేమౌతుంది ? పిడుగుపడి తగల బడరా వాళ్ళు ! దేవత లూరుకుంటారా ?

మంగమ్మ:

వాళ్ళమీద కాదు–మనమీద–వాళ్ళకేం తెలుసు ?

సుందరేశయ్య:

వీల్లేదు, వీల్లేదు.

మంగమ్మ:

ఏం చెయ్యవేం ? వూరికే వీల్లేదు, వీల్లే దనకపోతే –

సుందరేశయ్య:

ఏం చెయ్యమంటావు?

మంగమ్మ:

తిట్టుకునేవాళ్ళు—

సుందరేశయ్య:

ఒకర్ని చూసి ఒకరు మండిపడేవాళ్ళు—

మంగమ్మ:

అంతా ప్రేమేగావును!

సుందరేశయ్య:

ఒకటే గర్వం.

మంగమ్మ:

ఐతేనేం. మన ఆకర్షణే! మన దుర్మార్గమే - వాళ్ళిద్దరికీ వొచ్చింది. నన్ను చూసి నువ్వెట్లా నిలవలేకపోయినావో— అట్లానే నీ కూతురు నా కొడుకును చూసి—

సుందరేశయ్య:

కాదు నీ కొడుకే—

మంగమ్మ:

కాదు, కాదు. నీ కూతురే పిలిచివుంటుంది. వాడు చెడ్డవాడైనా; ఆడదే—

సుందరేశయ్య:

మరి నువ్వా నన్ను కోరింది, నువ్వేనా?

మంగమ్మ:

కాదు, కాదు—అబ్బా, ఆలోచించకు - మాట్లాడకు—వూరికే ఖూచున్నారేమో! అంతేనేమో!

సుందరేశయ్య:
భయమేస్తోంది, వుండ మన్నదేమో!

మంగమ్మ:
భయమేమిటి?

సుందరేశయ్య:
అతి భయం దానికి.

మంగమ్మ:
శోభనంరోజు రాత్రి, యిదేం బుద్ధి!

సుందరేశయ్య:
వాడేమో!

మంగమ్మ:
యిట్లా నీతిలేకండా ఎట్లా పెంచావంట!

సుందరేశయ్య:
మరి వాడుమాత్రం ప్రతి ఆడదాన్నీ-

మంగమ్మ:
నీ బుద్ధే! నువ్వు నన్నేం చేశావు? ఆ ఆకర్షణే, ఆ దుర్బుద్ధే! ఆ నీతి లేకపోవడమే! మన పాపమే నన్ను తరతరాల యిట్లా బాధిస్తోంది-

సుందరేశయ్య:
నీమీదంటే అట్లా మనసు కరిగిపోయిందిగాని నా బుద్ధి అట్లాటిదేమీ కాదు-ఆ నాటినుంచి ఎవరివంకన్నా కన్నెత్తన్నా చూడలేదు.

మంగమ్మ:
కాని లోకం అభివృద్ధి చెందటంలేదూ? తండ్రులకన్నా పిల్లలీ విధంగా అతిక్రమిస్తున్నారు.

సుందరేశయ్య:
చూడు. ఇంకోసారి సరిగా చూడు.

మంగమ్మ:
అవును తెలుస్తుంది. నువ్వా రా. వెళ్ళి (చూస్తున్నారు.)

సుందరేశయ్య:
ఇంక చాలు రా.

మంగమ్మ:
(కదలదు) చాల్లే, ఇంక భరించలేను!

సుందరేశయ్య:
(కదలడు.) అన్ని సందేహాలూ తీరాయి పద.

మంగమ్మ:
కడుపు నిండింది.

సుందరేశయ్య:
జన్మం పావనమయింది. రా.

మంగమ్మ:
చూడు, చూడు!

సుందరేశయ్య:
నీకుమల్లేనే

మంగమ్మ:
ఆ ముద్దు-అట్లానే!

సుందరేశయ్య:
రామ, రామ.

మంగమ్మ:
ఏం చేద్దాం? (ఒకరి దగ్గిరిగా ఒకరు జరిగారు, చేతులు పట్టు కున్నారు దగ్గిరిగా అనుకు నుంచున్నారు.)

సుందరేశయ్య:

అబ్బా!

మంగమ్మ:

ఎంత బావుంది-దగ్గిరికి రా. (ఒకరెన్ని ఒకరు ఒత్తుకున్నారు. చప్పున మంగమ్మ పరిగెత్తుకు ఒచ్చి చెట్టుకింద పడ్డది. వెనక సుందరేశయ్యా వొచ్చి ఆమెను లేవనెత్తాడు.)

సుందరేశయ్య:

ఏమిటిది?

మంగమ్మ:

వుండు.

సుందరేశయ్య:

మాట్లాడు.

మంగమ్మ:

ఉండు, తాకకు. ఇదేమిటి మళ్ళీ?

సుందరేశయ్య:

ఏదోగాలి, భూతం——

మంగమ్మ:

నువ్వే. మొదట——

సుందరేశయ్య:

నేనా, కాదు——

మంగమ్మ:

నువ్వే!

సుందరేశయ్య:

చూశావా! (మంగమ్మని కావిలించుకున్నాడు) ఇట్లానే!

మంగమ్మ:

ఛీ, పో.

సుందరేశయ్య:

ఇంకా 'ఛీ' అంటావేమిటి?

మంగమ్మ:

పో, నీమాటాలానే... ...మళ్ళీ యీనాడు–

సుందరేశయ్య:

అవును.

మంగమ్మ:

మొదలా–

సుందరేశయ్య:

ఏం చేస్తాం?

మంగమ్మ:

ఏం చెయ్యాడమేముంది?

సుందరేశయ్య:

మనం కర్తలమా?

మంగమ్మ:

మళ్ళీ, అదంతా——

సుందరేశయ్య:

నే నున్నానుగా!

మంగమ్మ:

ఛీ, ఛీ, సిగ్గుచేటు, వొదులు.

సుందరేశయ్య:

వదలను.

మంగమ్మ:

కనపడతాం సిగ్గు, సిగ్గు! ఇన్నేళ్ళొచ్చి–

సుందరేశయ్య:

ఆ సిగ్గే కొంపముంచింది. ఆవాళ మెరుపులకింద–

మంగమ్మ:

నువ్వు ఆ నారాయణకుమల్లేనే - నా మెడ పట్టుకుని-

సుందరేశయ్య:

మరీ అంత ముసలివాళ్ళమా! ఇప్పుడుమాత్రం? యింకో రెండేళ్ళు - నాలుగేళ్ళు - యీ కాలదేవత నించి తప్పించుకోలేమా!

మంగమ్మ:

నిజమేలే-కాని, అక్కడ ఆ సంగతి-పూరికే కూచుంటావేం?

సుందరేశయ్య:

పోయి-

మంగమ్మ:

తగలపెట్టు చంపు - విడతియ్యి - విసతీసి అవతలపారెయ్యి-
"అన్నా చెల్లెలు" అని అరువు-

సుందరేశయ్య:

నువ్వూ రా. (ఇద్దరూ కొంతదూరం నడిచారు)

మంగమ్మ:

నేను రాలేను.

సుందరేశయ్య:

ఏం చేద్దాం?

మంగమ్మ:

ముందు ఆలోచిద్దాం, రా. (ఇద్దరూ కూచున్నారు.)

సుందరేశయ్య:

ఇన్నేళ్ళు యెంత బాధపెట్టానో నిన్ను! ఇప్పుడు తెలిసింది.

మళ్ళీ మనని యీశ్వరుడు కలిపాడు. ఉన్న కాలమంతా, పాపపరిహారార్థంగా నీసేవలో వినియోగిస్తాను.

మంగమ్మ:

మళ్ళీ మొదలా? ఇరవైఏళ్ళ తరవాత మళ్ళీ మొదలా? కాని యేం లాభం; ఇన్నాళ్ళు ఒకర్నొకరు ద్వేషించి... వొద్దు... కాని యీ బాధేమిటి? ఏమిటిది? ఎన్నడో అనుభవించిన సుందర స్వప్నాలూ, ఈజన్మవో, పూర్వజన్మవో, రాబోయే జన్మవో, బాధలూ, ఆనందాలూ, నా కళ్ళ ముందు కనపడుతున్నాయి. నేను కనకుండా వొదిలిన పిల్లలు, నేను పాలియ్యక యెండబెట్టుకున్న పిల్లలు, పిలుస్తున్నారు. కసితీర్చుకుంటున్నారుగావును. విధి కనికరించి వొదులుతుందా మనని! ఈనాలుగు వృద్ధప్యమాసాలన్నా స్వేచ్ఛగా అనుభవించనిస్తుందా! రక్తాశ్రువులతో చెల్లించాలి, పాప ఋణాన్ని! వెళ్ళండి. వెళ్ళండి.

సుందరేశయ్య:

వెళ్ళనా. నిజమా!

మంగమ్మ:

వెడితే నాకిక్కడ యేంతోస్తుంది? ఏం చెయ్యను? మళ్ళీ నాకెక్కడ కనబడ్తావు? కాని నువ్వు వుంటే-యీ పాపం యీ బాధ-సరే చూద్దాం-కాని వాళ్ళిద్దరూ-యిప్పుడు—

సుందరేశయ్య:

ఇది సాగడానికి వీల్లేదు. పిలిచి చెప్పు.

మంగమ్మ:

[illegible]మని!

సుందరేశయ్య:

సంబంధం.

మంగమ్మ:

చెప్పనా ?

సుందరేశయ్య:

దాచడానికి వీల్లేదు. చెప్పెయ్యి-మన రక్తం, మన ప్రేమ ఫలం.

మంగమ్మ:

చెప్పినా మాన్తాడా ?

సుందరేశయ్య:

ఇంకా మానడా ?

మంగమ్మ:

కాని మన సంబంధం కూడా చెప్పాలి-

సుందరేశయ్య:

చెప్పాలి-

మంగమ్మ:

చెపితే-చిక్కులున్నాయి-ఈ ఆస్తీ, యీ యిల్లూ తనదంటాడు.

సుందరేశయ్య:

అవును మరి వాడిదే కదూ ?

మంగమ్మ:

మరి వెంకటచలం ?

సుందరేశయ్య:

వాడికి కొంతభాగం యిద్దాం-

మంగమ్మ:

ఏమంటారో! తగూలూ, వ్యాజ్యాలూ—

సుందరేశయ్య:

నేను సర్దుతాగా—

మంగమ్మ:

ఆ యిద్దరి తగూలూ ఎవరూ తీర్చలేరు.

సుందరేశయ్య:

వెంకటచలానికి ఉద్యోగ మిప్పించి, పంపించి—

మంగమ్మ:

అవును—

సుందరేశయ్య:

నువ్వూ, నేనూ, మనకోడుకూ, నా కూతురూ—

మంగమ్మ:

మరి వెంకటచలంతో వెళ్ళదూ?

సుందరేశయ్య:

అవును—అదోచికూ—, (వెళ్ళారు.)

నారాయణ:

(నారాయణ బైటికి వొచ్చాడు. వెనక కామాక్షి వొచ్చింది) వెళ్ళారు—

కామాక్షి:

ఇంకేమైనాగాని, ప్రతిరాత్రీ—యిట్లా—

నారాయణ:

ప్రతి రాత్రీనా? మరి ఆ మొగుణ్ణి యేం చెయ్య తలుచు న్నావు?

కామాక్షి:

ఏమన్నా కానీ—నువ్వు కావాలి. నాకు మొగుడు, అత్తా, తండ్రీ, యెవరూ లేరు.

నారాయణ:

కోపమన్నావే! నన్ను చూస్తే—

కామాక్షి:

ఇంకా కోపమే! నిన్ను చంపాలి—నిన్నిట్టా పట్టుకుని—(మాటలు వినపడుతున్నాయి)

నారాయణ:

యెవరో వొస్తున్నారు. నువ్వు లోపలికి పో.

కామాక్షి:

తెగించాను. నాకేం భయం?

నారాయణ:

కాదు. ముసలిది చెడ్డది.

కామాక్షి:

నిన్ను విడవను—ఒక్క నిముషంకూడా నిన్ను విడవను. ఏమై పోతావో, యేమో! నిన్నేం చేస్తారో వీళ్ళందరూ? నాకు భయం—నిన్ను కాపాడుకుంటాను. ఇందాకా ఆయన బెదిరించారు కూడాను! వెళ్ళను.

నారాయణ:

(నవ్వి) ఆయనో మనిషికూడాను! వొస్తున్నారు. వెళ్ళు ముందు.

కామాక్షి వెళ్ళింది. మంగమ్మా సుందరేశయ్యా వొచ్చారు.

సుందరేశయ్య:

నువ్వు చెప్పు. నేను వెడితేనే బావుంటుంది – రేపు వాళ్ళని–
(వెళ్ళాడు)

మంగమ్మ:

(నారాయణని చూసి) నారాయణా! ఇందాకట్నించి ఎక్కడ
వున్నావు?

నారాయణ:

స్వర్గంలో.

మంగమ్మ:

సరిగా మాట్లాడు. నాతో హాస్యమూ?

నారాయణ:

ఎక్కడా లేను. నిద్రపోతున్నాను.

మంగమ్మ:

అబ్బా! అబద్ధాలు మానవుకద! ఆ గదిలో నీకేం పని?

నారాయణ:

నాకేం పని?

మంగమ్మ:

నాకు అంతా తెలుసు–ఏం?... మాట్లాడవా? ఇంక అట్లాంటి
దుర్మార్గం వీల్లేదు (దయగా) ఎందుకు యిట్లాంటి పనులు
చేస్తావు?

నారాయణ:

పెళ్ళికానివాణ్ణి. ఏం చెయ్యను మరి?

మంగమ్మ:

(ఇంకా దయగా) నీకు పెళ్ళిచేస్తాను.

నారాయణ:

పెళ్ళా న్నేం చేసుకోను ?

మంగమ్మ:

నాయనా, నీకు ఆ స్త్రీకూడా యిస్తాను.

నారాయణ:

బావుంది. ఎప్పుడిస్తారు? కాని నాకు పెళ్ళివొద్దు.

మంగమ్మ:

యిప్పుడేగా కావాలన్నావు.

నారాయణ:

వూరికే అన్నాను. అక్కర్లేదు.

మంగమ్మ:

ఆ స్త్రీయిస్తాను. పెళ్ళిచేస్తాను. కాని నువ్వు కామాక్షిజోలికి పోవొద్దు.

నారాయణ:

కామాక్షి జోలికా? అదిమాత్రం నన్నడగ వొద్దు.

మంగమ్మ:

ఏం?

నారాయణ:

నన్ను కొయ్యి, చంపు. కామాక్షినిమాత్రం వొదలను.

మంగమ్మ:

ఏమిటి! వొదలవూ! నీకు మతిపోయిందా, వొదలవూ!

నారాయణ:

వొదలను. నేను వొదిలినా అది నన్నువొదలదు. మమ్మల్ని

ముక్కలు ముక్కలుగా కోసినా, చెక్కలు చెక్కలుగా చెక్కినా ఒక రొక్కకరం వొదలను.

మంగమ్మ:

ఒరే బాబూ! ఎందుకురా, నాయనా, నాగుండె యిట్లా కాల్చుకు తింటావు? చేసిన ఘోరాలు చాలవురా? చివరి కిదికూడా జరగాలి! ఓరే నీయిష్టం, లోకంలో యెవరినన్నా తెచ్చుకో, నేనేమీ అనను. ఆ విమలతో యేమ. నీయిష్టం. దీనొక్కదాన్ని వొదులు. అది వొచ్చినా వొద్దను. ఇదేరా నేనడిగే వరం. ఇదొక్కటేరా.

నారాయణ:

అదొక్కటే నా చాత కాదు.

మంగమ్మ:

(తనలో) అదొక్కటే నీ చాతకాంది! ఎంత విపరీతం! (పైకి) ఎందుకు వొదలవురా?

నారాయణ:

ఎందుకా? ఎందుకా? అది......అది సరిగా నావంటిది. అట్లాంటిది లోకంలో యింకో ఆడది లేదు. దాన్ని చూడ గానే ప్రేమపుట్టింది నాకు. అది నాదానిలాగు, మేమిద్దరం ఒకటే జన్మమెత్తినట్టు, నారక్తం దాని రక్తాన్ని పిలిచింది. నా స్వభావమే, నాగుణమే దాంది.

మంగమ్మ:

ఇంక మాట్లాటకు వొద్దు, వొద్దు — వూరుకో. అవును. అవును. నీరక్తమే, నీస్వభావమే — అర్థంకావటంలేదురా,

మూర్ఖుశా? ఎంత ఘోరపాపంచేశావు? సాయంత్రంలోపల నీ గుడ్లు పేలిపోవా, నీ తల చెక్కలు కాదా! అంది—

వెంకటచలం కర్రతో పరుగెత్తుకుంటోవొచ్చాడు. కర్రతో నారాయణతలమీద కొట్టబోయినాడు. మంగమ్మ అడ్డంవచ్చింది. గురితప్పి తగలలేదు. మళ్ళీకర్రయెత్తి కొట్టాడు. నారాయణ వీపున తగిలి కిందపడ్డాడు.

వెంకటచలం:

నన్ను పెట్టినబాధలకి అనుభవించు. (పరిగెత్తి వెళ్ళిపోయినాడు)

మంగమ్మ అరుస్తోంది. అందరూ వొస్తున్నారు. సుందరేశయ్యా కామాక్షీ వొచ్చారు.

సుందరేశయ్య:

ఏమిటిది?

మంగమ్మ:

వెంకటచలం కొట్టాడు.

సుందరేశయ్య:

చూడు, దెబ్బతగిలిందా?

మంగమ్మ:

తెలీటంలేదా. మీరు చూడండి.

కామాక్షి యీలోపల అతన్ని కావిలించుకుని ఏడుస్తోంది.

సుందరేశయ్య:

ఛీ, ఛీ, లే! (మాట్లాడదు. అంత ధ్యాసా నారాయణ మీదే.) లేస్తావా? లాగనా? నీకేం సిగ్గు లా !

కామాక్షి:

నన్నుకోసి ముక్కలుముక్కలుచేసి లాగవలిసిందేఇక్కణ్ణించి—

సుందరేశయ్య:

వాడు చచ్చాడేమో చూణ్ణీ.

కామాక్షి:

చస్తే నేనూ చస్తాను.

సుందరేశయ్య:

డాక్టరికన్నా కబురుపంపు. పో.

మంగమ్మ:

లే. తోటవాణ్ణి పిలిచి చెప్తా.

కామాక్షి ఏడుస్తో పరుగెత్తింది.

సుందరేశయ్య:

నీళ్ళన్నా తేవే?

మంగమ్మ:

ఇంటోకి తీసికెడదాం.

సుందరేశయ్య:

బతికివున్నట్టు లేదు.

ఇద్దరూ పట్టి తీసికెడుతున్నారు. కామాక్షి వొచ్చింది.

కామాక్షి:

తేరే? (చూస్తోంది. వెంకటచలం వొచ్చాడు.)

వెంకటచలం:

చచ్చాడా, బతికాడా?.

కామాక్షి:

హంతకుడా—నిర్భాగ్యుడా! ఎందుకురా, అట్లా కొట్టావు?

వెంకటచలం:

నీకోసం. నువ్వూ వాణ్ని చంపింది. నేను కాదు.

కామాక్షి:

నేనా! సరేలే. ఇంకా వున్నావేం, ఇక్కడ?

వెంకటచలం:

ఇంకెక్కడ వుంటాను?

కామాక్షి:

వుండి —

వెంకటచలం:

చచ్చాడా వాడు?

కామాక్షి:

ఏమో నాకు తెలీదు.

వెంకటచలం:

చావకపోతే చంపుతాను.

కామాక్షి:

ఎందుకు చంపుతావు? తేరగావున్నారు చంపడానికి, వూరుకుంటారు.

వెంకటచలం:

అట్లా చూస్తావేం? వాడెవడు నీకు? ఎందుకు చంపుతానా! నీకోసం! నిన్నెప్పుడు తాకానో, అప్పుడే వొచ్చింది ధైర్యం! ఆహా, స్వర్గమంటారే అది యెక్కడవుందో తెలిసింది. స్త్రీ అంటే ఎంత తీవ్రశక్తో అర్థమయింది.

కామాక్షి:

నీకా? నీకు నేను స్త్రీనా? నానించి ధైర్యం వచ్చిందా?

వొచ్చిన ధైర్యం చాలు. ఇంకా వొచ్చిందంటే లోకాలు మునిగిపోతాయి. పద.

వెంకటచలం:

నే నెక్కడికి వెడతాను, నిన్ను విడిచి!

కామాక్షి:

అర్థం కావటం లేదూ, నువ్వు చేసిన పని! ఇప్పుడు రారా, పోలీసులు.

వెంకటచలం:

ఆ—

కామాక్షి:

అవును.

వెంకటచలం:

రాసి, వాడే చచ్చాడంటాను. ఎవరో చంపారంటాను.

కామాక్షి:

వూరుకుంటాను! మా నాన్న లేడూ! ఆమె వూరుకుంటుందా? వాడికోసం ఆమె యెవరినన్నా నాశనం చేస్తుంది. నువ్విక్కడే వుంటే ఆమే చంపుతుంది నిన్ను. ఆమె వూరుకుంటే— (ఆగింది)

వెంకటచలం:

నామీద చెపుతుందా, అమ్మ? చెప్పదు.

కామాక్షి:

గుడ్డివాడా, ఆమె ప్రాణమంతా నారాయణమీదనే! నిన్ను [illegible] పరమద్వేషమామెకి. ఆ మాత్రం తెలుసుకోలేక [illegible]!

వెంకటచలం:

ఆ —

కామాక్షి:

మరి వెళ్లు—తొరగా. పో. నీకోసమే చెపుతున్నా.

వెంకటచలం:

నువ్వూ రా, పోదాం.

కామాక్షి:

నేనా! నేనెందుకు వొస్తాను? పో, యెవరికీ కనపడక ఏ దేశమన్నా పోయి బతుకు. వెళ్లు.

వెంకటచలం:

నువ్వు వొస్తే—

కామాక్షి:

ఏమైనాసరే నేను రాను. నువ్విక్కడ వున్నా నేను నీదాన్ని కాదు. వెళ్లు. ఎందుకు చిక్కులు తెచ్చుకుంటావు. నీ చావును నువ్వు తెచ్చుకుంటున్నావు.

వెంకటచలం:

నేను వెడితేమాత్రం నన్ను పట్టుకోరా!

కామాక్షి:

నువ్వు వెడితే ఎవరూ చెప్పరు. పారిపోతే అందరి దయా నీమీదే వుంటుంది.

వెంకటచలం:

అమ్మని పిలు. నామీద చెప్పకుండా చేస్తాను.

కామాక్షి:

మీ అమ్మ నీవేపు తిరిగినా, నేను చెప్పి తీరుతాను, పోలీసులతో. పో.

వెంకటచలం:

నువ్వా!

కామాక్షి:

అవును, నేను. ఇప్పుడే వెళ్ళి పిలుచుకొస్తాను.

వెంకటచలం:

వెడతాను-వెడతాను. తల్లీ! నీ పాదాలమీద పడతాను. ఆ పిల్ల లిద్దరూ తల్లి లేని పిల్లలు-వాళ్ళకోసమన్నా కనికరించు దేవతా.

కామాక్షి:

మరి వెడతావా?

చీరదని తీసుకుని-వెంకటచలం వెడుతున్నాడు. చెట్టు చాటునించి నారాయణ వొచ్చి నవ్వుతున్నాడు.

నారాయణ:

బలే చేశావే! రా యిట్లారా. చాలా సేపయింది. వెధవ గడ్డలు వీపంతా గుచ్చుకున్నాయి.

కామాక్షి:

నువ్వూ బలే మోసగించావే!

నారాయణ:

[illegible] కనుక్కున్నావు!

కామాక్షి:

మొదట భయపడ్డాను. కాని నన్ను వొదిలి పోవని తెలుసు నాకు.

నారాయణ:

నరకానికి కూడా ?

కామాక్షి:

స్వర్గానికి కూడా !